## రెండుమాటలు

వంగభాషలో శ్రీధీరేంద్రనాథపాల్, ఆశాలత, భ్రమర, లక్ష్మీలాభము జాహానీ గోజాండా మొదలగు నవలలను, ఆంగ్లభాషలో కృష్ణచరిత్రమును The Mysteries of the Mogul Court ను రచించినాడు. Mysteries of the Court of London, Mysteries of London, Mysteries of Paris మొదలగునవి పఠించుటచే నితని కీ గ్రంథము రచించు నభిలాష పొడమి యుండవచ్చును.

సంస్కృత గ్రంథముల నెన్నిటినో పరిశోధించి కృష్ణచరిత్రమును వ్రాసిన లేఖినితోడనే ఇతడు నవలలుకూడ రచించినాడు. మనవిద్వాంసులవలె ధీరేంద్రుడు నవలావాఙ్మయమునెడ హేయభావము వహింపక జనసామాన్యమున కానందముగొల్పుటకై యెన్నో నవలలు విరచించెను.

ఈకథాబంధము జహంగీర్ పాదుషా కాలపు చరిత్రతో సమ్మిళితమై యున్నది. అయినను ఇందలి చరిత్రాంశము లన్నియు యథార్థములనుటకు వీలులేదు. నవలాప్రణేత చరిత్రను యథార్థముగా నిరూపింపవలసిన బాధ్యతలేదు ; ఆకాలపు ఆచారవ్యవహారములు, స్థితిగతులు కన్నులయెదుట గట్టినట్లు వర్ణించిన జాలును. ఇతిహాసవేత్తలు కొందరు పురాతత్త్వముమీది వ్యామోహముచే చరిత్రాంశములను మిక్కుటముగా వర్ణించి కథాబంధమును చమత్కారవిరహితము చేయుదురు. ధీరేంద్రు డన్ననో యితివృత్తమందలి రామణీయకత్వము లోపింపకుండ జాగరూకతతో కథ నడిపినాడు.

ఈ నవలయం దితరరసములు స్ఫురించినను అద్భుతరసము ప్రధానము. కావుననే యితివృత్తము జటిలమై అడుగడుగునను హృదయాందోళనజనకమై ఔత్సుక్యము వృద్ధిచేయుచుండును. ఇట్టి నవలలితివృత్తము పట్టుచేతనే చమత్కారముతో విలసిల్లును.

సామాన్యకుటుంబములందు గానవచ్చులాగున రాజకుటుంబములందనురాగము సరళముగను నిశ్చలముగను గానరాదు. ఆశాపిశాచపీడితులై రాజకుమారులు తండ్రులపై కత్తులు దూయుదురు. తండ్రులును కుమారులను హింసించుటకు వెనుదీయరు. అధికారవాంఛాప్రేరితులైనవా రవలంబింపని కుమార్గము లుండవు; ఆచరింపని యసత్కార్యము లుండవు. ప్రభువులతో చెలిమి పాములతో చెలగాటము వంటిది. ప్రభువుల యనుగ్రహము నిగ్రహముగా మారుట కెంతో సేపు పట్టదు. "పృథివి నధిపులు నూతనప్రియులు రారె?" అని సూక్తి. అక్కఱయున్నంతవరకు నృపతులు తమ యనుచరులను సాదరముగా జూతురు. అక్కఱ తీరినతోడనే తూష్ణీంభావము వహింతురు. ఒక్కొక్క వేళ ననుచరులు ప్రాణములు గోల్పోయినను విచారింపరు.

ఈకథయందు మానవసంఘ మందలి వివిధ వ్యక్తులు కానవత్తురు. పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, ధనికులు, దరిద్రులు, బలవంతులు, బలహీనులు, సజ్జనులు, దుర్జనులు, ప్రభువులు, బానిసలు నాయాఘట్టములందు మూర్తీభవింతురు. ఈ నవలవలన మొగలాయీ ప్రభుత్వమందలి నిరంకుశత్వము, భోగలాలస, స్వార్థపరత్వము మొదలగు విషయములు చాలవరకు గోచరించును.

ఈనవల రెండుసంపుటము లగును. ఈభాగమువలెనే రెండవభాగము కూడ పాఠకవర్గమునకు మనోహరముగా నుండగలదని మావిశ్వాసము.

రాజమహేంద్రవరము }
డిశెంబరు ౧౯౨౫ }

శ్రీ శివశంకరశాస్త్రి

మొగలాయి సార్వభౌముఁడగు జహాంగీరు కాలమున, హిందూస్థానము క్షామబాధ నెఱుంగక హాయిగ నుండెను. సార్వభౌముఁడు భోగానురక్తుఁడగుటచే, ఆతని రాజ్యము సమస్త భోగములకును ఆలవాలమాయెను. స్వర్గవైభవమును ధిక్కరించు నిజాంతఃపురమున, రంభాద్యప్సరసలను తృణీకరించు మోహనాంగులచే బరివేష్టితుండైన సార్వభౌముఁడు భోగసాగరమున నీదులాడుచు కాలము గడుపుచుండెను. ఆగ్రా, ఢిల్లీ నగరములందలి సామాన్యజనులు సహితము భోగముల నోలలాడుచుండిరి.

హిందూస్థాన మిట్లు భోగసాగరమున నోలలాడుచుండిన సమయమున అతి విపరీతములగు మూడు సంగతులు జనులను గలవరపఱచెను. ఆగ్రా, ఢిల్లీ నగరముల వాస్తవ్యులయందుఁ గలిగిన సంచలనము అసాధారణమైనదియై యుండెను. ఆ మూడు సంగతుల గుఱించియును ముచ్చటించుకొనునపుడు, ఆజనులకు జనించు భయభ్రాంతులను వర్ణింపనలవికాదు. రాజాంతఃపురమునందును, బజారునందును, మఱి యెచటనైనను ఆ విషయముల గురించియే ప్రసంగములు జరుగుచుండెను, ఇద్దరు ముగ్గురు జను లెచటనైనను గలయునపుడా విషయముల గుఱించి సంభాషించుచు, భీతచిత్తులై తమతమ యిండ్లకు వెడలుచుండిరి.

అట్టి మూడు సంగతులు నెవ్వియో!

మొదటిది: సార్వభౌముని కుమారుఁడు రహస్యముగఁ నంతఃపురమునుండి నిష్క్రమించెను. ఆతఁ డెచటికేగెనో, ఎందుల కేగెనో ఎవ్వరికి తెలియదు. ఆతఁ డెన్నఁడు సైన్యసమేతుఁడై యరుదెంచి, రాజ్యాధిపత్యమునకై తండ్రిపై దండెత్తునో యని జనులు వెఱచుచుండిరి. రాజ్యమునకై రాజకుమారులు యుద్ధసన్నద్ధులాయెద రేమోయని వారు భీతిల్లుచుండిరి. మహావైభవముతో నుండిన మొగలాయిసామ్రాజ్య మెన్నఁడు రణక్షేత్రముగ మాఱిపోవునో యని వారుతల్లడిల్లుచుండిరి.

రెండవది: ప్రతిమంగళవారము నాఁడును, ఢిల్లీనగరము నందలి సింహద్వారమునందు ఒక మానవమృతకళేబరము గోచరమగుచుండెను. ఆ కళేబర మెవ్వరిదో, ఎచటనుండి ఏతెంచుచుండెనో, అచటి కెట్లు వచ్చుచుండెనో యెవ్వరికైనఁ దెలియకుండెను. ఆ శవము వస్త్రవిహీనమై యుండెను. ఆ కారణమున నా పురుషు డేజాతివాఁడో తెలిసికొనుటకూడ కష్టముగ నుండెను. కాని, నిదానముగఁ బరిశీలించువారికి మాత్రము, ఆతఁడు సర్వాంగసుందరుఁ డగు యౌవనపురుషుఁడై యుండవలయుననియు, ఉన్నత మహామ్మదీయ కుటుంబములకుఁ జెంది యుండవచ్చుననియు గోచరించుచుండెను. అందు మఱియొక విషయముకూడ జనులకు గ్రాహ్యము కాకుండెను. శవము కనబడుచుండెను, గాని, మరణ మెటులు సంభవించుచుండెనో నిర్ణయించుటకు వీలులేకుండెను. కత్తితో పొడిచినట్లుగాని, ఉరితీసినట్లుగాని, గొంతుముడి నొక్కి చంపినట్లుగాని తెలిసికొనుటకు, అట్టి చిహ్నము లెవ్వియు లేకుండుటచే అవకాశము లేకుండెను. అట్టి హత్యలు విధినిర్ణీతమువలె ప్రతివారము జరుగుచుండుట చేతను, మృతకళేబరములు సింహద్వారము ముందు ప్రతిమంగళవారమును బ్రకటింపఁ బడుచుండుటచేతను, హత్య లెట్లు జరుగుచుండెనో శవముల కచటి కెట్లు వచ్చుచుండెనో తెలియకుండుట చేతను జనులు భయవిహ్వలులు కారా?

మూఁడవది: దయ్యములయొక్క విపరీతమగు చేష్టలు. వాని గుఱించి జనులు విశేషముగఁ జెప్పుకొనఁదొడంగిరి. ఆచేష్టలను దలంచుకొనునపుడును వానిగుఱించి ప్రసంగించునపుడును నగరవాస్తవ్యుల దేహములు గగుర్పడుచుండెను.

సార్వభౌముని కుమారుఁ డదృశ్యుఁ డగుటయు, సింహద్వారమున మానవమృతకళేబరములు గోచరించుటయు, దయ్యములు చెలరేగుటయును — ఈమూఁడు విషయములును ఒకేమాఱు ప్రారంభ మగుటచేత,

ఈమూడింటికి నెద్దియో పరస్పరసంబంధ ముండవలయునని, నగర వాస్తవ్యులు గ్రహించిరి. ఆకారణముచేత వారికలవరము మఱింత యధికమాయెను.

ఈమూడువిషయములును మూడునగరములందు జరిగియుండెను. మొదటివిషయము ఆగ్రానగరమున రెండవవిషయము ఢిల్లీనగరమున మూడవవిషయము "ఫతేపూరు సిక్రీ" యను నగరమున జరుగుచుండెను.

సిక్రీనగరమునందలి దయ్యముల అద్భుతచర్యలను గుఱించి మొదట విచారింతము.

సిక్రీనగరము ఆగ్రానగరమునకు సుమారు ముప్పదిమైళ్ళదూరమున నుండెను. సుప్రసిద్ధస్వారభౌముఁడగు అక్బరుషాచే నానగరరాజము నిర్మిత మాయెను. కొంతకాల మానగరము స్వారభౌముని రాజధానియై యుండుటచే నద్యాది సాటిలేని వైభవముతోడను సౌందర్యముతోడను విరాజిల్లుచుండెను. కాని, త్రాగుటకు వలయు నీటివసతి లేకుండుటచేత, అక్బరుచక్రవర్తి యానగరము వీడి, ఆగ్రానగరమును దనరాజధానిగ నొనరించెను. రాజధానియైనకారణమునమాత్రమే ప్రాముఖ్యతగాంచిన సిక్రీనగర మాహేతువుచే నిర్జనప్రదేశ మాయెను. ఆకాలము, నంటి యున్న సౌధము లన్నియుఁ గ్రమముగా భూమట్టమాయెను.

అక్బరుచక్రవర్తి సిక్రీనగరమును నిర్మించుట కొక కారణముండెను. ఆతనికి వృద్ధాప్యము సమీపించు చుండినను, పుత్రుఁడు కలుగడాయెను. సిక్రీనగరప్రాంతమున నొక ఫకీరుండెను. ఆతని మహాత్మ్యము గుఱించి జనులు వేనోళ్ళ చెప్పుకొనుచుండిరి. ఆ ఫకీరు కరుణించి చక్రవర్తిని ఆశీర్వదించుటచేత నాతని కొకకుమారుఁ డుదయించెను. తనకుమారునకు ఫకీరుయొక్క నామము నిడి తన కాతనియెడల గల కృతజ్ఞతను అక్బరు చక్రవర్తి వెలిబుచ్చెను. ఆతని పేరే "సలీము." తనకృతజ్ఞతను మఱి యొకవిధమున గూడ నాతఁడు విశదపఱచెను. జగత్ప్రసిద్ధిఁ జెందిన

మక్కాయందలి మసీదునుబోలిన మసీదును ఆప్రాంతమున నిర్మించెను. కరుణార్ద్రహృదయుఁ డగు సార్వభౌముఁ డంతటితో సంతసింపక, తనకు పుత్రభిక్ష నొసంగిన ఆఫకీరు స్మారకచిహ్నముగ నొక నగరరాజమును నిర్మించి, అద్దానిని దన సామ్రాజ్యమునకు ముఖ్యనగరముగ నొనరింప వలయునని సంకల్పించెను.

ఆఫకీరు జీవించియుండినంతకాలము, అక్బరుచక్రవర్తి యాతని నప్పుడప్పుడు దర్శించుచుండెను. కాని, ఆఫకీరు పాదుషా లిర్వురును మరణించిరి. మనకథ ప్రారంభమగునాటికి, సిక్రీనగరము నిర్జనప్రదేశమై పాడుపడి యుండెనుగదా. ఐనను, అందు సిద్ధపురుషులు మాత్రము నివసించుచుండిరి. మహనీయుఁడగు సలీముఫకీరుయొక్క శిష్యుఁడగు నొక ఫకీరు సలీముయొక్క మసీదును గనిపెట్టుకొని యుండుటకై నియోగింపఁబడెను. మిక్కిలి వృద్ధుఁడగు "ఉమ్రావ్" యొకఁడు కూడ నానగరమున నుండెను. ఆతనిపేరు సలబత్ ఖాన్. సిక్రీనగర వాస్తవ్యు లందఱును అక్బరుచక్రవర్తితోఁబాటు ఆగ్రానగరమునకు నిర్గమించిన సమయమున, వృద్ధుఁడగు ఈఖానుమాత్రము సార్వభౌముని యనుజ్ఞ వడసి సిక్రీయందే నిలిచియుండెను. ఆతనిప్రార్థన నాలించి జహాంగీరు చక్రవర్తి సహితము అతఁడచటనుండుటకు ననుజ్ఞనొసంగెను. ఆ సలబత్ ఖాను వృద్ధుఁడగుటచేతను తత్వజ్ఞుఁడగుటచేతను, ఆతనికి రాజదర్బారు నందలి కుట్రలు భోగభాగ్యములును రుచింపవని యెఱింగి, జహాంగీరు చక్రవర్తి ఆఖానును సిక్రీనగరమున నుండనిచ్చుటయేగాక, ఆతనికొక చిన్నవసతినిగూడ నేర్పఱిచెను.

నాటినుండియు వృద్ధుఁడగు సలబతుఖాను శిథిలమైయుండిన రాజాంతః పురమున వాసముచేయుచుండెను. ఆ రాజమందిర మతి విశాలముగ నుండెను. లోకప్రఖ్యాతిగాంచిన లెక్కలేని శిల్పులచేఁ గట్టఁబడిన సౌధము లందనేకములుండెను. కొన్నికొన్ని కట్టడములు పూర్తి

కాకుండగనే శిల్పులు ఆగ్రానగరమునకు బోవలసినవారలైరి. అతివిశాల మగు రాజమందిరము శిథిలమైనను, అక్కడక్కడ కొన్నికొన్ని గదులు మాత్రము నివాసయోగ్యములై యుండెను. అట్టి కొన్నిగదులకు సల బతుఖా ఉపయోగించుచుండెను.

సలబతుఖానును గనిపెట్టుకొని, ఒకసేవకుడుండెను. ఆతనిపేరు 'మహమ్మదుజాన్.' ఆతడు బాల్యమునుండియు ఖానును సేవించు చుండెను. ఆకారణమున నాతనిపై స్వామిభక్తియు, ప్రేమయును ఆ సేవ కున కధికముగ నుండెను. కాబట్టి, తన స్వామి నిర్జనప్రదేశమున నుండి నను, ఆతని విడువఁజాలక, భక్తివిశ్వాసములతో నాతని సేవించుచు తోడునీడవలె మెలంగుచుండెను.

ఈ సేవకునితోఁబాటు నొక పరిచారికగూడ ఖానును గనిపెట్టుకొని యుండెను. ఆమెపేరు 'హమీదా.' వీరు మువ్వురతోబాటు, అనమాన సౌందర్యవతి యగు నొక బాలికామణిగూడ నుండెను. ఆమెప్రాయము పదునైదేండ్లు! మంటిలోనుద్భవించెడి మణివలె నావృద్ధులనడుమ సహజసౌందర్యవతియగు నాబాలికామణి మఱింతసౌందర్యముతో విరా జిల్లుచుండెను. ఆమె ఖానుయొక్క మనుమరాలైయుండునని జను లను కొనుచుండిరి. హమీదామాత్రము పెదవి విరచుచుండెను.

## ౨

### ఆతఁడెవరు?

సాయంసంధ్యాసమయమున, మృణ్మయపాత్రము నొండుశిరముపై నిడికొని, నిర్మలోదకములం గొని తెచ్చుటకై 'లూలిఖా' ప్రయాణ మాయెను. జలాశయము రాజమందిరమునకు బశ్చిమ దిశయందుండెను. సౌందర్యవతియగు నాబాలిక హంసవలె మెల్లగ నడుచుచు బావిని సమీపించెను. చెంతనుండిన గట్టుపై పాత్రనిడి, ఆబాలిక బంగారుకాం

తులతో ప్రకాశించు సూర్యునిజూచి యానందింపఁ దొడంగెను. మోహనాకారముగల యాబాలికపై భానుని సువర్ణకిరణములు ప్రసరించుటచే నామెసౌందర్యము వర్ణనాతీతముగ నుండెను. గగనమున ధగధగ ద్యోతమానిముగ మెఱయుచుండిన సూర్యుఁడును, వజ్రఁపుతునకవలె మిఱుమిట్లు గొల్పుచు నతిశయించుచుండిన ఆబాలికయును ఒకరినొకరు వీక్షించుచు, యానందించుచుండినటులుండెను. ప్రపంచమెట్టిదో యెఱుంగని 'లూలియా' ప్రకృతిసౌందర్యమునుగని మైమఱచియుండెను.

ఆమె కొంతతడవట్లు పరధ్యానముగ నుండినపిమ్మట, మెల్లని యడుగుల చప్పుడు వినవచ్చెను. సూర్యుఁడు పశ్చిమాంబుధిని గ్రుంకెను. సన్నని చీకటులు ప్రారంభమాయెను. వాతావరణమంతయు నిశ్శబ్దముగ నుండెను. ఆ యడుగుల చప్పు డొక్కసారిమాత్రమే వీనులఁబడినట్లాయెను. కాల మతిక్రమించి యుండుటచే నా బాలికయొక్క దాదియగు హామీదా తనను వెదకికొనుచు వచ్చియుండునని ఆమె యూహించెను. కాని, ఎవరును గోచరింపకుండుటచే, తాను పొరబడియుందునని భావించి, నూతిలో చేదవైచి నీరు తీయఁబోయెను. అనసమయమున నూతిచాటుననుండి ఇట్లు వినపడెను.

"బాలా! తామరపద్మములకంటె కోమలములగుహస్తద్వయముతో నీ వెట్లు నీరు లాగగలవు? ముహూర్తమాత్రమున నీరమును దీసి నేను నీకొసంగగలను."

ఈపలుకులను వినినంతనే లూలియా యాశ్చర్యపరవశురాలాయెను. ఆ నిర్జనప్రదేశమున వృద్ధులగు ఉమ్రావుయును, ఆతని యనుచరులగు మహమ్మదుజాన్ హామీదాలు తప్ప మఱియెవ్వరును లేరుకదా. మసీదును గనిపెట్టుకొనియుండు ఫకీరు ఈదెస వచ్చువాఁడు కాఁడు. మఱియు, తనను సంభోధించిన కంఠస్వరము లూలియా పూర్వము వినినదికాదు. ఏమియు తోచక, ఆమెనివ్వెరపడుచుండిన సమయమున

నొక చిక్కని యువతీలలామ ఆమె యెదుట సాక్షాత్కరించెను. నిర్మా నుష్యముగ నుండిన యాప్రదేశమున కాజవ్వని యెట్లేతెంచెనో గ్రహింప జాలక లూలియా మిక్కిలి యాశ్చర్యపడుచు నామె ముఖారవిందమును బరిశీలించెను. ఆమె సుమారుఇరువదియేండ్లప్రాయుపుయువతియై యుండు నని లూలియా యూహించెను.

క్రొత్తగ గోచరించిన యా నారీమణి పరిశుభ్రమైన ముదుకవస్త్రము లను ధరించియుండెను. ఆమె యొడలిపై నాభరణము లెవ్వియు లేకుండెను. ఆమె ధరించిన ముదుకవస్త్రములే సహజసౌందర్యవతియగు నాజవ్వని కొక వింతయందము నొసంగెను. సౌందర్యమునుబట్టి ఆరమణీ మణి శుద్ధాంతముల మెలంగు రాజపుత్రికవలె నుండెను. వస్త్రములు మాత్రము పేదఱికమును సూచించుచుండెను. ఏమియు దోచక, ఱెప్ప వాల్పక నామెను లూలియా యట్టె తిలకింపఁదొడంగెను.

అట్లు తనను వింతగజూచుచుండిన లూలియాను గాంచి ఆరమణీమణి మఱల యిట్లు సంబోధించెను. “కోమలాంగీ! ఆ త్రాటిని నాకొసం గుము. ఇట్టి క్రూర కార్యమునకు నిన్నెవరు నియోగించిరి! నేనేనీరము దీసి నీకొసంగెదను.”

లూలియా: “అమ్మా! అనుదినము నేనే నీరముఁ దీయుచుందును. నాకిదియొక కష్టముకాదు. నామాటకేమిగాని, నిన్ను మున్నెన్నఁడు గాంచియెఱుంగను. మీరెవరో తెలిపెదరేని నే నెంతయు సంతసింతును”

బాలామణీ! “నేను నిఱుపేదలకు జనించినదానను. నన్ను రక్షింతు వని నీచెంత కేతెంచితిని” అని యామె ప్రత్యుత్తర మొసంగెను.

ఆమె ముఖారవిందమును లూలియా మఱల విలోకించెను. ఆమె కేదియో యొక యూహ జనించెను. ఆమె మానసమున ఆమెయే యెఱుంగని మార్పుకలిగెను. హృదయగమనము త్వరిత మాయెను! ఇట్టితొట్రుపాటు ఆమె కేలగల్గెనో అమెకే తెలియనపుడు మన కెట్లు

తెలియఁగలదు ? తన యెదుటనున్న సౌందర్యవతి యెవరు ? ఆమె యిచటి కేల వచ్చెను? ఎట్లు వచ్చెను? ఆమె కెవ్వరైన బంధుగు లుందురా ? ఉన్న యెడల, ఇట్టి నిర్మానుష్యప్రదేశమునకు ఆమె నొంటిరిగా నేల రానిత్తురు ? ఈవిధముగ దనను దాను లూలియా ప్రశ్నింపఁ దొడంగెను. హృదయాంతరంగమున నెట్టి పరివర్తనము జరుగుచుండినను, ముగ్ధ యగు నాబాలిక తనయెదుటనుండి వనితారత్నమును ప్రశ్నింపఁజాలకపోయెను. ఇంతలో నారణీమణి లూలియా కొనివచ్చిన త్రాటి నందికొని, క్షణమాత్రమున నీరమును లాగి క్రింద నిడి మందహాస మొనరించుచు, ఆ బాలిక నుద్దేశించి యిట్లనెను.

" బాలా! చూచితివా, నే నెంత సులభముగా నీరమును దీసితినో ! ఈకార్యమునకై నిన్నిచటకు హమీదా పంపుట క్రూరము సుమా !"

క్రొత్తగ నరుదెంచిన ఆస్త్రీకి హమీదాయొక్క పేరెట్లు తెలిసెనో యని లూలియా నివ్వెరపడుచు నిట్లు బదు లిడెను. " నన్నిచటకు హమీదా పంపలేదు. ఆమె వలదని యెంతచెప్పినను నేనే నీటికై వచ్చుచుందును. మేము ధనికులము గాము. నే నిట్టి పనులైనఁ జేయకుందునేని, గృహకృత్యము లెట్లు జరుగఁగలవు ? కాని, నీ విపుడు 'హమీదా' యని యంటివే. నాదాది పేరు నీకెట్లు తెలిసెనో వచింపుము."

" నీవు నన్నెఱుంగవు కాని, నిమ్మందఱను నే నెఱుంగుదును " అని చిరునవ్వు నవ్వుచు నామె బదులిడెను.

"కాంతామణీ ! నీవచనము లాలించుకొలఁది నిన్నెఱుంగవలయు ననెడు కుతూహల మధిక మగుచున్నది. నాసంశయముఁ దీర్పవలయు నని ప్రార్థించుచున్నదానను."

" నే నింతకుమున్నే ఎఱింగించి యుంటిని. నేను నిఱుపేదలకు జనించిన నిర్భాగ్యురాలను. మాగృహము దోపిడి పాలయెను. కావున, ఆహారముకై భిక్షాటనమున చేయుచున్నదానను."

"అయ్యో, నీ వెట్టి కష్టముల పాల్పడితివి?"

ఆస్త్రీ దీర్ఘమగు నిట్టూర్పువిడిచి యిట్లు బదులిడెను. "దురదృష్ట వంతుఁడ నగు — దురదృష్టవంతురాలనగు నాయవస్థగాంచి విచారించు దానిని ని న్నొక్కర్తనే జూచితిని. నీవుతప్ప మఱియొకరు లేరుగదా!"

ఆమె సంగతి లూలియా కనిపెట్టజాలక పోయెను. గాని, ఒక విధమగు యనుమానము మాత్ర ముదయించెను. తోడనే, కండ్లకు పొర గప్పినట్లు ఏమియుఁగానరాకుండెను. కాని, ఆమెకేమియు గ్రాహ్యము కాకుండెను. ఆమె తెలివిఁదెచ్చుకొని చూచునరికి చీకటులుక్రమ్ముకొని వచ్చుచుండెను. తనకు బరిచయములేని కాంతతో నచట నిశీథసమయమున నుండుటకు వెఱచి, జాగుచేయక యింటికేగవలయు నని లూలియా ప్రయత్నించెను. ఏకారణముచేతనో గాని, ఆమె కదలఁ జాలకపోయెను. అట్లామె ప్రమాన్పడి నిశ్చేష్టురాలై యుండ, ఆమె నుద్దేశించి యా స్త్రీ యిట్లనెను.

"బాలా! నీకు శ్రమకలుగకుండ, ఈ నీరమును నేను మీయింటికి గొంపోవుటకంటె సంతోషకర మగుకార్యమునాకు మఱియొకటి లేదు. కాని, కారణాంతరముచే నేనట్లు చేయఁ జాలనందున నా కెంతయు విచారము కలుగుచున్నది. ఆహా! అచిరకాలమున నవరత్నఖచితమగు కిరీటమును ధరింపగల యీశిరము యిపు డీఘటభారమును వహింప వలయుగదా!"

లూలియా ఏమియు జెప్పజాలక చేష్ట లుడిగియుండుట గాంచి, ఆ యంబుజాక్షి మఱల నిట్లనెను — "బాలా! నీవంటి సుందరితో నే నెన్నఁడు ముచ్చటించి యెఱుంగను. సుందరీ! నాప్రక్క కూర్చుండుము. తనివిదీర మన మిరువురము సంభాషింతము."

లూలియా కదలలేదు. అంత నావనిత లూలియాయొక్క మృదువగు హస్తమును బట్టికొని, తనప్రక్క కూర్చుండబెట్టెను. తనను ముట్టరా

దనిగాని, తానచట కూర్చుండజాలనని గాని లూలియా చెప్పజాలక బోయెను. కాని, ఆమె డెందమున నొకవిధము కలవరము జనించి, దేహమంత ఘర్మకణప్రపూరితమాయెను. గాలిచే నల్లలాడు తరు పత్రమువలె నామె యొడలంతయు గంపింప నారంభించెను. ఆమె యెన్నడు నట్టి యవస్థ నెఱుంగదు.

జీకటిమైనను లూలియా చనుదేర కుండుటచే నామెను వెదకుటకై హమీదా బయల్వెడలెను. కన్నబిడ్డకంటె నెక్కుడుగ బ్రేమించు నాబాలికకు చీకటియందు నెట్టిప్రమాదము సంభవించునో యను భయం బును, చీకటి పడకుండగనే రారాదా యని కోపంబును ఆ వృద్ధురాలికి జనించుటచే నామె యిట్లఱచుచు బావివైపు బోయెను — "ఈ బాలి కతో జాలకష్టముగ నున్నది. 'లూలియా!' (యని బిగ్గఱగ నఱచుచు) ఈబాల యెచటను గానరాదేమి? 'లూలియా!' 'లూలియా!'

అని యఱచుచు విసిగికొనుచు వృద్ధురాలాదెస నరుదెంచుట గని పెట్టి, లూలియాను గూర్చుండబెట్టి ఆమె యెన్నడెఱుంగని క్రొత్త రీతిని బ్రసంగింప నారంభించిన నూతనస్త్రీ లూలియాను దన యుర కౌగిటం జేర్చి, మెల్లగ నామెచెవిలో రహస్యముగ నిట్లనెను — "బాలా! అణుమాత్రమైనను నాగురించి యేరికైన దెలియనీయకుము. అట్లు కాదేని, నాకు గొప్పవిపత్తు సంభవించును."

అని బలికి, ఆసుందరి వదనారవిందము గాంచినంతనే, ఆస్త్రీకి నొక విధమగు పారవశ్యము జనించెను. ఇంక బట్టజాలక, తనయురకౌగిటనున్న భువనైకసుందరిని గాఢాలింగన మొనరించి, ధవళచ్ఛాయ లీను ఆ సుందరి చెక్కులను తనివితీర ముద్దాడి, అంతతో సంతృప్తి కలుగక పోవుటచే, అమృతప్రపూర్ణమైయున్న ఆ సుందరి యధరమును ముహూర్తమాత్రమున గ్రోలి, మఱలనొక్కసారి ఆసుందరిని బిగ్గరగ గౌగలించి, మెఱుపువలె నామె యదృశ్యమాయెను.

లూలియాను వెదకికొనుచు నరుదెంచుచుండిన హామీదా, ఆ బావిని సమీపించుగొలది, మఱింత నాగ్రహావేశురాలగుచుండెను. జలాశయము సమీపమగుచుండెను. చీకటి యధికమగుచుండెను. అచట నైనను లూలియా గోచరమగునో లేదో యను భయ మావృద్ధ దాదికి నధికమగుచుండెను. అట్టివెఱపే ఆమె కోపమునకు గారణము. ఎట్టకేలకు, ఆమెకు లూలియా జలాశయప్రాంతమున గాన్పడెను.

విసుగుచు, దిట్టుచు, గేరుచు నరుదెంచిన దాదిని జూచినంతనే పారవశ్యముచే మైమరచియుండిన లూలియా మేల్కాంచెను. ఒక్క గంటకాలములో జరిగిన విపరీతవిషయములన్నియు కలసి ఒక కలవలె నుండెను. తానెన్నడెఱుంగని యా వింతస్త్రీయొక్క వింతప్రవర్తన మంతయు — ఆ మనోహరాకారము, మధురసంభాషణము, భావగర్భిత ములగు బలుకులు, రహస్యసంచరణము, ఎన్నఁడెఱుంగని గాఢాలింగ నము, అధరచుంబనమును జ్ఞప్తికి వచ్చుచుండెను.

లూలియా దృగ్గోచరమైనంతనే, కుపితస్వాంతయై యుండిన దాది యిట్లనెను.

" ఎందరినో బాలికలను జూచియుంటిని గాని, నీవంటిదాని నెన్నఁ డెఱుంగను. నీకింతటి యజ్ఞానమేల ? ఇంత చీకటిపడినను, ఇంకను ఈ నూతిచెంతనే గూర్చునియున్నావే ? "

ఆబాలికస్థితి కడు విషమముగ నుండెను. తానచట నంతకాల మేల గూర్చుండవలసివచ్చెనో యెట్లు చెప్పగలదు : ఆమె యెన్నఁడు నన్నృతమాడి యెఱుంగదు. కాని, ఈవిషమసమయమున మాత్రము బొంకవలసినదాయెను. తన యాందోళనమును లోలోన నడంచుకొని, తెగువచేసి ఆబాలిక యిట్లు బదులిడెను — " నాపై నీకుగల ప్రేమను బరీక్షింపవలయునని నాకు నేడు కుతూహలము కలిగెను. నాకై నీవు వెదకికొనివత్తువో లేదో కనుగొనుటకై యిచట గూర్చునియుంటిని. ఆగ్రహింపకుము, "

హామీాదా : "చాలుఁ నీ ప్రతాపము. నీవింకను చిన్నబిడ్డ వను కొనుచుంటివి కాబోలు! ఇట్టి రాత్రిసమయమున నీ వొంటిగా దిరుగాడు చుండువేని, జను లేమనుకొందురు? ఆమాత్ర మెఱుంగవలదా?"

లూలియా : "హామీాదా? అదియేమి?"

ఆమె ప్రశ్నను వినిపించుకొనక, హామీాదా యిట్లనెను. "నీకై వృద్ధుడగు ఖాను ఎంత తత్తరపడుచున్నాడు! బాలా నీకు ప్రపంచజ్ఞానము లేదుసుమా. మనయాతిథ్యమునకై పెక్కండ్రు అరుదెంచి యున్నారు. వారికై, సముచితసన్మానము లొనరింపవలయును. సత్వరముగ నింటికేగుదము రమ్ము."

లూలియాకు జ్ఞానాభ్యుదయమైనది మొదలు, చుట్టములనుగాని యతిథులనుగాని జూచి యెఱుంగదు. తా ననుదినము గాంచు వృద్ధులు తప్ప ఇతర బాంధవులెవ్వరైన నున్నట్లు లూలియాకు దెలియదు. బాహ్యప్రపంచ మెట్లుండెనో యెఱుంగని లూలియా, అతిథు లేతెంచిరని వినినంతనే యానందభరితురాలాయెను. తత్క్షణము వారిని జూడవలయునని ఆమె యాతురపడసాగెను. ఏదియో గొణుగుచుండిన దాదిని గాంచిః "ఆ యతిథులెవ్వరో చెప్పెదవా!" అని లూలియా యడిగెను. కాని, తనలోఁ దానేదియో గొణుగుకొనుచుండిన వృద్ధురాలి కా ప్రశ్న వినఁబడలేదు. లూలియా కుతూహల మత్యధికముగ నుండుటచే నామె మఱల బ్రశ్నింప, దాది యిట్లు బదులిడెను.

"పది పండ్రెండుమంది సిఫాయిలను వెంటఁబెట్టుకొని, ఒక రసపుత్ర వీరుఁ డేతెంచినాఁడు. అతఁడు పాదుషాచే నియోగింపఁబడిన గూఢచారియైయుండును. కాని పాదుషాయొక్క బుద్ధికి నేమనవచ్చును? ఆతఁడు మన కేర్పఱచిన వసతి మన కేచాలకున్నది. అట్టి మనవీకలమీాఁదకు నిట్టివారినాతఁడు పంపుచుండినచో, మనమెట్లు భరింపఁగలము?"

దాది చెప్పినదంతయు వినుట మాని, ఆమె నిట్లు లూలియు

ప్రశ్నించెను— “ ఆ రసపుత్రవీరుఁడెవరో తెలుపుము. ఇచటి కేలవచ్చి యుండును ? ”

దాది : “ అతఁడు జయపురాధిపతి యఁట, ఆతఁ డేల చనుదెంచెనో దైవమే యెఱుంగును. ”

లూలియా కుతూహలము మఱింత యధికమాయెను. కొంతసేపటికి వారిరువురు నిల్లుఁ జేరిరి.

గృహముఁ జేరినంతనే, లూలియా తత్తరపాటు చాల హెచ్చాయెను. పళ్ళెరమున బోసిన పాదరసమువలె నామె మనసు పరిపరివిధములఁ బోవుచుండెను. నీటికై బావికేగినపుడు కలిగిన, నూతన వనితా దర్శనమును, ఆమె చతురప్రసంగములును, గాఢాలింగనములును, అధర చుంబనమును, వానిచేఁ గలిగిన పారవశ్యమును ఆమెకు మఱల జ్ఞప్తికి వచ్చెను. ప్రపంచమంతయు నామెకు గ్రొత్తగఁ దోచుచుండెను. తుపాను సమయమునందు సముద్రమువలె నామె మనసంతయు నల్ల కల్లోలముగ నుండెను. ఆతొట్రుపాటంతయునుదాది కనిపెట్టునేమోనని వెఱచి ఆ బాలికతన మోమును మఱుఁగుపెట్టియుంచెను. దాదియొక్క ధ్యాన మంతయు గ్రొత్తగ నరుదెంచిన యతిథులపై లగ్నమై యుండకుండినచో నామె లూలియా పడుచుండిన కలవరమును గనిపెట్టి యుండెడిది ?

వృద్ధుఁడగు సలబతుఖాను దిండుపై నగము వ్రాలి యొద్దియో చదివికొనుచుండగా, ఆతని సేవకుఁ డగు మహమ్మదుజాను యరుదెంచి సవినయముగ నిట్లు విన్నవించెను.

‘హుజూర్ ! రసపుత్రసైన్యాధిపతి తమదర్శనార్థము వేచియున్నాడు’

సలబతుఖాను : “రసపుత్రసైన్యాధిపతియా ? ఏమి ?”

మహమ్మదుజాన్ : “ఆతఁ డెవరో నాకుఁ దెలియదు. ఆతని యాకారమును, ఆతఁడు ధరించిన వస్త్రములను బట్టిచూడ, గొప్పయధి

కారివలె నున్నాడు. ఆతనితోఁ బది పదిహేనుమంది సైనికులుగూడ నరుదెంచియున్నారు. ”

ఆమాటలు వీనులఁ బడినంతనే, మోమును చిట్లించుకొని, రస పుత్రుని లోనికిఁ దీసికొరావచ్చు నని ఖాను పలికెను. రసపుత్రుఁడు ప్రవేశించు నంతలో, ఖానుయొక్క మనసు పరిపరి విధములుగ నుండెను. ఆతఁడు చదువుచుండిన గ్రంథము నటుంచి, సులోచనములను దీసి, నిట్టూర్పు విడిచి, రసపుత్రవీరుఁ డేల యరుదెంచి యుండునాయని గాఢముగ విచారింపఁ దొడంగెను. ఆకాలమున రాజాజ్ఞయునిన యముని యాజ్ఞవలె వెఱచుచుండిరి. తన కెట్టి యుపద్రవము సంభ వించునో యనియును, తనప్రాణముకంటె నెక్కుడుగఁ జూచుచుండిన తన ముద్దులపట్టి నొసంగవలయునని పాదుషా యాజ్ఞాపించునో యని యును, ఆమె నెడబాసి తా నెట్లు జీవించియుండఁగల నని యును ఖాను ఖేదపడుచుండెను.

అట్టి విషాదసాగరమున సలబతుఖాను మునిగియుండిన సమయమున రసపుత్రవీరుఁడు ప్రవేశించెను. తోడనే ఖాను తన విషాదమును దిగ ద్రింగి, రసపుత్రునకు సవినయముగను సగౌరవముగను స్వాగతం బొసంగి “ఆర్యా తమ సేవకున కేమి యాజ్ఞ ?” అని యడిగెను.

రసపుత్రుఁడు: “ఆర్యా! తమ సుగుణములగుఱించి వినుటయే గాని, తమతోడి సాంగత్యభాగ్యము నేడుగా లభించెను. నేను జయ పురాధీశుఁడను. ‘అజితసింగు’ అని నన్ను బిలుతురు.”

సలబతుఖాను: “రాజోత్తమా! మీకు స్వాగతము. ఈ యాసనమును దమ రలంకరింపుడు. సేవకుని కేమి యాజ్ఞో దయ చేయుడు.”

తోడనే, అజితసింహుఁ డుచితాసనముపైఁ గూర్చుండి, పాదుషా యొక్క ముద్రగల జాబును జేబునుండితీసి సలబతుఖానున కొసంగెను.

జాబు నందుకొను నపుడాఖాను హస్తము వడకెను. హృదయము న నెద్దియో యాందోళనము పుట్టెను. జాబునందలి సంగతు లెట్లుండునో, ప్రాణపదమగు లూలియాకు నెట్టి విపత్తు కలుగునో యని తడఁబడుచు జాబును విప్పి యిట్లు చదివికొనెను:—

"నా ప్రియమగు సలబతుఖాను ఉమ్రాసాహెబా!"

మా స్నేహితులును సైన్యాధిపతులును అగు అజితసింహమహారాజు రాజకార్య నియోజితుఁడై సిక్రీనగరమున కొన్ని దినములు నివసింప వలసియున్నది. ఆతని కేమికావలయునో అరయుచుండుము.

విధేయుఁడు,

సలీము—జహాంగీరుషా."

లూలియాను గొనిపోవుటకై రసపుత్రు డరుదెంచె నేమోయని యులికిపడుచుండిన వృద్ధునకు శాంతి కలిగెను. కాని, నిర్మానుష్య ప్రదేశమగు సిక్రీనగరమున నెఱవేర్పవలసిన రాజకార్యమేమైయుండునో యని యోచించుచు నజితసింహునితో ఖాను ఇట్లనెను — "జయపుర కులావతంసమా! తమకు నుచితమగు స్వాగత మొసంగజాలనైతినని నేనెంతయు విచారించుచున్నాఁడను. విశాలహృదయులగు మీబోంట్లు లోపములను మన్నింతురుగాక. నాకు వీలగునట్లు తమయునికి సుఖప్రదముగ నుండునట్లు ప్రయత్నింతును."

ఆజానుబాహుఁడగు రసపుత్రయోధుఁడు చిరునవ్వు నవ్వుచు నిట్లనెను! "రణక్షేత్రములనే హంసతూలికాతల్పములుగ భావింపగల రసపుత్రవీరులకు గష్టసుఖములు సమానములేగదా."

సలబతుఖాను: తమరు లెస్సగా సెలవిచ్చిరి. ఈరాత్రి తమ రెచట బసచేయుదురో సెలవిండు."

అజిత: "ఎల్లపుడు సైన్యములతో బ్రయాణముచేయు మే మెచటనైన విశ్రమింపఁగలము. కాఁబట్టి, ఏబసనైన నేర్పాటుచేయుడు."

వీరి కెచట బస యేర్పఱతునా యని ఖాను యోచించుచుండ "మరియము బీగము మహాలులో నేటిరాత్రి విశ్రమింతుము" అని అజితసింగు పలికెను.

ఆ మహాలుపేరు వినినంతనే, తనపై పిడుగుపడినట్లు ఖాను నిశ్చేష్టితుఁడాయెను.

## 3

### మరియాబీగము మహాలు

సలబతుఖాను కూర్చునియుండిన గది కొంచెము చీకటిగ నుండెను. అట్లు కాదేని, ఖానుయొక్క యులికిపాటును రాజపుత్రుఁడు కనిపెట్టి యుండెడివాడు. కాబట్టి ఖానుయొక్క యదృష్టము బాగుగనే యుండెను. గడుసరియగు నమ్మొదుసలియొక్క ముహూర్తమాత్ర కాలములో ధైర్యము వహించి, అజితసింహునితో నిట్లనెను :

"రాజచంద్రమా! సిక్రీనగర మెట్టి హైన్యస్థితియందున్నచో చూచి యున్నారుగదా. చాలకాలమునుండి వాడుకలో లేని మరియాబీగము మహాలు మనుజుల కెంతమాత్రము నివాసయోగ్యమైనది గాదు."

అజితసింహుఁడు : "ఔగాక, ఆమహాలునందే విశ్రమింపవలయునని పాదుషావారి యాజ్ఞ. కావున, నేనచటనే బసచేయవలయును"

"పాదుషావారి యాజ్ఞ." అని అజితసింగు పలికినంతనే, ఖానుయొక్క మోము వెలవెల బోయెను. కారణ మేమై యుండునో గాని, ఆముదుసలి నోటమాట వచ్చుటయే కష్టముగ నుండెను. ఒక్కనిముష మట్లుండి, అతఁడు మెల్లగ నిట్లనెను : — "పాదుషా వారి యాజ్ఞను దప్పక శిరసావహింపవలయును. మరియాబీగముమహాలు తమకు సదుపాయముగ నుండదనిమాత్రము సంకోచించితిని."

"పాదుషావారి యాజ్ఞచొప్పున బ్రవర్తింపవలయును. గత్యంతరము లేదు."

"అట్లయిన, మీరిచట గొంతతడవు విశ్రమింపుడు. నేను పోయి మీరు బసచేయుటకుఁ దగియుండునట్లు ఆమహాలును శుభ్రపరుప వలయునని నా సేవకుల నాజ్ఞాపించి వచ్చెదను."

"మీ కట్టిశ్రమ కలిగించుటకు నే నియ్యకొనఁజాలను. నా సేవకు లనేకు లున్నారు. ఆమహాలును మేమే శుభ్రపఱచికొనగలము. మా కేదైన నవసరము కలుగునేని మీకు వర్తమానము చేసెదము."

అజితసింహుఁడు మరియాబీగము మహాలును తక్షణము ప్రవేశింప కృతనిశ్చయుఁడై యుండుట గాంచిన సలబతుఖాను ఆగ్రహావరవశుఁ డాయెను. ఆతడెంత యడంచికొనినను, ఒకక్షణముమాత్ర మాతని యాగ్రహ మాతని మోమున దాండవమాడెను. ఆగది కాంతివిహీనమై యుండినను, అతని మోమును అజితసింహుఁడు కఠినముగాఁ బరీక్ష చేయఁదొడంగెను. తననుగుఱించి కనిపెట్టుటకే నిశ్చయముగ రాజ పుత్రుఁడరుదెంచియుండునని సలబతుఖాను గ్రహించెను. అజితసింహుని కట్టిబుద్ధి యేల పుట్టవలయును? అనేక నగరము లుండ, పాదుషా యీతనిని, బాడువడిన యీస్థలమున కేలపంపవలయును? అని సలబతు ఖాను యోచింపదొడంగెను.

అజితసింహుఁడుకూడ నాలోచనాతత్పరుఁడాయెను. తాను బీగము మహాలునందు బసచేయుట ఖానున కయిష్టముగ నుండెనని యాతనికి విశదమాయెను.

"నిర్మానుష్యప్రదేశమగు మరియాబీగము మహాలునందు నేను బస చేయుట కీవృద్ధున కభ్యంతరమేల? నన్నచటికిఁ బంపుట కాతఁడేల సంశయింపవలయును? ఇందేదియో రహస్యముండవలయును. కాదేని, ఈమహాలునందే బసచేయుమని పాదుషావారేల నన్నేల నియోగింప వలయును? నాకిందుబసయొసంగుట కీఖాను యేలసంశయింపవలయును? కాఁబట్టి, ఇందేదియో రహస్య ముండుననుట తథ్యము."

వృద్ధుని వదనమును బరిశీలించి ఆతని భావమును గనిపెట్టవలయునని అజితసింగు ప్రయత్నించెను. మెఱపుమెఱసినట్లు వృద్ధుని వదనమున గాన్పించిన యాగ్రహము మెఱుపువలెనే యొక్కక్షణములో నదృశ్యమాయెను. అంతలో సద్దుకొని, శాంతమువహించి ఎప్పటియట్లు వృద్ధుడు ప్రసంగించుచుండుటచే నాతని భావమును గనిపెట్టుటకు రసపుత్రునకు సాధ్యము కాదాయెను. అతడపుడావృద్ధు నిట్లడిగెను :— "మరియాబీగము మహాలులో నేను బనచేయుటకు మీకేమైన నభ్యంతరముండునా ?"

"అదియేమి ?" అని ఆశ్చర్యముతో ఖాను బదులిడెను.

అజితసింగు : "మేమచట బనచేయుటకు మీకేమియు నభ్యంతరముండదుగదా."

ఖాను : "నా కభ్యంతరమేల ? మీ రచ్చటనే తప్పక బన చేయవచ్చును. మీకు నదుపాయముగ నుండదని మాత్రము నేను సంశయించుచుంటిని"

అజితసింగు : "ఆర్యా ! మన సౌఖ్యములకేమి ? పాదుషావారి యాజ్ఞ నతిక్రమింపరాదుగదా" అని చిరునవ్వునవ్వుచు బదులిడెను.

ఖాను : "రాజా ! రాజపుత్రుల రాజభక్తి కడుంగడు శ్లాఘనీయము. మీ రాజభక్తియును, శౌర్యప్రతాపములును అసాధారణములు. మహావైభవముతో నలరారు మొగలాయిసామ్రాజ్యమంతయు మీ సాహస పరాక్రమముల మీదనేగదా ఆధారపడియున్నది"

"ఉదారవంతులగు మీరిట్లు నుతింతురుగాని మాయందు విశేషమేమియులేదు" అని పల్కి దిగ్గునలేచి మఱల నిట్లనెను :—"వేళ యతిక్రమించుచున్నది. నే నిక బన చేరవలయును. మరియాబీగము మహాలుయొక్క బీగమును దయచేయుడు."

ఖాను : "బీగము నిప్పుడే నొసంగెదను. అని బలికి బీగమును దెచ్చ

ట్లకై యాతఁడు లేచి లోనికిఁబోవ ప్రయత్నించెను. కాని, అజితసింహుఁడాతని కడ్డు నిలువబడి యిట్లనెను: "తమరేల శ్రమపడవలయును? సేవకునిఁ బంపి బీగము దెప్పింపుడు."

అజితసింహు డట్లు ఖానును లోనికి బోకుండ వారించినంతనే యాతఁడు నిర్ఘాంతబోయెను. తనను వారించిన రసపుత్రునిఁ జురజుర జూచుచు ఖాను యిట్లనెను: "మీరు నన్ను ఖైదు చేసిరా?"

రసపుత్రుఁడు బదులిడకుండగనే, ఖాను యిట్లు విలపించెను: "హా! దైవమా! ఇక ముందు నాకేమి సంభవించునోగదా!"

అట్లు విలపించుచు నా వృద్ధుఁడు భయభ్రాంతుఁడై మొదలు నఱకిన వృక్షమువలె నేలఁగూలెను. అతని దేహమంతయు మంచువలె చల్లనై, కట్టెవలె బిఱ్ఱబిగుసుకొని యుండెను. వృద్ధుని మరణకాలమాసన్నమాయెనని అజితసింహుఁడు వెఱగందెను. రసపుత్రుని గాంభీర్యమంతయు నదృశ్యమాయెను. "బీగము మహాలునందు నేను బసచేయుట యీ వృద్ధుని కిష్టము లేదనియు, ఆ కారణమున ప్రసంగము నకు దిగి యాతఁడు కాలహరణ మొనరించుచుండెననియు, ఈ లోన, ఆ మహాలునందు నాకంట బడరాని వస్తువు లేవైననుండునేని వాని నాతని సేవకులు తీసివేయుదురనియు ననుమానించి నేనింతటి కాఠిన్యము వహించితిని. కాని నిక్కముగ నేను పొరబడియుంటిని. నేనాతని ఖైదు చేసితినను వెఱపేగదా యీతని మరణావస్థకు దెచ్చినది. హా! దైవమా! ఈ వృద్ధుని మరణమునకు నేనే గారణమైతినే!"

అని అజితసింహుఁడు పరితపింపఁదొడంగెను. శీతలోదకము గొనితెచ్చి వృద్ధునిమోముపైఁ జల్లినచో నాతఁడు తెప్పిఱిలు నేమోయని యూసించి తన సైనికులకై యాతఁడు కేకవైచెను. కాని వారు చాల దూరముగ నుండుటచే, వారికా కేక వినబడలేదు. ఉపచారలోపముచే నా వృద్ధుఁడు మరణించునేమో యను భయముచే రసపుత్రుని పరితా

పము మఱింత యధికమాయెను. కాని, ఆతనికొక యనుమానముకూడ కలిగెను. ఈ నిర్మానుష్య ప్రదేశమున నీ వృద్ధుఁడొక్కఁడే యెట్లు జీవించును? ఈతని యనుచరులెవరైన నిందుండవలయును. నాకేక విని వారెవ్వరైనను రాకుండుటాశ్చర్యకరముగ నున్నది! అనుమానమునకు గారణమగుచున్నది. ఈవృద్ధుని యనుచరులీ సమయమున నిశ్చయముగ మఱియాబీగము మహలునందు సంచరించుచుందురు"

వలలోఁ జిక్కిన చేపవలె నజితసింహుఁడు కొట్టుకొనుచుండెను. మరణించుచుండిన ఖానును విడిచి వెళ్లుట కాతని మనసొప్పదాయెను. కాని, బీగము మహలుకు తక్షణమేగి, అచట నేమి జరుగుచుండెనో చూచుట మిక్కిలియావశ్యకమై యుండెను. ఖానున కుపచారమొనరించుటకై యెవరినైన నియోగించి, బీగము మహలున కేగవలయునని ఆతఁడు యోచించెను. కాని, అతఁడెంత బిగ్గరగ నఱచినను, ఒకసేవకుఁడైన రాఁడాయెను. ఒక్కొక్క నిముసము గడచినకొలది, ఖాను మరణించునేమో యను భయ మధిక మగుచుండెను. తన కెదురుగా నుండిన గృహమున నెవరైన నుందురని యెంచి, వారిని గొనివచ్చుటకై అజితసింహుఁడు వెడలెను.

అజితసింహుఁడట్లు వెడలఁగనే, అంతవఱకును జచ్చినట్లు పడియుండిన సలబతుఖాను మెల్లగను, మిక్కిలిజాగ్రతగను కనులు సగము తెఱచి ఆజితసింహుఁడు వెడలుచుండిన దెస చూచెను. వెంటనే, ఆతఁడు మఱల చచ్చినట్లు పడియుండెను. అజితసింహుఁడు పోయివెదకిన గదియందు నెవ్వరులేకుండుటయేగాక, నీరమైనను దొరకపోయెను. ఎన్ని గదులువెదకినను లాభములేకపోయెను. కాని, ఒక కవాటమునుండి యాతఁడు చూచుచుండగా, ఎవ్వరో ఆయింటివైపు పరుగిడుచుండుటాతనికి గోచరమాయెను. చీకటిగ నుండుటచే, వారియాకారమాతనికిఁ గనుపడలేదు. వారినుద్దేశించి, ఎలుగెత్తి యాతఁడు పిలిచెను.

ఆతని పిలుపులచే గదియంతయు మాఱుమ్రోగెనేగాని, ఎవ్వరును బదులిడరైరి.

మోమునందలి చెమ్మట దుడుచుకొనుచు, తనకారణమున వృద్ధుడు మరణించుననని అజితసింహుడెంతయుఁ బరితపించెను. ఖాను సజీవుఁడై సచేతనుడై యుండెనని రసపుత్రుఁడెఱుంగడు. తన కారణమున నా వృద్ధుఁడు మరణించుననని యాతనికిఁగలిగిన విషాద వేదనములను వర్ణింపనలవిగాదు.

అంతలో, దూరమున నొకదీప మాతనికి గోచరమాయెను. తోడనే, అజితసింహుడాఁదెస రయమున బోయెను. ఆదీప మొక చిన్నగదియందు వెలుఁగుచుండెను. అదియొక వంట యిల్లువలె నుండెను. వంటకు వలయు సామగ్రియంతయు నందుండెను. ఒకమహామ్మదీయాంగన యందుండి వంటచేయుచుండెను. ఆమెను గాంచినంతనే రసపుత్రుఁ డాగ్రహావరవశుఁడై యిట్లనెను:

"గొంతుక బ్రద్దలగునట్లు నేనరచుచుండఁ నీ విచట గూర్చుని యుండియు, ఏలపలకకుంటివి?"

వంటచేయుచుండిన వనిత, పారకు లెఱింగిన 'హామీాదా' యేను. ఒక్కనిమిషముక్రిందనే ఆమె అచటి కేతెంచియుండెను. అతిత్వరితము లగు ఆమెయొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసము లామె యతిశీఘ్రముగ నచటికి బరువులెత్తి వచ్చియుండునని తెలుపుచుండెను. కాని, కుపితుఁడై యుండిన రసపుత్రుఁడాసంగతిని గుర్తింపఁజాలకపోయెను. ఆతని తలంపంతయు నావృద్ధునిమీాదనే యుండెను. ఆతఁడామెతో మఱల నిట్లనెను.

"వృద్ధుడగు ఉమ్రాసాహెబు స్పృహదప్పియున్నాఁడు. జలము గొని, శీఘ్రముగ నాతోడరమ్ము."

"నాకుఁ జెముడు, నాకేమియు వినిపించుటలేదు"

అంతట, అజితసింహుఁడామెను సమీపించి, ఆమె చెవిలో బిగ్గఱగ నఱచుచు, విషయము నామె కెఱింగించెను.

"అయ్యా! భయపడకుఁడు. ఖానున కప్పుడప్పు డిట్లు సంభవించు చుండును." అని పలికి, హమీదా చెంబులో నీరుబోసి, మెల్లగ బయలు దేఱెను. వృద్ధుడేమగునో యని తొట్రిలుచుండిన అజితసింహుఁ డామె చేతియందలి పాత్రను లాగికొని, ఖానునకై వరుగిడుచుఁ బోయెను.

## ౪

### అ ను మా న ము లో అ ను మా న ము.

సలబతుఖాను పడియుండిన గదిని అజితసింహుఁడు కనుఁగొనఁజాలక పోయెను. ఎన్నిగదులు వెదకినను, ఖాను కనఁబడ డాయెను. ఎంత వెదకినను ఆగది కానరాకుండుటచే, నాతనికి విసుగు జనించుటయేగాకఁ ఆగ్రహముకూడ నధికమాయెను. తుదకు, ఆతఁడు బిగ్గరగ నఱవసాగెను. అంతలో, ఎవరో దీపము చేతబట్టుకొని, ఆదెస వచ్చుచుండినట్లు రసపుత్రునకు గాన్పించెను. ఆతఁడెవఁడో సమీపించినంతనే, అజిత సింహుఁ డాతనిపై మండిపడుచు నిట్లనెను:—

"మీ కందఱకును చెముడేనా? నేనెంతయఱచినను, మీ రెవ్వరును రారె తిరే?"

సలబతుఖానే దీపమును బట్టుకొని వచ్చియుండెను. ఆతఁడు మర ణించునేమోయనిగదా అజితసింహుఁ డంత ప్రయాసపడుచుండెను. ఖాను నజీవుఁడై యున్నందుల కాతఁ డెంతయు సంతసించుచు, అంత లో దీపము జేతఁబూని రాగలిగినందుల కెంతయు నాశ్చర్యపడుచు నిట్ల నెను:— "మీ రేనా? మీకు క్షేమమే గదా?"

ఖాను: ఇది మూర్ఛసంబంధమగు తెగులు: నాకీజాడ్య మప్పు

డపుడు ప్రవేశించుచుండును. మీ కీవిషయము తెలియకుండుటచే నిట్లు కలవరపడితిరి. ”

అజితసింహుఁడు:—“ కలవరమేగాదు. మీరు మరణించిరనియే భావించితిని. దారుణమగు నిట్టి జాడ్యమునకు దగిన చికిత్స జేయింప రాదా ?”

ఖాను : రాజా ! నేను పాపాత్ముఁడను. ఈబాధ నెన్నిదినము లనుభవింపవలసియున్నదో, అన్నిదినములును అనుభవింపక దీఱదు గదా. రాజోత్తమా ! మీకు నిష్కారణముగా శ్రమకలిగించి నందులకునాకుఁజాల విచారముగనున్నది. ఆర్యా! నాతో దయచేయుఁడు లోపములను మన్నింపుఁడు.”

అజితసింహుఁడు: “ శ్రమ కేమిగాని, అతివిశాలమగు నీరాజమందిరమున మీరొక్కరే నివసించుచున్నారా ?”

ఖాను : “ నేనొక్కఁడనే నివసించుచున్నాఁడననియే చెప్పవచ్చును. మహమ్మదుజాన్, హమీదాయను నిరువురు సేవకులు మాత్రము సదా నన్ను గనిపెట్టుకొని యుందురు. సేవకులైనను, బంధుగులైనను, మిత్రులైనను వారు తప్ప మఱియొకరు లేరు. దుర దృష్టవంతుఁడనగు నావృత్తాంతము నాలించుచు, మీ రేల కాలహరణ మొనరింపవలయును ? మరియాబీగము మహాలుయొక్క బీగమును బట్టుకొని, మహమ్మదుజాను మీకై వేచియున్నాడు. దయచేయుఁడు. ఆమందిరమును మీకాతఁడు చూపించును. మిమ్మాతఁడు సదా కనిపెట్టుకొనియుండును. ఆతని మీస్వంతపరిచారకునివలె భావింపుఁడు. మీయాజ్ఞచొప్పున నాతఁడు మెలఁగు చుండును. దయచేయుఁడు. ”

అని పలికి, దీపమును బట్టికొని, ఖాను ప్రయాణమాయెను. మాఱుపలుకక, అజితసింహుఁడు కూడ ఆతని వెంటబోవుచుండెను. ఆతఁడట్లేగుచుండ, ఆతనిలోఁగల యనుమానములు మఱల మొలక

లెత్తెను. "ఈముదుసలి యుదంతమంతయు నబద్ధమువలె తోఁచుచు న్నదే. ఈతనిజాడ్యము నిజమైయుండునా? నిజముకాదేని, నన్ను మోసపుచ్చుట వలన ఈ ఖానుకు గలుగు లాభమేమి? నే నీతని నకారణముగ ననుమానించు చున్నవాఁడను. భోగభాగ్యములను విసర్జించి, ఈమూలను ముక్కుమూసుకొని ఈశ్వరధ్యానైకతత్పరుఁడై యుండు ఈవృద్ధుఁడేల మోసగింప గడంగును?"

ఖానుయొక్క లోతునరయఁజాలని రాజపుత్రుఁ డట్లుతనను దాను సమాధానపఱచికొనుచు ఖాను వెంబడి పోవుచుండెను. రస పుత్రుఁడు ఖాను ననుమానించినట్టులే, ఖాను గూడ రసపుత్రు నను మానించుచుండెను. తాను ప్రాణముకంటె నెక్కుడుగఁ జూచు లూలి యాను గొనిపోవుటకై యజితసింగు యేతెంచెనేమో యను భయ మావృద్ధుని బాధించుచుండెను. రసపుత్రుఁ డామెను రహస్యముగనో బలవంతముగనో దీసికొనిపోవునేమో యను భయ మావృద్ధుని మఱింత బాధింపదొడంగెను. హఠాత్తుగ నీ రసపుత్రు డిచటి కేల రా వలయును? పెద్ద రసపుత్రసైన్యాధిపతిని పాదుషావా రిచటకుఁ బంపఁ గతంబేమైయుండును? తానేల యరుదెంచెనో అజితసింగు చెప్పరాదా? ఇన్ని మహాలులుండ మరియాబీగము మహాలుసందే బసచేయుదునని రసపుత్రుఁడేల సంకల్పించవలయును?

అని, పరిపరి విధముల దనను దాను ఖాను ప్రశ్నించుకొను చుండెను కాని, సమాధాన మెద్దియును గుదరకపోయెను.

రాజపుత్రుని డెందముకూడ డోలాయమానముగ నుండినను, ఖానువలన నెట్టిసమాధానమైనను గ్రహించుట యసంబద్ధమని గ్రహించి మాటాడక వృద్ధునితోఁ బోవుచుండెను. వారిరువురు నట్లాలోచనా తత్పరులై గృహద్వారమునుఁ జేరునప్పటికి, వారికై నిరీక్షించుచుండిన

మహమ్మదుజాను గోచరమాయెను. అజితసింగున కాతఁడు వంగివంగి సలాములొనరించి తన వినయవిధేయతలను వ్యక్తపఱచెను. ఆసేవకుని గాంచి ఖాను యిట్లు పలికెను: "ఈరాజపుంగవుని మరియాబీగము మహలుకుగొనిపొమ్ము? వారియాజ్ఞానుసారము మెలంగుము." పిమ్మట, అజితసింగుతో నిట్లనెను: "రేపు దర్శన మొసంగఁగలరని విశ్వసించు చున్నాఁడను."

అని వృద్ధుఁడగు ఖాను పలికినంతనే, "నేటిరాత్రియే కలిసికొనఁ గలవు" అని యెవ్వరో యొకస్త్రీ వెనుకనుండి పలికినట్లు వినవచ్చెను. ఆపలుకులను వినినంతనేఁ వెనుకనుండి యెవరో పోటు పొడిచినట్లు, అజితసింహుఁ డులికిపడి గిఱ్ఱున వెనుకకు దిరిగెను, కాని, ఆతని కెవరును గనుపింపకుండిరి. అటు నిటు నెంతజూచినను దన యెదుట నుండిన ముసలివాం డ్రిరువురును దప్ప మఱియొక రాతనికి గోచరము కాకుండిరి. మఱియొక విశేష మాతనికి మఱింత యాశ్చర్యమును గల వరమును గలిగించెను. రసపుత్రునకు విస్మయము గలిగించిన పలుకుల నావృద్ధులు వినని యట్లూరకుండిరి. ఈవఱకే ఖానుపైఁ గల అజితసింహుని యనుమానము వేయిమడుంగు లధికమాయెను. కాని, తాను విననియట్టులు నటించుచుండిన ఖానును ఆవిషయమై ప్రశ్నించుట నిరర్థక మనియును, తానాప్రసంగము నెత్తకుండుటయే తన కార్యమునకు క్షేమకరముగ నుండుననియును వితర్కించుకొని, మాఱుపలుకక, మహమ్మదుజాను వెంటఁబోయెను.

వారు దృగ్గోచర మగుచుండి నంతవఱకును వారిం జూచుచు, వా రదృశ్యమైనతోడనే సంతసమును సూచించు దీర్ఘమగు నిట్టూర్పు విడిచి, సలబతుఖాను లోనికరిగి, తన గదిఁ బ్రవేశించి తలుపు బిగించుకొని సుఖాసీనుఁ డాయెను. హమీదా కూడ నచటనే యుండెను. ఆమెనుఁ గాంచి ఖాను యిట్లనెను: "నీ వట్లు పలుకుట యవివేకము

సుమా !" హామీాదా వృద్ధుని నొక్కనిమున మట్టెజూచి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను :

"వృద్ధాప్యముచే నీ తెలివితేటలు లోపించుచున్నవి సుమీా."

ఖాను చిరునవ్వు నవ్వుచు, మారుపలుకక మిన్నకుండెను.

## ౫

### మొగలాయిసార్వభౌము నినగరము

మన కథ ప్రారంభమగునాటికి ఫతేపూరు సిక్రీనగరము నిర్జనప్రదేశమై యుండెనని పాఠకు లెఱింగిన విషయమే గదా. ఆగ్రానగరము సార్వభౌముని రాజధానియై యుండెను. ఢిల్లీనగరము తొంటి హైందవ సార్వభౌములకు గూడ రాజధానియైయుండి, మొగలాయి పాదుషాల కాలమున గూడ జగద్విఖ్యాతి గాంచి యుండెను. ఈమూడు నగరముల గుఱించియును పాఠకు లనేక నవీనాంశములను గ్రహింపఁగలరు.

'మరియాబీగము' యను నొక 'కిరస్తాను' యువతిని అక్బరు చక్రవర్తి వివాహ మాడియుండెను. సిక్రీనగరమున నామె కొఱకై అద్భుతమగు మందిరమును చక్రవర్తి నిర్మించెను. శతాబ్దములు గడిచినను నాటి మహా వైభవమును బ్రదర్శించు నా రాజమందిర భాగము లింకను నిలిచియున్నవి.

మరియాబీగము మహాలు సిక్రీనగర హృదయమున నుండెను.

ఆ మహాలునకు గొంతదూరమున మఱికొన్ని రమ్యమగు మందిరము లుండెను. వానిచుట్టును ఉన్నత ప్రాకారము లుండుటచే, నా మందిరము లన్నియుఁ గలసి యొక కోటవలె నుండెను. చక్రవర్తియొక్క హైందవ యర్ధాంగి యగు జోధుభాయి కొఱ కా మందిరములు నిర్మితము లాయెను. ఆ ప్రాకారములకుఁ గొంతదూరమున సుప్రసిద్ధుఁడగు బీరుబాలు రాజాయొక్క గృహముండెను. ఆ గృహమునకు

వెనుకభాగముననే సార్వభౌమునకుఁ గుమారుని బ్రసాదించిన 'సలీము ఫకీరు' యొక్క గోరీ యుండెను. సార్వభౌముని కళాపోషణమును, శిల్పుల కల్పనాచాతుర్యమును సమానముగఁ బ్రదర్శింపుచు, మహావైభవముతో దేదీప్యమానముగ వెలుగొందుచు, నా స్ఫటికశిలాభవనము చూపరుల నాకర్షించుచుండెను. సమానవైభవముతో నలరారుచు, మక్కాయందలి మసీదును బోలిన మసీదు యొకటి ఆగోరీ యెదుటనే యుండెను.

సిక్రీనగరమునందలి రెండవభాగమున నతి విశాలములగు రెండు భవనము లుండెను. ఒక విశాల భవనమునందు అక్బరుచక్రవర్తి దర్బారు చేయుచుండెడివాఁడు. ఆభవనమును 'దివానీ అమ్' అని పిలుతురు. ఆ రెండవభవనము సార్వభౌముని కార్యాలోచనామందిరము. ఇవిగాక, ఆనగరమునఁ బలువిధములగు సౌధము లుండెను.

దైవనిర్మిత నగరమువలెనుండిన యీనగరరాజమును బలిష్ఠములగు ఉన్నతప్రాకారములు సంరక్షించుచుండెను. ఆ ప్రాకారములక్రింద బెక్కు గృహములు బారులుతీర్చి యుండెను. కాని, మన కథ ప్రారంభమగునాటి కాగృహము లన్నియు జనశూన్యములై యుండెను. ఆనగరమంతయుగూడ నట్టులే నిర్జన ప్రదేశమై యుండెగదా.

నలభతుఖానుయొక్క సేవకుఁడగు మహమ్మదుజాను అజితసింగును గొన్ని సందులు త్రిప్పి, ఎత్తైన గోడలనడుమనుండిన మందిరద్వారమున నిలిచి "ఇదియే మరియూబీగము మహాలు" అని యాతనికిజూపెను.

అజితసింహుడు : "నీవద్దనున్న బీగమును నాకొసంగుము. నాయనుచరులున్నారు. వలయునేర్పాటుల నెల్ల వారొనరింపఁగలరు."

అట్లు పలికిన రసపుత్రునకు బీగము నందిచ్చి "ఈ సేవకుఁడు —" అని యెద్దియో మహమ్మదు చెప్పఁబోయెను. అజితసింహుఁ డాతని వారించి ఇట్లనెను.

"మాకుఁ గావలయు కార్యములెల్ల నా సేవకులు నిర్వర్తింప గలరని నీకుఁ జెప్పియుంటినిగదా. నిన్ను శ్రమపెట్టుట నాకిష్టము లేదు. సింహద్వారమున నిలిచియుండు యనుచరులను బిలుతువేని చాల సంతసింతును."

ఆమాటలు వినినంతనే, మాఱుపలుకక, మహమ్మదుజాను వెనుకకు మఱలెను. అతఁడొక్క ముహూర్తకాలమున నదృశ్యుఁడాయెను. అతఁ డెటుబోయెనో యెవ్వరెఱుంగరు.

ఖానుయొక్క సేవకుఁడు నిష్క్రమింపఁగనే, బీగమును జేతఁ బట్టుకొని, అజితసింహుఁడు మందిరద్వారమును డాసి, బీగమును బ్రయోగించి, తలుపు తెరచి లోని యావరణప్రవేశించెను. చీకటిగ నుండుటచే నాప్రదేశము నాతఁడు పరిశీలింపఁజాలక, దీపమునకై మిక్కిలి యాతురతతో నిరీక్షించుచుండెను.

అంతలో నిరువదిమంది యాశ్వికు లచటి కరుదెంచిరి. సామానులను గొనితెచ్చు సేవకులు కొందఱును, కరదీపములతోఁ గొందరును గూడ వారితో నేతెంచిరి. వారందఱును అజితసింహుని యనుచరులని పాఠకులు గ్రహింపఁగలరు. కరదీపికా సహస్రంబుల కాంతిచే నా మందిర సౌందర్య మజితసింగునకు గోచరమాయెను. ఆ మందిరమును గనిపెట్టువారెవరు నచట లేకుండినను అసాధారణ వైభవముతో బ్రకాశించుచుండిన యాప్రాసాదరాజముం గాంచి రాజపుత్రుఁ డానంద పరవశుఁడాయెను. అందలి ప్రధానమందిరము చుట్టు తలుపులును కిటికీలును ఉండెను. చుట్టును వసారాయుండెను. అందు నివసించువారికి నదుపాయముగ నుండునట్లంతయు నమర్చఁబడి యుండెను. మేడపై, విశాలమగు నొక మహలుమాత్ర ముండెను. ఆమహాలు సౌందర్య వైభవములను వీక్షించుట కాతనికి రెండునయనములు చాలకుండెను. అట్లు నయనపర్వ మొనరించుచుండిన మహాలు మఱియాభీగమునకై

నిర్మితమై యుండునని అజితసింహుఁ డూహించెను. క్రిందిభాగమంత యును, చుట్టునుండిన యసంఖ్యాకములగు చిన్న చిన్న గదులు బీగము యొక్క పరిచారికలకై యేర్పడియుండుననియు నాతఁడు భావించెను.

"సుప్రసిద్ధమగు మరియీబీగము మహాలునందు నే డీరసపుత్ర భూమీశ్వరుఁడు విశ్రమింపఁగలఁడు; బీగముయొక్క పరిచారికల గదు లలో నా యనుచరులు విశ్రమింపఁగలరు" అని అజితసింహుఁడు తనలో ననుకొని, మందహాస మొనరించుచు, తన సుబేదారుఁడగు రఘువీర సింహునకు బిలిచి తన యభిప్రాయము నాతనికి దెలియఁబఱచెను.

అంతలో, వారికి మహమ్మదుజాను ప్రత్యక్షమాయెను. ఆతఁడెట్లు వచ్చెనో వారు కనిపెట్టలేదు. అజితసింహు నుద్దేశించి యాతఁడిట్లనెను. "రాజోత్తమా! తమరీ సేవకున కేదైనఁ బని గల్పింపుఁడు, మేడపై నున్న సౌందర్యమహాలు తమరు విశ్రమింపవలసిన స్థితి యందు లేదు. సర్వ ధూళీధూసరంబై యున్నది. నేనుపోయి శుభ్రపరచె దను. అనుజ్ఞ నొసంగుఁడు."

మహమ్మదు కొట్లాడుటకు నాతఁడచటనుండెనని రసపుత్రుఁ డెఱుంగఁడు. ఆతని మాటలు విననంతనే, అజితసింహునకుఁ జెప్పరాని విస్మయమును, పట్టరాని యాగ్రహము జనించెను. వానిని లోలోనె యడంచికొని, మహమ్మదుతో నాతఁ డిట్లనెను:

"నీసహాయ్యము నాకవసరములేదు: నా సేవకు లనేకులు కలరు. ఖాను నీకై వేచియుండును, శీఘ్రముగ పొమ్ము." తా నచట నుండుట కవకాశములేదని మహమ్మదుజాను గ్రహించెను. తోడనే అజితసింహున కాతఁ డుచితగతిని సలాము లొనరించి నిష్క్రమించెను.

ఆతఁడు వెడలినంతనే, రఘువీరసింహునితో నజితసింహుఁ డిట్లనెను: "రఘువీరా! చూచితివిగదా! ఏలకోగాని మనమీ మందిర మున విశ్రమించుటకు నలబతుఖాను సహింపకున్నాఁడు. నేను వలదని

5

చెప్పినను, ఖానుయొక్క సేవకుఁ డిచటనుండుట కేల ప్రయత్నింప వలయును ? మఱికొన్ని కారణముల ననుసరించిగూడ యోచింప, నిం దెద్దియో పరమరహస్య ముండుననిగట్టి సందియము కలుగు చున్నది.”

రఘువీరుఁడు “ మన కేమి భయము ? ఈమందిరము కోట వలె సురక్షితముగా నున్నదిగదా. పాదుషావారే సైన్యసమేతులై స్వయముగా దండెత్తుట కేతెంచినను, మనము వెఱువనవసరములేదు. అట్టి మనకు నీముదుసలులు ముప్వురగుఱించి మనము విచారింపనేల?”

అజితసింహుఁడు: రసపుత్రవీరుఁడు వెఱపెట్టిదో యెఱుఁగడని వేఱుగ, జెప్పవలయునా ? నేను జెప్పునదేమనఁగా, మనమీనగరమున కరుదెంచుటయే ఖానున కయిష్టముగ నున్నటు లగుపించును. అందు, మన మీమందిరమున విడిసియుండు టాతని కెంతమాత్రము సంతృప్తి కరముగ లేదని స్పష్టమగుచున్నది.”

రఘువీరుఁడు: “మనకు వలయు సౌకర్యములన్నియు మనమే చేసికొనఁగలము. కాబట్టి, ఖానున కభ్యంతర మేముండును ?”

అజితసింగు : “ మన మాతని కెట్టిశ్రమయుఁ గల్గింపమని యాతఁ డెఱుంగును. ఐనను — ”

రఘు : “ రాజా! అట్లయిన, కారణ మేమైయుండును ?”

అజిత : చెప్పుట కేమియు లేదుగాని, అనుమానము మాత్ర మధికముగ నున్నది. ”

రఘు : “అదేమియో వ్యక్తీకరింపుము. ”

అజిత : “నేనేమియు జెప్పఁజాలను, కాని, రఘువీరా! మన మాగదిని లెస్సగా బరిశీలింతము రమ్ము.”

అజతసింహుఁడట్లు పలికినంతనే, రఘువీరుఁ డొక కరదీపమును గైకొనెను. వారిరువురుఁగలసి లోనికరిగిరి. గది నిట్టునటు పరిక్షించి తన

సరదారుతో నిట్లనెను: "చూచితివిగదా రఘువీరా! ఈగది యెంత మనోహరముగ నున్నదో. ఇట్టి రమ్యాహర్మ్యము నివాసయోగ్యము కాదని ఖాను చెప్పసాహసించెను! మఱియు, ఈగదు లెంతశుభ్రముగ నున్నవో చూడుము. దీనికేమందువు?"

రఘు: "రాజా! ఈ ఖాను చెప్పిన దంతయు శుద్ధ యబద్ధమనుటకు సందియము లేదు. ఈగృహము నిశ్చయముగ నుపయోగములో నున్నది సుమా!"

అజిత: "నీ వెట్లు చెప్పఁగలవు?"

రఘు: "వాడుకలో లేని గృహము ఇంతశుభ్రముగ నుండదుగనుక."

అజిత: "మేడను గూడ పరిశీలింతము రమ్ము."

వా రిరువురు మేడ మీఁదకు బోయిరి. ఆ మహాలు మఱింత మనోహరముగ నుండెను. అందలి సామానులన్నియు నుచితస్థానములందే యుండెను. ఆమహాలు నలంకరించిన చిత్రపటములు మొదలగు వస్తువు లన్నియు జీవకళతోఁ బ్రకాశించు చుండెను. "రాజా! చూచితివి గదా! నావచనములు యదార్థములు. ఇం దెవ్వరో నివసించు చున్నారని నిస్సంశయముగ జెప్పగలము అని రఘువీరుఁడు పలికెను.

ఆ మహాలునం దొక దెస చక్కని మంచమమర్చఁబడి యుండెను. ఆమంచముపై మనోహరమగు హంసతూలికాతల్ప మొండుయుండెను. నేల యంతయు విలువగల పెరసియాదేశపు రత్నకంబళులచే గప్పఁబడి యుండెను. వెలలేని దంతపు మేజాబల్ల యొకటి కళాప్రవీణుల నైపుణ్యమును బ్రదర్శింపుచు నొక మూల నుండెను. ఆబల్లపై సువర్ణకలశ ముండెను. అందు అమృతతుల్యమగు ద్రాక్షరసముండెను.

వీని నన్నిఁటిఁ గాంచిన అజితసింగు విస్మయపరవశుఁ డాయెను. "ఇం దెవరు నివసింతురు? ఖాను ఈ విషయము నేల మఱుగుపెట్ట

వలయును ? మేమిచటి కేతెంచువఱకును, ఖాను యీదివ్యభవనమున సుఖాసీనుఁడై సురాపాన మొనరించుచుండె గాఁబోలు. ఈతఁ డింతలో నెట్లదృశ్యుఁ డగును ? మే మేతెంచుసరికి ఈ మందిరము బీగము వైచియుండెఁ గదా." అని పలికి, కొంతతడవు గాఢముగ యోచించి అజితసింహుఁడు మఱల నిట్లనెను :

"సువర్ణకోశము నుపయోగించు మనుజుఁడు ఉన్నతవంశజుఁడై యుండవలయును సామాన్యమానవుఁ డట్లొనరింపఁజాలడు."

అంతలో, అంతఃపురవాసినులగు రాజాంగనలు ధరించు వడ్డాణ మొకటి రఘువీరునకు గోచరమాయెను. ఆ యాభరణమును గాంచి నంతనే యాతఁడు నిశ్చేష్టపడి, రాజపుత్రునకు దానిని జూపించి "ఇందొక బీగము నివసించుచున్నట్లు స్పష్టమగుచున్నది" అని యాతఁడు పలికెను. తోడనే, అజితసింహునివిస్మయము మినుమడించెను. "ఆమె యెవ్వరై యుండును ? ఇందామె దాగియుండు గతంబేమి ?" అని యాతఁడు ప్రశ్నింపఁ దొడఁగెను.

రఘువీరుఁడు : "సందియమేల ? సబతుఖాను యిందొక బీగమును దాఁచియున్నాడు. ఈ వృద్ధసదాచారి కామాగ్ని యింకను జల్లారినట్లు కానరాదు. ఈగమాన్య మిక దాఁగఁజాలదు. ఈ వృద్ధుఁడు విషమావస్థలో దగుల్కొనియున్నాఁడు. ఈ కారణముచేతనే, మనల నిందు ప్రవేశపెట్టుట కీఖాను యిష్టపడకుండెను."

అజితసింహున కావాక్యములు సహేతుకముగఁ గాన్పించలేదు ? ఆతఁడెంతయో చింతించినను, "ఆమహలునందే నివసింపవలయునని పాదుషాగారేలయాజ్ఞాపించిరి ?" యనుప్రశ్న కాతనికి జబాబు స్ఫురింపకుండెను. పాదుషాయొక్క యాజ్ఞ కెద్దియో గట్టి కారణముండవలయు ననియు, తానప్రమత్తుఁడై యుండవలయుననియు నాతఁడు నిశ్చయించి, రఘువీరునితో నిట్లనెను :

"రఘువీరా! కారణము నొకసంగజాలనుగాని, నా కొక యను మాన ముదయించినది. మనము కాంచిన యీయువ్వి వృద్ధులేగాక, మఱికొంతటీ నగరమున నుండవచ్చును, కాఁబట్టి మనము జాగ రూకతతో మెలంగవలయును."

## ౬

### వైరిగృహము.

పెద్ద దీపమును బట్టుకొని రెండు మహాలులను రసపుత్రు లిర్వురు బాగుగఁ బరిశీలించిరి. ఆ మహాలుల చుట్టును, ప్రక్కనుండిన చిన్న చిన్న గదులనుగూడ వెదకిచూచిరి. ఆవరణము నంతయుగూడ వారు శోధించిరి. కాని, ఎవ్వరును గనుబడలేదు. అజితసింగు మఱియొకసారి చుట్టుతిరిగి పరిశీలించి, చిన్నచిన్న గదులలో విశ్రమించియుండిన దన సైనికులను సమీపించి, అవసరమగునేని యొక్కనిముషములో యుద్ధ సన్నద్ధు లగునటు లప్రమత్తులై యుండవలయునని వారి నాఁతడు హెచ్చరించెను. అంత రసపుత్రనాయకు లిర్వురు దమ మందిరమును జేరిరి. "నీవీ గదిలో బరుండుము, పైగదిలో నేను విశ్రమింతును," అని రఘువీరునితోఁ బలికి, అజితసింహుఁడు మేడమీఁదికిబోయెను.

అతఁడట్లు మేడమీఁద కరిగి, తన సైనికదుస్తులనువిప్పి, వానిని బ్రత్యేకముగ నొకచోట నుంచెను. రత్నఖచితమగు తనఖడ్గమును వర నుండి తీసి గోడకు తగిలించెను. అంత నా రాజపుత్రుఁడు శయ్యపై వ్రాలి, ఇట్లు చింతింపఁ దొడగెను.

"రఘువీరుఁడు చెప్పునది సమంజసముగ గాన్పించదు. ఆతని యూహాలన్నియు దప్పుదారిని బోయినవుండెను. ఈ మందిరమున ఖాను ఒక బీగమును దాచియుంటయే నిజమగునేని, ఈ గృహము తాళమువైచి యుండనేల? ఈ రహస్యము మనకుఁ దెలియకుండుటకై, ఖానుయొక్క సేవకుఁడగు మహమ్మదుజా నాబీగము నెచటకో

కొంపోయి, ఈ గృహామునకు దాళము వైచియుంచునా? ఏది యెట్లు న్నను, ఈరేయి సుఖముగాఁ గడచునట్లు తోఁచదు."

ఆతఁ డట్లు తలపోయుచుండ, ఆతని సేవకుఁ డొకఁడు ఆహార పదార్థములు గొనివచ్చెను. అయ్యాహారము నాతఁడు శీఘ్రముగ భుజించి, సైనికు లెల్లరు జాగరూకులై యుండవలయునని హెచ్చరించి, ఆసేవకుని బంపివైచెను. అంత నాతఁడు హంసతూలికా తల్పము పై వ్రాలి, గదినంతయు నొక్కసారి తిలకించెను. దీపము సరిగా వెలుగుచుండెను. ఖడ్గము తన సమీపముననే వ్రేలాడుచుండెను. తాను పిలుచునంతనే సైనికు లెల్లరు సాయుధపాణులై రావలయునని ఆతఁ డాజ్ఞాపించియుండెను. కాఁబట్టి, తానిక హాయిగ నిద్రింపవచ్చునని యాతఁడు భావించెను. కాని, అరగంట గడచినను ఆతనికి నిద్దుర పట్టకుండెను. అన్ని విపరీతములను గాంచినవాడు సుఖముగా శీఘ్రముగా నెట్లు నిద్రింపఁ గలడు? అంతలో నాతని కొకసంగతి జ్ఞప్తికివచ్చెను. మరియాబీగము మహాలునం దనేక రహస్యమార్గము లుండునని ఆతఁడు వినియుండెను. కాఁబట్టి, ఆమహాలు మఱియొకసారి శోధించుటకై యాతఁడు దిగ్గున లేచెను.

ఆతఁడట్లు దిగ్గునలేచి, గోడను వ్రేలాడుచుండిన ఖడ్గమునుఁ జేతఁ బూని, ఆ గదినంతయు సూక్ష్మముగ బరిశీలింపఁ గడంగెను. గోడల యందు రహస్యమార్గ మేదైన నుండునేమో యని అనుమానించి, ఒక్కొక్కగోడను బాగుగ నేత్రపరీక్షచేయుచు, గోడయొక్క ప్రతి భాగమును గాలితో దన్నుచు, అనుమానముగ నుండుభాగములను మూలలను ఖడ్గముతో బొడిచి పొడిచి పరిశీలించుచు, నేలభాగమును గూడనట్లే పరీక్షజేసి, అనుమానమున కణుమాత్రమైన నవకాశము కలుగకుండుటచే నారాజపుత్రుఁడు ఖడ్గమును మఱలగోడకు దగిలించి, శయ్యపై వ్రాలెను.

ప్రయాణ ప్రయాసముచే నలసియుండిన సైనికులు, కాలూనుట కవకాశము కలిగినంతనే హాయిగ నిద్రించిరి. అజితసింహునిసరదారుం డగు రఘువీరుఁడు గుఱ్ఱుదీయుచు మైమరచి నిద్రించుచుండెను. కాని, అజితసింహునకుమాత్ర మంతటి యదృష్టము కలుగకుండెను. ఎంత ప్రయత్నించినను, ఆనిద్దుర పట్టదాయెను. నాడాతఁడు గాంచిన విప రీతములన్నియు మఱల మఱల దలంపునకు వచ్చుచుండెను. ఏమియుఁ దోఁచక, ఆతఁడు మఱల క్రిందికిబోయి, ఆప్రదేశము నొక సారి పరిశీ లించి తిరిగి వచ్చి శయ్యపై వ్రాలెను. నిద్రాదేవత యింకను బ్రసన్ను రాలు కాకుండుటచే, నాతడిట్లు చింతింప నారంభించెను: "పాదుషా వారు నన్నీనగరమున కేల పంపవలయును! 'ఈకార్య మొనరింపవ లయు' నని నన్ను నియోగింప లేదు; పోయుట కిం దేమిపని యుం డును? నాకేమియుం దెలుపక "నీవీముహూర్తమున బోయి సిక్రీనగర మున బదునైదు దినము లుండుము" అని మాత్రము వారాజ్ఞాపిం చిరి. మరియాబీగము మహలునందే విడిసి యుండవలయునని కూడ వారి యాజ్ఞ, కారణము దైవమెఱుంగవలయు: పాదుషా యెఱుంగ వలయు. పదునైదు దినములు గడచిన పిమ్మట పాదుషా మఱియొక యాజ్ఞ నంపునట. అంతవరకు, ఏల వచ్చితినో నాకే తెలియక, వెఱ్ఱి వానివలె నిందుండవలయు గాబోలు ఆహా! ఎంతటి దుస్థితి సంభవిం చినది! కాలప్రభావముచే నెట్టిహీనత్వము సంభవించినది?"

అని పెద్దతడవు విచారించి, అజితసింహుఁ డెట్టకేలకు నిద్రించెను. కొంతకాల మాతఁడు యొడలెఱుంగక హాయిగ నిద్రించెను. కొద్దికాల మట్లు గడచినపిమ్మట, మృదుమధురగానస్వరముచే నాతని నిద్దురకలఁత జెందెను. అదియేమియో ఆతనికి మొదట దెలియకుండెను. క్రమముగా కలగాంచువానికివలె, నాతనికాస్వరము వినవచ్చెను.

పిమ్మట, స్పష్టముగ కమ్మని వీణానినాద మాతనికి శ్రవణానందము

గలిగించెను. రాగతాళ సమ్మిళితమైయుండిన ఆదివ్యగానము. దైవాంగనల నృత్యగానమువలె నుండెను. ఎచ్చటనో నృత్యము జరుగుచుండెనని యజితసింహుఁడు గ్రహింపఁ గలిగెను. అపు డాతనికిఁ గలిగిన విస్మయము నెవరు వర్ణింపఁగలరు? విస్మయపరవశుడై రాజపుత్రుడిట్లు చింతింపదొడంగెను:

"ఈప్రదేశమున ముసలివారు ముగ్గురుదప్ప మఱియొకరు లేరని వింటినిగదా! అట్టి యీప్రదేశమున నిట్టి మనోహరగాన మొనరించువా రెవరు? ఈవీణానినాదము దగ్గఱనుండి వినవచ్చుచున్నదే! ఈగృహము నంతటిని స్వయముగాఁ బరిశీలించి యుంటిని. ఎవ్వరును లేరుగదా? సమీపమున నొక గృహమైనను లేదు. ఈవిశాలావరణమునందు మరియీబీగము మహా లాక్కటే యున్నది. ఈమధురగానమెచ్చటనుండి వచ్చుచున్నది."

అని యాతఁ డెంతతర్కించినను సమాధానము కుదరదాయెను. ఆతఁడు నిద్రించువఱ కెంత వెదకినను, ఎవ్వరును గనుపించలేదు. శయనించినపిమ్మట మనోహరమగు గానము కర్ణపర్వమొనరించుచుండెను. ఈరెండువిషయము లెట్లు సమన్వయించును? ఏమియుఁ దోచక, అజితసింగు మంచమునుండి లేవఁబోయెను. కాని, ఆతఁడు లేవఁ జాలకపోయెను. ఆతఁడు పరిశీలించి చూడ, తాను పరుండిన మంచమునకుఁ దాను కట్టబడితినని ఆతఁడు తెలిసికొనెను. ఎంత విపరీతము! ఆమందిరమునందుండు వారలందఱు నాతని సేవకులేగదా! శత్రుగృహమును జొచ్చి ఆతని నట్లసహాయు నొనరించుటకు సాహసింపఁగల వారెవరు? అజితసింగున కేమియుఁ దెలియకుండెను. కట్టువడి, అసహాయుఁడనై యుంటినని మాత్రమాతఁ డెఱుంగఁగలిగెను. ఆతఁడెన్నఁడు నట్టిదైన్యావస్థ నెఱుగడు. ఆతని పాశబద్ధు నొనరించినవార లెవరోగాని, ఒక

వ్రేలైన నాతఁడు కదల్పజాలకపోయెను. ఆతనికి నిద్దుర జనించిన కొద్దికాలములో నెంతటి మార్పు సంభవించెను!

ఆతఁడట్లు పాశబద్ధుఁడగుటయేగాక, ఆతఁడు నిద్రించియుండిన మహాలుయొక్క తలుపులన్నియు మూయఁబడియుండెను. తలుపులన్నియు లోపలిభాగముననే గడియలు వేయఁబడియుండెను. ఆతని యవస్థ కడుదుర్భరముగ నుండెను. లోని కెవరు ప్రవేశించిరో ఆతనికిఁ దెలియకుండెను. ఎవ్వరు గానరాకుండిరి. తన్నెవరు కట్టివైచిరో తెలియకుండెను. ఒక వ్రేలైనను గదల్పుటకు వీలులేనంత బిగ్గరగ నెవ్వరు గట్టిరో, అంత గట్టిగ బంధించినపు డాతని కేట్లు మెలకువ కలుగకుండెనో యాతని కే యణుమాత్రమైనను దెలియకుండెను.

ఆహా! ఎట్టివాని కెంతటిగతి సంభవించెను! రణరంగమున స్వైర విహార మొనరించు రసపుత్రయోధుఁ డిపుడు అసహాయుఁడై జీవచ్ఛవంబువోలె పడియుండెను! రణరంగంబున శత్రుసైన్యంబులను దూదిబుంగలవలె దగ్ధమొనరింపఁజాలిన వీరుఁడిపుడు తన్నుదాను సంరక్షించికొనఁజాలకుండెను. మృత్యుముఖమున నుండినను వెలిపెట్టిదో యెఱుంగని జగదేకవీరుని ధైర్యమంతయుఁ జలించుచుండెను. తనను బంధించిన పాశములను ఛేదింపవలయునని శక్తికొలఁది యాతఁడు ప్రయత్నించెను. కాని, ఆసింహబలుని బలమంతయు నిరర్థకమాయెను. ముందు చెప్పఁబోవు విపరీత ప్రదర్శనము లాతనికి గోచరముగుచుండుటచే, తన సరదారుఁడగు రఘువీరుని బిలుచుటకైనను నోరాడకుండెను.

కలయో, నిక్కమో, యాతఁడెఱుంగకుండెను. ఆతఁడు నిద్రించినది బీగము మహాలు కాని, ఆతఁడిపుడు కాంచుచుండినది మాత్రము వేఱుగనుండెను. ఆతఁడిపుడొక విశాలమగు భవనమునం దుండెను. నేలయంతయు తళతళలాడు తెల్లని బలపపురాళ్ళతో నమర్చబడి

యుండెను! వింతవింత రంగులతో దేదీప్యమానముగఁ బ్రకాశించు దీపరాజములు కండ్లు మిఱుమిట్లుగొల్పుచుండెను. సుగంధవాసనలతో గది యంతయు బరిమళించుచుండెను. పారిజాతమును మించిన సుగంధవాసనలు రసపుత్రునకు బారవశ్యము గలిగించుచుండెను. సువర్ణ మణిమయవిరాజితంబులగు నిలువుటద్దములు గోడలకు నమర్చఁబడి యుండెను. దీపములనుండి అద్దములపైఁ బ్రొక్కొక కిరణము సహస్ర కిరణములుగఁ బ్రతిఫలించుచు, ఆమహాలునకు మహావైభవమును గలిగించుచుండెను.

నవరత్నఖచితమగు సువర్ణవేదిక యొకప్రక్కనుండెను. మహారాజులు దర్బారుచేయుట కయ్యది యుచితాసనంబై యుండెను. అనన్యసామాన్య సౌందర్యవతియగు నారీమణి ఆసింహాసనము నలంకరించియుండెను. ఆభువనైకసుందరి లేఁబ్రాయంపు జవ్వనియై యుండెను. ఆమెను గాంచినంతనే, బంగారముతోడను, నవరత్నములతోడను నమర్చబడిన దివ్యసుందరి విగ్రహామువలె దోచుచుండెను. మొగములతోఁ జేయబడిన మెత్తని దిండుపైనా నారీమణి సగము వ్రాలియుండెను. ఉచితాలంకృతులగు యువతులిర్వురు వెలలేని వింజామరములను బట్టి సిహాసనాసీనురాలగు రమణీమణి కిరుపార్శ్వముల నిలుఁబడి, విసరుచుండిరి.

మాటాడుటకై నను నోరాడక, నివ్వెరపడి అజితసింగు తిలకించుచుండ, సింహాసనాసీనురాలై యుండిన సౌందర్యవతి యాతనిపై నొక్కసారి దృష్టిసారించెను. తోడనే, అతని మతిపూర్ణముగఁ జలించెను. నాగస్వరము నాలించుచు కట్టువడు ఫణీంద్రునివలె, రసపుత్రుఁడు సంపూర్ణముగ నిశ్చేష్టుడాయెను. అట్టిసౌందర్యమునాతఁ డెన్నడు కాంచి యుండలేదు. సౌందర్యమునంతయు నొకముద్దగ నొనరించి బ్రహ్మదేవుఁడామెను సృష్టించెను గాబోలు!

సార్వభౌముని బీగముమహలుయొక్క మహావైభవము గూర్చి వినుటయేగాని, అజితసింహుఁడెన్నడు జూచియుండలేదు. అంతటి యద్భుతప్రదర్శనముజూచుటకు సార్వభౌముఁడు తప్ప నుఱియొక్కఁ డర్హుఁ డెట్లగును! ఏమాయచేతనో, అజితసింహుడా రాత్రి పాదుషావారి బీగము మహలుకుఁగొంపోబడెనా?

కాని, తానువిశ్రమించినది ఢిల్లీనగరము గాని ఆగ్రానగరముగాని గాదనియు, నిర్జనప్రదేశమగు సీక్రీనగరమున నుంటిననియు రసపుత్రుఁ డెఱింగి యుండెను. కాఁబట్టి, పాడువడిన సీక్రీనగరమున పాదుషావారి బీగముమహలుండుట యసంభవమని యాతఁడు గ్రహింపఁ గలిగెను.

అట్లైన, అజితసింహుఁ డెచటనుండెను?

"ఈ నిర్జనప్రదేశమున నిట్టి భువనైక సుందరియెట్లుండును? ఈమె సలబతుఖానుయొక్క యుంపుడుకత్తెయై యుండునా? అసంబద్ధము. సార్వభౌముని నైన దాసునిగా జేసికొనఁగల యీమోహనాంగి, వృద్ధుఁ డగు ఖాను నేల వరించును?" అని అజితసింహుఁడు ప్రశ్నించుకొనఁ దొడంగెను. ఎంత యోచించినను, ఎంత తర్కించినను, అతఁ డెచట నుండెనో, అచటి కెట్లువచ్చెనో, సింహాసనము నలంకరించిన సుందరి యెవరో, లేశమైనను దెలియకుండెను.

అది యంతయుఁ గలయని భ్రమించి సంతృప్తి జెందుటకైనను అవకాశము లేకపోయెను. పంచేంద్రియములును ఆతని యధీనమున నుండెను. మనసంతయు నాతని యధీనముననే యుండెను. కాని, రఘువీరుని బిలుచుటకు మాత్రము వీలులేకుండెను. ఉచ్ఛ్వాస నిశ్వాసముల కెట్టి యడ్డంకి లేదుగాని, మాట్లాడుటకుఁ బ్రయత్నించు నపుడు మాత్రము గొంతుకనం దేదియో యడ్డుపడి బాధించుచుండుటచే మాటలాడుట కవకాశము లేకపోయెను.

## ౭

## మరణావస్థ

మాటలాడఁజాలక జీవచ్ఛవంబువలె పడియుండిన అజితసింగునకు మఱి యొక్క యద్భుతవిషయము గోచరమై, ఆతనికి మఱింత భ్రాంతి గల్గించెను. తన కెదురుగా నుండిన సింహాసనమున నసాధారణసౌందర్యవతి యగు వనితామణి సుఖాసీనురాలై యుండెననియు, ఆమె కిరుపార్శ్వములను జక్కని స్త్రీ లిర్వు రామెకు వింజామరములతో వీచుచుండిరని కదా రసపుత్రుండు చూచియుండెను. రఘువీరునిఁ బిలువఁజాలక పోయిన రసపుత్రుఁడు సంహాసనము వంక వీక్షింప, అసుందరాంగి ప్రక్క నొక రాజపుత్రుఁ డాతనికి గోచరమాయెను. ఆరాజపుత్రుఁడు వెలలేని ముగమల్ వస్త్రములను ధరించియుండెను. ఆతనిమస్తకము నవరత్నఖచిత మగు వస్త్రముచే నలంకరింపబడి యుండెను. ఆతఁడు సుప్రసిద్ధ రాజపుత్ర వంశోద్భవుఁడై యుండు ననియు, ప్రసిద్ధి జెందిన సైన్యాధిపతియై యుండుననియును అజితసింగు గ్రహింపఁ గలిగెను. ఆకోమలాంగి కరస్పర్శనముచే నా రసపుత్రయోధుఁడు కామాయత్తచిత్తుఁడై, ఆ సుందరి వదనారవిందము నట్టె వీక్షించుచు మోహపారవశ్యమున మైమఱచి, చేష్ట లుడిగి యుండెను.

రాజపుత్రుఁ డట్లు మోహప్రవాహమున గొట్టుకొని పోవుచుండ, నా కులుకులాడి మందహాస మొనరించుచు, ఎదుటనుండిన సువర్ణకలశమును నిజ మృదుహస్తమునఁబట్టి, ఆ రాజపుత్రుని నోటి కందిచ్చెను. ఆమెపైఁ గల మోహముచేఁ బరవశుఁడై యుండుటచే నాతఁడా పాత్రలో నుండిన పానీయము నెల్ల బూర్తిగ ద్రాగెను. పిమ్మట, నా రసపుత్రుఁడు లేవఁ బోయెను. కాని లేవఁ జాలక, గడగడ వడకి, చెప్పరాని బాధ ననుభవించుచు, 'ఉస్సుర'ని దీర్ఘమగు నిట్టూర్పులు విడుచుచు,

కుప్పవలె నేలఁ గూలెను. చక్కనియాతని మోము నల్లబాఱి వికృతరూపముఁ దాల్చెను. తోడనే, మరణవేదనఁ బడుచుండిన ఆ సుప్రసిద్ధ రసపుత్రసైన్యాధిపతిని, చెంతనుండిన పరిచారికలు వికత వస్త్రుని నొనరించిరి.

అట్టి దారుణకృత్యము నెన్నఁడు నజితసింహుఁడు జూచి యెఱుంగఁడు. ఆసుందరి ఎట్టిఘాత మొనరించెను! రాజకుమారుని మరలఁగొల్పి, మోహపరవశు నొనరించి, తుద కాతని విసమిడి చంపివైచెనే! అట్టి ఘోరకృత్యమొనరించు నామె, జగన్మోహనాకారము ధరించిన రక్కసియై యుండవలయును. కాకున్న, అంతటి పాపకార్యమున కెవ్వరు యొడిగట్టికొందురు? తానొనరించిన యమానుషకృత్యము కావంతయు లజ్జింపక, నిష్కళంకహృదయుఁడగు రాజకుమారుఁడు మరణించినందుల కణుమాత్రమైన విచారింపక, మానవవేషధారిణి యగు నారక్కసి యెప్పటియట్లు నిశ్చలచిత్తయై యుండెను. అజిత సింహునకుఁ బట్టరాని యాగ్రహ ముదయించెను. అతఁడెద్దియో తీవ్ర ముగఁ బలుకబోయెను. కాని, క్రోధనలజ్వాలలచే నుగ్రుండైన యాతఁ డేమియుఁ బలుకజాలక పోయెను.

అట్లు దారుణగతి మరణించిన రాజకుమారుని దిగంబరు నొనరించిన పరిచారికలు అనంతర మామృత కళేబరమును గోడను నిలువఁ బెట్టిరి. అట్లు గోడనంటి నిలువబడియుండిన దిగంబర మృతకళేబరమును గాంచి నంతనే అజితసింహుఁడు భయభ్రాంతుఁడాయెను. అట్టి భయంకర ప్రదర్శనము నెన్నఁడు నాతఁడు చూచియెఱుంగఁడు. ఢిల్లీనగర సింహ ద్వారమున బ్రతిమంగళవారము, వస్త్రహీనమగు మానవమృత కళేబరము గోచరించుచుండెననియు, అట్టిశవ మచ్చటి కెట్లు వచ్చు చుండెనో తెలియకుండుటచేతను, హత్య యెట్లుజరుగుచుండెనో దెలిసి కొనఁగల చిహ్నము లెవ్వియు లేకుండుటచేతను, అట్లు వధ్యుఁడగు

చుండిన పురుషుఁడెవ్వఁడో తెలియకుండుటచేతను, ప్రతి మంగళవార మును విధినిర్ణీతమువలె నొకశవము తప్పక ప్రత్యక్షమగుచుండుటచే తను— ఇన్ని విపరీతములు జరుగుచుండుటచేత ఢిల్లీపురవాసులు మిక్కిలి కలవర పడుచుండిరనియు బొతకులెరింగియేయున్నారు.

తన యెదుటనుండిన రాజపుత్రుని దిగంబర మృతకళేబరమును గాంచినంతనే, ఢిల్లీనగరమునందలి భయంకర ప్రదర్శనము గూడ మన యజితసింగునకు వెంటనే కంటికిఁగట్టినట్టు లగుపడుచుండెను. ఢిల్లీనగరమునందలి భయంకర ప్రదర్శనమునుగూడ నాతఁడు కాంచి యుండెను. ప్రదర్శనములు రెండును, నొక్కవిధముననే యుండెను. గతించినవారలందఱునుగూడ దాను గన్నులార గాంచిన తెఱంగుననే వధింపఁబడియుందురని అజితసింహుఁడు గ్రహింపగలిగియుండెను. ఆభయంకర ప్రదర్శనము గాంచినంతనే, ఆతని దేహమంతయు భయముచే గగుర్పడెను. రోమరోమమును గద్దలించెను.

“ఆహా! ఈవనిత లెట్టి యమానుషకృత్యము నొనరించిరి! వీరు కేవలము పయోముఖ విషకుంభములని గ్రహింపఁజాలక, వీరి బాహ్య సౌందర్యమును గాంచి భ్రమించి, మోహపరవశులై రాకుమారు లెందఱు మరణించిరోకదా! దయారహితులగు ఈరక్కసులకు నిట్టి యసాధారణ సౌందర్యమును దైవ మేల యొసంగవలె? ఎవ్వరు గాంచకుండ వీరీ మృతకళేబరములను ఢిల్లీకిఁ గొంపోయి, సింహద్వార మున నెట్లు ప్రదర్శించుచున్నారో!” అని యజితసింగు యోచింపఁ దొడంగెను.

తాను జూచుచుండ గ్రూరముగ వధింపఁబడిన రాజకుమారుఁ డెవఁడై యుండునో యని ఆతఁడు గాఢముగ విచారించెను. అంతవర కారాజకుమారుని మోముమాతనికిఁ గనుపించలేదు. కాని రాజకుమా రుని దిగంబరు నొనరించి గోడకు నిలువబెట్టినపిమ్మట నాతని వదనము

స్పష్టముగ గోచరమాయెను. తోడనే, అజితసింగునకు బట్టరాని యాగ్రహము జనించెను ఇఁకను భరింపఁజాలక ఆతఁడిట్లు బిగ్గరగా నరచెను :

"హా! దైవమా! ఈతఁడు ఉదయపురమహారాణాయొక్క జ్యేష్ఠకుమారుఁ డగు ఉదయసింగు! ఈవిషాదవృత్తాంతమువిని మహారాణా యెట్లు జీవించి యుండును? ఎంత ఘోరము! ఎంత దారుణము!"

తోడనే, సింహాసనాసీనురాలగు సుందరి అజితసింగు నుద్దేశించి యిట్లు బదు లిడెను: "ఓయి! రాజపుత్రనాయకుఁడా ఇట్టి గతియే నీకు రేపు సంభవింపఁ గలదు! ఎవ్వరికిఁ దెలియకుండ, ఈకళేబరము మే మెంత నేర్పుగ ఢిల్లీనగరసింహద్వారమునకు గొంపోవుచుంటిమో చూచితివిగదా!"

అజితసింహుని డెందమున రగిలిన క్రోధానలము పూర్తిగ బ్రజ్వలించెను. ఆతని యాకార మంతయు విషానల జ్వాలలను వెడలగ్రక్కు నాగేంద్రుని వలె నుండెను. మానవరూపధారిణి యగు నారక్కసి నాతఁడు క్రోధానలజ్వాలలచే దహించి వేయబోయెను. గొంతుక సవరించి, తన యాగ్రహమును వ్యక్తీకరింపఁ బోవుసరికి, మందిరమంతయు నంధకారబంధుర మాయెను. ఆతఁడు గాంచిన యద్భుత ప్రదర్శన మంతయు నొక్కక్షణములో మాయమాయెను. మొదట పరుండిన గదియందే యిపు డుంటినని యాతఁడు తెలిసికొనెను. తన సేవకులు వెలిగించిన దీపమే వెలుఁగుచుండెను. ఆతనికి జనించిన విస్మయమునకు మేర లేదు. అదంతయు నొక కలయని భావించుటకైన నవకాశము లేకుండెను. నిద్రించినంతనే, ఆతని బంధించిన పాశము మెల్లమెల్లగా విడుచుండెను! అట్టి నిదర్శనము గుపడుచుండ, కలయని యెట్లు భ్రమింపఁగలఁడు? కలయగుట కల్లయని యెంచి, పరుపుపై నుండి తటాలున లేచి, ఖడ్గమును జేతఁ బూని, తన పాన్పుక్రింద నెవ్వరైన నుందురేమో

యని అజితసింగు వెదకెను. అచటనేగాక, ఆ మహాలునం దెవరును లేరైరి. పిమ్మట, తన్ను బంధించిన పాశము నాతఁడు పరీక్షింపఁ బోయెను. కాని, ఆతని విస్మయ మేమని వర్ణింతుము? ఎంత వెదకినను పాశము కానరాకుండెను. కోటికొనయైనను లేదాయెను ఒక్కరాత్రి యాతఁడెన్ని వైపరీత్యములు గాంచుచుండెను! తనను బంధించిన పాశము మాయ మగుటచే, నాతడు నిశ్చేష్టితుఁడాయెను. జీవరహిత మగు శిలావిగ్రహమువలె నాతఁడు చేష్టలుడిగి యట్టె నిలుచుచుండెను.

ఆ మాయనాటక మంతటితో ముగియలేదు. హృదయపుట భేదన మొనరించు నార్తనినాద మాతని వినఁబడెను. చెప్పరానిభయమును విషాదమును, దెలుపు నాధ్వని ప్రతిధ్వనించుచు క్రమముగా బిగ్గర యగుచుండెను. ఆవడిచేయు మిగుల చీఁకటిగను నిశ్శబ్దముగను నుండెను. దిక్కులుపిక్కటిలు నట్లు మాఱుమ్రోగుచుండిన యమ్మహారవమును గొంత తడవాతడు వినిన పిమ్మటపట్టరాని యావేశమునకు జిక్కి, ఖడ్గహస్తుఁడై యుండిన అజితసింహుఁడు పరుగులిడుచు క్రిందికిబోయెను.

కాని, అంతయు గాఢాంధకార బంధురమై యుండుటచే, నాతని కేమియు గానరాకుండెను. క్రిందిగృహమున నేమిజరుగుచుండెనో చూచుట కవకాశము లేక పోయెను. అతిదైన్యమగు రోదనముమాత్ర మాతని హృదయమును బూర్తిగా గలఁచుచుండెను. అంతలో హఠాత్తుగ, దయ్యముపట్టినవానివలె వికృతముగ నఱచుచు నాగృహమునుండి ఎవ్వరో పాఱిపోవుచుండునట్లు అజితసింగునకు గోచరమాయెను.

దీపములేకుండుటచే అట్లుపాఱుచుండిన పురుషుఁడెవఁడో రాజపుత్రుఁ డరయజాలక పోయెను. మేడపైనుంచిన దీపము వెలుఁగుచునే యుండ, అచటిదీప మేల లోపమాయెనో తెలియకుండెను. ఆదీపము నెవరైన నార్పివైచియుందురా? ఎవరార్పుదురు? రఘువీరుఁ డేమి చేయుచుండెను? అని అజితసింగు ప్రశ్నించికొన దొడంగెను.

అంతలో, నాతనికొక యనుమాన ముదయించెను. తన సరదారుఁడగు రఘువీరుఁడే ఆతెరఁగున నటించుచు బాతియుండునా? కాని, ఆతని కంతటి భయమేలకలుగవలయును? భయకారణమేమైయుండును? అని యోచించుచు నాల్గువైపులు నొక్కసారి యాతఁడు పరికించి చూచెను. ఆచీకటిలో నాతని కేమియు గనుబడ లేదు. కాని, ఆగదిలో నెవరో, తీయలేక తీయలేక ఊపిరిదీయుచు, వదలలేక వదలలేక ఊపిరి వదలుచు గిజగిజ గొట్టుకొనుచుండినట్టు లాతనికి దెలియవచ్చెను. అజితసింహుఁడు ధైర్యవంతుఁడే యైనను, ఈసమయమున మాత్రము చలించెను. వేయిమంది శత్రువులైనను ఖడ్గపాణియై యొంటరిగా మార్కొనుటకు వెనుదీయని రసపుత్రుని ధైర్యస్థైర్యము లీసమయమున మంచువలె గరగిపోయెను. మానవాతీత మగు నట్టి వైపరీత్యముల నాతఁడెన్నఁడుఁ గాంచి యెఱుఁగఁడు. దేహమంతయు, గగుర్పొడ, రసపుత్రవీరుఁడొక్కక్షణమైనను నిలువఁజాలక ఆవలకు పోయెను.

మేడపై నిద్రించిన అజితసింహుఁ డాభయంకరనాటకమును వీక్షించుచుండ, క్రిందిమహాలునకు జుట్టునుండిన గదులలో నాతని సైనికులును సేవకులును హాయిగ నిద్రించుచుండిరి. దిన మంతయుఁగష్టపడి యుండుటచే వారు మైమరచి నిద్రసౌఖ్యమును బూర్తిగ ననుభవించుచుండిరి. కాని, ఏమహారోదనముచే నజితసింహుఁడు భయభ్రాంతుఁడాయెనో, అమ్మహారోదనముచేతనే ఒడలెఱుంగక నిద్రించుచుండిన సైనికులు త్రుళ్ళిపడి మేల్కాంచిరి. ఆధ్వని యెట్టిదో, ఎటునుండి వచ్చుచుండెనో వారా సమయమున నరయఁజాలరైరి. హఠాత్తుగ మేల్కాంచుటచే మిక్కిలి కలవరపడి, వారు కూడ నఱువ నారంభించిరి. వారి వెంబడివారిగుఱ్ఱములుకూడ గట్టిగ సకిలింపనారంభించెను.

తామప్రమత్తులై నిద్రించుచుండుటచే శత్రువు లెవరో యేతెంచి ముట్టడించియుందురని యోచించి, రసపుత్రసైనికులు వరలనుండి

ఖడ్గములను దీసి ఆత్మసంరక్షణార్థమై యిటు నటు విసరఁ గడంగిరి. కేవలము వారి కోలాహలముచేతనే సిక్కిసకర మొక్క క్షణములో రణక్షేత్రముగ మాఱి పోయెను.

రఘువీరుఁడు నిద్రించిన గదియందు నిలువఁజాలక అజితసింగు పరుగులిడుచు నావలికి బోవునప్పటికి రంగము అల్లుకొనెను. అతడు ధైర్యము వహించి "ఆ కోలాహలమేమి? ఏమిసంభవించినది.?" అని బిగ్గరగా నఱచెను. కాని, వారి కేకలు విని వారే బెదరుచు బొబ్బలిడుచు నాయుధములను ఝుళిపించుచుండిన సైనికుల కాతని కేక లెట్లు వినబడును? అంతలో, అజితసింహుని సేవకుఁడాతని కంఠధ్వని గుర్తించి, కరదీపమును బట్టి, అతిరయమున నాతనివద్దకుఁ బోయెను.

ఆదీపపు వెలుతురుచే సైనికులందఱు అజితసింహుని గుర్తింపగలిగిరి. పిమ్మట ఒకరినొకరు తిలకించి తమరందఱు అజితసింహుని సైనికులమే యని యెఱింగి సంతసించి, తమయేలికను సమీపించి, పట్టరాని యాతురపాటుతో "రాజోత్తమా! ఈకలవరమేమి?" అని యాతని ప్రశ్నించిరి.

"అదియే నేను మిమ్మడుగుచున్నాఁడను. ఈ గంద్రగోళమేల? విపరీతమేమైన సంభవించెనా?" అని అజితసింగు ప్రశ్నించెను.

సైనికుల యావేశ మప్పటికి బూర్తిగ వదలెను. అంతట, వారిట్టు ప్రత్యుత్తరమొసంగిరి.

"మేమందరము హాయిగ నిద్రించుచుండ, భూమిని బ్రద్దలుచేయునట్టి విశృతరోదనముచే గలతజెంది, ఉలికిపడుచు మేల్కాంచితిమి. మేము మైమఱచి నిద్రించునపుడు శత్రుసైన్య మేతెంచి పైఁబడెనని భ్రమించి కృపాణధారులమై యుండ, మిమ్ముఁగాంచు భాగ్యమబ్బినది."

అజితసింగు మఱల నాశ్చర్యపరవశుఁడగుచు నిట్లు పలికెను:

"సింహద్వారమునకు మీరు జాగ్రత్తగ బీగమువైచి యుండిరి

గదా. ఉన్నతప్రాకారములను దాటి ఎవఁడైన నిందుఁ బ్రవేశింపవల యునుగాని, మరియొకమార్గము లేదు.”

సైనికుఁడు : “నిజము రాజా, మఱియు, ఎవఁడైన గదిలో బ్రవేశించియుండునేని, మనకు దొరకక తప్పడు.”

“రఘువీరసింహుఁడెక్కడ ?”

“ఇచట లేఁడు, గదిలో నున్నాఁడేమో!”

“ఇందెవరైన దాగియున్నారేమోకూడ చూతము. ఈదీపముతోఁ బరిశీలింతము”

తోడనే సైనికు లందఱును రఘువీరుఁడు నిద్రించిన గదిలోఁ బ్రవేశించిరి. వారి వెంబడి, అజితసింగు కూడా ప్రవేశించెను. సైనికు లందఱు నెంత పరిశీలనగా శోధించినను వారి కేమియు గాన రాకుండెను. గదిలో నేమియుఁ గానరాకుండుటచే, వారు బాహ్యప్రదేశమును వెదుక నారంభించిరి. వారెంత శోధించినను, ఎవరును గానరాకుండిరి. కాని, ఒక మూలను ఎద్దియో చుట్ట చుట్టుకొని పడియుండెనని, అజిత సింహుని సేవకుఁడు కనిపెట్టెను. తోడనే, వారందఱు నచటికి పరు గునఁ బోయిరి.

రఘువీరుఁడే యట్లు పడియుండెను. ఆ వీరుఁడు సగము చచ్చి గోడవారను బడి యుండెను. తన సైన్యాధిపతి యగు రఘువీరుఁ డట్టి దైన్యావస్థయం దుండుట గాంచినంతనే అజితసింహుఁడు దుఃఖ పర వశుఁడాయెను.

“ఆహా! ఎంత ఘోరము సంభవించినది! ఈ మహావీరుఁడు భయ ముచే సగము చచ్చియున్నాఁడు. ఓరి సేవకా! శీఘ్రముగ నీరము గొనిరమ్ము; జాగు చేయకుము, పొమ్ము, నీరము నీరము!” అని యాతఁడు పలికెను. తోడనే, సేవకుఁడు నీటికై పరుగెత్తెను.

అజితసింహుఁడు తన సరదారుని ప్రక్క గూర్చుండి, ఆతని శిర

మును దన తొడపై నిడి, ఉపచారము చేయ గడంగెను. హృదయము కొట్టుకొను చుండుటచేతను, ఊపిరి దీయుచుండుటచేతను సరదారుడు జీవించియే యుండెనని స్పష్టమాయెను. కాని, పళ్లు దగ్గరపడి, నోటి నుండి చొంగలు విశేషముగ స్రవించుచుండుటచే నాతఁడు భయ విహ్వలుఁ డాయెనని అజితసింగు గ్రహించెను. కాని, సహస్రరణరంగ ముల నాఱితేఱిన మహాశూరునకు వెఱపేమి? ఈతనిఁగాంచిన భయమే! భయపడవలసియున్నపు డీతని కింత భయమేల కల్గియుండును? అని, అజితసింగు యోచింపగడంగెను.

ఇంతలో, నీరము గొని, సేవకుఁ డరుదెంచెను. రఘువీరుని మోముపై నీరము నెన్నిసారులు జల్లినను, ఆతనికి దెలివి రాకుండెను. భయమనెడు పిశాచమున కాతఁడు బలియగునేమో యని అజితసింహుఁడు మిక్కిలి తహతహపడెను. కాని, ఒక గంట కాలమట్లు శీతలోపచారము లొనరించిన పిమ్మట, రఘువీరుఁ డొక పెద్ద నిట్టూర్పు విడిచి, మెల్లగ గండ్లు తెఱచి, డగ్గుత్తికతో "ఇపుడు నే నెచట నున్నాను?" అని ప్రశ్నించెను.

తోడనే, అజితసింహునకు బట్టరాని సంతోషము కలిగెను. అపారమగు తన సంతసమును లోలోన నడంచుకొని, ఇట్లు బదు లిడెను: "మిత్రమా భయపడనవసరము లేదు. నీకేమి కావలయునో యెఱిగింపుము." భయముచే గబగడ వడకుచు రఘువీరుఁ డిట్లనెను:

"సాధ్యమగునంత త్వరలో నీప్రదేశమునుండి నన్ను గొనిపొండు."

## ౨

### దయ్యముల కొంప

రఘువీరుడు బాలుఁడు కాడు. అబలకాడు. ఆతఁడు శత్రుజనమధ్యమున స్వైరవిహార మొనరించు మహావీరుఁడు. అపజయము నెన్నఁడెఱుంగని

మహాశూరుఁడు. రణరంగమున వెన్నిచ్చి యెఱుంగని ధైర్యశాలి. అట్టి సైన్యాధిపతికా యిట్టి దైన్యావస్థ? ఆగృహమునందు దయ్యములో బ్రహ్మరక్కసులో ఉండవలయును. వానిచే రఘువీరున కిట్టి దుస్థితి సంభవించియుండవలయును. అట్లు కాదేని, మహావీరుఁడగు రఘువీరుని నెవరు భయకంపితు నొనరింపఁగలరు? వారు విశ్రమించిన గృహమున దయ్యములు దేవులాడును కాబోలు. అజితసింహుఁడు మేడపైఁ గాంచిన యద్భుతప్రదర్శనమంతయు గూడ పిశాచముల ప్రతాపమే కాబోలు. తాను పరుండిన తల్పమునకు గట్టబడియుంటినని యాతఁడు చక్కగ నెఱింగియుండెను. అదియును పైశాచకృత్యమేనా? పిశాచి గణములుండెనని విశ్వసించుచు వాని వైపరీత్యములగుఱించి నాటి రాజపుత్రులు చెప్పికొనుచుండెడివారు. అజితసింహునకు మాత్ర మట్టి విశ్వాసము లేదు. కాని, ఇపు డాతఁ డేమిచేయఁగలడు? తాను గన్నులార గాంచిన భయాద్భుత ప్రదర్శనములును, భయముచే రఘువీరుఁడు పడుచుండిన మరణవేదనమును మానవాతీతమగు పిశాచకృత్యములకు ప్రత్యక్షనిదర్శనములవలె నుండ, ఆతని తొంటి అవిశ్వాసము చలింప నారంభించెను. ఆతఁడు నిద్రించినపిదప మేడపై జరిగిన యద్భుతచర్య లాతని కన్నులకుఁ గట్టినటులుండెను. అది యంతయు స్వప్నగతవృత్తాంతమని త్రోసివేయుటకు వీలు లేకుండెను. రహస్యమగు గదులుండునేమో వారు మొదటనే ఆప్రదేశమును మహాలులను శక్తివంచన లేకుండ శోధించియుండిరి. జరిగిన విపరీతముల నిట్లు మఱల మఱల జ్ఞప్తికిఁ దెచ్చికొనుచు, దీర్ఘముగ విచారించుచు, రఘువీరుఁ డెట్టియుదంతము నెఱింగించునో యని అజితసింగు తత్తరపడుచుండెను. అంతవఱకును రఘువీరునకుఁ దెలివి రాలేదు. సంధియెత్తిన రోగివలె నాతఁ డప్పుడపుడు "నన్నొక దూరప్రదేశమునకుఁ గొనిపోండు." అని మాత్ర మఱచుచుండెను.

అజితసింహుఁ డాతనికి శీతలోపచారము లొనరించుచు, ప్రియవాక్యముల బుజ్జగించుచు, నేర్పుమెయి ధైర్యము గఱపఁ బ్రయత్నించుచుండ, రాజపుత్ర సైనికులు తమ సరదారుని యవస్థఁ గాంచి భయవిహ్వలులై, యొకరినొకరుడిల్లపడి చూచుచుండిరి. సైనికులు ధైర్యమంతరించినచో స్వామికార్యమునకు భంగము కలుగునని యెంచి, అజితసింహుఁ డిట్లనెను.—"సైనికులారా! రఘువీరుఁడు హఠాత్తుగా వ్యాధిగ్రస్తుఁడై యున్నవాఁడు. ఉచితోపచారములచే నీతని వ్యాధి తొలఁగఁ గలదు. మీలో కొందఱు ఆ చల్లని ప్రదేశమున కీతనిఁ గొనిపొండు, కమ్మని మందమారుతప్రభావముచే నీతఁడు తెప్పిరిలఁ గలఁడు మిగిలినవారు మరియాబీగము మహలుఁ జొచ్చి, లెస్సగ బరిశోధించి, అం దెవఁడైన దాగి యుండునేని వానినిఁబట్టి భద్రముగ నావద్దకు కొనిరండు మరియాబీగము మహలును శోధించువారు ఖడ్గపాణులై యేగవలయును"

తోడనే, పదిపండ్రెండుగురు సైనికు లాయుధపాణులై మరియాబీగము మహలుకుఁ బోయిరి. మిగిలిన బరివారమును గాంచి "ఇపుడు వేళ యెంతైనదో చెప్పగలరా" యని అజితసింగు ప్రశ్నించెను. వారిలో ననుభవశాలియొకఁడు ఆకసముగాంచి నక్షత్రములను లెక్కించి "రాజా! ఇపుడు నాలుగుగంటలై యుండును" అని బదులిడెను.

త్వరలోఁ దెల్లవారునని అజితసింగు సంతసించెను. రాత్రి తాను వీక్షించిన యద్భుతచర్యల గుఱించి తన సైనికుల కెఱింగింతునా? మానుదునా? యని ఆతఁడు యోచింప నారంభించెను. తన వృత్తాంతమును విననంతనే సైనికులందఱు నొక్కక్షణమైన నచట నిలువక పాఱుదురని యెంచి, తన వృత్తాంతమును మరుగుపఱచుటయే క్షేమకరమని నిశ్చయించెను. రఘువీరుని వృత్తాంతము కూడ విపరీతముగ

నుండుననియు, ఆ వృత్తాంతమునుకూడ సైనికులు వినరాదనియును భావించి, రాజమందిరమును భద్రముగా గాచుచుండవలయు నని సైనికుల నాజ్ఞాపించి వారిని అజితసింగు పంపివైచెను.

అంత నాతఁడు రఘువీరుని చేయిఁబట్టి మెల్లగ నాతని లేవనెత్తెను నిలువ జాలకుండిన రఘువీరుని యాకట్టె పట్టికొని, తన బలమును నేర్పును ఉపయోగించి, ఆతని, బదియడుగులు వేయించి, రాజబాట వఱకు నాతని యజితసింగు కొంపోయెను. ప్రకృతియంతయు గాఢాంధకార బంధురమై యుండెను. ప్రకృతియందలి భూతములన్నియు నిద్రించుచుండినట్లు ప్రదేశమంతయు గడు నిశ్శబ్దముగ నుండెను. కావలి గాచుచుండిన సైనికులుమాత్రము సింహములవలె గర్జించుచుండిరి. కాటుక రాశివలె నాచీకటియందు నక్షత్రములు వజ్రపు తునకలవలె మెఱయుచుండెను. చల్లని మందమారుతములును కమ్మని సుగంధసౌరభములును, ఆలోచనాపరుఁడై రఘువీరుని, నడపించుచుండిన అజితసింగునకు సుఖప్రదములుగ నుండెను.

అజితసింహుఁడు విచారించుచుండెను: —

"అంతయు విపరీతముగ నున్నదే? ఈ నిర్జనప్రదేశమున నేగాంచిన ఖాను బృందముగాక ఇతరులుకూడ నివసించుచున్నారా యేమి? ఇందెవరైన నివసింతు రేని మేఘములవలె నా సైనికులు గర్జించుచున్నను, పైకి రారేమి? యోచించుగొలది ఈ గ్రామమున మఱి కొంద ఱున్నారనియే స్పష్టమగుచున్నది. కాని, తన్నివాసులు గోచరింపకుండుట చాలా జోద్యముగ నున్నది. బహుశః వా రెక్కడనో దాగియుండి, మా దైన్యావస్థను గాంచి లోలోన యానందించుచున్నారు కాఁబోలు!

"మఱియు, నీమందిరము వృద్ధుఁడగు ఖాను నివసించు గృహము సమీపముననే యున్నదిగదా. నాసైనికులు ఆబోతులవలె ఱంకెలు

వేయుచుండ, ఖానుయొక్క సేవకుఁడైనను అగపడించి విషయమును విచారింపవలదా? అట్లుగాక, నిద్రాసౌఖ్యము ననుభవించు నా పుణ్యాత్ములకీ కేకలు వినబడలేదేమో తెలియదు."

అని పరిపరివిధము లాతఁడు యోచించు చుండెను. ఎంత యోచించినను సంశయవిచ్ఛిత్తి కాకుండెను. రఘువీరున కింకను మత్తు పూర్తిగ వదలలేదు. కాని, చల్లని మందమారుతములు వీచుచుండుటచే నాతనికి క్రమముగా దెలివి వచ్చుచుండెను. మందమారుతప్రభావముచే నాతని బాధయును భ్రాంతియును దొలంగుచుండెను. అంత వారిరువురును జేరువనున్న బండరాతిపై నాసీనులైరి. "మిత్రమా! నీకుఁ గుశలమా?" యని అజితసింగు ప్రశ్నించెను. తోడనే, వేడి నిట్టూర్పు వదలుచు "దుర్భరము, దుర్భరము," అని రఘువీరుఁడు పలికెను.

ఆతని కేలుబట్టి మృదువుగా నజితసింగు యిట్లనెను:— "ఓయి! ప్రతాపవంతుడా! ఏమి సంభవించెనో వచింపుము. గొప్ప విపరీతము జరుగకుండ నీకిట్టి దుస్థితి సంభవింపదు. అట్టి యుదంత మేమో వినుటకై తత్తరపడు చున్నాఁడను శాంతచిత్తుఁడవై యెఱింగింపుము."

ఒక్క క్షణ మూరకుండి, రఘువీరు డిట్లనెను:

"నాకు బాగుగ జ్ఞాపకము లేదు. రాజా! నా మనసింకను భ్రాంతి జెందియున్నది. నాకింతటి వెఱపుఁ గలిగించిన విషయమును స్పష్టముగ నివేదింపఁ జాలను."

అజిత: "తొందర లేదు. వలయు విశ్రాంతి బొందుము. నీమనసు బాగుగ కుదుటబడినతరువాతనే యెఱింగింపవచ్చును."

అంత వారిరువురు మౌనమువహించి ఒక గంట కాలమట్లు గూర్చుని యుండిరి. రఘువీరుఁడేమి యోచించుచుండెనో యెఱుంగజాలము. అజితసింహునివలె నాతఁడుగూడ భయానక ప్రదర్శనమును నెద్దియో గాంచి

యుండును. బహుశః ఆ విపరీతమునుగురించి యాలోచించు చుండెను గాబోలు.

అజితసింగు పరిపరివిధములు యోచింపదొడంగెను. సిక్రీనగరమున కేతెంచి ఖానుతో సంభాషింప నారంభించిన దాదిగ జనించుచుండిన యనుమానములు గాఢములగుచు నాతని బాధించుచుండెను. అనుమానములక్రిందట మాత్రమాతడు మొగలాయి దర్బారున కేతెంచియుండెను. అంతవఱకు నాతఁడు రాజపుతానా దేశమునందలి తనరాజ్యమున హాయిగానుండెను. ఆతఁడు మొగలాయిదర్బారునందలి కుట్రలను, మాయలను, అద్భుతములను ఎఱింగినవాడుకాడు. మాయమర్మముల నెఱుంగక స్వచ్ఛందముగ మెలంగు నారాజకుమారుఁడు సిక్రీనగరమునందలి యద్భుతచర్యల నైజము నరయఁజాలక, ఇట్లు చింతింప నారంభించెను: "ఈనిర్మానుష్య ప్రదేశమునకు నన్ను సార్వభౌముఁడేల పంపవలయును? మరియాబీగమునందే బసచేయవలయునని యేల నియోగింపవలె? ఈనగరము శిథిలమగుచున్నను నివాసయోగ్యములగు గృహములు కొన్ని యున్నవిగదా. మరియాబీగము మహలునందు బసచేయుమని సార్వభౌముఁడానతిచ్చుటయును, నాకా బసయొసంగుటకు ఖాను సంశయించుటయును జూడ నిందెద్దియో భద్రకారణముండునని తెల్లమగుచున్నది. ఈమహలునందు నేనుగాంచిన విశేషములు చక్రవర్తికి దెలిసియేయుండునని తోఁచుచున్నది. అట్లగుచేని, నన్నీ పిశాచగృహమునకేల పంపవలయును? పంపఁదగిన యవసరమెద్దియో తెలియకున్నది" అజితసింగు యిట్లు విచారించుచుండ రఘువీరుఁడొక నిట్టూర్పు విడిచెను.

"మిత్రమా! నీకు కుశలమా?" అని అజితసింగు ప్రశ్నించెను.

రఘు: "రాజా! కుశలమే. చాలమట్టుకు మనసు వదిలపడినది. నాచర్యఁదలంచిన నాకే సిగ్గగుచున్నది సుమా"

అజిత: "సిగ్గు పడనేల? దుర్భరమగు విపత్తేద్దియో నిన్నిట్లొనరించియుండు"

రఘు: "స్వామీ! అరుణోదయ మైనటు లున్నది జూడుము!

అజిత: "అవును. సూర్యోదయముకూడ శీఘ్రముగఁ గాఁగలదు"

రఘు: నా వృత్తాంతము నేమని యెఱింగింతును? నానుడువు లాలించి యందఱు పరిహసింతురు గాబోలు."

రఘు: "మూఢాత్మునకు సర్వము పరిహాసకరముగనే యుండును. బుద్ధిమంతు లట్టివారలు కారు. కావున, సంశయము వీడి నీ యుదంతము నెఱింగింపుము"

రఘువీరుని వృత్తాంతము వినిన అజితసింగుకూడ పరిహసించువాఁడే. కాని, తనవలె రఘువీరుఁడుసహిత మెద్దియో విపరీతమును గాంచియుండునని యాతఁ డెఱింగియుండెను. మిక్కిలి తొట్రిలుచు రఘువీరుఁ డిట్లనెను: "ఏమైనను, రేపురాత్రిమాత్ర మిందుండరాదు. ఈ గృహమును సాధ్య మగునంత త్వరితముగ వదలివేయుట ప్రధాన కర్తవ్యము"

ఆ గృహమున మఱల శయనించుట అజితసింగునకుఁగూడ యిష్టములేకుండుటచే నాత, డిట్లు బదు లిడెను: "నివాసయోగ్యములగు గృహము లనేకము లున్నవి. రేపు తప్పక మఱియొక గృహము నరయుదము."

రఘువీరుఁ డెద్దియో ధ్యానించుచుఁ గొంతతడవూరకుండెను. అజితసింహుఁడిట్లనెను:

"రఘువీరా! సూర్యోదయ మగువఱకు నీ యుదంతము నెఱింగింపఁ జాలవు కాబోలు: అట్లేకానిమ్ము: తొందరలేదు"

రఘు: "రాజా! అట్లుకాదు. నా వృత్తాంతము నీవిప్పుడు వినుటయే క్షేమకరము. వృత్తాంతము వినినపిదప, నీవుకర్తవ్యమాలోచింప

వలసి యున్నది. ఆలోచనకు నేనెంతమాత్ర మక్కరకురాను. ఏమిచేయ వలయునో నేను నిర్ణయింపఁజాలను"

అజః జరిగిన యుదంతమును మొదట పూర్తిగ నెఱింగింపుము. పిదప, కర్తవ్య మాలోచింతము కాల్సేతులు కూడదీసికొని రఘువీరుఁ డిట్లు చెప్పనారంభించెను:

"రాజా! సావధానచిత్తుఁడవై వినుము. దినమంతయుఁ బ్రయాణ మొనరించి యుండుటచే కడుంగడు డస్సితిని. మన మిరువురము రెండు మందిరములను బరిశీలించిన పిమ్మట, కడుపార నాహారమును మెసవి, వెంటనే శయ్యపై వ్రాలితిని. శయనించుటకు ముందుగా మహాలు యొక్క తలుపులను కవాటములను భద్రముగ మూసియుంటిని. నీసేవకుఁడు వెలిగించిన దీపము సమముగా వెలుగుచుండెను. ద్వారము లన్నియు భద్రముగ మూయఁబడుటచేతను, దీపము స్వచ్ఛముగ వెలుగుచుండుటచేతను, ఎట్టి భయంబును లేక హాయిగ శయనింపఁ గలిగితిని. దేహ మలసి యుండుటచే, శయ్యపై వ్రాలినంతనే కండ్లుమూతలు పడ, మై మఱచి నిద్రించితిని!

అట్టి గాఢ నిద్ర నెంతకాల మనుభవించితినో యెఱుంగను. ప్రపంచమునన దెట్టిదో యెఱుంగక, కొంతకాల మట్లు నిద్రించియుంటిని. అనంతరము జరిగిన వృత్తాంతము నేమని విన్నవింతును? మైమఱచి నిద్రించుచుండిన నేను కొంతతడవైనపిమ్మట హఠాత్తుగ మేల్కాంచితిని. నా దేహ మంతటినుండియు ముచ్చెమటలు స్రవించుచుండెను. రాజా! ఆస్థితిని వర్ణింపజాలను. నేను వరుండిన పరుపంతయుఁ బూర్తిగ దడిసిపోయెను. నాహృదయ మెట్లుండునో నీవే యోచింపుము! నరములన్నియు బిఱ్ఱబిగిసుకుపోయెను. దేహమంతయు గగుర్పొడుచుచుండెను. తుదకు, ఎవరో గొంతుముడి నొక్కుచుండినటులు, కంఠము బిగిసుకొనుచుండెను. హంతకు లెవరైన నరుదెంచి నాకంఠమును

నులిపివేయుచుండిరో, లేక, దయ్యములు నాపై వ్రాలియుండెనో, మఱి యేకారణముచే నట్టిగతి పట్టెనో యోచించుటకు నవకాశములేక పోయెను. ఎవరినైనఁ బిలుచుటకైనను, యఱచుటకైనను వీలు లేకుం డెను. మఱియు నోరాజా! నేను కండ్లు తెఱచుసరికి, సర్వము గాంధాంధకార బంధురమై యుండెను. నేను నిద్రించుటకు ముందు ద్వారము లను జాగ్రత్తగ మూసియుంటినిగదా. అట్టి సందర్భమున గాలిచే దీపమాఱిఁ యుండుననుట కవకాశము లేదు. దీప మెట్లారెనో యోఱుంగ నైతిని. ఏమియుఁ దోచక నిన్ను బిలువవలయునని ప్రయత్నించితిని. రాజా, నా యవస్థ యేమందును? నిన్నుఁ బిలుచుటకైనను నోరాడ కుండెను. కండ్లు విప్పినంతనే గోచరించిన గాఢాంధకారమును, దేహము నుండి ప్రవహించుచుండిన స్వేదమును, నోరాడకుండుటయును గమ నించి, ఓ రాజా! నా యవస్థ యెంత దుర్భరముగ నుండెనో నీవే యోచింపుము. నాకు గలిగిన భయమును వర్ణింపజాలను. నాదురవస్థకుఁ గారణమేమో దెలియకుండుటచే మిక్కిలి భయకంపితుఁడనైతిని. శాత్రవుని కరవాల మెదురుగా తళతళ లాడుచుండినను సరకు సేయక వానిపై దూకఁగల నేను డిల్లపడి యుంటి. శాత్రవజన సమూహమును గాకులవలె బాఱఁద్రోలు మద్భుజశక్తి మంట గలిసెను.

సముద్రమువలె నుండిన యంధకారమున నట్లెంతకాలముంటినో దెలియదు. అసహాయుఁడనై కొంతకాలమట్లు పడియుండిన పిమ్మట గాంచిన విశేషములను దలంచిన హృదయము వ్రక్కలై పట్టుదప్పి పడిపోవునేమోయని భయముకలుగుచున్నది. అట్టియెడ నీవైనను భయ భ్రాంతుడవు కాకుందువా? కనుక సావధానచిత్తుఁడవై యుండుము" అని పలికి దీర్ఘమగు వేడి నిట్టూర్పులు విడుచుచు మగుడ నిట్లు చెప్ప నారంభించెను.

"భయవిహ్వలుఁడనై తమోసాగరమున గొంతకాలమట్లు పడి

యుండిన పిదప గుడ్డిదీప మొకమూలనుండి కనుపింప నారంభించెను. ఆసన్ననిదీపము క్రమముగా రెండాయెను. ఆ రెండుదీపములును వల యాకారము గల రెండు గాజుబుడ్లలో స్థాపితమైనటులుండెను. బుడ్లవలె నుండిన ఆ రెండుబుడ్లును నృత్యము నొరించుచు నన్ను సమీపించెను. నన్ను సమీపించినంతనే నృత్యము నిలిచిపోయెను. నేను నిదానముగ జూచుసరికి ఒక వికృతాకారము నాకు గోచరమాయెను. నేను గాంచిన రెండు దీపములును ఆవికృతాకారముయొక్క నయనములు. ఆవికృతా కారమును సరిగా వర్ణింపఁజాలనుగాని అయ్యది నాకిపుడు కన్నులకుగట్టి నటులనే యున్నది. రాజా! నాకు జనించిన భయము వర్ణనాతీతము” రఘువీరుఁడిక చెప్పజాలక భయముచే గడగడ వడకసాగెను. అంతలో మఱల ధైర్యము వహించి ఆతఁడిట్లు చెప్పనారంభించెను.

“చింత నిప్పులవలె మండుచుండిన రెండు నేత్రములునన్నె నాదెస చూచుచుండెను. అతిభయంకరమగు నారాక్షసిచూపులకు నేనెంత కాలముగురినైయుంటినో తెలియదుగాని, అంతకాలమును భయముచే నారక్తము గడ్డబాఱి పోవుచుండెను. అంతలో తెల్లనిదీపము ఆప్రక్కను గోచరమాయెను. రాజా! వినుము. నాయెదుట వికృతాకారముదాల్చిన దయ్యమొకటి నిలుచుండెనని ఆ దీపకాంతిచే నప్పుడు తెలిసికొంటిని. అంతవరకును నేనావిషయము నెఱుంగనైతిని. మొదట రెండుదీపము లని భ్రమించినవి ఆదయ్యముయొక్క నయనములని తెల్లమాయెను. పొడుగుపాటి పురుషునియొక్క అస్థిపంజరము వస్త్రవిహీనమై రక్తమాం సములు లేక నిప్పులవలె మండుచుండిన నయనములను త్రిప్పుచు వికృత ముగ గంతులు వైచుచు భయంకరమగు ధ్వనులు పుట్టించుచు వికృత ముగ నవ్వుచు గేరుచు నాయెదుట నిలుచుండెను. ఆదయ్యము నవ్వి నపుడు దాని పండ్లెట్లుండెనో వర్ణింపఁజాలనుగాని వానింగాంచినంతనే నాప్రాణము లెగిరిపోయెనని యనుకొంటిని. ఊపిరి దీయుటకునైనను

సాహసము చాలక డిల్లవడియుంటిని. ఆరాక్షసప్రదర్శన మంతటితో నైనను ముగియలేదు" అని పలికి రఘువీరుఁడూరకుండెను. జరిగినవిషయమును స్మరణకుఁ దెచ్చుకొనుచుండుటచే జనించిన భయమువలన నాతని పెదవులతడి యాఱిపోయెను. చూపులు వెలవెలఁ బోయెను. హృదయము తట తట గొట్టుకొనుచుండెను. ఊపిరిదీయుటయే కష్టముగనుండెను. అట్టి రఘువీరుని అజితసింహుఁడు హెచ్చరింప నాతఁడు మఱల ధైర్యము వహించి ఇట్లు చెప్పెను:

"అప్పు డా దయ్యము నన్ను సమీపించుచు, ఎముకలతోఁగూడి యుండినచేయిని జాచుచు నేద్దియో పలికెను. అంత నాదయ్యము మఱింత భీకరాకారముఁ దాల్చెను. అతి ఘోరముగ నాదెసజూచుచు, రక్తమాంసములులేని హస్తమును బిసిగికొనుచు, మిక్కిలి భయంకరముగనుండిన పండ్లను పటపట గొఱికి, ఆ దయ్యము వెంటనే వికవికనవ్వసాగెను. రాజా! ఆ నవ్వును గాంచవలయును, వినవలయును, అంతెగాని, వర్ణించుటకు సాధ్యముకాదు. తోడనే, నా యవయవముల చేష్టలన్నియు నుడిగిపోయెను. నే పక్షవాతరోగివలె నుంటిని. నా ప్రాణమింకను ఎట్లునిలిచియుండెనో యెఱుంగను."

అని రఘువీరుఁడు పలికి యూరకుండెను. ఇంతవరకును గంభీరముగ నుండిన అజితసింహుని ధైర్యముకూడ చలించెను. ఆతని హృదయము దడదడ గొట్టుకొనుచుండెను. కూర్చుని వినుచుండిన యాతఁడు తటాలున లేవబోయెను. అంతలో నాతఁడుధైర్యమువహించి, ఎప్పటియట్లు ఆసీనుఁడాయెను. రఘువీరుఁడుకూడ సద్దుకొని శేషించిన వృత్తాంతము నిట్లు చెప్పెను:

"అంత నాదయ్యము మూరెడు పొడుగుగల నాలుకను జూపెను. కాలిన గునపమువలె నెఱ్ఱబాఱి పొడుగుగనుండిన యానాలుక పాము వలె నాడ నారంభించెను. నిప్పు గ్రక్కుచున్నటులుండిన ఆ నాలుకను

ఆ కండ్లను గిఱగిఱ ద్రిప్పుచు, నన్ను ఆలింగన మొనరించుటకై, తన రక్తమాంసములులేని అతి దీర్ఘములగు హస్తములను ఆ దయ్యము జాపినంతనే, ఇక భరింపజాలక, యావచ్ఛక్తిని వినియోగించి బిగ్గరగ బొబ్బలిడుచు, ఎట్టులెట్టులో యీవలఁ బడితిని. తోడనే స్పృహదప్పె. అనంతర మేమిజరిగెనో నీవే యెఱుంగుదువు. రాజా! నే నింక భయ పడనేల యని నీవన్యథా తలంపఁదగదు. మనుజున ధైర్యస్థైర్యములు మనుష్యుల ముందుగాని, దయ్యములముందు నిరర్థకములు. ఎన్నిబీరములైనను బలుకవచ్చును గాని దయ్యముల చర్యలు మానవాతీతములు. రాజా! ఇది నా యనుభవము. మఱియు, ఈ గృహమున నుండరాదు. శీఘ్రముగ కర్తవ్య మాలోచింపుము"

## ౯

### రహస్యాలోచన

రఘువీరుని భయంకరవృత్తాంతము ముగిసినంతనే, అజితసింహుఁడు దిగ్గున లేచెను. అతని డెందమున నెద్దియో విపరీతమగు నాందోళనము పుట్టెనని అతని మోమును జూచినంతనే తెలియుచుండెను. అతఁ డెంతటి వీరుఁడైనను, అతని దేహ మంతయు భయముచే గంపించెను. ఆతఁ డెన్నఁడు నట్టి ఘోరమగు వృత్తాంతమును విని యెఱుంగఁడు. రఘువీరుఁడైనను దక్కువ వీరుఁడు కాఁడు. అతఁడు వీరుఁడు కాఁబట్టియే సజీవుఁడై యుండెను. వీరుఁడుకాని వాఁడు నిశ్చయముగ దారున మరణించియే యుండును. అజితసింహుఁ డావిషయము నెఱింగి యుండెను. కొంతకాల మాతఁ డేమియుఁ బలుకక శిలావిగ్రహము వలె నిలుచుని యుండెను. ఆతఁడేమి యోచించు చుండెనో గాని,

"అతిదారుణము, అతిఘోరము" అను పలుకు లాతని నోటనుండి, ఆతఁ డెఱుఁగకయే వెలువడెను.

తోడనే, రఘువీరుఁ డిట్లనెను:–"ఓ రాజా! నేను వెలుపెట్టిదో యెఱుంగ
ననియు, ఎట్టియుపద్రవము సంభవింపనుండినను వెనుదీయక మార్గోన్ను
వాఁడనని నీవు తెలియుంగుదువు గదా. కాని, నేఁడు నీయెదుట నిలు
చుండుటకు సిగ్గగుచున్నది. ఎట్టి ఘోరము సంభవించెనో జూడుము."

అజితసింహుఁ డాతని వచనములు నాలింపలేదు. తాను గూడ
భయంకర ప్రదర్శనమును గాంచియుండుటచే, నాయుదంతమును రఘు
వీరున కెఱింగించుట యుచితమా కాదా యని ఆతఁడు యోచించు
చుండెను. రఘువీరుఁడు కేవల మాతని సరదారుఁడే కాఁడు. జయ
పూరు మహారాజు నాతఁడు చిరకాలమునుండియు మిక్కిలి విశ్వాస
ముతోఁ గొలుచుచుండెను. మహారాజుపై నభిమానముకూడ మెండుగ
నుండెను. రఘువీరుఁడు మహావీరుఁడనియేగాక, ఉపాయశాలి యనియు
గూడ జయపురాధీశుఁడు నమ్మియుండెను. కుమారుఁడగు నజితసింగు
అవసరము కలుగునప్పుడెల్ల రఘువీరుని సలహా ననుసరించి మెలంగ
వలయునని జయపూరు మహారాజు నియోగించెను. పితృవాక్యముల
ననుసరించి, అజితసింగు ప్రతి యంశమును రఘువీరున కెఱింగింపుచు,
ప్రతికార్యమునందును ఆతని యభిప్రాయము నరయుచుండెను.
ప్రమాదకరముగ నుండు సమయమున రఘువీరుని సలహాప్రకార
మాతఁడు మెలంగుచుండెను. కాని, నేఁడుమాత్ర మాతఁ డన్యథా
ప్రవర్తించెను. భయముచే సగము చచ్చియుండిన సరదారునకు తన
యుదంతము నెఱింగించు టెంతమాత్రము క్షేమకరము కాదని యెంచి
ఆతఁ డిట్లు ప్రశ్నించెను. "రఘువీరా! నీయుదంతంబు నంతయు వింటి.
నీ కింతటి యాపద సంభవించినందుల కెంతయు జింతించుచున్నాఁడను.
కాని, నీకు భయము తీరియుండును గాన, ఆ విషయమును గుఱించి
లెస్సగ యోచించి సమాధాన మొసంగుము. అది యంతయు పిశాచ
కృత్యమనియే భావింతువా ?"

రఘు: "మానవాతీతమగు నిట్టి వికృతకార్యములు భూతాదులు తప్ప మరి యెవ్వ రొనరింతురు ?"

అజి: "అట్లు లననేల? నిన్ను భయభ్రాంతు నొనరించుటకై మనుజు లెవ్వరో యిట్లొనరింపరాదా ?"

రఘు: "రాజా! మనుష్యమాత్రుఁ డట్లు వేయఁజాలఁడని దృఢముగాఁ జెప్పఁగలను."

అజిత: "అట్లయిన, ఇచటనే యీరాత్రిగూడ పరుండి చూతము. అప్పుడు"-

తోడనే, రఘువీరుఁ డులికిపడుచు నిట్లనెను:

"రాజా! వలదు, వలదు. నాక్షేమము కొఱకే చెప్పుట లేదు. ఈసరికి ప్రాణము లెట్లో నిలిచియున్నవి. ఇఁకనైనను ఈగృహమును వీడకుందుమేని, మన ప్రాణములు మనవి కావని నమ్ముము. నాకా వికృతాకారము మఱల గోచరమగునేని, మరణము తథ్యము; అదృష్టముకొలది సజీవుడనై యుందునేని, మతి చెడి ఉన్మాదుడ నగుదును. కాఁబట్టి మన మిందుండరాదు."

అజితసింహుఁడు ఖిన్నుడై యిట్లనెను: — రఘువీరా! అట్లే కానిమ్ము. సూర్యోదయమైనదిగాన మన మీగృహమును మఱియొక సారి పరిశీలింతము రమ్ము."

రఘువీరున కింకను భయము వదలలేదు. ఆగృహమును దలంచి నంతనే ఆతని హృదయము ఝల్లుమనుచుండెను. ఒక్క గడియకాల మచటనే విశ్రమించి ఆ అవయవములకు బలము చేకూరిన పిమ్మట నరుదెంతునని యాతఁడు ప్రత్యుత్తర మొసంగెను.

అజితసింహుఁడు మారుపలుకక లేచి మరియాభీగము మహాలం ప్రవేశించెను. ఒకవిధమగు దిగులు ఆతని హృదయము నావరించి యుండెను. ఆతఁడు మిక్కిలి మనోబలము గలవాఁడగుటచే భయము

నడంచుకొనియుండెను. కాని ఎంతయణచియుంచినను మరియాబీగము మహాలు ప్రవేశించినంతనే ఆతని హృదయము కంపించెను.

తన సైనికులను బిలిచి మఱియొకగృహమునందు బసచేయుట కంద ఱును సిద్ధముగ నుండవలయునని అజితసింహుఁ డాజ్ఞాపించెను. కారణము నెఱుంగమి, వారు వెలవెలబోయిరి, రఘువీరుఁడు జీవచ్ఛవంబు వలె బడియుంట మాత్రము వారు గాంచిరిగాని ఆతఁడును అజితసింహుఁడును గాంచిన భయంకర ప్రదర్శనముల గూర్చి వారెఱుంగరు గదా, మాఱుబలుకక స్వామియాజ్ఞను నిర్వర్తించుటయే యభ్యాసము గల సైనికులా గృహమును వదలివేయుటకై వెంటనే ప్రయత్నము లొనరింప నారంభించిరి. మఱియు, ఆరెండు మహాలుల తలుపులను కిటికీలను బూర్తిగ దెఱచియుంచవలయునని యాతఁ డాజ్ఞాపించుటచే వారట్లె యొనరించిరి.

పిమ్మట, ఆమందిరముయొక్క చుట్టుప్రక్కల నాతఁడు పరిశీలించెను. ఏయే త్రోవలవలన నాగృహమును ప్రవేశించుటకు వీలుండునో వాని నెల్ల నజితసింగు శోధించి చూచెను. రాత్రి జరిగిన విపరీతముల నర యఁగల జాడలేమైన గాన్పించునేమో యని శోధించుచుండిన రాజపుత్రుఁడు విఫలమనోరథుఁ డాయెను. అంత నాతఁడు సమీపమున నుండిన యుద్యానవనమునకుఁ బోయి, మధ్యనుండిన వేదిక నారోహించి మరియాబీగము మహాలున కభిముఖుఁడై, తద్గృహమును దిలకింపఁ దొడంగెను. శిల్పుల కళాప్రావీణ్యమును బ్రదర్శించుచుండిన యాదివ్య మందిర మాతనికి నయనపర్వ మొనరించెను. బాలభాస్కరుని సువర్ణ కిరణములచే నా మందిర సౌందర్యము మఱియు నతిశయించి యుండెను. తన్మందిరోపరిభాగము గోపురాకారముఁ దాల్చియుండెను. ఆమందిరముయొక్క ద్వారము లన్నియు దెఱచియుండెను గదా, అజితసింహుఁ డెంత పరికించినను, ఒక రహస్యమందిర మాభవనమునకు

సంబంధించి యుండునని యూహించుట కాధారము లేకుండెను. తాను నిద్రించినపిదప గాంచిన మహాలు ఆగోపురమునఁ దాగియుండ నేరదని ఆతఁడు భావించెను అట్లైన, ఆతఁడు గాంచిన మందిర మెచట నుండెను! అచటి కాతని నెవరు గొంపోయిరి? అదియంతయు పైశాచ కృత్యమేమో యను ననుమానము బలమాయెను.

కాని, అజితసింగు దయ్యము లుండునని నమ్మువాఁడు కాకుండుటచే నాతఁడు ఖడ్గమును బూని, బీగముమహాలు బ్రవేశించి, గోడభాగమును నేలభాగమును గాలితోఁ దన్నుచు, చేతితో గ్రుద్దుచు, అనుమానముగనుండు భాగములను గత్తితో వ్రాయుచు, రెండు మహాలులను లెస్సగ బరిశోధించెను. ఎంత వెదకినను, కార్యము లేకుండుటచే నాతఁడిట్లు చింతింపఁ దొడంగెను:-

" ఈ వైపరీత్యములు మానుషకృత్యములో, పైశాచకృత్యములో నిర్ణయింపఁజాలకున్నాఁడను. నేను గాంచిన దారుణమగు చేష్టలన్నియు నొక కలయని కొట్టివేయుటకు వీలు లేకున్నది. నేను కన్నులు విప్పి చూచుసరికి. పాశబద్ధుఁడనై యుండుట నిక్కువము! జయపురాధీశుని కుమారుని ప్రాణమును హరించినరక్కసి సౌందర్యము, ఆరాజకుమారుని ఘోర మరణము, వస్త్రహీనములగు శవములు ఢిల్లీనగరమున నెట్లు ప్రదర్శింపఁ బడుచుండెనో, ఆ తెరంగుననే రాజకుమారుని కళేబరముకూడ గోడకు నిలువబెట్టించి యుండుటయును గన్నులార గాంచిన మీఁదట, కలయని యెట్లు భ్రమింపఁ గలను? కలయని భ్రమింతునన్నను, రఘువీరుని యుదంతము నేమని సమర్థింతును? కావున, కలయని భ్రమింపరాదు. ఈ వైపరీత్యములను, అసాధారణ ప్రజ్ఞావంతులగు మనుష్యు లొనరింప వలయును, లేదా, అయ్యవి దయ్యముల చేష్టలై యుండవలయును. దయ్యముల ప్రభావమే యని రఘువీరుని దృఢ విశ్వాసము. నేనెంత వెదకినను, మనుజుని జాడ లగు

పడకుండుటచే నాతనిమాటను త్రోసివేయుటకు వీలు లేకున్నది. కాని, "ఓయి, రాజకుమారుఁడా! ఇట్టిగతియే నీకు రేపు సంభవింపగలదు" అని పలికిన ఆ రక్కసి పలుకులు ములుకులవలె నాహృదయమున నాటికొనియుండ, కలయనియు, దయ్యములనియు భ్రమించుటకు వీలు లేకున్నది. ఇది నిశ్చయము. కలగాదు. భూతముగాదు. మానవాతీత మగు చాతుర్యముతో మనుష్యుల నసహాయుల నొనరించి, కొండొక కారణార్థము ఎవరో యిట్లొనరించి యుండవలయును. ఈ గ్రామమున నెవ్వరైన నందు రేని నలబతుఖానుకు దెలిసియుండవలయును. ఈఖాను సాధారణుఁడు కాకపోయినను, ముందుగ నాతనితోఁ బ్రసంగించుట ప్రధాన కర్తవ్యము" అని వితర్కించుకొని, అజితసింహుఁ డీవలకు వచ్చునరికి, రఘువీరుఁడును, ఖానయొక్క సేవకుఁడగు మహమ్మదు ఖానును ఆతనికిఁ గోచరించిరి. మహమ్మదును జూచినంతనే, అజిత సింహుఁడు వెలవెలబోయెను. కారణ మేమన, తన వృత్తాంతము నా సేవకునకు రఘువీరుఁ డెఱింగించెనేమో యని ఆతఁడు భీతిల్లెను. కాని, రఘువీరుని మోమును గాంచినంతనే, అట్టి ప్రమాదము సంభవించి యుండదని అజితసింగు గ్రహింపగలిగెను. ఆతని గాంచినంతనే, వంగి వంగి సలాము లొనరించుచు మహమ్మదు యిట్లనెను:- "రాజోత్తమా! తమక్షేమము నరయుటకై మా ఉమ్రావు సాహేబుగారీ సేవకుని బంపి యున్నారు. తమకెట్టిపరిచర్యయైన నొనరింపవలయుననియు తమయాజ్ఞల నెల్ల శిరసావహింప వలయుననియుఁ గూడ స్వామియాజ్ఞ. ఆనతిండు."

మహమ్మదు పలికిన ప్రతిపలుకును అజితసింహుఁడు శ్రద్ధగా వినెను. రఘువీరుని వృత్తాంత మాతని కెంతమాత్రము దెలిసియుండదని యెంచి అజితసింహుఁ డెంతయు సంతసించి ఖానును దర్శించుటకై తాను సత్వరమరుదెంతునని యాతఁడు తెలుప మహాప్రసాదమని బలికి సలాము లొనరించి మహమ్మదు నిష్క్రమించెను.

అనంతర మజితసింహుఁడిట్లు విచారించుచు ఖానుపద్దకు బోయెను :—

"ఎంత తర్కించినను ఈవైపరీత్యములన్నియు మానవకృతము లనియే తేలుచున్నది. ఈనిర్మానుష్య ప్రదేశమున నెవరైన యుందు రేని అనుభవజ్ఞుఁడును, సూక్ష్మబుద్ధియును గాన ఖానుయెఱుంగకుండఁడు గదా! అయ్యది రహస్య వృత్తాంతమగునేని ఈయుదుసలివలన గ్రహించుటకల్ల కాని ఇట్టి యద్భుతములను మనుష్యమాత్రుఁ డెట్లొనరింపగలఁడు? కావున, మఱియు యిసుపురము నెద్దియో చెప్పరాని భ్రమకులోనై యుందును. కాబట్టి ఈ రాత్రిగూడ నామహాలునందే విశ్రమింతునేని నిజము బయలుపడును. కాని, ఆతఁడెంత తర్కించినను భయముచే జనించిన యనుమాన మాతని హృదయము నావరించి యుండెను. మఱియు, అనుభవనీయుఁడగు రఘువీరుఁడా మహాలునం దుండు టెంత మాత్రము క్షేమకరము కాదని విస్పష్టముగ వక్కాణించియుండెను గదా. కావున, ఆ మందిరమున మఱల విశ్రమించుటెట్లు?

ఆతఁడట్లు యోచించుచు, ఖాను యింటికి బోయెను. మెత్తని దిండుపై సగము వ్రాలి ఖాను ఎద్దియో ధ్యానించుచుండినటు లుండెను. నిర్లక్ష్యము నిర్విచారమును ఆతని ముఖలక్షణములు తెలుపుచుండెను. గాంభీర్యము, ఒక విధమగు యౌదార్యమునుగూడ నాతని మోమున దాండవమాడుచుండెను. ఆతని గాంచినంతనే, ఆతఁడొక మహాపురుషుఁ డనియు, యోగియనియు, జ్ఞానియనియు, భ్రమించు వారలేగాని, ఆతని హృదయకౌటిల్యమును గుర్తించు వారరుదు. అజితసింహుని గాంచి, నిశ్చలహృదయముతో నాతఁడు సవినయముగ నిట్లనెను :— "ఓ జయపుర కులాబ్ధిచంద్రమా! స్వాగతము. తమరీ యాసనము నలంకరింపుడు. రాజోత్తమా! తమకు కుశలమేగదా?"

అజిత: "అయ్యా మీ కృపాభిమానముల కెంతయు సంతసించు

చున్నారము. కాని, మిమ్ముల నొకప్రశ్న యడుగవలసియున్నది. తమ రేమందురు ?"

ఖాను : "మహారాజా ! సేవకుని కేమియాజ్ఞో శీఘ్రముగ నానతిండు."

అజిత్ : "మాటమాటకు మీకు శ్రమగలిగించుట సహింపఁ జాలను. మరియూబీగము మహలు నా సేవకులకు సదుపాయముగ లేదు. ఒకవిధముగ ఆమహలు నాకుఁగూడ నివాసయోగ్యముగలేదు."

ఖాను : ఈనగరమునందలి గృహములలోఁ దమ కెద్ది సదుపాయముగ నుండునో యెఱింగింతురేని—"

అజిత్ : వలదు, వలదు. మేము నివసించుట కేగృహము అనువుగ నుండునో మేమే వెదకికొందుము. మీకు శ్రమగలిగించుట కేనియ్యకొనను."

అని, అజితసింహుఁడు పలికినంతనే ఖానుయొక్క వదనమెఱ్ఱబారెను. అజితసింహుఁడు గుర్తింపకుండ, ఒక్కక్షణమాత్రమున దన యాగ్రహమును దిగమ్రింగి, "రాజోత్తమా ! నా మనవి వినుము—" అని యెద్దియో చెప్పఁబోయిన ఖానును వారించి, అజితసింహుఁ డిట్లు పలికెను : "తమకు శ్రమఁ గలిగింపఁజాలనని చెప్పియుంటిగదా. మాసదుపాయములకై మేమే దేవులాడెదము." అని పలికి, ఖాను ప్రత్యుత్తర మొసంగుటకైనను అవకాశ మొసంగక, అజితసింహుఁడు దిగ్గున లేచి శరవేగమున మాయమాయెను.

అపు డావృద్ధునకుఁ గల యాగ్రహ మంతయు నాతని మోమునఁ దాండవమాడెను. దుర్భరమగు ప్రమాద మెద్దియో ప్రాప్తించునట్టు లాతఁడు చేష్టలుడిగి శిలావిగ్రహమువలె నిలువఁబడి, అజితసింహుఁడు పోయిన దెసఁ జూచుచుండెను. కాని, ఖానునకు సంభవించిన యుపద్రవ మేమి ? తన కనువగు గృహమును దానె వెదకికొందునని రాజకుమా

రుఁడు, పలికినప్పుడు శ్రమయే తప్పెనని ఖాను సంతసింపవలయునుగాని, ఆగ్రహాపరవశుఁడు కానేల? ఆతఁ డట్లు ఉలికిపడ నేల?"

౧౦

మతి యొక్క బస

నిర్జనప్రదేశమగు సిక్రీనగరమున నేదియో గొప్ప రహస్యము దాగి యుండుట నిక్కువమని అజితసింహుఁడు భావించెను. ఖానుయొక్క ప్రవర్తన మాతని యనుమానమును బలపఱచెను. ఆ రహస్యమును గనుగొనువఱకును దానాప్రదేశమును వీడరాదని యాతఁడు నిశ్చయించెను.

అజితసింహుఁ డానగరము నెన్నఁడు జూచియుండలేదు. ఆతఁ డానగరమున కేతెంచుసరికి ప్రొద్దుగ్రుంకియుండుటచే నాప్రదేశమును బరిశోధించుట కవకాశము లేకపోయెను. అయ్యదే ప్రధాన కర్తవ్యమనియెంచి, ఖానుయొక్క గృహమునుండి వెలువడిన యజితసింహుఁడు తత్కార్యాచరణమునకై బయల్వెడలెను.

ఆ నగరమునందలి యుత్తరభాగమున మహావైభవముతో నలరారు మందిరము లనేకము లుండెను. అందలి సార్వభౌముని 'దివానీఆమ్' 'దివానీఖాన్' యను దివ్యభవనములు చూపరుల దృష్టిని ముఖ్యముగా నాకర్షించును. ఆవెనుక, అసంఖ్యాకములగు చిన్నచిన్న భవనములు బారులు తీర్చియుండెను. వాని నెల్ల నజితసింహుఁడు పరిశోధింపఁగడంగెను. కాని, అందెవరైన నివసించు జాడలైనను గానరాకుండెను. వాని యవస్థ బరికింప, సంవత్సరములనుండియు నందెవ్వరు మసలుచుండినట్లు తోపకుండెను. రారాజున కేర్పడిన నగరులును, ఆతని విఖ్యాతపూరుషుల కేర్పడిన సౌధంబులును కేవలము నిర్జన ప్రదేశంబులై, కళావిహీనంబులై ధూళిధూసరంబులై యుండి, అజితసింహునకు భయభ్రాంతులు కల్గించుచుండెను. కాని, ఒక్క విషయము

మాత్ర మాతని యనుమానమును బెంపుజేసెను. 'మరియా' బీగము మహలునందుగూడ నెవ్వరు గానరాకుండినను, ఎవ్వరైన నివసించు జాడలైనను తోపకుండినను, మనుష్యసంచారము లేని కారణమున నా మహలు ధూళిధూసరంబై యుండుటకు మారుగ, పరిశుభ్రముగ నుండుటచే, నందెవ్వరో కావలియుందురని రఘువీరుడు వితర్కించెను. కాబట్టి తాను పరీక్షించుకొనిన మహలునందు బసచేసి యుందలి మర్మము నరయవలయునని యాతడు నిశ్చయించెను.

తోడనే, ఆతడు మరియామహలునకు బోయి తన రాకకై నిరీక్షించుచుండిన తన పరివారజనంబును గాంచి, తమ సామగ్రినంతయు బదిలముగ బట్టుకొని తాను పరీక్షించివచ్చిన నూతనప్రదేశమున కేగి అందు బసచేయవలయునని వారికి దెలియబఱచెను. రఘువీరుడచటనే యుండెను. "రఘువీరా! ఈపట్టణమంతయు బరిశోధింతము. వచ్చెదవా?"

రఘు: "రాజా! క్షమింపుము. రాజాలను. నాకింకను నస్వస్థతగానే యున్నది: నేనిపుడు స్నాన మాచరింపవలయును"

కావున అజితసింహుడొక్కడే బయల్వెడలెను. కాని, ఆ నిర్మానుష్యప్రదేశము నందెంత తిరుగాడినను మనుష్య సంచారము కానరాకుండెను. ఒకానొక కాలమున జనసంకీర్ణమై ప్రతిభాశాలియగు నక్బరు పాదుషాకు ప్రేమాస్పదమై యుండిన పట్టణమెట్టి దుర్దశకు బాల్పడినది. ఒంటరిగా దిరుగాడుచుండిన రాజకుమారుడొక సౌధోపరిభాగము నారోహించి చుట్టును బరికింప, నాబయలుప్రదేశ మంతయు నొక యెడారివలెను, మహాసముద్రముపలెను గోచరించెను. దవ్వున నొక కుగ్రామమొండు యుండునటు లాతని నయనేంద్రియమునకు దెలియవచ్చుచుండెను. అచ్చటచ్చట విశాలములగు పొలములును, వాని మధ్యమున చిన్నచిన్న గుట్టమెట్టలనుగూడ నయనగోచర మగు

చుండెను కాని, ఎంత పరిశీలించినను, మనుష్య సంచారము మాత్రము గోచరము కాకుండెను.

రాజసింహుఁడంతట విసిగి వేసారి ధ్యానైకతత్పరుఁడై, నిజనివాసాభిముఖుఁడాయెను. అంత, మార్గమధ్యమున నాతనికి ముదుసలి యగు మౌలానా యొకఁడు సాక్షాత్కరించి, యథోచితముగ దండ ప్రణామంబులాచరించి, "రాజోత్తమా! తమరీ నిర్జన ప్రదేశమున కేతెంచి నందులకీ తమసేవకుఁ డానందపరవశుఁడై యున్నాఁడు."

అజిత: "మీ కెవరు చెప్పిరి?"

"పాదుషావారు ఖానుల కొకజాబు పంపియున్నారు గదా! నాకా సమాచారమును దెలుపుటకై ఖాను తన సేవకుని ఆజాబుతో గూడ నావద్దకు నిన్నటిరేయి బంపియుండెను. మాచేతనగు మర్యాదలచే మిమ్మును గౌరవించుట మా విధి."

అజిత: "మీరిట నొంటిగా నెట్లు జీవించుచున్నారు?"

"ఏమి చేయగలము? దైవాజ్ఞ నతిక్రమింప నేరముగదా"

"ఆర్యా! మీరును, వృద్ధుఁడగు నబ్రూమ్ యనుదప్ప మఱియొకరీ నగరమున నివసించుటలేదని నేనువిశ్వసింతును."

"కాదు, కాదు! మే మిరువురమే కాక, ఖానుయొక్క సేవకులగు మహమ్మదుజానుయునుఁ హామీదాయును గూడ నిందే నివసింతురు."

"మీరు వృద్ధులుగదా! మీకొక్క సేవకుఁడైన నుండవలదా?"

"రాజా! ఫకీరునకు సేవకుఁ డేల?"

"ఆర్యా! క్షమింపుడు మీకుభోజనము నెవ్వ రమర్తురు?"

"రాజా! బాగుగఁ జూడుము: నాయాహారమును దయారు చేసి కొనఁ జాలకుండునంతటి వృద్ధుఁడను గాను. నాకప్పు డపుడు మహమ్మదు వలయు సాహాయ్యము నొనరించుచుండును. మఱియు దయార్ద్రహృదయుఁ డగు సార్వభౌముఁడు నాకు వలయు సామానులను

మాత్ర మాతని యనుమానమును బెంపుజేసెను. 'మరిదూ' బీగము మహాలునందుగూడ నెవ్వరు గానరాకుండినను, ఎవ్వారైన నివసించు జాడలైనను తోపకుండినను, మనుష్యసంచారము లేని కారణమున నా మహాలు ధూళిధూసరంబై యుండుటకు మాఱుగ, పరిశుభ్రముగ నుండుటచే, నందెవ్వరో కావలి యుందురని రఘువీరుడు వితర్కించెను. కాబట్టి తాను పరీక్షించుచుండిన మహాలునందు బసచేసి యాదలి మార్గము నరయవలయునని యాతడు నిశ్చయించెను.

తోడనే, ఆతడు మరిదూమహాలునకు బోయి తన రాకకై నిరీక్షించుచుండిన తన పరివారజనంబును గాంచి, తమ సామగ్రినంతయు బదిలముగ బట్టుకొని తాను పరీక్షించివచ్చిన నూతనప్రదేశమున కేగి అందు బసచేయవలయునని వారికి దెలియబఱచెను. రఘువీరుడచటనే యుండెను. "రఘువీరా! ఈపట్టణమంతయు బరిశోధింతము. వచ్చెదవా?"

రఘు: "రాజా! క్షమింపుము. రాజాలను. నాకింకను నస్వస్థతగానే యున్నది: నేనిపుడు స్నాన మాచరింపవలయును"

కావున అజీజ్‌సింహుడొక్కడే బయల్వెడలెను. కాని, ఆ నిర్మానుష్యప్రదేశము నందెంత తిరుగాడినను మనుష్య సంచారము గానరాకుండెను. ఒకానొక కాలమున జనసంకీర్ణమై ప్రతిభాశాలియగు నక్బరు పాదుషాకు ప్రేమాస్పదమై యుండిన పట్టణమెట్టి దుర్దశకు బాల్పడినది. ఒంటరిగా దిరుగాడుచుండిన రాజకుమారుడొక సౌధోపరిభాగము నారోహించి చుట్టును బరికింప, నాబయలుప్రదేశ మంతయు నొక యెడారివలెను, మహాసముద్రమువలెను గోచరించెను. దవ్వున నొక కుగ్రామమొండు యుండునటు లాతని నయనేంద్రియమునకు దెలియవచ్చుచుండెను. అచ్చటచ్చట విశాలములగు పొలములును, వాని మధ్యమున చిన్నచిన్న గుట్టమెట్టలనుగూడ నయనగోచర మగు

చుండెను కాని, ఎంత పరిశీలించినను, మనుష్య సంచారము మాత్రము గోచరము కాకుండెను.

రాజసింహుఁ డంతట విసిగి వేసారి ధ్యానైక తత్పరుఁడై, నిజనివాసాభిముఖుఁ డాయెను. అంత, మార్గమధ్యమున నాతనికి ముసలియగు మౌలానా యొకఁడు సాక్షాత్కరించి, యథోచితముగ దండ ప్రణామంబులాచరించి, "రాజోత్తమా! తమరీ నిర్జన ప్రదేశమున కేతెంచి నందులకీ తమసేవకుఁ డానందపరవశుఁడై యున్నాఁడు."

అజిత: "మీ కెవరు చెప్పిరి?"

"పాదుషావారు ఖానుల కొకజాబు పంపియున్నారు గదా! నాకా సమాచారమును దెలుపుటకై ఖాను తన సేవకుని ఆజాబుతో గూడ నావద్దకు నిన్నటిరేయి బంపియుండెను. మాచేతనగు మర్యాదలచే మిమ్మును గౌరవించుట మా విధి."

అజిత: "మీరిట నొంటిగా నెట్లు జీవించుచున్నారు?"

"ఏమి చేయగలము? దైవాజ్ఞ నతిక్రమింప నేరముగదా"

"ఆర్యా! మీరును, వృద్ధుఁడగు నమ్రూవ్ యునుదప్ప మఱియొకరీ నగరమున నివసించుటలేదని నేనువిశ్వసింతును."

"కాదు, కాదు! మే మిరువురమే కాక, ఖానుయొక్క సేవకులగు మహమ్మదుజానుయును హమీదాయును గూడ నిందే నివసింతురు."

"మీరు వృద్ధులుగదా! మీకొక్క సేవకుఁడైన నుండవలదా?"

"రాజా! ఫకీరునకు సేవకుఁ డేల?"

"ఆర్యా! క్షమింపుడు మీకుభోజనము నెవ్వ రమర్తురు?"

"రాజా! బాగుగఁ జూడుము: నాయాహారమును దయారు చేసికొనఁ జాలకుండునంతటి వృద్ధుఁడను గాను. నాకప్పు డపుడు మహమ్మదు వలయు సాహాయ్యము నొనరించుచుండును. మఱియు దయార్ద్రహృదయుఁ డగు సార్వభౌముఁడు నాకు వలయు సామానులను

మానమున కొకసారి పంపుచుండును. ఎట్టిలోపములేక, మే మిచట సుఖులమై యున్నారము."

"అహా! మిమ్ము నొక ప్రశ్న నడుగుట కనుజ్ఞ దయచేయుదురా?"

"రాజోత్తమా! సంశయమేల? ఈ తమసేవకుఁడు సంసిద్ధుఁడై యున్నాఁడు."

"మహనీయా! ధన్యోస్మి! మీయౌదార్యము కడుంగడు శ్లాఘనీయము. అల్పజ్ఞుఁడగు నేను—"

"రాజా! నీప్రశ్న యేమి?" రాజకుమారుఁడు మిక్కుటముగ సంకోచించుచు నల్లనల్లన నిట్లు పలికెను. "మహనీయా! ఇయ్యది నిర్జన ప్రదేశము; పెక్కుసంవత్సరముల నుండియు నిందు మనుష్య సంచారము లేదుగదా? నీ విందెన్నఁడైన దయ్యములను గాంచి యుంటివా? లేనియెడల, వాని గుఱించి వినియైన నుందువా!"

ఆ ఫకీరుతోడనే యాశ్చర్యమగ్నమానసుండై చూచి కొంత తడవాగి యిట్లనెను. "దయ్యములా! అదియేమి? దయ్యముల గుఱించిగాని, పిశాచముల గుఱించిగాని నే నిచట నెన్నఁడు విని యెఱుంగను. మీ రేమైనా గాంచియుంటిరా?"

అజిత: "నిన్నటిరేయి మేము మరియాబీగము మహలులో విడిసి యుంటిమి—పాదుషావా రట్లాజ్ఞాపించియుండిరి."

"అట్లు వా రేల యాజ్ఞాపించవలయును?"

"నాకెట్లు తెలియును? పాదుషావారు వేఱువిధముగ నాజ్ఞాపించువఱకు నే నామందిరముననే యుండవలయును."

"కాని, ఈ నిర్జన ప్రదేశమునకు పాదుషావారు మిమ్మేల పంపవలయు? సర్వసంగపరిత్యాగ మొనరించు మాబోంట్లకును, వయసు మీరినవాఁడగు ఖానునకును మాత్ర మీ యరణ్యప్రదేశము తగును. ఇట్టి ప్రదేశమునకు మిమ్మేల పంపియుండిరో గ్రాహ్యము కాకున్నది."

" అణుమాత్రమైనను నాకుగూడ దెలియకున్నది."

" కేవలము పాదుషావారి విలాసమై యుండవలయు. కాని, రాజా! దయ్యముల గుఱించి మీరేమనెదరు ?"

" మిక్కిలి ధైర్యవంతుఁ డగు నా సరదారుఁ డొకఁడు భోజనానంతరము శయ్యపై వ్రాలి నిద్రించుసమయమున నతి భయంకర ప్రదర్శన మాతనికి గోచర మగుటచే నాతఁడు భయభ్రాంతుఁడై దిగ్గున మేల్కాంచెను. ఆతఁ డట్లు కలగాంచి యుండునని నేను భావింతును."

మిక్కిలి యాతురముగా ఫకీ రిట్లు పలికెను :-

" నిశ్చయముగఁ గలదే. నే నిందు డెబ్బదియేండ్లనుండియు నివసించి యున్నాఁడను గాని, ఇట్టి వైపరీత్యము నే నెన్నఁడు గాంచి యెఱుంగను. కాని, రాజా! ఎవ్వడో యొక పిఱికిపంద యకారణముగ నులికిపడినంత మాత్రమున నీ ప్రదేశమును వీడెదవా యేమి?" పౌరుషవంతుఁడగు రసపుత్రవీరుని మనమున నాఫకీరుని పలుకులు ములుకుల వలె నాటికొనెను. అజితసింహుఁడు కొంతకాలము నిరుత్తరుఁడై సిలుచుండి యుండెను. ఆతని వదన మెఱ్ఱబాఱ, నాతఁడిట్లు బదులిడెను :-

" నేనీ విషయమై యింకను నేమియు నిశ్చయింపలేను."

ఫకీరు: కాలాతీతమగుచున్నది. మిమ్మును చాలాకాలము నిలిపి వైచితిని. మనము మఱల కలిసికొనఁగలమని విశ్వసింతును."

అజిత: " అవశ్యము."

యథోచితముగ నొండొరులు శెలవుగైకొని వేఱ్వేఱు మార్గముల వెడలిరి. స్ఫటికశిలానిర్మితమగు సలీముఫకీరుయొక్క గోరీకి సమీపముగ నుండిన కుటీరమునకా ఫకీరు పోవుచుండుట రాజపుత్రుఁడు కనిపెట్టెను. ఆతఁడు నిజగృహాభిముఖుఁడై యిట్లు చింతింపదొడంగెను. " ఈఫకీరు టక్కరివలె దోచుటలేదు. నిక్కముగ నీతఁడు ఐహికవిషయములఁ బూర్తిగ విసర్జించి ధృవముగు మోక్షమునపేక్షించి, కేవలము

భగవద్ధ్యానైకతత్పరుఁడై యుండు తత్త్వవేత్తయై యుండనోపు. ఈప్రదేశమునందలి రహస్యాద్భుతవిషయము లీసాధుజనునకు దెలిసి యుండవు. టక్కరియగు సలబతుఖానుయొక్క చర్యలుకూడ నిమ్మహానీయునకుఁ దెలిసియుండవు. ఈప్రదేశమునం దెవ్వరైన దాగియున్నను ఈఫకీ రావిషయము నెఱింగియుండఁడు."

అట్లు చింతించుచు, అజితసింగు రమ్యమగు మసీదు బ్రవేశించెను. తొల్లి దేశదేశమునందలి జనుల నాకర్షించుచుండిన యా దివ్యభవన మీసమయమున నా బక్క ఫకీరు కొక్కనికే నివాసస్థలమై యుండెను. మహమ్మదీయులు సకాలమున గుంపులు గుంపులుగా నేతెంచుచు, నావేశపరులై యెలుగెత్తి తమ దైవము నారాధించు నాపుణ్యప్రదేశమున కా ఫకీరు తప్ప మఱియొక రేతెంచుటలేదు. అట్టి వ్యత్యాసమును గమనించుచు నజితసింహుఁడు సింహద్వారము డాసెను. శిలానిర్మితమై, సోపానపరంపరావృతమై, అత్యున్నతమై మహాగంభీరాకృతి దాల్చియుండిన యాద్వారము రాజపుత్రునకు విస్మయము కలిగించెను. ప్రతాపవంతుఁడగు నక్బరుపాదుషా తన మహావిజయములకు సాక్షీభూతముగ నాద్వారమును నిర్మించి యుండెను. "కాని, పాదుషా నిజముగ బేలయనుటకు సందియము లేదు. ఈ భవన నిర్మాణమునకై వెచ్చించిన ధన మంతయు నిరర్థకమాయెగదా. పాదుషా యీపాటి గుర్తింపఁజాలకపోయెనే!"

అని తలపోయుచు నాలోచనాపరుడై యుండిన అజితసింహుఁడు హఠాత్తుగా నులికిపడెను. కారణ మేమైయుండును? ఆనిర్జనప్రదేశమును వీక్షించుచు నాలోచనాపరుఁడై యుండిన రాజకుమారునకు దైవాంగనల మృదుమధురగానము హఠాత్తుగ వినవచ్చెను. గానారవ మతిమనోహరముగ నుండుటచేతను, ఆశూన్యప్రదేశమున ఖాను మొదలగు వృద్ధులు తప్ప వేఱొకరు కానరాకుండుటచేతను, నయ్యది దైవాం

గనల కంఠస్వరమే మోయని రాజపుత్రుఁడు భ్రమించెను. “ఈ శూన్య ప్రదేశమున దాము తప్ప యింకొకరు లేరని ఖాను చెప్పెనుగదా. కాని ఆతని వచనము లసంబద్ధములనుట తథ్యము. ఆతఁడు టక్కరి యనియు వేషధారి యనియును గ్రహించియే యుంటిని. కాని, కేవలము పరమ హంసవలె నుండిన ఫకీరుకూడ మోసము చేయునా? కాని, నన్నాతఁ డేల మోసపుచ్చవలయును? ఆతనికిఁ గలుగు లాభ మేమి?”

అని యోచించుచు, ఆమృదుమధురగానారవమేదిశనుండి యే తెంచు చుండెనో యరయుటకై నల్దిశల నిక్కి పరికించి కృతకృత్యుఁడై యజిత సింగు సింహద్వారము నతిక్రమించి బాహ్యప్రదేశమున కేతెంచి మఱల బరికింప, సమీపమున నొక బావి గోచరమాయెను. అట నుండియే రాల్గరగించు మృదుమధురగానము బయల్వెడలుచుండెను. ఎవ్వరో పిల్లనగ్రోవితో సరిగా మేళగించి పాడుచుండినట్లు గూడ నాతనికిఁ దెలియవచ్చెను.

అజితసింహుఁ డాదెస బోయెను. నూతిచెంత నుండిన వేదికపై నిరువురు పురుషులు సుఖాసీనులై యుండిరి. వారిలో నొకఁడు సన్యాసి వేషధారియై యుండెను. ఆతని హస్తముల నొక సారంగు యుండెను. ఆతని ప్రాయ మిరువదియైదేండ్లు మీరి యుండదు. ఆతఁడు ధరించిన కాషాయివస్త్రము లాతని సహజసౌందర్యమున కొక వింతసోయగము నొసంగుచుండెను. ఆతని లేఁబ్రాయ మును మన్మథుని ధిక్కరించు మనోహరాకారమును రాజపుత్రునకు మిక్కిలి యాశ్చర్యము గలిగించెను. ఆవింతసన్యాసి చెంత కొంచెము వయసు మీఱిన పురుషుఁ డొకడు వంట చేయుచుండెను. ఆతఁడా సన్యాసి శిష్యుఁడై యుండును.

# ౧౧

## పడుచు సన్యాసి

తన గానకళా ప్రభావముచే నజితసింహునకు గర్వ పర్వమొనరించిన సన్యాసి, రాజపుత్రుఁడు సమీపించినంతనే, గానము నాపి సారంగు నటుంచెను. సమీపించిన రాజపుత్రుఁడు తోడనే సవినయముగ నమస్కరించి "నాకారణమున మీకు భంగము కలిగినచో, మహనీయా! క్షమింపుడు"

మోమున జిరునవ్వు తోప సన్యాసి యిట్లు బదులిడెను. "ఇందు భంగమున కేమున్నది? అభ్యంతరము లేనిచో నాపాటను మఱల ప్రారంభింతును"

అజితసింహుఁడు బదులాడుటకైన నవకాశ మొసంగక, సారంగు సవరించి సన్యాసి పాడఁగడంగెను. ఆదివ్యగానామృతము వీనుల సోకినంతనే రసపుత్రవీరుఁడు కేవలము పరవశుడాయెను. ఆతఁడు వినుచుండిన గీతము భావగర్భితమై యుండెను. ఐహికవిషయములన్నియు బుద్బుదప్రాయములని తెలుపుచు, పరమాత్ముని గుణముల నాగీత మభివర్ణించుచుండెను. అందలి భావము, సన్యాసియొక్క గాత్రవైభవమును కేవలము వర్ణనాతీతములై యుండెను. సంతోషపారవశ్యమున నారాజకుమారుఁడు చేష్టలుడిగి చూచుచుండెను. రాజపుతానా నివాసియగు నారసపుత్రవీరుఁడు గానవిద్యావిశారదుల నెఱుంగనివాఁడు కాఁడు. దిగ్విజయము లొనరించిన రసపుత్ర విద్వాంసులప్రభావము నాతఁడెఱింగి యుండెను. కాని, ఇట్టి మధురగానమును మాత్ర మాతఁడెన్నఁడు వినియుండలేదు. తన కింతటి పారవశ్యము గలిగించు దివ్యగానమాతని కిప్పుడే పరిచయమాయెను. ఆ సన్యాసి గానము చేయునంతకాలము, నాగస్వరము నాలించు ఫణిరాజువలె, నాతఁడు

వేఱువిచారమెఱుంగక నైమఱచి యుండెను. ఆ గీతము ముగిసిన పిమ్మట నాసన్న్యాసి యిట్లనెను: "రాజా! అజితశింహాఖ్యా ఇంతకంటె మీకు శ్రమ కలిగింపరాదు."

తన నామ మాపరివ్రాజకుండెఱింగినందుల కెంతయు నాశ్చర్యస్వాంతుండై రాజకుమారుడిట్లు ప్రశ్నించెను. "మీరు నన్నెట్లు యెఱింగిరి?"

"సుప్రసిద్ధమగు నంబరు వంశకలశోదధి పూర్ణశశాంకుఁడగు నజితసింహు లెఱుంగనివారెవరు?" అని, మందహాసమొనరించుచు సన్న్యాసి పలికెను.

"మిమ్ము నే నెన్నఁడు జూచి యెఱుంగను."

"రాజా! భోగభాగ్య మహిమోజ్వల రాజ్యరమావిలాసులగు రాజకుమారులు దారిద్ర్యపీడితులగు మాబోటి పరివ్రాజకులను జూతురా? చూచినను మఱువకుందురా?

"ఆర్యా! మీరిట్లు పరిహసించుట న్యాయముకాదు."

"నేను పరిహసించుట లేదు. ఆగ్రానగరము మొదలు సిక్రీనగరము వఱకునుండు గ్రామస్థు లెల్లరకు నీరాక తెలిసియుండ, నాకేల తెలియరాదు? అజితసింగు రాజకార్యధురంధరుండై యేతెంచెనని లోకము కోడియై కూయుచున్నది. కాఁబట్టి, నిన్ను గాంచినంతనే నీవే యజితసింహుఁడవై యుందువని మాకు స్ఫురించు టొక వింతయా? మఱియు, జ్యోతిశాస్త్రమునందు నాకుఁ గొంత ప్రవేశము కలదు."

"ఆర్యా! మిమ్ము కొంత ప్రశ్నింపవలసియున్నది. దయయుంచి సెల వొసంగెదరా?"

అంత నా సన్న్యాసి నిగూఢముగాఁ దన యనుచరునివంకజూచి, "భోజనము సిద్ధమైనదా; ఇంక నెంత కాలమగును" అని యడిగెను.

అట వంటకము లొనరించుచుండిన వాఁడు సన్న్యాసి శిష్యుఁడు. అతఁడు దిగఁగాలుచుండిన కట్టెల నెగఁద్రోయుచు, పాయ్యనావరించి

యుండిన ధూమపటలమును శక్తిశాలిందిని నూచుచు "రెండు గంటలగునేమో" యని బదులిడెను.

అజితసింహుఁడేలకో విస్మయ వివశుఁడై మోము చిట్లించుకొని యిట్లనెను—"అయ్యా! మీరు బంగాళాదేశస్థులా?"

తన చక్కని వదనమున జిరునగవు చెంగలింప, సన్న్యాసి యిట్లు బదులిడెను—"సర్వసంగపరిత్యాగుల మగు మాబోటి పరివ్రాజికులకు నొక జాతియు నొకమతమును నుండవను విషయము మీకు దెలియనిదికాదు. నా శిష్యుఁడు మాత్రము బంగాళీవంశజుఁడే యని చెప్పఁగలను. వీనిపేరు బెహారీచారన్.

"ఆర్యా! ఒక్క విషయము నడిగెద, క్షమింపుడు. ఇట్టి చిఱుత ప్రాయమున తమ రైహికవిషయములను త్యజించి కఠినమగు సన్న్యాసము నేల స్వీకరించితిరి?"

సన్న్యాసి మోమున నొక చిఱునగ వుదయించెను. "నాప్రాయము మీ రెఱుంగుదురా?"

"ఇరువదేండ్లకు మీఱియుండదు: బహుశః, అంతకును మిక్కిలి తక్కువగనే యుండనోపు." సన్న్యాసి నిరుత్తరుఁడై యుండెను. ఆతని ముఖమండలమున జిరునగవు మాత్రము తూగాడుచునే యుండెను. ఆజితసింహుఁడు మఱల నిట్లనెను: "సన్న్యాసులలో నిట్టి లేఁబ్రాయము నెన్నఁడు జూచి యెఱుంగను." సన్న్యాసి యట్టె మిన్నకుండెను. అజితసింగు మఱల నిట్లనెను: "జగదాదర్శమగు నిట్టి మనోహరాకారము గూడ నే నెన్నఁడు జూచి యెఱుంగను."

"ఓయీ, రాజకుమారా! తుదకు నీవు మన్మథావేశమున నన్ను మోహింతువా యేమి? ఏను మోహనాంగిని గానని నీ వెఱుంగవో!"

తోడనే, అజితసింహుఁడు లజ్జపడి, విషణ్ణవదనుఁడై, మోము వంచికొని నిరుత్తరుఁడై యుండెను. సహస్రాక్షునైన సరకుజేయని

సాహసవంతుని కాదైన్యమేమి! మృత్యుదేవతనైనను ముఖాముఖి వీక్షించు నాపోటు మానిసి, సర్వసంగపరిత్యాగి యగు నొక సన్న్యాసి సాధు వదనమును వీక్షింపఁజాలడాయెనే. అమ్మహావీరుఁడు మూడు సారులు ప్రయత్నించి విఫలమనోరథుఁడై చిన్నబోయెను. సాధుశీలుఁడగు నాబాలతాపసి మృదుమధుర మార్దవమే, పరాక్రమోజ్జ్వలుండగు నారసపుత్రవీరునకు దుర్భరముగ నుండెను.

అజితసింహుఁడట్లు తొట్రిలుచుండ, నా సన్న్యాసి యిట్లనెను :

"వంటకములు తయారగుటకు జాలకాలమగునని నా శిష్యుఁడు చెప్పియుండెగదా, కావున నోరాజా! ఈలోపున దమ కెద్దియైన పరిచర్యయోఁ జేయఁగలనేని, సంసిద్ధుడనై యున్నాఁడ.

నవమోహనాకారుఁడగు నా బాలతాపసికి జ్యోతిషజ్ఞానము కూడ గలదను విషయ మా రాజకుమారునకు తోడనే జ్ఞప్తికి వచ్చెను. అంత నాతని పారవశ్యము ద్విగుణీకృతమాయెను. అనుభవజ్ఞులగు శాస్త్రజ్ఞులకే నగమ్యముగ నుండు దైవవిద్య యీబాలునకెట్లు లవడును? "కాని, ఒక్క ప్రశ్నచే నీతని జ్ఞానాజ్ఞానములు వెల్లడికాఁగలవు. నిన్నటి నడిరేయి నాకు గోచరించిన భయంకర ప్రదర్శనము నన్ను కలంకరు గదా. ఆవిషయమై ప్రశ్నించినచో నీతని దర్పము దృశ్యమగును. ఈతఁడు వేషధారియైనచో నీతని కాపట్యము బయల్పడకమానదు." అని, యజితసింహుఁ డాలోచనాపరుఁడై యుండ, సన్న్యాసి యిట్లు నిరోధించెను, "రాజా! నీవేమాలోచించుచుంటివి?"

"నీ వీప్రదేశమునకు రాఁగతంబెద్ది?"

"ఏను సన్న్యాసినిగదా. మాకు సమస్తప్రదేశములు సమానములు. ప్రకృతము నేను బృందావనమునుండి యేతెంచుచు, తియ్యని పానీయము లిచట లభించునని దెలిసికొని కొంతసేపిట విశ్రమించి వింధ్యాదరగింపవలయునని యెంచి యిట నిలచితిని?"

"ఇటనుం డెట కేగెదరు ?"

"సన్యాసుల కొక తావుండదని వచించియుంటిగదా. భోజనానంతర మెటుబోయిన నటుపోదును."

"మీ రిచటి కేతెంచి యెంతకాలమైనది ?"

"ఇప్పుడిపుడే వచ్చియుంటిని ;—మీ రిట విడిసియుండిరని, నే నాగ్రా నగరమునుండి వచ్చునపుడు వింటిని."

"మార్గాయాసముచేత మున్నే కడు డస్సియుండు మీకీ బహిరంగ ప్రదేశము దుస్సహముగ నుండుగాన లోనికి దయచేయరాదా ?"

"సన్యాసులము ! కష్టసుఖములు మాకొక లెక్కయా ? రాజా ! కార్యమునకుం గడంగుదము. మీ రరయఁగోరు విషయ మెయ్యది ?"

అజితసింహుఁడు తడబడుచు నల్లన నిట్లనెను: "నిన్నటి రేయి నాకేమైన సంభవించియుండెనేమో దయయుంచి వచింపుము ?"

అంత నా తపస్వి మెల్లగ నగుచు, రాజకుమారుని హస్తమును దన కోమలకరపల్లవమునఁ బట్టి, అరచేతియందలి రేఖలను బరీక్షింప నారంభించెను. ఆతపస్వి తాకినంతనే దేహమున విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లు రాజకుమారుడు పులకాంకితశరీరుఁ డాయెను. ఆదివ్య సౌందర్యము ఆ కోమల కరస్పర్శన సౌఖ్యమును రాజకుమారునకు విస్మయము కలిగించెను. కోమలాంగి కరముకంటె గోమలమైయున్న కరస్పర్శ జనితా సౌఖ్యమును జవిజూచినంతనే యీ తపసి నిక్కముగ పురుషుఁడై యుండునా యని రాజకుమారుఁడు సంశయించెను.

సన్యాసి పరీక్ష ముగిసెను. తోడనే రాజకుమారుని హస్తము నాతఁడు వదలివైచి యిట్లనెను.

"రాజా చక్కగ లెక్కించినాడ ; కాని, రాత్రి వృత్తాంతము నిజముగ నీవరయఁ గోరెదవా ?"

అని ప్రశ్నించి, మానసమున నెద్దియో తీవ్రముగ లెక్కించువాని

వలె గొంతకాల మభినయించి, ఆ తాపసి మెల్లగ నిట్లనెను. "రాత్రి నీకు బీగము మహాలు దృశ్య మొకటి ప్రదర్శనమై యుండెను."

ఆమాట లా సన్యాసి నోటినుండి వెలువడినంతనే అజితసింహుఁడు నిర్ఘాంతపడెను. ఆతని యొడలంతయు నొక్కసారి కంపించెను. ఏమి ఆడింభకుని జ్యోతిశ్శాస్త్ర ప్రభావము? అగమ్యమగు నిమ్మహాశాస్త్రము నిజముగ నింతసులభగ్రాహ్యమా యెనా? అట్లు కాదేని, ఒరులెఱుంగని మర్మము నీబాలతాపసి కెట్లు తెలియఁగలదు? కాని, ఒక సంశయము కలుగుచున్నది. తాపసిరూపము ధరించిన యీ యువకుఁడు నిన్నటి భయంకర ప్రదర్శనమునఁ బాల్గొని యుండునా? ఆ వృత్తాంతము నంతయు సమగ్రముగ నెఱింగియు నొరులెఱుంగకుండుటకై యీవింత పూరుషుఁడీవేషమును ధరించియుండునా? కాదేని, ఈతఁడా వృత్తాంతము నింత విస్పష్టముగ నెట్లుచెప్పగలఁడు? అని విచారించుచు, ప్రమాన్పడి, అజితసింహుఁడా సన్యాసివంక నట్టె వీక్షింపఁ గడంగెను.

ఆ తాపసి సహజమగు చిరునగవును ధరించి యిట్లు పలికెను. "నేను లెక్కించి పలికిన పలుకులకు నీవు కేవలము నివ్వెరపడు చున్నావు. జ్యోతిషము వట్టి బూటకమని భావింతువా యేమి?"

"కాదు! కాదు. నేనట్లు భావించుటలేదు. నీవు చెప్పినమట్టుకు నీలెక్క సరిగానే యున్నది. ఆ ప్రదర్శనమునందలి వివరములనుగూడ దయచేసి చెప్పుము."

"రాజా! వివరములనుగూడ వర్ణింపగలను. కాని, కొంతకాలమగును. కొంత శ్రమయగును. ఈస్వల్పకాలములో లెక్కించి గ్రహించిన విషయములను దెల్పెద వినుము. సార్వభౌముని బీగము మహాలునందు నీవు మొదట కడు రమ్యమగు దృశ్యమును గాంచియుంటివి. అనంతర మతి భయంకరమగు హత్యను గాంచియుంటివి. రాజా, నిజమేగదా?"

"కాదనజాలను"

"మఱియొకవిషయమున జెప్పెద నాలింపుము. అంతకంటె దారుణ మగుప్రదర్శనమును నీయనుచరుఁడు గాంచి యుండెను."

తోడనే, వర్ణనాతీతమగు నాశ్చర్యమును దెలుపు కంఠస్వరముతో నజితసింహుఁడిట్లనెను. "అత్యద్భుతమగు నీప్రభావము నాకాశ్చర్యము కలిగించుచున్నది."

"రాజా! పరమాత్ముని కృపచే నాకీదైవవిద్య కొంతయలవడినది. కానినాకు తెలియున దేపాటి" అని మందహాసమొనరించుచు నాతాపసి బదులిడెను.

"కేవలము వినయంబు కతన నీవట్లంటివి. నీశక్తి సామాన్యమే? నిన్నటి వృత్తాంతము మిథ్య కాదనియు నిశ్చయముగ నిక్కువమని యును నెఱుంగ నగునుకదా?"

సన్యాసి మోమున మఱల జిరునగవు చెంగలింప, యిట్లు బదు లిడెను. "నీప్రశ్నకు సరియగు సమాధాన మొసగుట కష్టము; చాల లెక్కింపవలసి యున్నది, కావున చాలకాల మగును. నీవు నాభోజనా నంతరము దయ చేయుదువేని యవకాశముగ నుండును."

"ఆ కారణమున నెద్దియైన బ్రమాదము సంభవింపవచ్చునా?"

ఆ తాపసి ముద్దుమోమున నేలకో కోపస్ఫూర్తి దీపించెను. ఏకారణముచేతనో యాతఁడు కలవరపడినట్లుగూడ వ్యక్తమాయెను. అంత నాతఁడు మెల్లన నిట్లనెను: "నాకు దెలియునంతమట్టుకు జెప్పెదవినుము. ఉపద్రవము వెంటనే సంభవింప వచ్చును"

"ఆర్యా, అట్లైన తరుణోపాయము ననుగ్రహింపుము."

"నా హితోపదేశము నాలింతువా? నీ విప్రదేశమును తక్షణము వీడుటయే శ్రేయస్కరము. 'ఆలస్యం అమృతం విషం' యను నార్యోక్తి ఈవిషయమున ధ్రువమగునని నాకు స్ఫురించు చున్నది. కాని, ఇట్టి గట్టి విషయములకు సరిగా సమాధాన మొసంగుటకు గొంత యవకాశ

ముండవలయు గదా, కావున, నీవు కొంత తడవు విశ్రమించి మగుడ నరుదెంతువేని, లెస్సగ యోచించి చెప్పఁగలను. ఓ రాజా ! వంటకములు తయారైనటు లున్నవి. సెల వొసంగుము. ”

“ మీ భోజనము ముగియువరకు నే నిందె వేచి యుండెద—”

ఇంక నెద్దియో చెప్పఁబోవుచుండిన అజితసింహుని మిక్కిలి యాతురముతో వారించి, సన్యాసి యిట్లనెను. “ నృపవతంసమా ! క్షమియింపుము. ఒరులుచూచుచుండ భుజించుట మా యాచారముకాదు. ”

రాజకుమారుఁడు సిగ్గుపడి యిట్లనెను :

“ తాపసోత్తమా ! క్షమియింపుడు. భోజనానంతరమే మిమ్ము దర్శింతును. పొద్దుగ్రుంకువఱకు మీరిచట విశ్రమింతురని విశ్వసింతును. ”

“ నిజము. ఖరకరుఁడుపరిణతకిరణుఁడగువఱకు నీప్రదేశమునఁబ్రయాణ మొనరించుటకు వీలుండదు. ”

అని పలికిన పరివ్రాజకుఁడు తోడనే తనచేయి చాచి, వీపున వ్రేలాడుచుండిన పెద్దసొరకాయిని దీసి రాజకుమారున కందించుచు నిట్లనెను. “క్షత్రియోత్తమా! మోక్షాపేక్షచే సర్వసంగపరిత్యాగ మొనరించిన యీభక్తుఁడొసంగు నీయల్పోపాయనమును బరిగ్రహింతువా ?”

అజితసింహుఁడా సొరకాయను సవినయముగా నందుకొనెను. ఆ ముహూర్తమున వారిరువురి కరములును చుంబించెను. తోడనే, ఒక విధమగు విద్యుచ్ఛక్తి ప్రసవించి రాజపుత్రుని రక్తనాళములందెల్లెడల బ్రవహించెను. ఆతనిసర్వాంగములు నొక్కసారి కంపించెను. దేహము గగుర్పొడిచెను : హృదయగమనము ద్విగుణీకృతమాయెను. ఆతఁడాశ్చర్యస్వాంతుఁడై డిల్లపడి ఎదుటనుండిన దివ్యసుందర విగ్రహమును ననిమిషుఁడై వీక్షింపదొడంగెను. ఇంతవరకును డోలాయమానమానసుఁడై యుండిన ఆ రాకుమారుఁడు కొంతకాలము శూన్యమనస్కుఁడాయెను. అట్టి విపరీతావస్థఁ దగుల్కొనిన యజితసింహుఁడు చెదరిన హృద

యము నెట్టకేలకుఁ జేకొదీసి, తన యవ్యక్త ప్రవర్తనమున కెంతయు లజ్జించి, మోము వాల్చికొని మాఱుపలకక నిష్క్రమించెను.

## ౧౨
### సిక్రీనగరము

అజితసింహుఁడు సిక్రీనగరమున కేతెంచిన పిమ్మట నయనప్రదర్శనమైన యద్భుతవిషయములను దలంచుకొలది ఆతనికి మతిపోవుచుండెను. ఆతఁడు కష్టసాగర డోలికలలో నూగులాడుచుండెను. తన యెదుటనే యట్టి వింతలాచరించిన సన్యాసిని గడుభద్రముగ గనిపెట్టవలయునని ఆతఁడు తత్తరపడసాగెను. కాని, ఆ వింత సన్యాసిని వెంటనే బంధించుట మర్యాదకాకుండుట కెంతయు నాతఁడు విచారించెను. తాను ముందుకు బోవుచుండినను, ఆతని మనసు మాత్రము సన్యాసి మీదనే లగ్నమై యుండెను. ఆతఁడు వెనుకకు దిరిగి యొకసారి చూడ నాసన్యాసి తన శిష్యుని సమీపించుచుండుట గోచరమాయెను. అజితసింహుడట్లప్పుడప్పుడు వెనుకకు మఱలి చూచుచునేయుండెను. తన కాల్సేతులకు సన్యాసి శుద్ధోదకస్నానము చేసుకొనుచుండెను. ఆతనికి బెహారిచారన్ వలయు నుపచారముల నొనరించుచుండెను.

ఆలోచనాపరుఁడై యుండిన అజితసింహుఁ డపుడు కడు రయమున దన బసకుఁబోయెను. భోజనము శీఘ్రముగ ముగించి సన్యాసిని డాయ వలయునని యాతఁడు తత్తరపడుచుండెను. సముద్రతరంగముల వలె నాతని మనమున వేనవేలు ప్రశ్న లుదయించి కలగింప నారంభించెను. “ ఈ యువకుఁడు సన్యాసికానేల ? రూపురేఖావిలాసములను వీక్షింప నీతఁడు సద్వంశసంజాతుఁడని చెప్పకయే తెలియుచున్నది. ఆ నవయవ్వనము, ఆమనోహరాకారము సన్యాసమునకు కేవలము విరుద్ధములై యున్నవి. ఆనవ్వులొలుకు ముద్దుమోమును గాంచుకొలది

ఆతఁడొక వనితారత్నమై యుండునా యను సంశయ ముదయించుచు నుండెనేగదా! ఆయనుమాన మజితసింహుని హృదయమున గాఢముగ నాటుకొనియుండెను. ఆత డెంత ప్రయత్నించినను నాతని హృదయము నాశ్రయించిన సందియము వీడకుండెను. ఆసుందరాకారుని కోమల కరస్పర్శనముచే జనించిన వింతయానందము మఱపునకు రాకుండెను. ఆతని జోస్యముకూడ, తలంచుకొలఁది, విస్మయము కలిగించుచుండెను. అజితసింహుఁడిట్లు యోచించుచు, వితర్కించుచు, నాశ్చర్యమగ్నచూన సుండగుచు, "ఆతఁడు యోగియగుటచే యోగధ్యానవశమున నిట్టిదైవ విద్య యాతని యధీనమైయుండును" అని సమాధాన పఱచికొనెను.

ఈవింతసన్యాసి వృత్తాంతమును రఘువీరున కెఱింగింతునాయని అజిత సింహుఁడు యోచింప దొడంగెను. తుదకాతఁడు సన్యాసియుదంతమును రఘువీరునకప్పుడే యెఱింగింపరాదనియు, ఎఱింగించుట క్షేమకరము కాదనియు నిశ్చయించుకొనెను.

అజితసింహుఁడొక చిన్నసందులో ప్రయాణమొనరించుచుండెను. ఆవీధిలో నిరువైపులనుండు గృహము లన్నియు బాడుపడి యుండెను. అవన్నియు శిథిలములై జనశూన్యములై యుండెను. కడునిశ్శబ్దముగ నుండిన ఆప్రదేశమున నాతని యడుగుల చప్పుడు మాత్రమే వినబడు చుండెను, సూర్యకిరణజాలములందు నృత్యము చేయు నిసుక రేణు వుల వలె నాతని డెందమున తాండవ మాడుచుండిన ఆతని యాలో చనలే యాతని సహకారులై యుండెను. అట్టి సమయమున హఠాత్తుగ గగనమునుండి పలుకులు వెలువడి ఆతని వీనులంబడెను. "ఓయి రాజా! ప్రాణములపై తీపు కలదేని, నీవీప్రదేశమునుండి వెంటనేనిష్క్ర మింపుము." ఆపలుకులు వినినంతనే అజితసింహుఁడులికిపడి ఆకసము వంక నొక్కసారి తిలకించెను. కానిఁ ఆకసమున నేముండును? మహా సముద్రమధ్యమునఁబడు దౌర్భాగ్యునివలె, రాజపుత్రునకు గాల్సేతు

లాడకుండెను. పళ్ళెరమున బోయుపాదరసము వలె నాతని మనసు పరి పరివిధముల పోసాగెను. తన కిటునటు నుండు గృహపంక్తుల యందెవ్వ రైనను నక్కియుండు రేమోయని భ్రమించి, ఎంత శోధించినను వ్యర్థ ముగ నుండెను.

"నేను భ్రమించితినాయేమి? ఛీ! భ్రమయెట్లగు?" అజిశసింహుఁడా పలుకులువిస్పష్టముగ విని యుండెను. కలకంఠి కలస్వనమువలె నుండిన ఆకంఠధ్వని యింకను నాతని శ్రవణకుహరముల బ్రతిధ్వనించుచునే యుండెను. అందంతయు వట్టి భ్రమయేయగునని, తన యునికి గూడ భ్రమయే కావలయును.

ఆధ్వని మఱల వినవగునేమో యని ఆతఁడు సర్వాంగములను బిగ బట్టి, ఉచ్ఛ్వాస నిస్వాసములను గూడ నిరోధించి నిక్కివినఁజొచ్చెను. కాని, ఆతఁడు భగ్నమనోరథుఁడాయెను. అంత నాతఁ డుద్రేకపూరి తుఁడై యెలుగెత్తి యఱచుచు సంబోధింపఁగడంగెను.—"ఎవ రక్కడ? నాతో మాట్లాడగోరెవరా? ఏల దయచేయరు."

శిథిలగృహావృతమైన యాప్రదేశమున నలుదెసలనుండి ఆతని కంఠ ధ్వనియే మఱల మఱల ప్రతిధ్వనించు చుండెనుగాని, ఏవ్యక్తియు గాన రాకుండెను.—"ఈ ప్రదేశమున నెవ్వరో తప్పక దాగియుందురు. ఇవ్వని తలమున వనితలు గూడ నుండవలయు. నేనిక నుపేక్షింపరాదు."

అని, యోచించి, తల పంకించి, మఱల నాతఁ డాలోచనాపరుఁడై యుండ, నాకస్మికముగ నాతని మనో నయనమునకు ఆ వింతతాపసి దివ్యసుందరవిగ్రహము గోచరమాయెను. "అహా! నేనెంత మూఢుఁడను! ఈ పాడునగరమున నిక్కముగ నెవ్వరో దాగి యున్నారు. ఎవ్వరో, నా వెనువెంటనే దిరుగాడుచు, నన్ను వంచింను చున్నారు భయభ్రాంతుఁడనై, ఆశ్చర్య పరవశుఁడనై, ఆలోచనాపరుఁడనై, కొంతకాల మిచట దడయుదునని గుర్తించియే, ఇట్టి భయానక వాక్య

ముల నెవ్వరో నిగూఢముగ నిట్లు పలికియుందురు. కాని, వారి యభి ప్రాయ మేమై యుండునో! ఏమీ! ఆసన్యాసిసహితము మోనగాఁడై యుండునా? హా! దైవమా! ఈ మర్మమును ఛేదింప సమకట్టియున్న నాకుఁ దోఁడ్పడుము. ”

సన్యాసిజాడ నరయఁగోరి, అతి రయమున నాతఁ డాసింహద్వార మును మఱల డాయఁబోయెను. వాయువేగమున నా ద్వారమును సమీపించెను గాని, గురుశిష్యు లిరువురు నగోచర మైరి! పొయ్యి లోని సమిద్ధలు మండుచునే యుండెను. అజితసింహుఁడు దగ్గఱకేగి చూడ, పొయ్యిమీదనుండిన మట్టిపాత్రలో వట్టి నీళ్ళు మాత్రము మఱుగుచుండెను!

సన్యాసి వట్టి మోనగాఁడని అజితసింహున కపుడు స్పష్టమాయెను. తాను మరలినంతనే యా ముచ్చు లిద్దరు పలాయన మొనరించిరని ఆతనికి వ్యక్తమాయెను. ఆ మృణ్మయ పాత్రయందు బియ్య ముడుకు చుండుటకు మాఱుగ, నుదక మొక్కటే గుడగుడ మనుచుండుటచే, నా సన్యాసిమోసము తెల్లమాయెను. వర్ణనాతీతమగు నాశ్చర్యమునకు వశుఁడై, యాతఁ డచేతనుఁ డాయెను. అనంతర మాతఁ డిట్లుచింతించెను:—

“ రాత్రి నేనును రఘువీరుఁడును గాంచిన భయానక ప్రదర్శన ములు కల్లయనియు, భ్రమయనియు ద్రోసివేసినను ద్రోసివేయవచ్చును గాని, ఈ ప్రదేశ మెన్నియో రహస్యములకు రంగస్థలమై యుండుట మాత్రము తథ్యము. ”

అజితసింహుఁడు వికలస్వాంతుఁడై నిజనివాసంబున కేగెను. ఆతని యనుచరు లందఱు భోజన మారగించి, బడలిక దీఱ విశ్రమించు చుండిరి. ఆతని పరిచారకుఁడుమాత్రము తన స్వామి రాకకై నిరీక్షించు చుండెను. రాజపుత్రుని గాంచినంతనే సైనికు లందఱు ససంభ్రమముగ స్వాగత మొసంగి అత్యుత్సాహముతో నిట్లనిరి; “ మహారాజా!

నిన్నటి బసకంటె, ఈ బస మాకెంతయు ననుకూలముగ నున్నది. ఈ ప్రదేశమున నుండునంతకాల మిందే విడిసియుందుమని మా యభిప్రాయము."

డోలాయమాన మానసుఁడై యుండిన రాజపుత్రుని కాపలుకులు వినుపింపలేదు. ఆకారణమున నాతఁడు యథాలాపముగ "సరే" యనెను.

అజితసింహుఁ డపుడు శీఘ్రముగ స్నానమొనరించి, శీఘ్రతరముగ భోజనమొనరించెను. సన్యాసియుదంత మేరికి నెఱింగింపరాదనియాతఁడు మొదట నిశ్చయించికొని యుండెను. కాని, విషయమంతకంతకు తీక్ష్ణాకృతి దాల్చుచుండుటచే, నెవరితోనైన విచారించి, వాని యభిప్రాయము గూడ నరయుట క్షేమకరమని యాతఁడు యోచించెను.

మొగలాయి దర్బారునందు నిరంతరము జరుగుచుండు రహస్యములను కుట్రలను బూర్తిగా నెఱిగినవాఁడు కాకపోయినను అజితసింహుడు వానిని కర్ణాకర్ణి నాలించుచుండెను. నీటిపైనుండు బుగ్గ బ్రతుకెంత శాశ్వతమో, మొగలాయి దర్బారునందలి జనుల యవస్థయు నట్లే యుండెను. ఆదర్బారు అనేక కక్షలకు నాలవాలమై యుండెనని అజితసింహుఁ డెఱింగియుండెను. అధికారము నపేక్షించిన పాక్షికులు పాపపుణ్యములను గణింపక రహస్యముగ హత్యలొనరించుచుండిరి. సామ్రాజ్యాధిపతియగు పాదుషాయొక్క ప్రాణమునకే స్థిరము లేకుండెను పాపము! తన దారాపుత్రాదులను విశ్వసించుటకే యాతని కవకాశము లేకుండెను.

భావాతీతమగు భోగభాగ్యములకు నాలవాలమై విలసిల్లుచుండిన జహాంగీరు నగరు, అతి దారుణమగు రాక్షసకృత్యములకు గూడ రంగస్థలమై యుండెను. ఎవని కెపుడు యెట్టియుపద్రవము ప్రాప్తించునో యరయుటకు నవకాశము లేకుండెను.

అజితసింహుఁడు ప్రసిద్ధమగు నంబరు వంశమున జనించియుండెను. దర్బారునందాతఁ డున్నతపదవి నలంకరించి యుండెను. ఆతఁడు

సాధారణపు రాజపుత్రునివలె గాక, ప్రసిద్ధ పురుషుఁడై యుండిన కారణమున నాతనిపై బెక్కండ్రు అసూయాపరులై యుండిరి. చారిత్రవిఖ్యాతి గాంచిన అంబరు వంశజుఁడగు 'రాజా మాన్సింగు' యొక్క సోదరియే అక్బరు సార్వభౌమునకు మొదటి హైందవ పట్టమహిషియై వన్నె గాంచెను. రాజామాన్సింగుయొక్క మనుమఁడే అజితసింహుఁడు. జహాంగీరును, అతని కుమారుఁడగు, ఖరీమ్యును రసపుత్ర వనితారత్నములకు జనించినవారలే కావున, అజితసింహునకు, జేరువ చుట్టములై యుండిరి. ఈ తెఱంగున నంబరువంశము మొగలాయి దర్బారునందు నత్యున్నత స్థానము నలంకరించియుండెను. ఒకానొక సమయమున రాజా మాన్సింగు అక్బరు పాదుషాకు కుడిభుజమువలె నుండెనుగదా.

కాని, కాల మిపుడు మాఱియుండెను. రాజపుత్ర కన్య లనేకులు మొగలాయిదర్బారున కరుదేర నారంభించిరి. వారి రాక రాజపుత్రుల యందు గలహములకు గారణమాయెను. ప్రతివంశమువారును యధికారము నపేక్షించి, అతిరహస్యముగ గుట్రలు సలుప గడంగిరి. కుట్ర లెచట జరుగుచుండెనో, ఎట్లు జరుగుచుండెనో, ఎవరికిఁ దెలియకుండెను. స్వతంత్రాధికార సమన్వితులై యుండిన రసపుత్రవీరులు క్రమముగా హైన్యావస్థకు దిగుచుండిరి. సుప్రసిద్ధుఁడగు ప్రతాపుని మనుమఁడగు కర్ణాసింగు, ఆగ్రానగరమునందలి మొగలాయి దర్బారునందు వందివలె దిరుగాడుచుండెను. అక్బరుసార్వభౌమునంతటి మహాసీయుని తృణప్రాయముగ జూచిన ప్రతాపుని వంశమునకు రెండు తరములలో నెంతటి కళంకము వాటిల్లెను!

అట్టి విషయములను దలపోయుచుండిన అజితసింహుని హృదయమునొక యనుమాన మావరించెను. తనయౌన్నత్యమును గాంచి సహింపఁజాలని రాజపుత్రులెవరైనను దననుగడ తేర్పఁగడంగి, ఈ పాదుసిక్రీ నగరమున గుట్రలు సలుపుచున్నారేమోయని యాతఁడనుమానింపఁ

గడంగెను. యశోభరితమగు నంబరువంశమును నిర్మూల మొనరించుట కెవ్వరో సంకల్పించి యుందురు. ఆ కారణముననే యజితసింహుఁడు సిక్రీనగరమున నుండవలయునని నియోగింప బడియుండునా! సార్వభౌముని గూడ ననుమానింపవలదా? సర్వము నిగూఢమైన, సర్వము యనుమానాస్పదమై, ప్రమాదభూయిష్ఠమై యుండిన సమయమున, ఎవ్వరిని విశ్వసింపక, అప్రమత్తుఁడై కడుభద్రముగా మెలంగుటయే శ్రేయోదాయకమని అజితసింహుఁడు నిశ్చయించుకొనెను. జరిగినవృత్తాంతమంతయు సవిస్తరముగ రఘువీరుని కెఱింగించి అయ్యనుభవజ్ఞునియభిప్రాయమునరయుటయే క్షేమకరమనియు నాతడు భావించెను.

అజితసింహుఁడు భుజించునంతకాలమా తెఱంగున నాలోచించుచునేయుండెను. ఎట్టులో భోజనము గడుశీఘ్రముగ ముగించి, రఘువీరుఁడుండిన 'దివానీఖాన్' యనుమందిరమున కాతడు పరుగుపరుగునఁబోయెను. ఏద్దియో చదువుకొనుచుండిన రఘువీరుఁడు దిగ్గున లేచి, ఆ సమయమున నరుదెంచిన రాజకుమారుఁడేమి చెప్పునో యని ఆతురభావముతో జూచుచుండెను.

## ౧౩

### చర్చ

రఘువీరునిచెంత నాసీనుఁడై యజితసింహుఁ డిట్లు పలుక దొడంగెను.— “రఘువీరసింహా! నే గాంచిన విషయములను గమనించుకొలది, ఈ శిథిల గృహావృత ప్రదేశమున నెవ్వరో నిక్కముగ దాగియుందు రను యనుమాన మంతకంతకు గాఢ మగుచున్నది. ఇందెవ్వరో నిశ్చయముగ దాగియున్నారు. ఈ విషయము టక్కరియగు ఖానునకు దప్పక తెలిసియుండును” రఘువీరుడు నిరుత్తరుఁడై యుండెను. “నేను మఱికొన్ని విషయముల నరసివచ్చితిని:—మన

కిచ్చటియునికి క్షేమకరము కాదు.''

రఘువీరుఁ డదరిపడి, "ఏమి?" యని యడిగెను. అజితసింహుఁ డంతట తాను గాంచిన యద్భుత విషయములను సవిస్తరముగా రఘువీరున కెఱింగించెను. "రఘువీరా! మనపై నిచట దారుణమగు కుట్ర జరుగుచున్న దనుటకు సందియము లేదు. పిశాచ వ్యవహారము కూడ నందుకు సంబంధించియే యుండును.''

నిరుత్తరుఁడై నిశ్చేష్టితుఁడై వినుచుండిన రఘువీరుఁడు మెల్లన నిట్లనెను—"రాజా! చావులేని దయ్యములతో మన మెట్లుపోరాడ గలము? వరులెవరైనను ఎందరైనను సరె ఈ రసపుత్రవీరుఁడు సరకుఁ జేయఁడని నీ వెఱుంగుదు గదా.''

"రఘువీరా! సందేహమేమి? పౌరుషవంతులగు రసపుత్రవీరులు శత్రుజనులకు వెఱచువారు గారు. కాని, బహిరంగముగ శత్రుసైన్యములను తుత్తునియలొనరింపనగుగాని, గూఢవైరులను బరిమార్చుట కష్టతరము గదా! భయంకరాకారముగల వ్యాఘ్రమును గరవాలముచే దెగ నఱుకనగును గాని, పొంచి తఱిజూచి పైఁబడు విషసర్పము నేమి చేయగలము?

"ఓ క్షత్రియ కులావతంసా! ఏమి నీ యూహలు? ఈ ప్రదేశమున మనము కడతేరవలయు ననియే సార్వభౌముఁడు మనల నిచటకు బంపియుండెనని నీవు భావింతువా యేమి? ఈప్రదేశమున జరుగు నద్భుతాంశములన్నియు పాదుషా వారికి దెలిసియుండునా? ఈవృద్ధుడగు ఉమ్రావ్ మనలను సంహరించుటకే నియోజితుఁడై యుండునా?''

"నే నట్లే విశ్వసింతును.''

"రాజా! నే నట్లు భావింపఁజాలను. నీ తండ్రియగు నంబరు పురాధీశుఁడు సార్వభౌమునకు గుడిభుజమై యొప్పువాఁడు. అట్టివాని కుమారుని గడ తేర్చుట కేల కడంగును?''

"నిజము; కాని, రఘువీరా! సర్వాధికారిణియై స్వైరవిహారమొనరించు నూర్జహానుచేతిలో జహంగీరు పాదుషా కేవలము కీలుబొమ్మవలె నున్నాడని నీవెఱుఁగవా?"

"కాని, రాజకుమారా! నూర్జహానుయొక్క తెలివితేటలు యత్యద్భుతములైనవి. ఆవనితారత్నము యొక్క మేధాశక్తి యద్వితీయమైనది. అట్టి మహారాణి, నీవంశమున కంతరాయము గల్పించి మేటి మొగలాయి సామ్రాజ్య విచ్ఛిత్తిని యభిలషించునా?"

ఐనను, నాకంతయు నగమ్యముగ నున్నది. నీవీవిషయమై లెస్సగ విచారించి మనకిపుడు తరుణోపాయ మెద్దియో నిశ్చయింపుము"

"రాజా! ఇందలి మంచిచెడ్డలను సావకాశముగ నరయుదము తాళుము. ఇందెద్దియో పెద్దరహస్యముండుట మాత్రము తథ్యము"

"ఔను, ఆరహస్యమును భేదించుటయే మనకర్తవ్యము"

"నేను గాంచిన భయానక ప్రదర్శనము మానవకృత్యము కాదని నేను దృఢముగ విశ్వసింతును. ఏమన, అయ్యది మానవకృత్యమగునేని, వారి జాడలేల కానరాకుండును? మఱియు నోరాజా! నీవెఱుంగుదువుగదా మనసైనికులు తక్షణమే, ఆమహాలును సూక్ష్మముగా బరిశోధించిరే. మనుష్యులేగాక, వారి జాడలైనను గానరాలేదే. అందెవరైన నుందురేని, సహస్రాక్షులగు మనసైనికుల కండ్లుగప్పి యంతలో బలాయన మొనరింపఁజాలరు"

"రఘువీరా! అందొక గుప్తద్వారముండరాదా! ఆతుంటరులా తెఱంగున నంతర్ధానమై యుందురు. ఇది నిశ్చయము."

"కాని, మనసైనికులంత పరిశీలనగా శోధించినపుడు ఎట్టిగుప్తద్వారమైనను బయల్పడక పోదు. పోనీ, టక్కరులెవ్వరో తమచాతుర్యమునేయి నన్ను భయకంపితు నొనరించిరే యనుకొందము; కాని, నీవు గాంచిన భయంకరప్రదర్శనము నెట్లు సమర్థింతువు? పాదుషావారి

బీగము మహాలునందు ప్రతిదినము దోచు దృశ్యమే నీకు దృశ్యమై యుండెగదా. ఆ బీగము ఆమె చెలికత్తెలు, ఆ మృతకళేబరముగూడ నొక్కత్రుటిలో యద్భుతముగా నంతర్థానమాయెననియే భావింతువా?"

"అట్లైన నేను కలగంటి ననియు భ్రమించి యుంటిననియు నీ వూహించెదవా, యేమి ?"

"అయ్యా! కలగాదు, భ్రమయుగాదు. ఇయ్యది మానవాతీతకృత్యము పిశాచముల చేష్టలుతప్ప వేరుగాదు. మనకండ్లుగప్పి దయ్యము లేమిచేయఁజాలవు?"

రఘువీరుని మొండితర్కము అజితసింహునకాగ్రహము కలిగించెను. ఐనను, తన యాగ్రహమును లోలోన నడంచికొని, ఆలోచన పూర్వకముగ నిట్లడిగెను. "రఘువీరా! సన్యాసిగుఱించి యేమందువు? గగనమండలమునుండి హెచ్చరించిన ఆకలకంఠ కంఠనినాదమున కేమందువు? ఇదియంతయు భ్రమయని తిరస్కరింతువా?"

"ప్రతాపవంతుఁడా! ఈవిషయమున సరిగా సమాధాన మొసంగుట సాధ్యము కాదు. ఎంత యోచించినను దేటపడకున్నది. ఒక్క విషయమును మాత్రము చెప్పఁగలను. సార్వభౌముఁడు నిన్నీ నిర్జన ప్రదేశమునకు నియోగించుట కెద్దియో భద్రకారణ ముండును. రాజకార్య ధురంధరుఁడవై యేతెంచిన నీవు కృతకృత్యుఁడవైనగాని ఈ ప్రదేశమును వీడరాదు. ప్రాణము పోవు నపాయము వాటిల్లనున్నను సరె, సార్వభౌముఁ డాజ్ఞాపించువఱకు నిందే నిలువవలయు. రసపుత్రులు నియమపాశబద్ధులుగదా?"

తోడనే, అజితసింహుఁడుద్రేకపూరితుఁడై యిట్లు బదులిడెను. "రఘువీరా! నా ధైర్యస్థైర్యంబులు నీవెఱుంగనివి కావుకదా. భయవిహ్వాలుఁడనై యీప్రదేశమును వీడనున్నాఁడనని నీవు శంకింపదగదు. ఇందలి సత్యాన్వేషణమునకై మాత్రమే తత్తరపడుచున్నాఁడను."

“రాజోత్తమా! నేనేగాదు రాజపుత్రాన్వయ మంతయు నీ ధైర్య స్థైర్యములను వేనోళ్ళ నగ్గడించుచున్నది. నా సమయ మాలింపుము: భయంకరములగు పిశాచసహస్రంబులు పరతెంచినను సరె, తత్పిశాచ గణంబులు నాదేహమును ఛేదించి రుధిరపాన మొనరించినను సరె ప్రాణముండునంతకాలము నేను నీయండనే యుండెదను.”

“కాని, ప్రస్తుత కర్తవ్యమేమి?”

“రాజా! విషయము లన్నింటిని బరికించి చింతింప, పాదుషావారు తమపై దారుణమగు గొప్పకుట్ర యతిరహస్యముగ జరుగుచున్నదని యెట్టులో గ్రహించియుందురు. ఆమోసగాం డ్రిందెందో దాగి యున్నారని పాదుషావారు యనుమానించియుందురు. ఆకారణమున, అంబరు వంశజుల ధైర్య సాహసంబులను భక్తి విశ్వాసంబులను నెఱింగినవారగుటచే నిన్నీరహస్య విచ్ఛేదమునకు వారు నియోగించి యుందురు. నా వచనములను విశ్వసింతువేని, నా యీసిద్ధాంతము ననుసరించి నీవు కార్యమునకు గడంగుము.”

“అట్లైన, వృద్ధుడగుఖాను యిందెవ్వరినో గుప్తముగ డాచియుండు నని యేనా నీ యభిప్రాయము?”

“ఔను.”

“ఈ కపట నాటకమునందు స్త్రీలు సహితము పాత్రలై యున్నట్లు తెల్లమగుచున్నదే!”

“నీవృత్తాంతము నాలించిన పిమ్మట నిట్లే పొడకట్టుచున్నది.”

“ఈసన్యాసిగూడ నీ కుట్రలోఁ జేరిన దొంగవలెనే గోచరింపు చున్నాఁడుగా!”

“రాజా! అట్లే వ్యక్తమగుచున్నది.”

అజితసింహుఁ డాలోచనాపరుఁడై యిట్లనెను:

“మన మిరుపురము గాంచిన భయానక ప్రదర్శనములు పైశాచ

కృత్యము లంటివిగదా. ఔగాక. కాని, ఈ సన్యాసి పై చిత్రమునకే మందువు ?"

రఘువీరుఁ డేమియు జెప్పఁజాలఁడాయెను. అజితసింహుఁడు కొంత తడ వూరకుండి యిట్లనెను— "రఘువీరా ! ఈ యంబరవంశ సింహ కిశోరముతో సరసములాడ సాహసించు కొనటుల కెట్టిగతిపట్టునో వారెఱుంగకున్నారు. ప్రాప్తకాలము దాపించు దౌర్భాగ్యులు తప్ప, ఇట్టి సాహసకార్యమున కెవ్వరు గడంగుదురు ?"

"రాజా ! నీ ప్రతాపము నెఱుంగనివా రెవరు ?" అని రఘు వీరుఁడు సంతుష్టాంతరంగుఁడై బదులిడెను.

అట్టిసమయమున, సైనికుఁ డొకఁడు వడివడి నేతెంచి, వంగివంగి జోహారు లొనరించి, చేతులు జోడించి, అజితసింహుని కట్టెదుట నిలు చుండి సవినయముగ నిట్లు విన్నవించెను—

"దేవా ! ఒక వృద్ధాంగన యేలినవారిదర్శనమునకై వేచియున్నది. ఏమి సెలవు ? తోడనే, అజితసింహుఁ డాశ్చర్య హృదయుఁడై, "ఆమె యెవరు ?" అని ప్రశ్నించెను.

"దేవా ! ఆమె బిచ్చకత్తెవలె నున్నది. దానివైఖరి జూడ కొం చెము వెఱ్ఱిదానివలె గూడ గాన్పించుచున్నది."

"దానికేమికావలయు ?"

"దేవా ! నేనెంత గుచ్చి యడిగినను ఏమికావలయునో చెప్పినది కాదు. కేవలము దేవరవారి దర్శనమునే యపేక్షించి యున్నది. మహారాజా ! ఆమె కడు వృద్ధురాలు, బడుగు దరిద్రురాలు."

అజితసింహుఁ డాలోచనపరుఁడై రఘువీరుని వంక దిలకించెను. ఆ వృద్ధురాలిని దోడితెమ్మని సైనికు నాతఁడాజ్ఞాపించెను. సైనికుఁడు యథావిధిగ దండప్రణామంబు లాచరించి నిష్క్రమించెను:—"రఘు వీరా ! ఈవృద్ధులెవ్వరు ? నాదర్శనమేల యపేక్షింపవలయు" అని,

అజితసింహుఁడు ప్రశ్నించెను.

"ఏమియు జెప్పజాలను. కాని, సావధాన మనస్కులమై యప్రమత్తులమై యుండవలయును."

అంతలో నొక వృద్ధురాలు గడగడవడకుచు చేతనున్న కఱ్ఱపై నానుకొనుచు నేతెంచెను. గాలిలో గొట్టుకొనుచుండెడు పత్రమువలె నామెయొడలంతయు గంపించుచుండెను. ఆమెవస్త్రములతిమలినములై అతిజీర్ణములై సగముదేహమును మాత్రముకప్పియుండెను. ఆమెజుట్టు మిక్కిలి పండి యుండుటచే పిండిబుట్టవలె నుండెను. ఆమెదవడలు టెంకాయ చిప్పవలె జాలలోతుగ నుండెను. కండ్లులోనికి జొచ్చుకొని యుండెను. అట్టి వికృతాకారముగల యావృద్ధురాలిని గాంచినంతనే ఎట్టి కఠినాత్ముని హృదయమైనను నీరు కాకమానదు.

ఆమె రఘువీరుని వైపున నతికష్టముమీఁద మెల్లగఁజతికిల బడి, ఆతని వదనముపై దృష్టినిల్పి యిట్లనెను:—"ఓ, బాబూ నీవా! నీవు కాదు—" అని పలికి, ప్రయాసపడి తనమోమును అజితసింహునిదెస ద్రిప్పి జరభారముచే గడగడ వడకుచు నిట్లనెను.

"బాబా—నీవే—"

అజిత—"ఏమి కావలయును?"

"అంబరు రాజ్యాధిపతి కావలయును, బాబా?"

"ఏమీ? నేనే యంబరు దేశాధీశుఁడ"

"అజితసింహుఁడేనా?"

"ఔను, నేనే యజితసింహుఁడను."

"ఔను — ఔను — సరే — బాగున్నది. కాని నా కుమారుఁడు చాల చక్కనివాఁడు—బాబా ఏమో—కానరాడు హా! కుమారా! ఏమైతివిరా—"

అంత నా వృద్ధురాలు భారున నేడువ నారంభించెను ఔదార్య

వంతుఁడగు నజితసింహుని చిత్తము నీరైపోయెను, తోడనే, ఆతని నయనము లశ్రుజల పూరితములాయెను. కాని, మహత్కార్యాలోచనా నిమగ్నుఁడైన రాజపుత్రునకట్టి దౌర్భాగ్యులతో గాలయాపన మొనరించుటకు నవకాశము లేకుండుటచే గొంచెము కుపితుఁడై ఆమెకొక పచ్చడము నొసంగి పంపివేయగోరి యిట్లనెను—"అవ్వా, దీనిని గైకొని వెడలుము. నీ కుమారుఁడు రణరంగమున మడిసెనేని, స్వర్గమున సుఖుఁడై యుండును."

"మహారాజా! స్వర్గ మెక్కడున్నది? దారియెట్లో?"

అజితసింహుఁ డాకసమును జూపి, అయ్యదే స్వర్గమని చెప్పెను.

"రాజా! నా విన్నపము విని నన్నచటికి గొంపోవా? నావంటి దీనురాలు అసహాయురాలుగ నెట్లుపోగలదు?"

"అచటి కొరులు రాఁజాలరు. అవ్వా, కాలాతీతమగుచున్నది. ఈపచ్చడము నందుకొని నీ విక వెడలుము."

"వద్దు, వద్దు నా కాపచ్చడ మెందుకు?—పేదదానను—ఎవరైనను లాగివేయుదురు—నాకు వద్దు—"

"అట్లైన, నీ కేమి కావలయును? ఏల వచ్చితివి? ఎట్లువచ్చితివి!" విసుగుచే నజితసింహుండు కోపాయత్తచిత్తుఁడాయెను.

"రాజా! నీ వేతెంచితివని పల్లెలో వింటిని. అందుచే—నిన్ను—చూడ—వలెనని—వచ్చినాను. హా! హా! రాజా మఱల మఱచి—పోతిని"

"అవ్వా! చాలు నిక పొమ్ము,"

"ఆ, ఆ, జ్ఞప్తికి—వచ్చినది—ఉండుము, ఉండు—ఒకసన్యాసి—"

## ౧౪
### వృద్ధురాలు

అమ్ముదుసలి 'సన్న్యాసి' యనినంతనే, ఆలోచనాపరుఁడై పరధ్యానముగనుండిన యజితసింహుఁ డదరపడి, మిక్కిలి యాతురముగా

నిట్లడిగెను—"ఆ సన్యాసి నీకేమి చెప్పెను?" కట్టుపై నానుకొనిజరభార ముచే గడగడ వడకుచు నావృద్ధురాలు గద్గదకంఠియైయిట్లనెను.

"సన్యాసి—అయ్యో—బాబా—మఱచితిని—ఆగుము జ్ఞప్తికి వచ్చినది—ఆ, అవును—ఆసన్యాసి నన్ను ఆశీర్వదించెను. ఆతఁడుచాల మంచివాఁడు. ఇక సెలవు—బాబా—దేవుఁడు నీకుమేలుచేయుగాక-"

ఇంతవఱకును నావృద్ధురాలు ఎపుడుపోవునా యని తత్తరపడుచుండిన రాజపుత్రుఁడిపుడు ఆమెను నిలిపి ఆమెతోఁబ్రసంగింప వలయునని తత్తరపడిన వాఁడాయెను—"అవ్వా! నిలునిలు ఇంతతొందరయేల? నీవా సన్యాసిని నెచటగాంచితివి?" అని, యడిగెను.

"బాబా—ఎక్కడా?—అక్కడ-అల్లక్కడ"

"నీతోనేమి మాట్లాడినాఁడు?"

"అయ్యో! బాబా! నాకంతజ్ఞాపకమా? కాని,— చెప్పెద—ఉండు—ఆతఁడు—"

"అవ్వా! నీకెంత జ్ఞాపకమున్నదో అంతేచెప్పుము"

"ఉండు, ఉండు—నన్ను ఓదార్చి—నాకుమారుని బ్రతికింతునని-చెప్పినాడు — ఇంకా — "వృద్ధురాలా! అంబరుదేశపు — యువరాజు - ఫతేపూరుసిక్రీలో — ఉన్నాడు — " అన్నాడు. — మఱి, యింకా — అయ్యో! బాబా — జ్ఞాపకము-లేదు"

రఘువీరుఁడు — "అవ్వా! మెల్లగ గూర్చుండుము. ఆయాసము తీఱగలదు"

"బాబా! అంత అదృష్టమా! చాలాదూరము పోవలయును. ప్రాణముమీాద ఆశఉంటే, రాజకుమారుఁడు ఈప్రదేశమునుండి వెంటనే పోవలయునని ఆతఁడు చెప్పెను."

తోడనే, అజితసింహుఁడు నివ్వెరపడి రఘువీరుని వదనమును వెఱ్ఱివానివలెఁ జూడఁగడంగెను. రఘువీరుఁ డాలోచనాపరుఁడై నోరు

మెదల్పక ఆవృద్ధురాలి యాకృతిని పరిశీలనగా వీక్షించుచుండెను. ఆ సమయమున నామె యిట్లనెను. — "బాబా! నాకు సెలవుదయచేయుదురా? నాకుమారుని బునర్జీవు నొనరింతునని — ఆసన్యాసి పలికెను గదా! నేను పోవలయును"

ఆ వృద్ధురాలిని బోనీయరాదని యజితసింహుఁడు సమకట్టెను. కాని రఘువీరుఁడాతని వారించుటచే నామె మెల్లగ వెడలిపోయెను. తోడనే రఘువీరుఁడు తన సైనికులను బిలిచి, ఆవృద్ధురాలి జాడలను నతిభద్రముగ నరయవలయునని యాజ్ఞాపించెను. ఒకఁడామె వెనువెంటనే దిరుగుచుండవలయుననియు, రెండవవాఁడు ఎప్పటిసమాచారము నప్పుడు దెలుపుచుండవలయుననియు గూడ రఘువీరుఁ డెఱింగించెను.

సైనికులు నిష్క్రమించిన పిమ్మట, అజితసింహుఁ డిట్లనెను—"రఘువీరా! ఏమందువు?"

"ఇందు నివసించువారి కేలకో మన యునికి యసహ్యాకరముగ నున్నదని స్పష్టమగుచున్నది."

"కారణ మేమైయుండును?"

"చెప్పుటకు సాధ్యము కాకున్నది."

అంతలో నా యిద్దరి సైనికులలో నొక్కఁడతిరయమున నరుదెంచి వగర్చుచు నిట్లనెను — "మహారాజా! వృద్ధురాలు ఎంతవెదికినను గానరాకున్నది."

తోడనే యజితసింహుఁడదరిపడి, "ఆ! ఏమీ?" అని గర్జించెను. రఘు —"ఆమె యిప్పుడిప్పుడేగదా యిచటనుండి వెడలినది. ఎచటనో యిక్కడనే యుండవలయు. ఇంతలో నామె యెచ్చటికిఁబోగలదు?"

"సైన్యాధిపా! ఆ సైతా నెటుబోయెనో తెలియకున్నది." అని సవినయముగ సైనికులు ప్రత్యుత్తర మొసంగిరి.

అజితసింహున కేమియు దోపకుండెను. అంత వారిరువురు గలసి

యీ వింతసమాచారమును సమగ్రముగ నరయుటకై బయల్వెడలిరి. సైనికుడుకూడ వారివెంటనే యుండెను. వారట్లు కొంతదూర మరుగు సరికి, సుఖాసీనులై ముచ్చటించుకొనుచుండిన రాజపుత్ర సైనికులు వారికి గోచరించిరి. వారంతయు నజితసింహుని గాంచినంతనే జోహారు లొనరించి యట్టె నిలిచియుండిరి. రాజకుమారుడు వారితో నిట్లనెను. "సైనికులారా! మాతో ముచ్చటించి ఇప్పుడే ఈత్రోవనే నిర్గమించిన వృద్ధురా లెటుబోయెనో చెప్పగలరా?"

సైనికులు డిల్లవడి యొకరిమోము నొకరుచూడసాగిరి. వారందఱట్లు నిరుత్తరులై యుండ, వారిలో నొకడు సాహసించి యిట్లువిన్నవించెను. "మహారాజా! ఈమార్గమున నెవ్వరు రాలేదు. ఎవరైన వచ్చి యుండిన జాగరూకులమైయున్న మేము యెఱుంగకుందుమా?"

అజితసింహునకు మతిపోవుచుండెను — "ఏమీ! ఆమె యిప్పుడే వెడలియుండెనే! మీరామెను గాంచలేదని వచించుట చాల చోద్యముగ నున్నది."

"రాజా! అట్లుకాదు. మేమెల్లర మిచటనే గూర్చుని యుంటిమి. ఆమె యీదెస యేతెంచినచో మేము కనిపెట్టియుండమా?"

"సైనికులారా? జాగు సేయక ఈప్రదేశము నంతయు బరిశోధించి యమ్ముదుసలిని బట్టి తెండు. ఆమె మంచువలె కరిగి మాయము కాజాలదుగదా."

తోడనే, మహాప్రసాదమని బలికి రాజపుత్ర సైనికు లందఱు నిష్క్రమించిరి. రఘువీరుని మోమువంక కొన్ని నిమేషము లూరక చూచి యజితసింహు డిట్లనెను— "ఈవృద్ధురాలు ఇంద్రజాలము చేయుచున్నది! కాటికి గాలుచాచియున్న యీముదుసలి క్షణమాత్రమున నెట్లు మాయమైనది?"

రఘు — "ఇది యొక యద్భుతప్రదేశమువలె నున్నది. ఇందు

జరుగున వన్నియు నద్భుతములే. ”

అంతలో నొక గ్రామ్యబాలిక కాయకూరలతో నిండియుండిన తట్టను శిరమున వహించి, యురుదెంచి యిట్లు విన్నవించెను— “ బాబులాలా ! నన్ను హామీదా పంపియున్నది. మీరు కొనవలసిన సామగ్రులేవైన నున్నవా ? ”

అజితసింహుఁడు కుపితస్వాంతుఁడై యిట్లనెను— “ మా కేమియు నక్కఱలేదుగాని, నీవొక వృద్ధురాలిని గాంచియుంటివా ? ”

నవ్వుచు నాబాలిక యిట్లనెను - “ ఇప్పుడిపుడే చూచియుంటిని. గడగడ వడకు ముదుసలియేగదా. ఆమె మాగ్రామవాసియే. మేమామెను “జంగ్లీబాయి” యందుము. ”

“నాకామెతోఁబని యున్నది. ” అని పలికి. ఆబాలిక చూపినమార్గమునను సరించి, అజితసింహుఁడతి రయమునఁ బోదొడంగెను. రఘువీరుఁ డాతని వెన్నంటి వెడలుచుండెను. ఆ బాలిక యేలకో నవ్వుకొనుచు, శిరముపై దట్టనిడికొని రెండవ దాఁటిఁబోయెను.

అజితసింహుఁడును రఘువీరుఁడును నిందందు వెదుకులాడుచు సింహద్వారమును సమీపింప, సైనికులందరు నచ్చటనే యుండుట గాంచిరి, తోడనే యజితసింహుఁడుగ్రుఁడై యిట్లనెను—“మీరందరు నిందుండుటకు గతంబెయ్యది ? అవృద్ధురాలిని బట్టి తేవలయునని చెప్పియుంటినే ! ఆజ్ఞోల్లంఘన మొనరించుట కడు విపరీతముగ నున్నది ! ”

సైనికులందఱు నేకగ్రీవముగా నిట్లుపలికిరి— “ రాజా ! ఆగ్రహింపకుడు. ఆవృద్ధురాలు ఇచటనే యుండెనని విని యేతెంచినారము ”

అజితసింహుఁడు కుపితస్వాంతుఁడై యిట్లనెను— “ మీకీ సమాచారమెఱింగించిన సైనికుఁడెవరు ? ”

“ కూరగాయలు విక్రయించు నొక గ్రామ్యబాలిక ”

తోడనే, అజితసింహుఁడులికిపడి రఘువీరుని మోము వీక్షించెను.

రఘువీరుఁడు సైనికులనిట్లు ప్రశ్నించెను.—"ఆ బాలిక యెట్లుపోయెను?"

"సర్దార్ సాహెబ్! ఉమ్రావు యొక్క సేవకురాలికి గూరలిచ్చుటకై పోయియున్నది."

అజితసింహుని యాగ్రహ మినుమడించెను. అతఁడు ఖచితముగా సైనికుల కిట్లు యెఱింగించెను—"కొందఱిచటనే యుండి జాగ్రత్తగా వెదకుఁడు. ఆముదుసలి యిందే నక్కియుండును. మీారామెను దప్పక పట్టి బంధింపవలయును."

తోడనే, పందెపు గుఱ్ఱములవలె రాజపుత్రసైనికులు పరుగుననిటు నటు బోయిరి. అజితసింహుఁడును రఘువీరుఁడును వివిధాలోచనాపరులై రాజమందిరద్వారమువైపు బోవుచుండిరి. ఆ ప్రక్కనే యుండిన మసీదునుండి వెలికి వచ్చుచుండిన మౌల్వీయొకఁడు వారికి గోచరమాయెను. మసీదుద్వారము దాపున యొకగుఱ్ఱమును, గుఱ్ఱపువాఁడును గూడనుండిరి, మసీదునుండి వచ్చిన మౌల్వీతనకై వేచియుండిన యశ్వము నారోహించి యెదురుగా నేతెంచుచుండిన యజితసింహుని గాంచి సగౌరవముగ నిట్లు పలికెను—"రాజా! నేను ఆగ్రానగరమున కేగుచున్నాను. మార్గమధ్యముననున్న యీసుప్రసిద్ధమగు మసీదును దర్శించి పోవలయునని యెంచి యిటు వచ్చియున్నాఁడను. ఇదియొక గొప్ప యదృష్టముగ బరిగణింతును."

అజిత: "సందియమేమి?"

మౌల్వీ—"సెలవొసంగెదరా?" అని పలికి, అతఁడు వాయువేగమున మాయమాయెను.

ఆ కాలమున నసంఖ్యాకులగు మౌల్వీలును ఫకీరులును నిరాఘాటముగ నిరంతరము దిరుగాడుట యాచారమై యుండుటచే, నా మౌల్వీయచట గోచరించుట, యొక వింతగ నజితసింహునకు దోపలేదు. మఱియు, దాము కాంచుచుండిన వింతలను దలంచుకొనుచు వారు దీర్ఘా

లోచనాపరులై యుండిరి. చూచుచుండగానే యంతర్థానమైన యావృద్ధురాలైనను, ఆమెనెఱుంగుదునని వచించిన గ్రామ్యబాలికయైనను గాన్పించునేమో యని వారిరువురు నాప్రదేశమునంతయు సమగ్రముగఁ బరిశీలించిరి, కాని, వారి శ్రమ యంతయు నిష్ప్రయోజనమాయెను

ఆసమయమున, సైనికుఁడొకఁడు ఖానుయొక్క సేవకుఁడగు మహమ్మదుజానుతో నరుదెంచెను. రాజపుత్రుని గాంచినంతనే ఆసేవకుఁడు సవినయముగ సలాము లాచరించి, అతివినయముగ నిట్లనెను—

"మహారాజా! తమ సేవకున కేమి యాజ్ఞ?"

"కూరగాయలు నమ్ము గ్రామ్యబాలికను నీవు చూచియుంటివా?"

"రాజా! నా కెవ్వరు గనుపించలేదు."

"హమీదా యేం నావద్దకు దనను నంపియుండెనని ఆ బాలిక చెప్పియున్నదే"

"అది యంతయు గల్ల. కూరగాయలు వారెవరు నీ దినమున మాయింటికి రాలేదు."

"పోనీ. ఆ బాలికను నీ వెఱుంగుదువా?" మహమ్మదు కొంచె మాలోచించి యిట్లనెను—"హుజూర్! మీరు చెప్పునట్టి బాలిక నెన్నఁడు జూచి యెఱుంగను. ఈ ప్రాంతమునందలి జను లందఱిని నే నెఱుంగుదును."

"ఈగ్రామమునఁ 'జంగ్లీబాయి' యను పిచ్చిముసలియున్నాదా?" ఆశ్చర్యమును దెలుపు జూపులతో నజితసింహునిఁ జూచి, మహమ్మదిట్లనెను— "జంగ్లీబాయా!"

"అవును. ఆమె యీగ్రామస్థురాలేయని ఒక్క నిముషముక్రిందనే కూరగాయలబాలిక చెప్పియుండెను."

"రాజా! అదంతయు నసత్యమే. ఈప్రదేశమున నట్టివా రెవరైన నుందురేని, నాకు దెలియకుండునా?"

అజితసింహుని కాగహాశ్చర్యము లధికమగుచుండెను. ఆతఁడు రఘువీరునివంక దిలకించి, ఆతఁడు నిశ్చేష్టితుఁడై యుండుటఁ గాంచి, మహమ్మదువంక మగుడఁదిరిగి— "ఈ సింహద్వారము తప్ప ఈనగరము నుండి పైకి వెడలుటకు వేఱొకమార్గమున్నదా?" యని ప్రశ్నించెను.

"మహారాజా! కోటవలె నున్నతప్రాకార పరిరక్షితంబై యున్న యీనగరమునకు మార్గాంతరము లేదని నిశ్చయముగఁ జెప్పగలను. పరిశీలింతురేని, సత్యము మీకే తెలియఁగలదు."

"సరే! ఇక నీవు పోవచ్చును. నేను చెప్పిన వృద్ధురాలు నీకెచట నైన గాన్పించునేని, నావద్దకు దోడ్తెమ్ము."

"దేవా! మహాప్రసాదము. అట్లే చేయువాడను."

"ఓయీ! జాన్, నాసేవకు లప్రమత్తులై సహస్రాక్షులై తిరుగు చున్నారు. వారి కండ్లుగప్పి యమ్ముదుసలిగాని ఆబాలికగాని ఈనగ రమునుండి పోఁజాలరులే"

"దేవా! తమ యీభృత్యుడు తమయాజ్ఞలను శిరసావహించుటకై సదావేచి యుండును" అని పలికి సవినయముగ సెలవుగైకొని నిష్క్ర మించెను.

మహమ్మదుజాన్ అట్లువెడలిన పిమ్మట, అజితసింహుఁడు రఘువీరుని గాంచి, "మిత్రమా! ఇప్పుడేమందువు?" అని యడిగెను.

రఘువీరుఁడేమియు, బలుక నేరక మిన్నకుండెను.

## ౧౫

### చరిత్రాంశములు

సరసప్రవర్తనముచే నక్బరుపాదుషా స్థాపించిన హైందవమహా సామ్రాజ్యమును జహంగీరు మిక్కిలి కఠినముగఁ బరిపాలించుచుండెను. వివేకశాలియు ప్రతిభాశాలియునగు నక్బరుపాదుషా వైవాహిక

సంబంధములచేతను ఇదితర సరసమార్గములచేతను శూరాగ్రేసరులగు రసపుత్రవీరుల ప్రాపువడసి అఖండయశోవైభవ సమన్వితుఁడాయెను. మేటిమొగలాయి సామ్రాజ్య భారమును రసపుత్రవీరులు దిగ్గజముల వలె వహించియుండిరి. మహామానియగు ప్రతాపసింగు మాత్రము పాదుషాను సరకుఁజేయక కడుస్వచ్ఛందముగ మెలంగుచుండెను. జోద్పూరు వంశపు వనితారత్నమగు జోద్బాయి జహాంగీరునకు ప్రియభార్యయై యుండెను. విఖ్యాతవీరుఁడగు రాజా మానసింగుయొక్క సోదరియగు జనాబీబాయి మహమ్మదు ఖుస్రూయొక్క మాతయై యుండెను. దురదృష్టవశమునఁ దప్పిపోయెగాని, ఆతఁడే అక్బరు మరణానంతరము సామ్రాజ్యాధిపుడై యుండెడివాఁడు. పాప మాతఁడు జహాంగీరుచే బంధింపఁబడి బధవశంబున మరణించెను.

ఉదయపూరు మహారాణాయగు ప్రతాపసింగు దివి కరిగిన ఎనిమిది సంవత్సరములకు నక్బరుపాదుషాసహిత మాత్రోవనే యంతరించెను. ఆమధ్యకాలమున ప్రతాపసింగు కుమారుఁడగు అమరసింగు తద్రాజ్యాధిపతి యాయెను. ఆతఁడు తండ్రివలె ప్రతాపవంతుఁడు కాకుండినను, ఆతని స్వాతంత్ర్యమునకు నక్బరు భంగము కలిగింపలేదు. కాని జహాంగీరు మాత్ర మాతని స్వాతంత్ర్యమును సహింపజాలనివాఁడాయెను. మొగలాయి వాహినిని నరికట్టు సామర్థ్యము లేకుండుటచేతను, స్వాతంత్ర్యవిరహితుఁడై రాజ్యభారమును వహించుట కిచ్ఛగింపనివాఁడగుటచేతను, తన కుమారుఁడగు కర్ణాసింగును పట్టాభిషిక్తు నొనరించి అమరసింగు ఐహికవిషయ పాశములనుండి విముక్తుఁడై దైవచింతానిమగ్నుఁడాయెను. మన కథాసందర్భ సమయమున వీరుఁడగు కర్ణాసింగే ఉదయపుర మహారాణాయై యుండెను.

అంబరు మహారాణాయగు మానసింగు మరణించియుండెను. ఆప్రసిద్ధపూరుషుని కుమారుఁడును మనుమఁడును సురాపాన మత్తమగుటచే

శీఘ్రతరముగ మరణించిరి. సార్వభౌముడు తన హైందవ యర్థాంగి యగు జోద్బాయి మాట ననుసరించి తద్రాజ్యమున జయసింగును నుంచెను. ఈ జయసింహుడు, మాన్సింగుయొక్క సోదరుడగు జగత్సింహుని మనుమడై యుండెను.

మన కథాసమయమున, మేవారు, (ఉదయపూరు) మార్వారు (జోద్బూరు), అంబరు (జయపూరు) — ఈ మూడు రాజ్యములును మొగలాయి సార్వభౌముని యెడల భక్తివిశ్వాసములు కలిగియుండెను. మేవారు రాజ్యపు కర్ణాసింగును, అంబరు రాజ్యపు నజితసింగును మార్వారు మహారాజపుత్రుడగు అసిలసింగుయును ఈ కథాసందర్భమున సదా గోచరించుచుందురు.

జహాంగీరు సార్వభౌమునకు నలుగురు పుత్రులుండిరి — ఖుస్రూ, పార్వేషు, ఖరీమ్, షరియార్. పైనుదహరించిన రసపుత్ర రాకొమరులు మువ్వురును, సార్వభౌముని పుత్రులగు పార్వేషు, ఖరీమ్‌లతో సమాన వయస్కులై యుండిరి. అంబరు వంశమునకు దూరపుబంధువగు కాభా రాజకుమారి కడుపుననే ఖరీము జనించియుండెను. ఆతడే భావి సామ్రాజ్యాధిపతియని యెంచి, రసపుత్రభూపాలు లాతని నెక్కుడుగ ప్రేమించుచుండిరి. అంబరు మార్వారు వంశజులిర్వురును జహాంగీరు నెడల ప్రేమబద్ధులై, ప్రాణముల నర్పించుటకునైన సంసిద్ధులై యుండిరి. ఉదయపూరు మహారాణా సోదరుడగు భీమసింగుమాత్రము సార్వభౌమ పుత్రుడగు ఖరీమునకు ననుంగునెచ్చెలియై యాతని నీడవలె మెలంగుచుండెను. వారిరువురు నన్యోన్యశ్రేయోభిలాషులై, యన్యోన్యానురాగ పాశబద్ధులునై యుండిరి. తనను ద్రోసివైచి, తన కుమారుడగు ఖరీమును సామ్రాజ్యాభిషిక్తు నొనరించుటకై రహస్యాలోచనలు జరుగుచుండెనని జహాంగీరు కనుగొనియుండెను. మొదట నంబరువంశ జాతుడై, పిదప మహమ్మదీయ మతావలంబకుడై నాటి సైన్యాధి

పతులలో నగ్రగణ్యుఁడని ప్రఖ్యాత చారిత్రుఁడై యుండిన మహాబత్ ఖానుగూడ సూక్ష్మజ్ఞానియు, ధైర్యశాలియునగు భీమసింగుయొక్క మంతనములకుఁ జెవియొగ్గి ఆతని ప్రయత్నములకు దోహద మొసంగుటకు సంసిద్ధుఁడై యుండెననిగూడ జహంగీరు గ్రహించియుండెను. ఉపాయముచే వారి ప్రయత్నములను విఫలపఱుచవలయునని యెంచి, భీమసింగును గుజరాతు దేశమునకు దన ప్రతినిధిగా నియమించి ఆ తెలుంగున నా దూరప్రదేశమున కాతని దఱలింపవలయునని ప్రయత్నించెను. కాని, సవినయముగ భీమసింగు ఆయుద్యోగమును నిరాకరించుటచే సార్వభౌముడు విఫల మనోరథుఁడాయెను.

జగదైకవీరుఁడగు ప్రతాపుని సోదరుఁడు శక్తిసింగు రాజ్యసుఖముల కాసవడి, దేశద్రోహమునకుఁ దలపడిపాదుషాపక్ష మవలంబించి చిత్తూరు సింహాసనము నధిష్ఠించెను. వీరాగ్రేసరుఁడును, స్వాతంత్ర్యప్రియుఁడును ప్రజాభిమానియును నగు ప్రతాపసింహుఁడు భోగభాగ్యపరాఙ్ముఖుఁడై మహారణమధ్యమున గడు గష్టజీవన మొనరించుటచే గరము దుఃఖవివశులై యుండినజనులు శక్తిసింహుని హైన్యప్రవర్తనముఁగాంచి సహింపనివారలై పలు తెలుంగుల నాతని నగౌరవించిన కారణమున, దనహైన్యప్రవర్తనమునకు దానే లజ్జించి, రాజ్యమును విసర్జించి, సోదరుని పాదములకు బ్రణమిల్లి, శక్తిసింహుఁడు సార్వభౌముని దర్బారునకుఁ బోయెను. కాని, ప్రజల నెట్టులో వశపఱచుకొని, రాజ్యపరిపాలన మొనరించుటకు మారుగ నసమర్థుఁడై శక్తిసింగు రాజ్యపరిత్యాగ మొనరించెనని అక్బరు కుపితుఁడై యాతని సభామధ్యమున దూఱుటచే నాతఁడు రసపుత్రుఁడైన కారణమున బరిభవదందహ్యమానమానసుఁడై యతి సాహసమున గైదువువేసి హస్తమున బిగియఁబట్టి ఆత్మహత్యగావించెను. ఆతని కుమారుఁడొకఁడు మహమ్మదీయమతమును స్వీకరించెను ఆతఁడే మహాబత్ ఖాను: నాటి సైన్యాధి

పతులలో నెల్ల నాతఁడు విఖ్యాతిఁ గాంచియుండెను. ధైర్యసాహసముల యందును యుద్ధనైపుణ్యమునందును నాతఁడద్వితీయుఁడై విరాజిల్లు చుండెను. ఆతఁడు మతమున మహమ్మదీయుఁడై యుండినను, అంతరంగికమున నాతఁడు పూర్తిగ రసపుత్రుఁడేయైయుండెను. వీరరసప్రధానముగు రుధిర మాతని రక్తనాళములఁ నిర్ఝరప్రవాహమువలెఁ బ్రవహించుచుండ, నాతఁడన్యథా యెట్లుండును? ఆతఁడు భీమసింగుతో నేకీభవించి, ఢిల్లీ సింహాసనమున ఖరీమును నిలుపవలయునని మంతన మొనరించుచుండెను. సార్వభౌముఁడు మహాబతుఖానుచే బంధీకృతుఁడై నిగ్రహించుచుండిన సమయమున, జగద్విఖ్యాతిగాంచిన నూర్జహాను సైనికులు నివ్వెఱపడి చూచుచుండ, తెగువజేసి మదగజ మారోహించి, నిరోధింపఁ గడంగు వైరులను జెక్కాడి, శత్రుజనమధ్యమున నుండిన ప్రాణనాథుని దన యధీనము జేసికొనిన యద్భుతవిషయమును హైందవ చరిత్రవిజ్ఞాన సంపన్నులెఱింగియే యుందురు.

మేము వ్రాయుకాలమున జహంగీరు నూర్జహాను చేతిలో కీలుబొమ్మవలె నుండెను. సార్వభౌముఁడు కేవలము విషయానురక్తుఁడై కాలము గడుపుచుండుటచే, నూర్జహానే నిక్కంపు రాజ్యాధికారిణియై యుండెను. అతి విశాలమగు మొగలాయి సామ్రాజ్యపరిపాలనము కడుదుష్కరమై యుండినను, అమ్మహావ్యక్తి తత్కార్యభారమునంతయుఁ దానే వహించి జయప్రథముగ నిర్వహించుచుండెను. ఆమె శాసనముల నెవ్వరు నుల్లంఘించుటకు సాహసింపఁజాలకుండిరి.

జహంగీరు యొక్క రాజమందిరమునందు సుందరీమణు లనేకులుండిరి. వారిలో మువ్వురు సార్వభౌముని వనితాగణంబులో ముఖ్యులై, ఆతని ప్రేమకు మిక్కిలి పాత్రులైన యర్ధాంగులై యుండిరి. శీలమునందును సౌందర్యమునందును, మేధాశక్తియందును దన్ను బోలువారుండరని ప్రపంచమునం దంతటను వన్నెగాంచిన నూర్జహాను

ఆ ముప్పురిలో మిన్నయై యుండెను. బికనీరు మహారాజ పుత్రికయగు జోద్బాయి కూడ జహాంగీరు మనోరంజనియై యుండెను. వారి తరువాత ఖరీముయొక్క జనయిత్రియు, అంబరు వంశస్థురాలును అగు సుందరీమణి సార్వభౌముని హృదయమును రంజింపజేయుచుండెను.

నూర్జహాను పుత్రహీనయై యుండెను. కాని, ఆమె షార్యేషుపై బద్ధానురాగయై, నిజకుమారునికంటె నెక్కుడుగఁ జూచుచుండెను. ఎట్టులైన నాతనిచే సామ్రాజ్యాధిపతి నొనరింపవలయునని యామె సంకల్పించియుండెను. ఆకారణమున ఖరీమ్ యామెకు బరమశత్రువువలె గోచరించుచుండెను. మఱియు, సహజముగ సార్వభౌముని రసపుత్ర రాణులామెకు గడుగంటకముగ నుండిరి. కాని, ఆమె రాజనీతివిశారద యగుటచే, మొగలాయి సామ్రాజ్యము రసపుత్ర భుజబలముపై నాధారపడి యుండెనని గుర్తించి తన మాత్సర్యము నామె మఱుగు పఱచి సమంజసముగఁ బ్రవర్తింపఁగడంగెను. ఆమె బాహ్యప్రవర్తనము గాంచువారు ఆమె హృదయాభిప్రాయము నరయ నేరరు అట్టి గభీరస్వాంతయు, సహస్రాక్షియునగు నూర్జహాను. సయుక్తమునసే, జహాంగీరు యనంతరము ఖరీమును సింహాసనాసీను నొనరించుటకై కుట్ర నిగూఢముగ జరుగుచుండెను. అట్టి సందర్భమున జరిగిన రహస్యాద్భుత విషయములను బ్రదర్శింపగడంగెదము; పాఠకమహాశయులారా, యవధరింపుడు.

అతి నిగూఢముగ సంభవించుచు ప్రజాహృదయమును గలంచివైచుచుండిన యద్భుతవిషయములు మూడింటిని కథాప్రారంభముననే వర్ణించియుంటిమికదా. మఱియు, జహాంగీరుచే గ్వాలియరుదుర్గమున బంధితుఁడై యుండిన ఖుస్రూ యేమాయెనో యెరికిఁ దెలియకుండెను ఆ దూరదేశమున నాతఁడు నిశ్శబ్దముగ వధ్యుఁడైయుండునని మాత్రము జనులు చెప్పుకొనుచుండిరి. కాని, ఐదారు సంవత్సరములు గడచినను,

ఆతని యుదంతము రూఢిగా నెవ్వరికిని దెలియకుండుటచే నాతనిగుఱించి జనులు తలంపకుండిరి. ఇప్పుడైనను, మొగలాయి చారిత్రమునందాతని యుచితస్థానమును గుర్తించిన వారగుదురు. అంతలో హఠాత్తుగ, కారాగృహమున గుందుచుండిన ఖుస్రూ యెట్లులో విముక్తుడై, మహాసైన్య సమన్వితుండై, రసపుత్రవీరబలసాహాయ్య సంపన్నుండై ఆగ్రానగరమును ముట్టడింప నరుదెంచుచుండెనని హఠాత్తుగ దెలియవచ్చెను. వజ్రపాతమువంటి యవ్వార్త వీరుల బడినంతనే, నూర్జహాను జహాంగీరు లిర్వురు భయభ్రాంతులైరి.

ఆ వదంతి యొక్క పెనుభూతమువలె బయల్వెడలుటయేగాని, అందలి సత్యాసత్యము లెవ్వరికిం దేటపడకుండెను. సహస్రాక్షియై సర్వవ్యాపియై యుండిన నూర్జహానుకే గ్రాహ్యము కానపుడు, ఇతరులకెట్లు తెలియును? మొగలు, రసపుత్రసైన్యాధిపతులందఱకుగూడ నావదంతియెట్లు బయల్వెడలెనో, అందలి యథార్థమెంతయో దెలియకుండెను. ఐనను, ఆవదంతి మాత్రము మెల్లగ బ్రజాహృదయమునావరించుటచే, వారు భయకంపితులై, అర్థానికి వేర్వేరు కారణములను నిరూపించుచు, నావిషయమై బహిరంగముగ జర్చించినచో రాజభటులు దండితురేమో యని వెఱచుచు, లోలోన సదా చర్చించుకొనుచుండిరి.

ఈవదంతి తెలిసినంతనే జనులెల్లరు పరిపరివిధముల బ్రసంగించుకొనుచుండుటయేగాని, సార్వభౌముడగు జహాంగీరుపై జరుగుచుండిన కుట్ర యెవ్వరికిం దెలియదు. సార్వభౌముని రాజ్యభ్రష్టు నొనరించుటకో, లేక, విగతజీవు నొనరించుటకో, రహస్యముగ రగులుచుండినకుట్ర గుఱించి యణుమాత్రమైనను జనసామాన్యమునకుం దెలియుట లేదు. జనసామాన్యమునకే యననేల? పాదుషావారి రాజమందిర నివాసులు గూడ లేశమైనను నరయజాలక నిర్విచారులై యుండిరి. పెనుభూతమువలె తనపై నరుగుదెంచుచుండిన మహావిప్లవమును సార్వభౌముడే

గుర్తింపఁజాలక, నిశ్చలహృదయుఁడై కేవలముభోగైకపరాయణుఁడై కాలము గడుపుచుండెను. అతఁ డతియుదారవంతుఁడగుటచే, తనడెందమును జీకాకు పరచు విషయములను స్మరింపకుండెను. కాని, మహారాణియగు నూర్జహాను అట్టిబేల కాదు. వనితాప్రపంచమున కాదర్శప్రాయమై యొప్పు నవ్వనితామణి సౌందర్యాతిశయమునవేగాక బుద్ధిసూక్ష్మతయందు గూడ నద్వితీయురాలై విలసిల్లుచుండెను. భీమసింగాదులొనరించుచుండిన నిగూఢప్రయత్నము లాశక్తిస్వరూపిణికిఁ దెలియక పోలేదు. ప్రతాపవంతులగు రసపుత్రవీరులందరు నేకమగుచు రేని, తప్పక ముప్పువాటిల్లునని గుర్తించి, మిక్కిలి చతురముగ నజితసింహాయనిలసింహాఖ్యులను జేరఁదీసి, విశేషాధికారములను బిరుదములను వారికి ప్రాయికముగా నొసంగుచు, తనయందు వారు భక్తిపరాయణులై బద్ధానురాగులై యుండునట్లు చేయఁగలిగెను.

సార్వభౌముని రాజ్యభ్రష్టు నొనరించుటకతినిగూఢముగ జరుగుచుండిన కుట్ర జనసామాన్యమునకుఁ దెలియదుగాని హృదయమును ప్రక్కలుచేయు ఢిల్లీనగరమునందలి దారుణశవప్రదర్శనములు మాత్రము ప్రజాహృదయమును గలంచివైచుచుండెను. బేలలగు జనులు భయవిహ్వలులై యారాక్షసకృత్యమును గురించి పరిపరివిధముల జెప్పుకొనుచుండిరి. కుట్రవిషయమై చర్చించువారతియుల్పసంఖ్యాకులు.

సిక్రీనగరమున నజితసింహుఁడును రఘువీరుడును గాంచుచుండిన పైశాచకృత్యములను నొరుల కెఱింగించుటలేదు. అయ్యద్భుత విషయము లితరులకుఁ దెలియరాదని వారు నిశ్చయించుకొనియుండిరి. ఐనను, ఆవైపరీత్యము లెట్టులో బహిరంగము కాఁజొచ్చెను. అతి రహస్యవృత్తాంతము లెట్లు బయల్పడుచుండునో, అట్టివిషయము లొకరి నోటిలోనుండి యింకొక నోటిలోఁ బడునపు డెట్టి వింతరూపములు దాల్చుచుండునో పాఠకు లెఱింగియే యుందురు. అట్టులే, సిక్రీనగర

చర్యలు పలురూపముల దాల్చుచు తుదకు నాగ్రానగరము జేరునప్పటికి దత్స్వరవాసు లెల్లరు భయవిహ్వాలులై, ఎప్పు డెట్టి యుపద్రవము సంభవించునోయని వెఱచుచు నిద్రాసౌఖ్యమునకు వెలియైయుండిరి.

"రఘువీరా! ఇచ్చటి దారుణకృత్యములను నీవుకూడ నెవ్వరికి బొరపాటుననైనను దెలిపియుండ వనియే విశ్వసింతును. కాని, జను లెల్లరు నీ విషయముల గుఱించియే ప్రశంసించుటకు గారణమేమో?" అని యజితసింహుఁడు ప్రశ్నించెను.

రఘు: "రాజా! నా కంతయు నాశ్చర్యకరముగ నున్నదని యిదివరకే చెప్పియుంటిగదా."

## ౧౯

### అగ్రానగరదుర్గము

సుప్రసిద్ధుఁడగు నక్బరుసార్వభౌముఁడు యమునానదీతీరమున నొక బలిష్టమగు దుర్గమును నిర్మించియుండెను. అమ్మహాదుర్గము శ్రేష్టతమమగు సామగ్రులతో నిర్మితమై యద్వితీయ శోభాయమానమై యున్నది. వజ్రసామాన్య కాఠిన్యముగల శిలాభాగములతో గట్టిన కారణమున నాదుర్గము శత్రుజన నిర్భేద్యమై యుండెను. నగర రాజముసౌందర్యాతిశయముచే నిప్పటికిని సకలదేశనివాసుల నాకర్షించుచున్నది. శతాబ్దములు గడచినను చెక్కుచెదరక నిలచియున్న యీా దుర్గరాజము నాటి శిల్పికళానైపుణ్యమును సార్వభౌముని కళాప్రావీణ్యమును కూడ సమానముగ దెలుపుచున్నది.

ఆదుర్గము మిక్కిలి లోతగు కందకముచే బరిరక్షితంబై యుండెను. దుర్గముయొక్క ప్రాకారములత్యున్నతములై యుండుటచే, సింహద్వారము ననుసరించియే లోనికిఁ బోవలయుగాని, వేఱు యవకాశము లేకుండెను. ఆదుర్గమునకు సింహద్వారము తప్ప వేఱొక ద్వారము

లేదు. అచట, ద్వారపాలకు లాయుధపాణులై యప్రమత్తులై లోనికిఁ బోవువారలను పైకి వచ్చువారలనుగూడ సముచితముగ బరిశీలించుచు, రేయింబవళ్ళు గావలిగాచుచుండిరి. కందకమునకు మీదుగను ప్రాకారములకు సమీపముగను నుండిన గృహపంక్తులలో మొగలాయి సైనికులును రాజపుత్ర సైనికులును సర్వకాలములందును విడిసియుండిరి.

అతి సుందరమగు మోతీమసీదు దుర్గమున నున్నది. తెల్లని బలపపు రాతితో నిర్మింపఁబడిన యీమసీదు నేడుసహితము చూపరులకు నేత్రపర్వము చేయును. తత్సమీపముననే జగజ్జేగీయమానమగు సార్వభౌముని నగరుండును.

దుర్గమునందలిసుందరమందిరములన్నియు సముచితస్థలములయందు మనోహరముగ బారులుతీర్చి ప్రాచ్య సౌందర్యౌచిత్య ప్రతిభావిశేషమును వ్యక్తీకరించుచుండెను. ఆమందిరములలో, ప్రథమమున దివానీఆమ్ చూపరులదృష్టి నాకర్షించును. అయ్యదే, సార్వభౌముని సభామందిరము. తరువాత దివానీఖాన్ దృష్టి నాకర్షించును. ఇయ్యది రహస్య సభామందిరము. ఆ వెనుక, సుందరములగు సౌధరాజములు బారులుతీర్చియుండును. అయ్యవి, సార్వభౌముని యుపయోగార్థము నిర్మితమాయెను. వానివెనుకనుండు బీగము మహాలు యద్వితీయ సౌందర్యవైభవాతిశయముచేఁ జూపరులకుఁ బారవశ్యము గలిగించును. చూచునంతనే భ్రాంతిగొల్పు నాదివ్యమందిరసౌందర్యము కేవలము వర్ణనాతీతమై యొప్పారు. సకలభోగభాగ్యములకును నాకరమైయొప్పు నాసార్వభౌము సౌధరాజము త్రిలోకైకనాధుని స్వర్గమునుసైతము ధిక్కరించుచుండెను.

ధవళచ్ఛాయలతో దళతళ మెఱయునా మహామందిరమంతయు బంగారుతోఁ గప్పఁబడి దేదీప్యమానముగ నుండెను. ఆదివ్యమందిర మధ్యభాగమున నొక చిత్రవస్తు ప్రదర్శనాలయము ముండెను. దానితో

గలసియే యుండు విశాలావరణమున సొగసైన వృక్షరాజములును మృదుమధుర సౌరభములీను పుష్పములును నుండును. చిత్రవస్తు ప్రదర్శనాలయమునుండి యావరణమునకు జూపుమార్గము బంగారుతీగెల తోఁగూడిన మొగములు తెరలతో నిండియుండెను. రమణీయమై యవిరళసౌఖ్యప్రదమై యుండు నా ప్రదేశమున పీలుకలుగు సమయములందు భువనైక సుందరియగు నూర్జహాను నిజ ప్రాణనాథునితోఁ గూడి విహార మొనరించును. అందలి జలాశయములు మనోహర రవంబులతో నిర్మలోదకముల నెగఁజిమ్ముచు పరిమళపుష్పముల సౌరభములను వెదఁజల్లుచు హాయి కలిగించును.

ఆ చిత్రవస్తు ప్రదర్శనాలయమున లోకైక సుందరములగు చిత్తరవు లన్నియు నుండును. అసాధారణ సౌందర్యవతియగు నూర్జహాను సార్వభౌమి విశ్రమించు నా బీగముమహాలు మధ్యభాగము సముచితముగ నలంకరింపఁబడి యుండెను. దేశదేశములందలి యపూర్వవస్తువు లన్నియు నందమరియుండెను. పట్టును మించు మెత్తని పెరసియా కాశ్మీర దేశముల రత్నకంబళులతో నేల యంతయు గప్పఁబడియుండెను. పై భాగమంతయు నపరంజితోఁ జక్కఁగఁ గప్పఁబడి యుండెను. గోడలన్నియు వింతవింత చిత్తరువులచేతను, సముచితస్థలములందు బైకప్పును దాకు నపరంజిచట్టబద్ధమగు నిలువుటద్దములచేతను నలంకరింపఁబడి యుండెను. సహస్రబాహువు గల 'లస్టరు' నందు నానా విధసుగంధబంధురంబులగు పంచసహస్రసంఖ్యాయుతంబగు క్రొవ్వువత్తులు దేదీప్యమానముగఁ బ్రకాశించుచుండును. అందంద వ్రేలాడు నానావిధములగు కుసుమగుచ్ఛములచే నా మందిరము "సర్వసుమన స్సౌరభ్య సంవాసమై" విలసిల్లుచుండెను. ఇంతకంటె సహస్రాధికముగఁ బ్రశంసార్హమై, సకలభోగభాగ్యములకు నాకరమై భూలోకస్వర్గమువలె నుండిన యాదివ్యభవన వైభవసౌందర్యములను సరిగా వర్ణింపఁ గష్టం

గుట పాసాన్నద ॥

ఈ బీగముమహాలునందు సార్వభౌముఁడును సార్వభౌముని పుత్రులును దప్ప యితరపురుషులు చొరనేరరు. లోకబాంధవుఁడగు సహస్రకిరణుఁడు సహితము మామందిరము జొరనేరఁడు. బలిష్ఠులగు కొజ్జాలు సాయుధులై మిక్కిలి జాగరూకులై సర్వకాల సర్వావస్థలయందును గావలి గాచుచుందురు. కాటుకకొండలవలె భయంకరాకారులై, యమదూతలవలె వికృతాకారులై యుండు నాద్వారపాలకులు కావలిగాచు నపుడు పోతుటీగయైన నందుబోఁ జాలదు. మహాలు నందంతటను కృపాణధారులైన బందీలు యప్రమత్తులై తిరుగాడుచుందురు. ఒకవేళ, అందుఁ జొరరానివా రెవరైన ద్వారపాలకుల కండ్లుగప్పి ప్రవేశించినను, విచ్చుకత్తులబూని సహస్రాక్షులై సంచరించు నాబందీలచేఁ బట్టుపడక మానరు.

ఆమహాలునందనేక మందిరము లుండును. ఒక్కొక్క బీగమున కొక్కొక్కమందిరము ప్రత్యేకింపఁబడియుండెను. బీగమునకు వలయు గృహోపకరణములన్నియు నందు మరియుండును. అసంఖ్యాకులగు బందీల నివాసార్థము లెక్కలేనిగదులు యుచితస్థలములందు బాలుసు తీర్చియుండును. లెక్కలేని మఱి కొన్నిగదులు వివిధకార్యములకై ప్రత్యేకింపఁబడియుండును. ఇట్లు వేనవేలు గదులతో నిండియుండిన యాబీగము మహాలు అభేద్యమైయుండిన పద్మవ్యూహముకంటె వేయి మడుంగులు నిగూఢమై యుండెను. అందుఁబ్రవేశించి దాటిదప్పువారు యమ్మహావ్యూహరహస్యముల నరసినవారి సాహాయ్యముచే దప్ప సజీవముగఁ బైకి వచ్చుటకల్ల.

బీగము మహాలునందలి యధోభాగమునఁగూడ బెక్కుగదులుండెను. అవన్నియు సముచితముగ నలంకరింపఁబడి వెలలేని వివిధవస్తుచయంబులతో విలసిల్లుచుండును. వేసవికాలమున తాపబాధితులగు బీగము

లాశీతల ప్రదేశము నందు విశ్రమింతురు. భూగర్భమునందలి చీకటికోణ ములయందు నిర్భాగ్యులెందఱు ఉరిఘన్నులై యుండి కొనిర్గమింపనలవి కాదు.

ఆగ్రానగరమునందలి యీ దుర్గరాజము యమునానదీతీరముననే గాక, యమునానదీగర్భముననే నిర్మితమైయున్నదని చెప్పవచ్చును. బేగము మహాలునందలి సౌధములనుండి చూచువారల కానదీప్రవాహము చక్కగ గోచరించుచుండును. ఆనదిపై ననతిదూరముననేయంబరచుంబితములగు పర్వతపంక్తులు మనోహరముగ బారులుతీర్చియుండును. ఒకనాడు వేసవికాలమున నిరంతరము రాజకార్యాలోచనా నిమగ్నయై యుండు నూర్జహాను ఒక చంద్రకాంత శిలావేదికపై సుఖాసీనయై నేత్రపర్వమొనరించుచుండిన ప్రకృతి సౌందర్యముం గాంచుచుండెను. చండాంశుకిరణ సహస్రంబుల నృత్యముజేయుచుండిన యయ్యమునానదీ తోయములు నిరంతరము రాజకార్యపంక మగ్నమానసియైయుండు నాత్రైలోక్య సుందరిడెందమున కానందము గలిగించుచుండెను. ఆమె క్రమముగా నాలోచనా తత్పరయై, యేమఱి పరధ్యానముగ నుండెను. విద్యావిశారదయగు నామించుబోడి వామపార్శ్వమున నొక పారశీక గ్రంథము తెఱచియేయుండెను. ఆసమీపముననుండిన పుష్పగుచ్ఛములచే నామందిరమంతయు పరిమళభరితమై సంతతానంద దాయకమై యుండెను. పలువిధములగు వింతవింతజలాశయము లావనితారత్నము చుట్టును బరిమళపానీయముల నెగజిమ్ముచు మనోహరముగనుండెను. ఆసమీపముననే పసిడిపంజరముల నుండిన శుకపికాది మనోహర విహంగముల కలకల నినాదములుకూడ సంతోషదాయకముగ నుండెను. నూర్జహానుమాత్రము ధ్యానైక తత్పరయై యుండెను. విహంగాదుల కలస్వనంబులు తప్ప నామందిరమంతయు గడునిశ్శబ్దముగనుండెను. సామ్రాజ్యభారమునంతయు వహించినయావనితామణి అట్టి యేకాంతప్రదేశమున నేకాకియై యట్లు ధ్యానైకతత్పరయై

యెట్టి మహాత్కార్యము నాలోచించుచుండెనో!

ఇరువదియారేండ్లు ప్రాయముననే నూర్జహాను దుస్సహామగు రాజకీయ వ్యవహారభారమునంతయు వహించెను. మహాసామ్రాజ్యాధిపతియగు జహాంగీరును మోహపరవశు నొనరించిన యారమణీమణి నిరంతరానందసాగర డోలికలలో నూగులాడుటకు మాఱుగ దుర్భరమగు రాజకార్యనిర్వహణమునకుఁ గడంగుట మిక్కిలి యాశ్చర్యకరము, కేవలము శ్లాఘనీయము. ఆ దివ్యసుందరవిగ్రహము నిజసౌధాంత్యభాగమున సుఖాసీనయై, సరదారులును సైన్యాధిపతులును భూమిశులును క్రమముగా సవినయముగ నివేదించు సమాచారముల నరయుచు, వారి వారికిదగు కార్యములను నియోగించుట యెంతవైభవముగనుండెనో యట్టి మహాదృశ్యమును గాంచినవారుతప్ప యన్యులుగుర్తింపనేరరు.

నూర్జహాను తన యభ్యంతరమందిరమున నుండు సమయమున నెవ్వరు సమీపింపరాదు. ఆమె కార్యాలోచనా నిమగ్నయై యుండు నట్టిసమయమున బరిచారికులేగాక రాజకుటుంబమువారు సహితము భంగము గలిగింపరు. అట్టిసమయమున సార్వభౌముఁడు బీగముమహాలు నందలి యితరబీగములతో విషయానురక్తుఁడై మైమఱచి యుండుటచే, నూర్జహాను నిజప్రాణనాథుని యాతంకము లేకయే, యతికఠినములగు బెక్కు రాజకీయ సమస్యలను ఛేదింపగడంగుటకు విశేషావకాశ ముండెను.

నూర్జహానుయొక్క రహస్యాలోచనామందిరము నెవ్వరు ప్రవేశింపరాదని చెప్పియుంటిమి గదా. కాని, చక్రవర్తిని యెదటనుండినను, ఎట్టి రాజకీయ సమస్యాపరిష్కారాలోచనా నిమగ్నయై యుండినను, ఆమె ప్రధాన చెలికత్తెకు మాత్ర మెట్టి యభ్యంతరములేదు. ఆ చెలికత్తె యెడల నూర్జహాను బద్ధానురాగియై యుండుటచే నామె తోడు నీడవలె మెలంగుచుండెను. ఆమెను సంపూర్ణానుగ్రహముతో "జులేఖా"

యని నూర్జహాను సదా పిలుచుచుండెను. సామ్రాజ్యమును శాసించుచుండిన మహారాణియొక్క సంపూర్ణానుగ్రహమునకు బాత్రురాలైన జులేఖా సహజముగ సూక్ష్మజ్ఞానియు సత్యాన్వితమగు మేధావియునగుటచే బీగము మహాలునందును దర్బారునందునుగూడ పాటిలేని పలుకుబడిని గడించియుండెను.

రాజకీయధురంధరయగు తన ప్రాణేశ్వరి రాజకార్యనిర్వహణ భారమంతయు వహించియుండుటచే, జహంగీరు నిర్విచారముగను నిరాతంకముగను భోగసాగరముననోలాడుచుండెనుగదా! ఎట్టిరహస్య కార్యమైననుసరే, తనచెలికత్తెకు నెరింగించుచు నామె సమయోచితముగ నొసంగు సలహాను నూర్జహాను గైకొనుచుండెను సామ్రాజ్యమును నేకచ్ఛత్రముగ బరిపాలించుచుండిన నూర్జహానుకు జులేఖా కుడిభుజమువలె నుండుటచే, దర్బారుకేతెంచువారలందరు నామెను భయభక్తులతో గౌరవించుచుండిరి. ఆమెనట్లు గౌరవించుటయేగాక కార్యసాధనమునకై యాగ్రానగరమునకేతెంచువారలందరు, నెంతెంత మహానీయులైననుసరె, జులేఖాయొక్క కృపకు బాత్రులగుటకై వందులవలె నామెననేక తెరంగుల నభినందించుచుండిరి.

అట్టి ప్రతిభా విశేషముచే జులేఖా యట్లు సుప్రసిద్ధయై విలసిల్లుచుండినను, ఆమెజీవితవృత్తాంతము మాత్రమతిభద్రముగ మఱుగువడియుండెను. ఆమెజీవితచారిత్రము నెఱుంగకయే జనులెల్లరు నామెయెడల గడు వినయవిధేయులై వర్తిల్లుచుండిరి. కాలచక్రము తిరుగుకొలది, ఆమె పూర్వచారిత్రము నెరింగిన యత్యల్ప సంఖ్యాకులు సహితము మఱువజొచ్చిరి. సర్వము నెరింగిన నూర్జహాను సహితమాతృవృత్తాంతము నెన్నడు త్రవ్వియెత్తకుండెను. జులేఖాయొక్క నిశ్చల నరస సమంజస ప్రవర్తనమును గమనించువారు తన తొంటి చరిత్రను జులేఖాయైన నెరింగియుండెనాయని శంకింపకమానరు.

నూర్జహానుయొక్క వెనుకటి వృత్తాంతము సాధారణముగ నందరకు విశదమే. ఆమె పెరిసియా దేశపు సామాన్యబాలికయైయుండినపు డామె పేరు మెహరున్నీసా.

ఆమె బీగముమహాలునందొకపరిచారికయైయుండినపు డామె యద్వితీయసౌందర్యమును గాంచినంతనే సార్వభౌమునికుమారుఁడగు జహాంగీరు మోహపరవశుఁడై ఆమెను దన ప్రధానబీగముగ నొనరించి, నిరంతరమా జగన్మోహినితో గూడి మదన సామ్రాజ్యాభిషిక్తుడు గావలయునని వాంఛించెను. తనకుమారుని మదన తాప మంతకంతకు నతిశయించుచుండుటగాంచి, తన పరిచారిక యొక్కరితె భావిసామ్రాజ్యాధిపతియగు తనకుమారుని యర్ధాంగియగుటసహింపజాలక అక్బరుపాదుషా తనసైన్యాధిపతులలో నొకఁడగు షేర్ ఆఫ్గనును రావించి, యాతనికామెహరున్నీసాను భార్యగా నొసంగెను. ఐనను, ఆమెసమీపమున నుండినచో నెట్టి మోసము సంభవించునోయని శంకించి, ఆయాఫ్గనును బంగాళా దేశమునందలి బర్ద్వానుజిల్లాకు సుబేదారునిగా నియోగించి సార్వభౌముఁడా తెరంగుననాతనిదూర దేశమునకు బంపివైచెను. పాపము పరిసియా దేశపు పరిచారిక మొగలాయి సార్వభౌమురాలగు ప్రమాదమా తెరంగున దొలంగెనని అక్బరు సంతసించెను.

సార్వభౌముఁడు తనపై యభిమానము వహించి యుండెనని గర్వించి బర్ద్వానుజిల్లా యందలి హైందవులను షేర్ఆఫ్గను క్రూరముగ బాధింపఁ గడంగెను. దారుణమగు నాతని దౌర్జన్యమునకు బెక్కండ్రు గుఱియైయుండిరి. అట్టివారిలో నాజిల్లాయందలి సుప్రసిద్ధ జమీందారుఁడగు నరహరరాయి యొకఁడు. ఆతఁడు వయోవృద్ధుఁడును, నీతికోవిదుఁడును, సద్గుణ గరిష్ఠుఁడును అగుటచే నాతని జనులెల్లరు నెక్కుడుగ ప్రేమించుచుండిరి. ఆతఁడు వయసు మీఱినంతనే బుద్బుదప్రాయములగు నైహిక విషయములను విసర్జించి మోక్షసాధనము నరయవలయు

నని భావించి, అతివిశాలమగు తన జమీందారీని దనకుమారుఁడగు బీమాలరాయునికి నప్పగించెను. నరహరరాయుని భార్య మరణించి యుండెను. ఆతని కోడలు కన్నకూతురుకంటె నెక్కుడుగ నాతని ప్రేమించుచు నాతని కెట్టి లోపము గలుగనీయక చక్కగ సాకుచుండెను. ఆమెకొక చిన్నికుమారితె యుండెను. ఆకుటుంబమునం దా నలుగురే యుండిరి. ఒకనాఁడు అధికారబల గర్వములచేఁ ద్రుళ్ళిపడుచుండిన షేర్ ఆఫ్గను హఠాత్తుగ వారి గృహమును ముట్టడించెను. ఆత్మసంరక్షణార్థము బీమాలరాయి చేతికి దొరకు నాయుధములను ధరియించి ధైర్యముగ బోరాడి తుదకు దెగటారెను. వృద్ధుఁడయ్యు నరహరిరాయి పౌరుషవంతుఁడగుటచే దానుగూడ నాయుధపాణియైనను బలవంతుఁడగు నాఫ్గనుని నిరోధింపఁజాలనివాఁడాయెను. క్రూరాత్ముఁడగు నాయాఫ్గనుఁడా కుటుంబమువారినెల్ల మహమ్మదీయ మతావలంబుల నొనరించెను. అంతటితోనైనను నాతని క్రౌర్యము చల్లారదాయెను. బీమాలరాయి భార్యయు, సుగుణరాసియు, నసాధారణ సౌందర్యవతియునగు సర్వసుందరిని నానీచుఁడు బలాత్కరించి కొంపోయి తన భార్యకు బరిచారికగ నొసంగెను. వృద్ధుఁడగు నరహరిరాయి దురదృష్టమేమని వర్ణింపఁగలము? కన్నకుమారుఁడా తానుజూచుచుండగనే మరణించెను. తన గాదిలికోడలా మ్లేచ్ఛునింట దాసి యాయెను. తానా ఆకటకు తురక పీడించుటచే మతభ్రష్టుఁడు గూడ గావలసి వచ్చెను. కావున నాప్రదేశమున నిలువఁజాలక ముద్దులొలుకుదన మనుమరాలిని వెంటనిడుకొని దురదృష్టవంతుఁడగు నరహరరాయి దేశాంతరమునకు నిష్క్రమించెను. ఆతఁడేరికి గానఁబడకుండుటచే నా దురదృష్టవంతుఁడెందైన నాత్మహత్యగావించి మరణించి యుండునని జనులు నిశ్చయించిరి.

మహమ్మదీయమతము నవలంబింపవలసి వచ్చినంతనే సర్వసుందరి

జులేఖా యూసెను. బర్ధవాను సుబేదారుని భార్యయగు మోహరున్నీసాయే నేడు మేటి మొగలాయి సామ్రాజ్యతంత్రమును మహావైభవముగా ద్రిప్పుచుండెను నాటి జులేఖాయే నేడు నూర్జహానుకు గుడిభుజమువలె నుండి మిక్కిలి పలుకుబడి గడించి వెలసియుండెను.

నూర్జహాన్ షేర్ ఆఫ్ఘను భార్యయైయుండిన సమయమున నైనను జులేఖా కేవల మొక పరిచారికవోలె నుండుటలేదు. విజ్ఞానముతో బ్రకాశించు నామె సుందరవదనమును గాంచినంతనే నూర్జహానుకు నాశ్చర్యము జనించెను. సౌందర్యమున దనకు సమానముగ నుండుటయేగాక ప్రాయమునగూడ దనకు నీడుగ నుంచుటయు, సద్వంశసంజాతయై యుండుటయు గాంచి ఆమెను నూర్జహాను యెక్కుడుగ బ్రేమించుచు మిక్కిలి గౌరవించుచు నుండెను. తనతో సమానముగఁ జూచుచుండెను.

జులేఖాయొక్క ప్రవర్తన మాదర్శప్రాయమై మిక్కిలి శ్లాఘనీయముగ నుండెను. ఆమె కార్యదక్షతయు నాత్మనిగ్రహాణశక్తియు వర్ణనాతీతములై యుండెను. తన ప్రాణనాథుఁడు క్రూరశాత్రవానీకముచే దాను జూచుచుండ దెగటారినను జనకునికంటె నెక్కుడుగ బ్రేమించు మామగారికి దాను దూరమైనను, తన ముద్దులబిడ్డను గూడ వీడవలసి వచ్చినను నిజరమ్యహార్మ్యమున భోగభాగ్యములఁ దులదూగవలసిన తాను యెరుల యింట నూడిగము చేయవలసివచ్చినను, తుదకు ప్రాణప్రదమగు నైజమతమును త్యజింపవలసివచ్చినను, నాపరమసాధ్వి జితేంద్రియురాలై లీశమైనను వగవక తొంటి విషాదచారిత్రము నెన్నఁడైనఁ దలంపక గభీరతరస్వాంతయై సంచరించుట గాంచి నూర్జహానుసహితము మిక్కిలి యాశ్చర్యపడి "నాటి సర్వసుందరి తన ప్రాణనాథునితోడనే మరణించెను. ఈ జులేఖా వేఱొక వ్యక్తి" యుని భావించెను.

ఆమె సౌందర్యము కేవలము అద్వితీయ శోభాయమానమై యుండెను. "సర్వసుందరి" యను నామ మాసుగుణ రాశికి సార్థకముగ

నుండెను. కాని ఆమె నూర్జహానుయొక్క సంరక్షణలో నుండుటచే, నామెను గన్నెత్తి చూచుటకైన నెవ్వరు సాహసింపకుండిరి. సార్వభౌము పుత్రులు సహిత మామెను సమీపింపజాలకుండిరి. అట్టి జులేఖా సర్వాధికారియగు నూర్జహానుతోఁగూడి జగదద్భుతమగు మొగలాయి సామ్రాజ్యతంత్రమును నిరాఘాటముగ త్రిప్పుచుండెను.

## ౧౭

### నూర్జహాన్, జులేఖా

భువనైకసుందరియగు నూర్జహాను ఆతెలంగున నాలోచనాతత్పరియై యుండ, కడు నిశ్శబ్దముగ జులేఖా యామందిరము బ్రవేశించెను. ఆమె యమ్మహారాణి పార్శ్వమున నిలువఁబడి యుండెను. జులేఖా ప్రవేశించుట యామెయెఱుంగదు. కాని, ఆమె ప్రవేశించినంతనే యడుగుల సవ్వడి వినవచ్చుటచే నులికిపడి, ప్రక్కకు తిరిగి జులేఖాను గాంచి, మందహాస మొనరించుచు నూర్జహాను యిట్లనెను — "నీవు చేయఁబూను కార్య మెన్నఁడు కాకమానదని నేనెఱుంగుదును."

మిక్కిలి చనువుగలిగియుండుటచే జులేఖా నూర్జహాను పార్శ్వమున గూర్చుండి, చెంతనుండిన పసిడిపిడిగల వీవన నందుకొని మెల్లగ వీచుచు నిట్లనెను— "దేవీ! తమ సేవకురాలు తలపెట్టు కార్యము సదా సిద్ధించుచునే యుండును. అపజయ మెన్నఁడు నెరుంగదు."

జులేఖా చేతనుండిన సువర్ణమయ వింజామరము నందుకొని, మెల్ల మెల్లగ నిటు నటు త్రిప్పుచు నూర్జహాను యిట్లనెను — "మిత్రమా! నీగుణాతిశయ మనుదినము నాకానందదాయకముగ నుండును. బాలా! మందబుద్ధులగు మదీయ సేవకులు తెచ్చు సమాచారములను విశ్వసింపఁజాలము. కావున, గ్వాలియరు నగరమున బంధితుఁడైన ఖుస్రూ తెగవడెనను వదంతియం దెంతసత్యమున్నదో చెప్పుము."

జులేఖా: దేవీ! జహాంగీరు సార్వభౌముని పరిపాలనమున, బాహ్యప్రపంచ సమాచారములు దర్బారుకు దెలియుట దుర్లభముగ నున్నదిగదా?"

ఏలకో, నూర్జహాను కుపితస్వాంత యాయెను. కాని, ఆకోపమును లోలోన యడంచుకొని, ఆమె యెప్పటియట్లుండుటచే జులేఖా మఱల నిట్లు చెప్పదొడంగెను— "దేవీ! ఒకవేళ పైవార్తలు తెలియవచ్చినను, గోరంతలు కొండలై నానావికృతాకృతులు దాల్చియే వచ్చునుగదా! ఈ మొగలు మహాసామ్రాజ్యము విచ్ఛిన్నమగునేని, ఇట్టి దురాచారములవలననే యట్టి యుపద్రవము సంభవించును.

నూర్జహానునకు నాగ్రహము జనించెను. దివ్యసౌందర్యముగల యాయువతీ లలామకు యాగ్రహమొక వింతసోయగ మొసంగెను: అంత నామె గంభీరముగ నిట్లడిగెను— "జులేఖా! ఖుస్రూసమాచారమునం గల యదార్థము ముందుగ వక్కాణింపుము."

జులేఖా తత్క్షణమిట్లు ప్రత్యుత్తర మొసంగెను—" దేవీ! మూడేండ్లక్రిందటనే, ఖుస్రూ కారణమున ప్రమాదము సంభవించునని భావించి గ్వాలియరు కారాగృహాధికారి యాతని దెగటార్చెను."

మిక్కిలి యాతురముతో "మిత్రమా! నేనీవార్తను విశ్వసింపవచ్చునా" అని యడిగెను.

"దేవీ! శంకింపవలదు. గూఢచారునొకని ప్రత్యేకముగా గ్వాలియరుకు బంపి యీ సమాచారమును దెలిసికొంటిని. సూర్యుడుతూర్పు దిక్కున నుదయించుట యసత్యమగునేని, నాయీ సమాచారముకూడ నసత్యము కాగలదు."

"జులేఖా! నామనసిపుడు పదిలపడినది. సైన్యసమేతుండై ఖుస్రూ యాగ్రానగరముపై **దండెత్తునను** వదంతి యసత్యము కావలయునా కాను నీసమాచారమే సత్యము. నాసేవకులందఱు వట్టి దౌర్భాగ్యులగుటచే నెట్టిముఖ్యవిషయములలోనైనను గూఢవార్త దెలియుట దుర్ల

భముగనున్నది. నీవంటి మిత్రరత్నము నాయెండ నుండుటచేతనే గదా సమాచారములు స్పష్టముగఁ దెలియుచున్నవి! మిక్కిలి ప్రశంస నీయ మగు నీసేవ నెన్నఁడు మరువఁజాలను.”

జులేఖాసుందరవదన మెట్టబారెను. తోడనే ఆమె వినయశీలయగు టచే జక్రవర్తినికి మనమలర వీచుచు సవినయముగ నిట్లు బదులిడెను. “బీగముసాహెబా! నాయందలి ప్రేమచే నుదారవంతులగు తమరిట్లు సెలవిచ్చితిరిగాని దీనురాలగు తమ యీసేవకురాలి యందు వేరు వి శే షము లేదు.”

“ఢిల్లీనగరవార్తలగుఱించి యేమైన నరసియుంటివా?”

“దేవీ! తమకృపావిశేషముచే నాయధీనమున బెక్కండ్రు గూఢ చారులుగలరు. నోటనుండి మాట వచ్చుటయే తడవుగ నెట్టిసమాచా రమునైనను నవలీలగ నరసివత్తురు. అట్టివానినొకని ఢిల్లీనగరమునకంపి యుంటిని. ఆతడిపుడే యరుదెంచియున్నాడు.”

“వాడేమిచెప్పెను? అదంతయు వట్టిబూటకమేనా?”

“వట్టిబూటకమనరాదు. అందిసుమంత సత్యమున్నది. కాని, దేవీ! గోరంతవిషయమును గొండంతజేసి చెప్పుట జనులకాచారమైయున్నది గదా!”

“సత్యమే కాని ఢిల్లీ సమాచారమెఱిగింపుము. సింహద్వారమున మానవమృత కళేబరము నిజముగ గోచరించెనా?”

“దేవీ! వాస్తవమే కాని, సుందరాకారుఁడగు యువకునిమృతకళే బర మాత్రప్రదేశమున గోచరించి ఒకటిరెండు మాసములాయెను. నాటి నుండియు వదంతి వేయిరూపములు ధరించుచు తుదకు భయంకరాకా రముదాల్చి జనులను బాధించుచున్నది.”

“అట్లయిన, ఢిల్లీనగరసింహద్వారమున నొక్కమానవ మృతకళేబ రముమాత్రమే గోచరమైయుండెనని మేముగ్రహింపవలయునుగదా?”

జులేఖా హైన్యస్వరము వహించి మందమున నిట్లుబదులిడెను— " దేవీ ! నాచారుఁడు ఢిల్లీనగరము జేరినదినముననే మఱియొక మానవ మృతకళేబరము తొంటితెఱంగుననే ప్రదర్శింపఁబడియుండెను. "

నూర్జహానుకు విస్మయము జనించెను—" అట్లైనజనులు భయభ్రాంతులగుటకు దగుకారణమున్నదనియే స్పష్టమగుచున్నదే "

" దేవీ ? జనులుచెప్పుకొనునట్లు వందలకొలది మానవమృత కళేబరములు గోచరించుటలేదు. మూఁడుమాత్రమే గదా గోచరమాయెను. "

నూర్జహాను యొక్క సుందరవదనారవింద మొక్కింత వివర్ణమాయెను. " చెలీ ! మూఁడేయగుగాక ! జనులు భయభ్రాంతులగుటకు జాలదా ? "

" దేవీ ? మఱియొక ముఖ్యవిషయము నెఱింగింపవలసియున్నది. ఈ విషయము మఱియొకరికి దెలియదనియే విశ్వసింతును. "

నూర్జహాను యాతుర మధికమాయెను—" చెలీ ! మఱియెట్టి సమాచారము నెఱింగింతువో శీఘ్రముగ జెప్పుము. "

ఎవ్వరైన బొంచియుండి వినెదరేమో యనునట్లులు మిక్కిలి మెల్లగ జులేఖా యిట్లు చెప్పెను— " దేవీ ! ఏమని విన్నవింతును ! ఈసమయమున వధ్యుఁడైన వాఁడు నూతనముగ మేవారు రాజ్యసింహాసనము నలంకరించిన కర్ణాసింగు సుమా ? "

" ఏమీ ! నీవేమంటివి ! జులేఖా ! " నూర్జహాను ఒక్కసారి నంత నాశ్చర్యమగ్న మానసమాయెను. ఆమె పట్టఁజాలక దిగ్గున లేవవలసినదేగాని, ఆమె యుక్తాయుక్తముల నెఱింగిన యువతీలలామయగుటచే వానిని వారించియు, నబ్బురపాటుతో గొబ్బున మఱల నిట్లనెను— " ఏమీ ! జులేఖా ! కర్ణాసింగా ! "

" ఈ సమాచార మింకొకరికిఁ దెలియదు సుమా వెనుకటి రెండు సారులువలెనే ఈసమయమున గూడ శవము పూర్తిగ దిగంబరముగ

నుండెను. అట్టి శవముంగాంచి యెవ్వరైనను నాశరీరధారుని గుర్తింపఁ జాలరు. ఆశవమట్లు ఒక్కదినముండెను. మఱునాడు యమునానదీప్రవాహమునఁ ద్రోయఁబడెను—"

"ఆతఁడు కర్ణాసింగు అని నీకెట్లు తెలిసినది ?"

"దేవీ ! నేను పంపిన చారుఁడు కడు నేర్పరియగుటచేతను, వానికి కర్ణాసింగుతో మిక్కిలి పరిచయముండుటచేత, వాఁడు గుర్తింపజాలెను. వాని వచనములను శంకింప నవసరములేదు మృతకళేబరము నిక్కముగ కర్ణాసింగుదే యైయుండును."

తనడెందమున బొంగిపొరలుచుండిన యానందమును వారింపఁజాలక, మందస్మితవదనారవిందయై నూర్జహాను యిట్లు తన సంతసమును వెలిబుచ్చెను — "జులేఖా ? నామార్గమున కడ్డునిలిచియుండు గండు పాషాణ మొకటి తొలంగెగదా !"

"దేవీ ! సందియ మేమి !"

"జులేఖా ! అజితసింహుఁడు గొప్పకార్యదక్షుఁడని విశ్వసించియుంటినిగాని, అతఁడుకూడ నక్కరకు రాకపోయెనే."

జులేఖాయొక్కసారి పక్కున నవ్వి యిట్లనెను: "దేవీ ! రసపుత్ర వీరులు భూతములన్నను మిక్కిలి వెరతురు."

"ఆ వదంతియందు యదార్థమేమైన నుండునని నీవు విశ్వసింతువా ? నీయభిప్రాయమేమి ?"

"మనము వినునదంతయు సత్యముకాజాలదు కాని, కొంతనిజముండకపోదని నేనువిశ్వసింతును. దేవీ ! మీకారణముననే గదా యజితసింగు సిక్రీనగరమునకు వెడలియుండెను ?"

"అవును కాని, కతంబెద్దియో వానికిఁ దెలియదు."

"దేవీ నీవుపంపుటకుగల కారణముగూడ నాతని కెఱింగించినచో బాగుండెడిదిసుమా !"

" అట్లు కాదు. ఆరహస్యము నింకను నెఱింగిపం రాదు. "

" అట్లేయగుగాక కాని, దేవి! అతిరహస్యముగ జరుగుచున్న యీ కుట్రకు భీమసింగు మహాబతుఖాను లిర్వురు నాయకులని యేమో నీవు నిక్కముగ విశ్వసింతువా ? "

" చెలీ ! నిక్కము దాపనేల ? నేనట్లే గట్టిగ ననుమానింపవలసియున్నది. ఏమైననుఁ మొదటినుండియు జాగ్రత్తగ నుంపుట క్షేమకరము గదా ? "

చిరునవ్వునవ్వుచు జులేఖా యిట్లనెను—" పాదషాబీగము సాహెబా! హైందవబీగమునకు జనించుపాదుషాపుత్రుడు మొగలాయి సామ్రాజ్యాభిషిక్తుడగు నవకాశము నీవు సహింపజాలవుసుమా ! "

తోడనే అన్మహారాణి ముద్దుమోము యెఱ్ఱబారెను. ఆమె యుద్రేకపూరితయాయెనని యామె స్పష్టముగ గోచరించుచుండెను.

" జులేఖా ! కేవలమట్లన రాదు. నేనట్లనఁజాలను. "

అంతలో హఠాత్తుగ భీతచేతస్కులై వారిరువురు ఒకరి మోము నొకరు చూచుచు దశదిశల దిలకింపఁసాగిరి. హఠాత్తుగ బీగముమహలునందు గొప్ప గంద్రగోళము జనించెను. ఏలకో, పరిచారకలందఱు నిటునటు నాతురముతో దిరుగాడుచుండిరి. విచ్చుకత్తులను జక్కగ సవరించుచు ఝుళిపించుచు కొజ్జాలు తమతమ స్థానములందు దీవ్రతరముగ గస్తుతిరుగ నారంభించిరి. బీగము మహలు యొక్క బహిఃప్రదేశము మిక్కిలి కోలాహలముగ నుండెను. ఏమియుఁదోచక నూర్జహాను జులేఖానుగాంచి " ఏమి ! యీగంద్రగోళము ! " అని యడిగెను.

గవాక్షమును డాసి జులేఖా రాజమార్గమున నిటునటు గలకింప సాగెను. " దేవి ! పట్టినసందడియే గాని ఎంతజూచినను ఏమియుఁ గానరాకున్నది. కర్మవశమున నెద్దియో గొప్పవిపత్తు ..... "

గభీరస్వాంతయగు నూర్జహాను మిక్కిలి తల్లడిల్లి యుద్రేకముతో

17

నిట్లనెను—"సార్వభౌముఁడు దీర్ఘాయుష్మంతుఁడగుగాక! నాప్రాణనాథునకెట్టి ప్రమాదము సంభవించి యుండదుగదా! హా! చెలీ! జులేఖా! నూర్జహానువంటి యదృష్టవంతురాలు లేదని లోకులు చెప్పకొనుటయేగాని వారి వాక్యములెంత యసంబద్ధములు?"

అట్లు వాపోయుచు నూర్జహానుకూడ గవాక్షమును సమీపించెను. ఆ నగరు మిక్కిలి యున్నతముగ నుండుటచే నతివిశాలమగు నమ్మహాదుర్గప్రదేశమంతయుఁ జక్కగా గోచరించును. కాని, ఎంతపరికించినను ఎద్దియో గందరగోళము పుట్టెననితప్పవిశేషమేమియు దెలియకుండెను. అంత నామహారాణి తన చెలికత్తెను గాంచి యిట్లు పలికెను.

జులేఖా! నీవు యతిత్వరితముగబోయి ఈ యాందోళనమేమియో దీనికి గతంబెద్దియో యూరసి నిమేషమాత్రమున రావలయునుమా! మత్ప్రాణనాథునకెట్టి యిక్కట్టైన సంభవించునేని నాకు ముందుగఁ దెలియవలయునే."

మహారాణి యాజ్ఞ ననుసరించి జులేఖా నిష్క్రమింపనుండిన ముహూర్తమున నొక దాసి రివ్వున నేతెంచెను. ఆమె యెంతశీఘ్రముగ బ్రయాణ మొనరించి యుండెనోగాని, మహారాణి కెద్దియో ముఖ్యాంశము నెఱింగింపనేతెంచిన యబ్బాలిక ఆయాసము కతంబున మాటలాడ నేరకపోయెను. మహారాణి మనసు పరిపరివిధములు పోవుచుండెను. కారణమున సహింపఁజాలక కోపాటోపంబున నూర్జహాను యిట్లు గర్జించెను.

"ఓసీ సైతాన్! మాట్లాడ నేరనిదాన వేల వచ్చితివి? జులేఖా! ఈ దయ్యమును మష్రూకొజ్జావద్దకు బంపివేయుము."

మష్రూవద్దకుఁ బోవువారు మగుడ నేతెంచుట యుండదు. పాపము! అట్టి దౌర్భాగ్యు లేమాయెదరో కూడ నేరికిఁదెలియదు కావున, నూర్జహానుయొక్క యాజ్ఞను వినినంతనే మాటాడనేరక నిలుచుండిన

దాసి ప్రాణము లప్పుడే పోవునట్లు డిల్లపోయెను. భయకంపితయై గజ గజ వడఁకుచు నిలువనేరక మొదలు నఱికిన తరువువలె గుభాలున నేలగూలి, ఎట్టులో కరములు రెండు జూచి, నూర్జహాను యొక్క పాదకమలములను బట్టబోవ, నాంబోళనముచే క్రోధైకధురీణయై యుండిన యమ్మహారాణి యిట్లు గర్జించెను— "ఏమే, సైతాన్! ఇప్పుడైన నీసమాచారము తక్షణ మెఱింగింపుము."

తోడనే, ఆ దాసి నిలిచి భీతిచే నింకను గడగడ వడఁకుచు ముకుళితకరకమలయై, పంచప్రాణములను బిగియఁబట్టి సవినయముగ నిట్లు చెప్పఁగడంగెను—"షాజాడా—"

"షాహజాడాకేమి సంభవించినది ?"

"ఆ ప్రభువు—ఆగ్రానగరమునుండి పారిపోయెను."

"ఓహో! ఇంతేగదా! నేనూరక భయభ్రాంతనైతిని. ఓసీ! అట్లు పాఱిన షాజాడా యెవ్వరు ?"

"ఖరీమ్, షాజాడా."

"దౌర్భాగ్యురాలా! నీవింక పొమ్ము."

మృత్యుదేవత కాహుతి కావలసిన యాదాసికి గలిగినసంతసమునకు హద్దులేదు. నూర్జహానుయొక్క కృపాతిశయము ననేక తెరంగులు లోలోన నభినందించుచు, తన యదృష్టమున కెంతయు సంతసించుచు దేవుఁడు దయామయుఁడని నుతించుచు నాదాసి నిష్క్రమించెను. అనంతరము మహారాణిని సమీపించి, జులేఖా మెల్లగ నిట్లనెను. "దేవి మీ కీసమాచార మంతకుమునుపే తెలిసియుండును సుమా ?"

జులేఖా మోము నొక్కసారి తీక్షణముగ గాంచి నూర్జహాను యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

"అవును, నాకీసమాచారము చాలకాలమునుండియు దెలియును. అశ్చర్యముతో "చాలకాలమునుండియు దెలియునా ?"

"అవును, జులేఖా. మనదర్బారునందు సూక్ష్మగ్రాహి యొక్కడు వుండేనేని, ఈషాహజాడా శత్రుపక్షము జేరెనని చాలకాలము క్రిందనే గ్రహించి యుండెడివాడు. చాలకాలమునుండియు ఖుర్రము దర్బారునందు గాన్పించుటలేదు. మూఢాత్ములగు మన యుద్యోగులింతకాలము గడచినపిమ్మట కండ్లు తెరచి నేడుగందరగోళము కావించుచున్నారు!"

"దేవీ! శత్రువులని చెప్పువారెవ్వరు?" అని సవినయముగ జులేఖా ప్రశ్నించెను. తోడనే, మహారాణి యుద్రేక పూరితయై యి ట్లుబదులిడెను—"మన శత్రువు లెవ్వరా? నీకు దెలియదా? మిక్కిలి యాశ్చర్యకరముగ నున్నది. నీకు దెలిసి యుండవలెను—నావలన నీవు వినగోరెదుగాబోలు? మేవారు మన విరోధి. కర్ణాసింగుసునవైరి. భీమ సింగు మనకు బరమశాత్రవుడు. ఆపాలుబోతు, మహాబతుఖాను కూడ నట్టివాడే. మన శత్రువులెవ్వరో నీకిపుడు తెలిసినదా?

## ౧౮

### జులేఖా

నూర్జహాను యెద్దియో యాలోచించుకొనుచుండ, జులేఖా యావల కేగి ఎన్నియోగదులు దాటుకొని ఎచ్చటకో శీఘ్రముగ బోవుచుం డెను. అంత హఠాత్తుగ నామె కెద్దియో యొకభావము తలంపునకు వచ్చుటచే మార్గమధ్యమున నొక్కింత యాగి ఆమె ధ్యానైకతత్పర యాయెను. ఆసుందరి వదనారవింద మొక్కింత వాడిపోయెను. కాని, వెంటనే తన సహజధైర్యమును దెచ్చికొని మందస్మిత వదనారవిందయై యామె మఱుగ బోసాగెను.

అత్యద్భుతమగు నాబీగము మహాలుయొక్క యడుగుభాగమున వేఱొక మహాలుండెను. దానినే "షీస్" మహాలందురు. భూగర్భ మున నుండిన యామహాలే జులేఖాకు గమ్యస్థానమై యుండెను. మూర్గ

మధ్యమున బీగము మహాలునందలి దాసిలును పరిచారికలును, నామెకు గోచరించుచుండిరి. వారినందఱిని నుచితరీతిని సరసముగ బలుకరించుచు వారివారి కుశలము ప్రశ్నించుచు నామెపోవుచుండెను. ఆమహాలు నందలి వారందఱు నామె నెఱింగి యుండుటయేగాక, నామె నూర్జహానుకు నత్యంత ప్రియమగు పరిచారిక యగుటచేతను, తనసహజ సద్గుణగణాతిశయముచే నెల్లరి హృదయము నాకర్షించియుండుటచేతను నామెను వారెల్లరు భయభక్తులతో గౌరవించుచుండుటచే వారి నందఱిని నామె పలుకరించుచు బోవలసియుండెను.

పాఠకులు గ్రహింపగలుగుటకై, భూగర్భమున నుండిన మహాలు గుఱించి కొంచెము వర్ణింపవలసియున్నది. అందు చిన్నచిన్న మందిరములనేకములు బారులు తీర్చియుండెను. నేలబారున బడియుండు తలుపులను దెఱచి, మెట్లుదిగి యామందిరములలో జొరనగును. ఆయామందిరములన్నియు నంధకార బంధురములై యుండెను. సాధారణముగ నందు జనులు నివసించు నాచారము లేకుండుటచే గడు నిశ్శబ్దముగ నుండెను. అంధకార బంధురముగ నుండుటచేతను, అతి నిశ్శబ్దముగ నుండుటచేతను, నిర్జన ప్రదేశమై యుండుటచేతను నాప్రదేశమునకు బోవుట మిక్కిలి కష్టముగ నుండును. గాఢాంధకార బంధురమై యుండిన యామార్గము ననుసరించి జులేఖా పోవుచుండెను. ఆప్రదేశమంతయు నామెకు మిక్కిలి పరిచయమైయుండుటచే నామె పోజాలియుండెను గాని ఆమె కేమియు గోచరించుటలేదు. అభ్యాసవశమున మార్గమునఁ బోవు నంధులవలె నామె పోవుచుండెనేగాని, ఒక్కయడుగు దూరమున నెవరైన నున్నను నామె చూచుట దుర్లభము. అట్టిప్రదేశమున నామె మెట్ల ననుసరించి పోవుచు నొకస్థలమున నాగి నల్దిశలు నామె లెస్సగ బరిశీలించెను. దూరముగ నుండిన బీగము మహాలు నందలి సందడులు మిక్కిలి మందముగ మాత్రము వినసగుచుండెను.

తన సమీపమున నెవ్వరైన నక్కియుందు రేమోయని యిటునటు నత్యాతురముతో జూచెనుగాని యట్టి యుపద్రవ మేదియు గోచరింపలేదు. అట్లామె వెరచుటకు దగు కారణము లేకపోలేదు. అట్టి కటికచీకటియందు నెట్టిప్రమాదమైనను సంభవింపవచ్చును. పక్కనెవ్వరైననుండి యొక్కపోటు పొడిచినచో తారున మరణించుటతప్పఅడ్డగించి రక్షించువా రెవ్వరు నుండరు. ఆ తెరంగున నందెందరు మరణించి యుండిరో లెక్కలేదు. ఆకారణమున నూపిరిబిగియబట్టి, తన పంచేంద్రియముల సామర్థ్యమును నొక్కకర్ణప్రదేశముననే కేంద్రీకరించి యెంత ప్రయత్నించినను, ఎట్టిశబ్దమైనను నామెకువినుపింపలేదు. కానిఅనుమాన మామెను బాధించుచుండుటచే నచ్చటి గదులన్నింటిని లెస్సగ బరిశీలించెను. అనంతర మామెయొక మెట్లువరుసవైపు పోయెను. ఆప్రదేశమంతయు గడుగాఢాంధకారబంధురమై యుండెను. తన కరచరణాదులే యామెకు గోచరింపకుండెను. చీకటియనెడు మహాసాగరమున నామె మునిగి యుండినటులుండెను. అచటి నిశ్శబ్దము కడుంగడు దుర్భరముగను భయంకరముగను నుండెను. అట్టిసమయమున నామెకొక మినుకు మినుకు లాడుచుండిన సన్నని దీపమొకటి దవ్వున గోచరించెను. తోడనే ఆమె హృదయతాప మినుమడించెను. భయాశ్చర్యములకు లోనై యామె మిక్కిలి జాగ్రతగ ముందుకు బోయెను. తనయడుగుల సవ్వడి తనకే వినుపింపకుండునంత నిశ్శబ్దముగ నడచుచుండెను. ఒరుల సవ్వడియేమైన వినవచ్చునేమోయని ఆమె మధ్యమధ్యనిలుచుచుండెను. అంతలో హఠాత్తుగ నెద్దియో యామెపై గుభాలున పడినటులాయెను. తోడనే ఆమె నిర్ఘాంతపడెను. ఆమె మనసంతయు నొక్కసారి జిత్తువోయెను. తనకెట్టి యుపద్రవము సంభవించెనో గ్రహింపగలుగుటకు ముందుగనే, ఎవ్వరో యామెనోట గుడ్డలు గ్రుక్కిరి. ఆ తమోసాగరమున నెవ్వరట్టి దుండగము నొనరించిరో తెలిసికొనుట కవకా

శము లేకపోయెను. నోరు బంధింపబడి యుండుటచే ప్రశ్నించుటకైన నవకాశము కూడ లేకపోయెను. పాపము! మొగలాయి సామ్రాజ్యమును నిరంకుశముగ శాసింపజాలిన నూర్జహానునకు సమంగు చెలియైయొప్పు జులేఖాకు నెట్టియుపద్రవము! విధివిధాన మిట్టులేయుండుగదా?

అట్టివిషమావస్థయందు హఠాత్తుగ దగుల్కొనినను మనోనిబ్బరము గల మానినియగుటచే జులేఖా ధైర్యము జిక్కబట్టి సంభవించినప్రమాదమునుండి తప్పుకొనుటకెట్టి యవకాశమైన నుండునేమోయని యాధీర విచార యాలోచింప గడంగెను. కాని, ఆహంతకు లెవ్వరోయామె కాలేతులను బిగియగట్టుటచే నామె ధైర్యమంతయు వమ్మయ్యెను. వారేమిచేయుదురోయని యామె నిరీక్షించుచుండ నాహంతకు లామెను సాయముబట్టి స్థలాంతరమునకు గొంపోవుచుండిరి.

తోడనే ఆమెధైర్యమంతయు జెదరిపోయెను. ఆపరమసాధ్వీభయవిహ్వలయై, అంత మొనరించిన హంతకు లింకెట్టి దారుణకృత్యము నొనరింతురోయని కరంబువెరచుచు నట్టి కష్టసాగరము నతిక్రమించుటకు మాధవ పదారవింద ధ్యానంబు తప్ప వేఱొండు తప్పలేదని నిశ్చయించుకొనెను.

ఆమె నోరు మొదటనే బంధింపబడెను. అనంతరము నయనములు కూడ మూయబడెను. ఆప్రదేశ మంతయు నామెకు మిక్కిలి పరిచయమైనదే యైనను, ఆహంతకు లెచటికి గొంపోవుచుండిరో యామెకు తెలియకుండెను. దుర్భరమగునట్టి యవస్థను పాఠకులే యాలోచించుకొని గుర్తింపవలయుగాని వర్ణింపనలవికాదు.

జులేఖా బీగము మహాలు ప్రవేశించి సుమారు పది సంవత్సరములాయెను. ఎంతటి వారలైనను నామెను గాంచునంతనే భయభక్తులతో నామెకు ప్రణమిల్లు వారలేగాని ఎదుటబడి యొక్క పరుషవాక్యమునైన నాడజాలకుండిరి. ఆమెను నూర్జహాను మిక్కిలి ప్రేమించుచుం

డుటచే పెద్దపెద్ద సైన్యాధిపతులు సహిత మామెను భయభక్తులతో గారవించుచుండిరి. నూర్జహానుయొక్క యనుగ్రహము నపేక్షించువారు ముందుగ జులేఖానే మిక్కుటముగ నాశ్రయించుచుండిరి. అంత మాత్రమున నామె కాబీగము మహలునందు శత్రువులు లేకపోలేదు. ఆమె యౌన్నత్యము గాంచి యనేకులు మత్సరించియుండిరి. ఒకపెద్ద నగరమువలె నుండిన యామహలునందు నిరంతరము దిరుగాడు వేనవేల జీవులలో నెవ్వరు యెవ్వరికి శత్రువులో నేరికిని దెలియకుండెను. అట్టి యమానుష కృత్యమునకు గడంగిన హంతకుల యూహ లెటులుండునో జులేఖాకు దెలియకుండెను. మానవవేషధారులగు నారక్కసులు తన్నువధింపనెంచిరేమోయని యామెకు వెరపు జనించెను. నూర్జహాను కావృత్తాంతము తెలిసియుండునా, యుండదా అని యామెచింతింపదొడంగెను. దుర్భరమగు నిట్టి దైన్యావస్థ కాయువతీలలామ యెన్నడు బాల్పడి యుండలేదు.

అంతలో నాహంతకు లామె నొకప్రదేశమున దింపివైచిరి. తోడనే కాల్చేతులు కలియగట్టిన పాశమును విప్పివైచిరి. నోటగ్రుక్కిన గుడ్డలను గూడ దీసివైచిరి. ఆ క్షణముననే యాహంతకులు గూడ నతిరయమున బాఱిపోయిరి. చేతులు స్వాధీనమగుటచే జులేఖా తనకండ్లకు గట్టియుండిన గంతను విప్పివైచి, తనకట్టి భంగపాటు నొనరింప సాహసించిన వారలెవ్వరో యరయ బ్రయత్నించెనుగాని, ఆ హంతకులు నల్లని ముసుగులతో బూర్ణముగ డాగి యుండుటచేతను, వారు శరవేగమున పాఱుచుండుటచేతను, వారి నామె గుర్తింపజాలదాయెను. జులేఖా యింకను బరిశీలనగా జూచు నవకాశము గలుగకుండగనే యారక్కసు లంతరించిరి.

ఆ హంతకు లెవ్వరైనను, ఒంటరిగా దొరకిన జులేఖాకు మానభంగముగాని ప్రాణభంగముగాని నొనరింపకయే విడిచివైచిరి, కాని,

తా నుండిన ప్రదేశమును బరిశీలింప జానొక సొరంగమున బంధింపఁ బడియుంటినని యామానవతి దెలిసికొనెను. ఆకోణమున నొక్కచో ద్వారముండెను. ఆయొక్క ద్వారము మూయఁబడి యుండెను. ఆ హంతకులను వెంబడించుట నిరర్థకమని యెంచి యట్లొనరింపక, తానెచట నుండునో గ్రహించుటకై యామె దీర్ఘముగ విచారించెను. ఇంతవఱకును మొగలాయి బీగము మహాలునందలి నిగూఢప్రదేశములన్నియు దనకంటె నెక్కుడుగ దెలిసిన వారెవరు నుండరని జులేఖా గర్వపడుచుండెను. అట్టి వనితామణి దానిపు డెచట నుండెనో, దెలిసికొనఁ జాలకుండుటకంటె నెక్కుడు పరాభవమేమి కావలయు? పరాభవము మాట యటుండ, ఆ చీకటికోణమునకు గల ద్వారమొక్కటియు బంధింపఁబడియుండెను. రెండవ దిక్కు ననుసరించి పోవుదమన్న, గాఢాంధకార బంధురమై యుండిన యప్ప్రదేశమున ముందు నేముండెనో, యడుగు వేసినచో నాయడు గెచటపడునో యెట్టిప్రమాదము సంభవించునో పోనీ దిట్టరియై యెట్టి కష్టమునైన నోరిచి ముందుకు బోవుదమన్న, నా మార్గమెచటికి గొంపోవునో దెలిసికొనుట దుర్లభముగ నుండెను. అట్టి విషమావస్థయందు దగుల్కొని యుండిన యా నారీమణి కేమి చేయుటకును దోపకుండెను. చిత్తవిభ్రమముచే డెందము పరిపరివిధముల బరుగులిడుచుండెను. చతుస్సముద్రముద్రిత మహీమండలమును నిరాఘాటముగ శాసించు నూర్జహానుకు ననుంగు నెచ్చెలియై, కుసుమ గుచ్ఛంబువలె సకలజన మస్తక ప్రదేశమున విలసిల్లు సాధ్వీమణి యా కటిక చీఁకటి కోణమున గృశించి మరణింపవలసిన దేనా! ఆ యుద్యాన ప్రదేశమున నామె దురవస్థను గమనించి యామెనుద్ధరించు వారలెవరు? గత్యంతరములేక యాసాధ్వి యార్తత్రాణ పరాయణుండగు భగవంతుని ధ్యానింపఁ గడంగెను. కాని, తగు పురుషప్రయత్నముండినఁగదా దైవసహాయము సిద్ధించును! కాఁబట్టి పంకిలమున దగుల్కొని

యుండిన యీ సుందరి తరుణోపాయము గుఱించి మఱల విచారింపఁ గడంగెను. ఆ హంతకు లెట్టివారలైనను దనను గడతేర్చుట మాత్రము వారి సంకల్పమై యుండఁజాలదనియు, అంతటి సాహసకార్యమునకుం గడంగిన హంతకులు మిక్కిలి పెద్దవారల ప్రేరేపణచేతనే యట్లొనరించి యుందురనియు నామె గుర్తించెను. కాని, తరుణోపాయమేమి? ఆ సాధ్వి ప్రాణములు బిగియబట్టి యతి భద్రముగ రెండడుగులు వేయ, నొక సన్నని మార్గమాకోణమున నుండెనని తెలియవచ్చెను. తోడనే యామె యాశ్చర్య స్వాంతయాయెను. తన కతిపరిచితమగు బీగము మహలునందు దనకు దెలియని కటిక ప్రదేశముండుటయు, హఠాత్తుగ నందు నొక దారి గోచరించుటయు నామెకు విస్మయము గలిగించెను. కాని, ఆదారిని విశ్వసించి యేగినచో నెట్టిమోసము సంభవించునో, ఆదారి యెచటి కేఁగునో, అగమ్యముగ నుండిన మార్గమధ్యమున నెట్టి ప్రమాదము సంభవించునో దెలిసికొనుటకు సాధ్యము కాకుండెను. కాని, మార్గాంతరము లేకుండుటచే నెంత ప్రమాదకరముగ నుండినను సాహసించి యట్లు పోవుటయో, లేక, యటనిలిచి కృశించి జీర్ణించుటయో నిశ్చయింప వలసియుండెను. ఆమె ధైర్యవంతురాలగుటచే నామార్గము ననుసరించి పోవుటయే యాచరణీయమనియు ప్రాణములుండునంత కాలము ప్రయత్నము విడువరాదనియు నిశ్చయించుకొనెను.

అట్లు కృతనిశ్చయయై యాసాధ్వి మఱి రెండడుగులు వైచెను. తన యడుగుల సవ్వడికి దానే భీతిల్లి యాకోమలాంగి యట నిలిచి వికల స్వాంతయై పంచేంద్రియములను కర్ణస్థానముననే కేంద్రీకరించి, ఇతర చేష్ట లుడిగి ధ్యానైక తత్పరయైయుండ, దవ్వున నొక సన్నని శబ్దముద్భవించినటులాయెను. నిజముగ నట్టి శబ్దము శ్రవణగోచరమాయెనో లేక కేవలము మనోవైకల్యమో యా పడంతి గ్రహింపఁజాలకుండుటచే,

నామె కలవరము సహస్రాధిక మాయెను. సహజముగ గభీరస్వాంత యగు నయ్యింతి ధైర్యమంతయుఁ జెదరిపోయెను. యుల్లము ఝల్లుమన దేహమంతయు గగుర్పొడచెను. ఆవిద్యుల్లతాంగి తనువంతయుబూర్తిగ గంపించెను. తాను నిలుచుండెనో కుప్పవలె నేల గూలుచుండెనో సహితమామె యెఱుంగకుండెను. వెఱపెట్టిదో యెరుంగని యాధీరురాలి కాసమయమున జనించిన భయము కేవలము వర్ణనాతీతమై యుండెను. ఐనను, సహజముగనామె ధీరచిత్తయగుటచే పాఱుచుండిన చిత్తమును జేరఁదీసి చెదరిన ధైర్యమునుఁ జిక్కఁబట్టి, సర్వవ్యాపియు దయాస్వరూపియునగు దైవమునే మఱల మఱల స్మరింపగడంగెను. సర్వాంగముల నదిమిపట్టి, మగుడ నెట్టి శబ్దమైనను విననగునేమో యని యా తలోదరి తదేకధ్యానముగ నుండెను. కాని, ఆసాధ్వి భగ్నమనోరథ యాయెను. ఎట్టిశబ్దమైనను నామె వీనుల బడకుండెను. తోడనే, ధైర్యమంతయు మఱల జెదర నామెభయవిహ్వల యాయెను. భయమనెడు సాగరమున నామె పూర్తిగ మునిఁగిపోయెను.

ప్రయత్నము విడువరాదని గట్టిగ నిశ్చయించుకొని యుండుటచే నామె మఱల ధైర్యము వహించెను. బాహ్యప్రపంచమునందలి సవ్వడి యిసుమంతయైనను, వినరాకుండుటచే దాను 'షిస్' మహలున లేననియు, తనను వేరొకప్రదేశమున నారక్కసులు డించి పోయిరనియు జులేఖా యోచించెను. ఇఁక నాలోచనతో బ్రొద్దు పుచ్చుట యవివేకమని యెంచి యగమ్యముగ నుండిన యాసన్నని మార్గము ననుసరించియే యామె ప్రయాణమొనరింపదొడంగెను.

ఆమె యెంతదూరమా మార్గమున బోయియుండెనో యామెకే తెలియదు. ద్వారముగోచరించునేమోయని భయభ్రాంతయైతత్తరపాటుతో పరీక్షించుచుండ, హఠాత్తుగ దన కెదురుగనొక పెద్దగోడ నిలిచి యుండుట గోచరించుటచే, ధైర్య మంతయు మఱల జెదరిపో

యెను. ఆమె కాసమయమున జనించిన నిరాశ కేవలము వర్ణనాతీతమై యుండెను. డెందము దిగులొందుటచే నామె హృదయము సహస్రాధికముగ గొట్టుకొన సాగెను. కరచరణాదుల పట్టువదల, బెండువలె నాసాధ్వి తూలిపోవుచుండెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములు సహితము నిలిచిపోయెను. ఆయధ్వానపు ప్రదేశమున మలమల మాడి దిక్కుమాలిన పక్షివలె జచ్చుటతప్ప గత్యంతరము లేదని యామె నిశ్చయించుకొనెను. కాని, ఒక్కొకప్పుడట్టి దుర్భరమగు నసహాయత్వమే ధైర్యము గలిగించుచుండును అట్టులే, వివేకవంతురాలగు జులేఖా చెదరిన హృదయమును వజ్రమువలె గట్టిపఱచి కొనెను. అంతలో మరల నొకశబ్దము వినులఁబడుటచే నామె పులకాంకిత శరీరయాయెను. తొంటిశబ్దమువలె నయ్యది చిత్త విభ్రమమేమోయని యామె భావించెను. కాని దూరముననుండిన మనుజుల సవ్వడియు, వారి కోలాహల ధ్వానములుకూడ నతి మందముగను నవ్యక్తముగను వినవచ్చెను. తోడనే, శుష్కించినయాశాలతమరలజిగిర్చెను. దుర్భర దారిద్ర్యభారమును సహింపజాలక జీవనము నిరర్థకమని యెంచి, మరణమే శరణ్యమని భావించి, ఆత్మహత్యగావింపఁబూను నిఱుపేదకు హఠాత్తుగ బెన్నిధి గోచరించినచో వాడెంత సంతసించునో, జులేఖాకు గూడ నట్టి సంతసమే యుదయించెను. కాని, అదంతయు వట్టి భ్రమయేయగునేమోయని వెరచి, తనపంచేంద్రియములను కర్ణములందే కేంద్రీకరించి యామెధ్యానైకతత్పరయై యుండెను. అంతసుధాపానముచేమైమరచు విషయలోలుల యవ్యక్త కోలాహలధ్వానములు విస్పష్టముగ వినులఁబడి ఆసాధ్వికి బ్రహ్మానందము గలిగించెను. జీవలోకమును సమీపించితినని యాతరుణి యానందపరవశయాయెను. కాని దయ్యమువలె నడ్డుగ నిలిచియుండిన కుడ్యము నతిక్రమించుటెట్లు ? ఆమెకు మఱల నిరాశజనించెను. ఇకమరణము తప్ప వేఱు శరణ్యములేదని

యయ్యింతి నిశ్చయించుకొని మాధవపదారవిందములనే విశ్వసించియు వికలహృదయయై యుండ, నామెకు హఠాత్తుగ నాగోడయందొక ద్వారము గోచరించెను. చీకటిగ నుండుటచే నా ద్వారము నామె మొదట గాంచజాలకపోయెను. తోడనే వర్ణనాతీతమగు నానందమనెడు ప్రవాహమున నామెకొట్టుకొని పోయెను.

గాఢాంధకారమయమైయుండిన నావిజనప్రదేశమున శుష్కించి మరణించుటయే శరణ్యమని నిరాశ జేసికొనియుండిన జులేఖా విశాల లోచనంబు లశ్రుజల పూరితంబులాయెను. తోడనే ఆతలుపును గట్టిగ ద్రోయ, నయ్యది విడిదారి నొసంగెను. పైలోకమునకుజేర్చు సోపాన పరంపరలాయింతికి హృదయపర్వముగావించెను. అప్పుడామెకు గలిగిన సంతసము నెవరు వర్ణింపగలరు? పెన్నిధిగాంచిన పేదవలె నాసాధ్వి యానందపరవశయై యుండుటచే నాదారి యెచటికి బోవునోవిచారింపక సంతసముచేదూలిపోవుచునా మెయాసోపానములనారోహింపగడంగెను. ఆసుదతి వేలు విచారమెటుంగక పోవుగొలది, భోగపరాయణుల తొంటి యవ్యక్తకోలాహల ధ్వానములు చక్కగ వినవచ్చుచుండెను. విషయానురక్తులగు జవ్వనులు తప్పద్రావి మైమఱచి స్వైరవిహార మొనరించుచుండిరని యామె గ్రహింపగలిగెను. అదియొక బీగము రొక్క మందిరమై యుండునని యామె గుర్తించెను. కాని ఆమందిర మెవ్వరిదై యుండునో తాను గుర్తింపజాలకుండుటచే నామె కెంతయో విస్మయముకలిగెను.

సోపాన పరంపరల నన్నింటి నతిక్రమించిన పిమ్మట నొక విశాల మగు చావిడిలో నామె ప్రవేశించెను. ఆమందిరము సముచితముగ నలంకరింపబడి నానావిధపరిమళ పదార్థములచే నిండియుండెను. పాతాళమునుండి వెలువడిన యవ్వనితామణి కాప్రదేశము మిక్కిలి యానంద దాయకముగ నుండెను. కాని, రెండడుగులువైచి ముందు కేగి

నంతనే గోచరించిన ప్రదర్శన మామెకు బట్టరాని యాగ్రహమును జెప్పరాని యసహ్యమును గలిగించెను.

## ౧౭

### షాజాదా పార్శ్వము

విశాలమగు నామందిరమంతయు జంద్రకాంత శిలానిర్మితమై యుండెను. అచ్చటచట సముచితముగ నుండిన బంగారు నగిషీపనులు చూపరులకు మిఱుమిట్లు గొల్పుచుండెను. కేళీమందిరమున నుండఁదగు మోహము నతిశయింపఁజేయు జిత్రవిచిత్రపటము లనేకములు వ్రేలాడుచుండెను. అట్టిపటములను వర్ణింపగడంగి సాధుశీలులగు పాఠకుల హృదయమును బాధింపఁజాలము. రాజసంభోగమునకు వలయుభోగ పదార్థములన్నియు నందమరియుండెను. సహస్రబాహువులుగల దీపరాజమొకటి మధ్యప్రదేశమున వ్రేలాడుచు దేదీప్యమానముగ వెలుగొందుచుండెను. పలు తెఱంగులగు పుష్పగుచ్ఛంబులచే నామందిరము సుగంధబంధురంబై మిక్కిలి యానందదాయకముగ నుండెను. నేలయంతయు నమూల్యమగు పెరసియాదేశపు రత్నకంబళులతోఁగప్పఁబడియుండెను. అయ్యవిమెత్తని పరుపులకంటెగడు మెత్తగ నుండుటచే వేయుపాదము లోనికి దిగిపోవుచుండెను. ఆ పార్శ్వమున రమణీయమగు నొక హంసతూలికా తల్ప మమరియుండెను. ఆతల్పము బంగారు నగిషీలతోడను, మేలుజాతి పట్టుకుచ్చులతోడను, ముఖమలు తెరలతోడను, ధగధగద్ధాయమానమై యుండిన చాందినీతోడను, వైభవసమన్వితమై కడుమనోహరమై యుండెను. నవరత్న ఖచితమగు సువర్ణకలశముల నుండిన మనోహర ద్రాక్షరసపానీయములును నానావిధ పరిమళ సౌరభములీను చందనాది పదార్థములును హాయికలిగించుచుండెను. దేవేంద్ర భవనమును ధిక్కరించు మహావైభవమండి

తంబై యుండిన యాదివ్యమందిరము జొచ్చువారు పులకాంకితశరీరులై మోహపరవశులు కాకమానరు.

కాని నిరంతరము నూర్జహాను మందిరమున సంచరించు జులేఖాకు నావైభవమొక లెక్క కాదు. సురాపానముచే మైమఱచి మోహపరవశులై సగము వస్త్రహీనులై యుండిన యాంగనాజన మూమెకు గోచరించుటచే, నావనితామణికి క్రోధమును నసహ్యమును తోడనే జనించెను. ఆజవ్వనులందరు నసాధారణ సౌందర్యవతులై యుండిరి. వారుధరించిన వస్త్రములూడిపోవుచుండుటచే వారి సహజసౌందర్య వ్యక్తమగుచుండెను. తమయవస్థ దామెఱుంగక నందరు హాయిగ నుండిరి. వారందఱిలో మిక్కిలి సుందరి యగునొక మోహనాంగి యొక యౌవనపూరుషుని యురంబుపై వ్రాలి యంగవికారంబులచే వారికి హాయిగొల్పుచు దానుగూడ నానందము ననుభవించుచుండెను. ఆ పురుషుని డెందమునకు హాయిగొల్పి తామెన్నడు కృతార్థులగుదుమోయని మిగిలినవారు నిరీక్షించుచుండిరి. సురాపానమధికమగుటచే గొందరు తూలుచు, జారిపోవువస్త్రములను జేరదీయుటకునైన శక్తిచాలక తూలుచు నేల కొరుగుచుండిరి. అట్టి దృశ్యముగాంచి జులేఖా యెట్లు సహింపగలదు ?

ఆపగిది నంగనాజన పరివృతుండై మొగములు దిండుపై బరుండి యుండినవాడు సార్వభౌముని కుమారుడగు పార్వేషు. ఆ రాజపుత్రుడు తప్పద్రావియుండుటచే నాతని నయనములు మూసుకుపోవు చుండెను. మహారాజ్యాధిపతియగు సార్వభౌముని పుత్రుండట్టి హైన్యావస్థ యందుండుట జులేఖాకు గడుంగడు దుస్సహముగ నుండెను.

అసహ్యముచే నొడలంతయు గంపింప నాసాధ్వి యిట్లనుకొనెను— “ రాజకుటుంబమునకే గాక మానవజాతికే యపకీర్తి దెచ్చు నీదౌర్భాగ్యుడా, ఈనీచుడా, ఈపరమపాపాత్ముడా, యీవిశాలమొగలాయి

సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించుట, అహా! కాలమెంత హైన్యముగ బరిణమించినది?"

అట్టి పాపిష్ఠిదృశ్యమును వీక్షింపఁజాలక జులేఖా వెనుకకు దిరిగి వెడల గమకించెను. కాని, ఆమె యెచటకి బోఁగలదు! పాపపూరిత మగునా దృశ్యమును గాంచకుండ వెడలుదమన్న మార్గాంతరము లేకపోయెను. తోడనే, శిలావిగ్రహమువలె జేష్టలుడిగి ఆమె యిట్లు చింతింపఁదొడంగెను.

"దుర్భరమగు నీ ప్రదేశమున కాముష్కరులు నన్నేల తెచ్చియుందురు? కడునసహ్యాకరముగ నున్న యీరంగమునకు నన్ను దీసుకు వచ్చుటయందు వారియభిప్రాయమేమైయుండును! మానవాధముఁడగు నీ పార్శ్వమున కిట్టి దుర్బుద్ధి యేలజనింపవలయు? దుర్భరమగు నీకపట నాటకమున కీతఁడే సూత్రధారుఁడై యుండనోపు, కాని, ఈదౌర్భాగ్యునకు నారాకవలనఁగలుగు లాభమేమి? ఏమైనను, మృగములవలె విచ్చలవిడి విహరించు నీనరాధములకు గోచరింపకుండ నిష్క్రమించుటకువీలులేకున్నదే! ఇట్టిపాపాత్ములను దర్శించుటపాపహేతు వైనను, కడుంగడు లజ్జాకరమైయున్నను క్రూరవిధివశమున నేను బోవలసియే యున్నది."

అట్లుచింతించి కోపధురీణయై యుండిన జులేఖా తలుపు ముందునకు ద్రోసెను. మనసార స్వైరవిహార మొనరించుచుండిన యా అంకు టాండ్రు యలుకుడి యగుటతోడనే యులికిపడి ఆతలుపువైపుఁజూడ సాగిరి. తోడనే, ఆ వెలయాండ్ర పకపక లొక్కసారిగ గట్టిపోయెను. వారి వారి చేతులందలి మధుద్రవపూరితంబులగు హేమపాత్రలన్నియు నట్టెనిలిచిపోయెను. వెంటనే వారందఱు తొంటియట్లొక్కసారి వికవిక నవ్విరి. అంతలో మఱల సద్దుకొనిరి. వారి హైన్యావస్థ వారికేసిగ్గుగలిగించెను. వారందఱు నెవరికి దొరకు దిండులను బట్టి వారు తమతమ మర్మస్థానములను జేతనగు పగిది మఱుగు పఱచికొనుచు, కలవరపడి

యొకరినొకరు చూచుచుండ, మద్యపాన మధికమగుటచే గండ్లెత్త లేకుండిన రాజకుమారుఁడు జులేఖాను నిట్లు యాహ్వానించెను. "ఓహో! వచ్చితివా? దయచేయుము!"

తోడనే, ఆసుందరి వదనారవింద మెఱ్ఱబారెను. దండహ్యామాన మానసియై, రోషకషాయతాక్షియై జులేఖా యిట్లనెను—"షాహజాడా! నేనెవ్వతెనో దెలియదా? నన్నిచటకి నీవు రప్పింపఁగతంబెద్ది? జులేఖాను పరిభవింపఁ దలంచి రప్పించితివాయేమి?"

షాజాడాయగు పార్వేషు ధైర్యవంతుఁడు కాఁడు. అవమానముచే జనించిన కోపాటోపముచే విస్ఫులింగములను గ్రక్కుచుండిన జులేఖా యొక్క రూక్షవీక్షణంబులకు వెఱచి ప్రకంపిత శరీరుఁడై, మెల్లగలేచి తొట్రిలుచు నిట్లు ప్రత్యుత్తర మీయఁ గడంగెను— "జులేఖా బీబీ!—అట్లుకాదు—నాయభిప్రాయమది గాదు—రాజకీయ వ్యవహారమునకై—"

"నీరాచ కార్యము కిదియా సమయము?"

చిరునవ్వు నవ్వి, పార్వేషు యిట్లనెను—"ఇందు నాదోషము లేదు. ఈసమయమున నిన్ను తెమ్మని నేను నియోగింపలేదు. మూఢులగు దూతలు పొరపడి గొప్ప నేరము నొనరించి యున్నారు!"

"కాని, కండ్లు మూయించి నన్నురప్పింప గారణంబేమి? నేనురావల సిన యవసరముండు నేని, వర్తమానమంపరాదా? నీవు సుఖుపుగా నుండు సమయముగాంచి యరుదేరనా మఱియు, పాదుషా బీగమునకు నీయభిప్రాయము నెరింగించి నంతమాత్రమున నామెయే నన్ను బంపియుండదా!"

"జులేఖా! అక్కడనే యున్నది చిక్కు."

"ఎట్లు?"

"తగు కారణములేక పోలేదు. జులేఖా! నీవు భావించు నంత మూఢుఁడనుకాను సుమా"

"షాజాడా ! నీవు తల్లివలెఁ బరిగణింప వలసిన నాసమక్షమున వికత వస్త్రు లైయుండు నీ అంకుటాంగ్రడచేఁ బరివృతుడవై యుండట నీకే లజ్జాకరముగ నుండవలదా ? రాజకుమారా ? నేను శీఘ్రముగ పాదుషా బీగము కడకుఁ బోవలయును. దారిజూపుము. ఈయుంగరముపై నెవ్వరి నామాక్షరములు లిఖింపఁబడియున్నవో చూచితివా ?"

అని పలికి, తన కోమల కరపల్లవమును జులేఖా ప్రదర్శింప, బాల సూర్య ప్రభాకలితంబై ధగధగద్ధాయమానంబై వెలుగొందు వ్రజపు టుంగరము గోచరమాయెను. దిగంత యశోవిలాసినియగు నూర్జహాను యొక్క దివ్య నామాక్షరములందు, జెక్కఁబడియుండెను. మొగలు దర్బారునం దేగాక, మొగలాయిసామ్రాజ్యము నందంతటను గూడ నాప్రసిద్ధ యంగుళీయమును గాంచునంతనే యెంతటివారలైనను సరె తమతమ యౌదలలు వాల్చియుండవలసినదే !

జులేఖా మగుడ నిట్లనెను—"రాజకుమారా ! నీ వచనములు నాకేమియు నర్థముకాకున్నవి. నీవు నాతో రహస్యసంభాషణ మొనరింపవలసి యున్నచో నిట్టిసమయమనుకూలమైనది కాదుగదా"

సారాయిమైకముచే దూలిపోవుచుండిన సార్వభౌము పుత్రుఁడు మెల్లగ నాసీనుఁడై కనుసన్నఁ జేయ, నయ్యంగనలందఱు తూలిపోవుచు నేలబారలాడుచు సర్వాంగముల నైజసౌందర్యమును బ్రదర్శింపుచు నెట్టులెట్టులో జెంతనుండిన చిన్నగదిలోనికిఁబోయిరి. వారినిగాంచుచు రాజకుమారుఁడమితానంద భరితుడై వికవిక నవ్వెను. తోడనే, జులేఖా రోషకషాయితాక్షుమై పట్టజాలక నిట్లు గంభీరముగ గద్దించెను.

"షాజాడా ! ఢిల్లీసామ్రాజ్యసింహాసనము నీవపేక్షింతువా ?"

ఇంతవఱకును జులేఖా రాజపుత్రుని క్రీడా మందిరము బ్రవేశింప లేదు. రాజకుమారుని యుంపుడుకత్తెలు వెడలినంతనే యామె ప్రవేశించి రెండడుగులు మాత్రము వైచెను. కూర్చుండుట కనేకములగు

సోఫాలుండినను, ఆమె నిలువఁబడియే యుండెను. తనసచ్చటికి రప్పింప గతంబెద్దియో యరయఁగోరి ఆమె యాలోచనాపరురాలై యుండెను. ఈసార్వభౌముపుత్రుఁ డేమైన మోసము తలపెట్టియుండునాయని ఆమె విచారింపఁదొడంగెను. కాని, నిరంతరము సురాపానీయ మహాప్రవాహమున గొట్టుకొనిపోవు నాదౌర్భాగ్యుఁడెద్దియైన రాజకీయవ్యవహారము దలపెట్టి దననుబట్టి బంధించి రప్పించియుండడని యాసాధ్వి గ్రహించెను. అంత నాయింతి గంభీరభాషణములనిట్లనెను—

"రాజకుమారా! పాదుషాబీగము మందిరమునకు దెరువెయ్యది? నేన మ్మహారాణిని దోడనే దర్శింపవలయును."

"జులేఖాబీబీ! నిక్కము చెప్పెదవినుము. నేను నిన్నురప్పింపలేదు. నీవేల యరుదెంచితివో యెఱుంగగోరి యింతదనుక నీవచనము లాలించుచుంటిని. పాదుషాబీగము మహాలుకు బోయెదువేని, ఈ మందిరము నతిక్రమించియే పోవలయును కాని మఱియెవ్వరైన నీమందిరము జొర సాహసింతురేని, వానికంఠము వెంటనే తెగియుండెనని నీవు యెఱింగియే యుందువుగదా?"

తోడనే జులేఖా కలవరపడిబిగ్గరగ నిట్లుప్రశ్నించెను—"అట్లయిన నన్నీ తెఱంగున భంగపరచి ఇట్టి యసమయమున నీప్రదేశమునకుదెచ్చుటకు సాహసించినవారు మఱియెవ్వరు?"

రాజకుమారుఁడేమేమో చెప్పబోయెను. అంతలో నాతని నోట నుండి యవ్యక్తముగ నొక్కపలుకు వెలువడెను. ఆతడుభయాశ్చర్యపరవశుఁడై డిల్లవడి నిశ్చేష్టితుఁడై తదేకధ్యానముగజూడ దొడంగెను.

రాజకుమారునివలెనే జులేఖాకూడ భయభ్రాంతయాయెను. ఒక్కక్షణముకాలముననేమి సంభవించునో యా సాధ్వికిఁ దెలియకుండెను. సార్వభౌముపుత్రుని యవ్యక్తాలాపమును, ఆతని వివర్ణ వదనమును దప్పయామెకు వేఱొండు తేలియలేదు. ఒక్క ముహూర్తమున

నాసాధ్వి యుండు ప్రదేశమంతయు గాఢాంధకారబంధురమాయెను. అట్టియభూతమగు మార్పు హఠాత్తుగ సంభవించుటచే నాసాధ్వి స్తంభీకృత యాయెను.

జులేఖా మనోధైర్యముగల మానిసియనియు నసాధారణ విజ్ఞానవంతురాలనియు పాఠకు లెఱింగియే యుందురు. ఎట్టిమహాసంకటములు ప్రాప్తించినను ఎంతటి యుపద్రవము సంభవించినను నామె యెన్నఁడు ధైర్యము వీడి యెఱుంగదు కావున, చెదరిన హృదయమును క్షణమాత్రమునఁ జేరఁదీసి విచారింప, దాను శీఘ్రముగ భూగర్భము లోనికిఁ బోవుచుంటినని యామె గ్రహింప గలిగెను. త్వరితగమనమునకుఁ దాళఁజాలక నయ్యింతి చతికిలబడి, చెంతనున్న శాలాభాగముపై నాను కొని యుండెను. మెల్లగ లేవవలయునని ప్రయత్నించి దొరలిపోయెను. ఎంతప్రయత్నించినను పాపమాసుదతి లేవఁజాలకపోయెను. పదియేండ్ల నుండియు నామె బీగము మహాలునందుండినను, దారుణమగు నిట్టి వైపరీత్యము నెన్నఁడు గాంచి యెఱుంగదు. అట్టి భయంకరమగు తమోసాగరమున నామె యెన్నఁడు మునింగియుండలేదు. పాపమా వనితామణితానెచటనుండెనో యెచట కేగుచుండెనో, ఎట్లుపోవుచుండెనో గ్రహింపఁజాలకుండెను. తాను పాతాళమునకు, ప్రయాణ మొనరించు చుంటినేమో యని మాత్ర మామె యనుమానింప గలిగెను.

అతిదారుణమగు నట్టి మహాసంకటమునఁ దగుల్కొను మానిసి లెవ్వరైనను, పురుషులైనను సరే, తోడనే భయవిహ్వలులై యచేతనులుం గాక మానరు. భయాధికముచే విగతజీవులైనను గావచ్చును. కాని, జులేఖా వజ్రహృదయ యగుటచే, మొదట విస్మయాధికముచే భీతచిత్తయై భ్రాన్తపడియుండినను, అతిరయమున తొంటిధైర్యమును ధరించిన దాయెను—"ఈ మనుజుల మనోవైఖరి కడు వింతగ గాన్పించుచున్నది. మత్ప్రాణాపహరణమే వారి యాశయమై యుండునేని,

ఇంత వైపరీత్యమేల ? ఒక్క నిముసములో నన్ను విగతజీవి నొనరించి యుండరా ? కాని, అట్టి దారుణకృత్య మొనరించినచో, భైరవీయువ తారమగు నూర్జహాను మొగలాయి సామ్రాజ్యమును బహుభంగుల తారుమారు జేసియైనను దమ్మగుర్తించునని వెఱచియే యీ నరా ధము లట్లొనరింపలేదు. ధైర్యమువలంబించి యప్రమత్తనై యీనీచులేమి చేయఁ గడంగుదురో చూచెదగాక. నిరంతర మీబీగమువుమహాలునందు స్వైరవిహార మొనరించు యీ జులేఖా వెఱువనేల ? కాని, మానవుని యల్పజ్ఞత యెట్లు వ్యక్తమగుచున్నది ! అత్యద్భుతమగు నీమహాలు బ్రవేశించి పది సంవత్సరములైనది. ఇందలి గుప్తమార్గములను రహస్య ప్రదేశములను లెస్సగా బరిశోధించి యుంటినని భావించి యుంటిని. రహస్యములన్నింటిని సమగ్రముగ గ్రహించియుంటినని యుప్పొంగు చుంటిని. ఇందలి మర్మములను నాకంటె నెక్కుడుగ నెఱుంగు వారె వ్వరుండరని గర్వించి యుంటిని. కాని నేడు పూర్తిగ గర్వభంగమైనది. పద్మవ్యూహముకంటె సహస్రమడుంగులు నిగూఢమై యున్న యీ మహాలు నందింకయు నెన్నియో రహస్యప్రదేశము లున్నవని నేడు యీ తెఱుంగున గదా వ్యక్తమైనది ? ”

ఆవిధమున జులేఖా చింతింపఁ దొడంగెను. భయంకరముగ నుండిన భూగర్భమున నింకను నామె ప్రయాణ మొనరించుచునే యుండెను. అంతకంతకు నంధకార మధికమగుచునే యుండెను. ఆప్రదేశము నీటి మయమై యుండెనని యామె గ్రహింపఁగలిగెను. ఆప్రదేశమునదుర్గంధ ములు బయల్వెడలి యామెకు బాధ గలిగించుచుండెను. ఊపిరి దీయుటకే పాపమయ్యంతికి గష్టముగ నుండెను. ఒక పలు కుచ్చరిం చుటకైనను సాధ్యముకాకుండెను. అట్టి నికృష్టప్రదేశమున దిక్కుమా లిన పక్షివలె మరణింపవలయునని విధివిధించెనేమోయని యయ్యంతి యనుమానింపగడంగెను. సకలభోగభాగ్యములకు నాకరంబై, యసాధా

రణ వైభవ సమన్వితమై వెలయు మొగలు బీగము మహాలుయొక్క యధోభాగమున తమోమయమై దుర్గంధబంధురమై పాపకూపమువలె నుండు ప్రదేశముండునని నేడుగదా జులేఖాకు ననుభవమాయెను. స్వర్గనరకములు రెండును గలిసియుండు నవకాశముండునేని, అట్టి వైపరీత్య మొక్కబీగము మహాలునందే యుండెను!

అగమ్యమగు నధోమార్గము ననుసరించియే జులేఖా యింకను పోవుచుండెను. తన గమ్యస్థాన మెద్దియో తెలియకయే యదేప్రకారముగ బోవుచుండుటచే నామె మనోధైర్యమంతయు నంతరించెను. వెఱపెట్టిదియో యెఱుంగని వనితామణి భయవిహ్వల యాయెను. తుదకు నపారమగు నిరాశకు నామె వశమగుటచే దన్నుదా నెఱుంగక ఇట్లనుకొనెను—"ఆహా! జీవములపై నింక నేమి యాశ? అసువులను ఒక్కనిముసమున బాయఁగల సాధనము నాచెంతనే యుండ, నిట్టి దారుణ మరణమునకుఁ బాల్పడనేల?"

కాని, తోడనే, తన సహజ వివేకమును తోంటి ధైర్యమును నలవడుటచే నామె యిట్లు వితర్కించుకొనెను—"ఛీ! ఎట్టి యూహ దలపెట్టితిని! ఆత్మహత్య గావింప నెంచనేల! అయ్యది మిక్కిలి పాపహేతువు. అంతియేగాక, నేనొనరింపవలసిన కార్యమంతయు నెట్టులగు? ఈప్రాణము లిట్లు ధరించియుండుట పగతురపై గసితీర్చుకొనుటకే గదా! పగసాధింపకుండ మరణింపఁ గడంగుట యెంతయప్రశస్తము! అట్టిమాట పొరపాటుననైన ననుదలపెట్టరాదు. నాహృదయకుహరమున నిరంతరము వెలువడు శబ్దములన్నియుఁ బగసాధింప వలయుననియే ప్రతిధ్వని నొనరించుచుండును. నా దేహమునందలి ప్రతి రక్తబిందువును పగయాశ్రయించియే యున్నదిగదా. మఱియు తీవ్రపడి జీవమును విసర్జింతునేని, నామహా ప్రయత్నములన్నియు సైకతస్థలమున నిర్మించు సౌధమువలె నొక్కసారి నేలఁగూలునుగదా! కావున, మరణము

నపేక్షింపరాదు. పర్యవసానమేమగునో చివరవఱకు వేచిచూచెదగాక."

తనడెందమట్టి తీవ్రవేదనలచే బ్రజ్వరిల్లుచుండుటచేత జులేఖా వేడి నిట్టూర్పులు విడిచెను. అసాధారణసౌందర్యవతియగు నాయువతీలలామ యానమయమున క్రోధావేశమున విషానలజ్వాలలు వెడలగ్రక్కు భుజంగరాజకన్యకవలె నుండెను.

అట్టితనహృదయతాపమును నడంచికొని పరికింప, తానధోలోకము నకు బోవుటలేదని జులేఖా గ్రహించెను. ఏలన, ఆమె యట్టులే భూగర్భములోనికి బోవుచుండెనేని, ఈ సరికి పాతాళము జేరవలసిన దే! అట్లుగాక, వర్ణనాతీతమగు యంత్రసాహాయ్యముచే నామెబీగముమహలు యొక్క యధోభాగమున నెచటికో గొంపోబడుచుండెను. జులేఖా యెన్నడు నట్టి వింత ప్రయాణమొనరించి యెఱుంగదు. భూగర్భమున బ్రయాణమొనరించు మహాయంత్రములుండెననియైనను నామె యెఱుంగదు. ఆకారణమున విస్మయపరవశయై యుండ, దేదీప్యమానముగ వెలుంగుచుండిన దీపరాజమామెకు హఠాత్తుగ గోచరించి భ్రాంతిగల్గించెను. తానెఱుంగకుండగనే హఠాత్తుగ తమోసాగరమును దరించి కాంతిమయమగు బాహ్యప్రపంచము నామె ప్రవేశించెను?

## ౨౦

### పాతాళము

తమోసాగరమున నోలలాడుచుండిన జులేఖాకు హఠాత్తుగ దేదీప్యమాన విరాజితంబై యుండిన దీపరాజము కాన్పించినంతనే గండ్లు మిఱుమిట్లుగొనెను. ఒక్కక్షణకాలమామె చైతన్యముడిగి నిర్జీవప్రతిమవలె నుండెను. ఒక్కక్షణములో నింతనింత మార్పుజనించుటచే నామె డెందము పూర్తిగ గలంగిపోయెను. అట్లు తనకు గలిగిన విపరీతపుభ్రాంతి నతిక్రమించి యయ్యెంతి పరికింప, దానొకవిశాలమగు

గదిలోనుంటినని గ్రహించెను. ఆమందిరము నెన్నఁడు నామె ప్రవేశించి యుండలేదు. అందు బల్లలు కుర్చీలు సోఫాలు మొదలగు సామాను లెవ్వియు నందు లేవు. పైన వ్రేలాడుచుండిన ఇత్తడిదీపము మాత్రము, సహస్రకిరణములను బర్వఁజేయుచుండెను. లెస్సగ వీక్షించి విచారింప నయ్యదిమహమ్మదీయుల మసీదువలె నుండెను. అట్టి దీపము లట్టుల లహర్నిశలు మసీదులందు వెలుఁగుచుండుననని యామె తొల్లివినియుం డెను. కాని ఆమందిరమెచటనుండెనో రాజమందిరావరణయందుండెనో, లేక బాహ్యప్రదేశముననే యుండియుండెనో యెంతవిచారించినను జులేఖా గుర్తింపజాలకపోయెను.

మాయయో, ఇంద్రజాలమో యనదగు నట్టి యద్వితీయాద్భుత విషయములను నామె యెన్నఁడు ననుభవించి యుండలేదు. ఆముహూ ర్తమున దన పూర్వవృత్తాంతమంతయు నొకసారిస్మరణకురా, నయ్యింతి ధైర్యవతియైయ్యు శోకాయత్తచిత్తయై బాష్పజలపూరిత యాయెను. కాని, ధైర్యమామెకు సహజగుణమగుటచే విషాదమును తోడనే దిగ మ్రింగి తొంటిధైర్యము వహించి, తానుండిన మందిరమును మరల బరికించి చూడ నందు రెండు గవాక్షములును ఒకటేద్వారమును గోచరమాయెను. తానామందిరమునకెట్లు తేబడియుండెనో యరయ వలయుననియు నామహారహస్యమును ఛేదింపఁగల జాడలైనను బొడ కట్టవచ్చుననియు నెంచి ప్రకంపితహృదయముతో నామందిరము నల్దెస లను బరిశీలనగా వీక్షించుచు నామెయాలోచనాతత్పరయై యుండ నా మందిరద్వారము మెల్లగ నిశ్శబ్దముగ గదలినట్లు తెలియవచ్చెను. నాటిసమాచార మంతయు నింద్రజాలమువలె నుండెను. ఇఁకనెట్టి యద్భుతము సంభవించునో యని సర్వాంగములను బిగయబట్టి తత్తర పాటుతో నామెనిరీక్షించుచుండ, నాద్వారము మెల్లగా విడిపోయెను. తోడనే యొక మానిసి ఛాయవలె బ్రవేశించెను. అట్లునిగూఢముగను

నద్భుతముగను వెలువడిన వింతయాకృతి వలన దనకెట్టి దోసగు సంభవించునో యనివెరచి ఆత్మసంరక్షణార్థము నిరంతరము దనచెంత నుండు కృపాణము నామెపైకి దీయఁబోయెను. కాని, ఆమానిసి భయంకరాకారుఁడై యుండుటకు మాఱుగ, సాధుజనుఁ డగుటచే కృపాణధారణ మనవసరమాయెను.

ఆమానిసి పొడవరియు, తేజోవంతుఁడునై యుండెను. వెండివలె దళ తళ మెఱయుచు నాభివఱకు వ్రేలాడుచుండిన గడ్డమాతనికిఁ జక్కగా నమరి యుండెను. దేహమునంతటిని గప్పియుండు "అల్ఖాల్లా" యను సంగీని మాత్రమాతఁడు ధరించియుండెను. అపురూపమగు దక్షిణావృతశంఖమునుబోలి యుండిన యాతని కంఠము పలురకములగు మాలలచే నలంకరింపఁబడి యుండెను. సన్యాసులు ఫకీరులు లోనగు సజ్జనులు ధరించు చిన్నికండ మాతని దక్షిణహస్తమున నుండెను. ఆతని గాంచునంతనే ఆతఁడు సర్వసంగపరిత్యాగ మొనరించిన ఫకీరు యని స్పష్టముగ దెలియుచుండెను. ఆతని వదనము గాంచునంతనే యాతఁడు దారవంతుఁడనియు దయార్ద్రహృదయుఁడనియుఁ బ్రేమస్వ రూపుఁడనియు విస్పష్టముగ వ్యక్తమగుచుండెను. ఆత్మసంరక్షణార్థమై జులేఖా నిజకృపాణము ధరింపగడంగుటగాంచి, మందస్మితవదనారవిం దుఁడై యా ఫకీరు యిట్లనెను-"సర్వసుందరీ! ఒక్క కృపాణమేగాక విషముగూడ సదా నీవద్దనుండునని యెఱుంగుదు సుమా!"

"సర్వసుందరీ" యని ఆఫకీరు సంబోధించినంతనే జులేఖా యదరి పడెను. ఆమె మహమ్మదీయ మతము నవలంబించి మొగలాయిదర్బారు ప్రవేశించినదాది యామె "జులేఖా" యని మాత్రమే పిలువఁబడు చుండెను. ఆమె తొంటిహైందవ నామధేయము నెఱింగిన వారలే యరుదు. సర్వము తెలిసిన నూర్జహాను సహితమామె తొంటినామము దలంచుటలేదు. సర్వసుందరియను హైందవ నారీమణి నాడేమరణించి

యుండెను. నేడు సజీవియై యున్నది జులేఖా. ఆకారణమున నాఫకీరు "సర్వసుందరీ" యని నంతనే యామె ఆశ్చర్యమగ్నమానసియై విస్మయపరవశయై యచేతనయై జూచుచుండ నాతఁడిట్లనెను:—

" ఈ బేగము మహాలునందు మానము నిలుపుకొనఁగోరు మానవతి సదా యప్రమత్తయై యుండవలయును. అట్టి జవ్వని యెల్లప్పుడు విషమును సిద్ధపఱచి యుంచుకొనుట సహజమే. అంతియేగాక, డాయఁబోవు శాత్రవుని హృదయము ఛేదించుటకై ఖడ్గమును ధరించుటయు గూడ సహజమేగదా, సర్వసుందరీ ! "

తన విస్మయోద్రేకము చల్లార, జులేఖా యిట్లు ప్రత్యుత్తర మొసంగెను.—"ఆర్యా ! నేను నూర్జహాను చక్రవర్తినియొక్క బందీని గాని, సర్వసుందరిని గాను. "

" నీ పూర్వవృత్తాంతమంతయు నాకు జక్కఁగాఁ దెలియును. "

"ఔను గాక కాని, సర్వసుందరి చిరకాలముక్రిందటనే జీర్ణించినది. నీవిపుడు గాంచునది 'జులేఖా' యని పిలువఁబడు మహామ్మదీయాంగన, బేగము మహాలు నందలియొక బందీ. "

ఆమె నొక్కసారి తీక్ష్ణముగా దిలకించి ఫకీరిట్లు ప్రశ్నించెను—"నీవు చెప్పునది సత్యమేనా ? "

"నిస్సందేహముగా సత్యము. "

నిశ్చలహృదయముతో జులేఖా యట్లు పలికినంతనే, ఫకీరు మాఱుపలుకక, ఆసుందరి వదనారవిందముపై తీక్ష్ణ వీక్షణములను బ్రసరింపఁగడంగెను. రోగి యొక్క దేహమును శస్త్రములచే ఛేదించి అంతరేంద్రియములను బరీక్షింపఁగడంగు శస్త్రవైద్యునివలె తీక్ష్ణ వీక్షణములచే జులేఖా యొక్క బాహ్యప్రవర్తనము నతిక్రమించి యామె హృదయము నరయుటకై ఫకీరు ప్రయత్నించుచుండెను—నీవు

చెప్పునది సత్యము కాదు; నీ వింకను నిక్కముగ బర్ద్వానునందుపుట్టి పెరిగిన సర్వసుందరివే!"

ఆగ్రహమున కెడమీక వినయగర్భితముగ జులేఖా యిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

"ఆర్యా! మీరెవ్వరో యే నెఱుంగజాలను. మిమ్ము నే నెన్నఁడు గాంచి యెఱుంగను మీయాకృతి బరికింప, మీరొక మహమ్మదీయ తత్వవేత్తవలె మాత్రము గోచరించుచున్నారు. కాని, మొఱకులచే నన్ను బట్టించి బంధించి యిట్లభూతముగ నీ యపూర్వప్రదేశమునకు రప్పింపఁ గతంబెద్దియో తెలియకున్నది. ఇందు మీప్రవర్తనము సమంజసముగ నున్నదేమో మీరే విచారింపుఁడు!"

ఫకీరిట్లు ప్రత్యుత్తర మొసంగెను.—"నిన్ని తెఱంగున రప్పించుటకు దగుకారణము లేకపోలేదు. మహత్తర రాజకీయకార్యములను నిర్వహించుసందర్భమున నెట్టివైపరీత్యమునైన నొనరింపవలసివచ్చును; ఆ సందర్భమున నొక్కొకని నెంతయైన బాధింపవలసి వచ్చును. ఇట్టి సూత్రములు నీ వెఱుంగనివి కావుగదా!"

తోడనే, జులేఖా కుపితస్వాంతయాయెను. సంధ్యాసమయమునందలి సూర్యబింబమువలె నామె సుందరవదనారవింద మెఱ్ఱబాఱ, నామె గంభీరముగ నిట్లనెను.—"ఓయీ! నీ చర్యలు పాదుషాబీగముసాహేబునకు రేపు తెలియకపోవు: తగినశిక్ష నీవే యనుభవింతువు!"

"సుదతీ! నే జెప్పునదంతయు సావధానచిత్తవై యాలింతువేని, ఈసమాచారము నొరుల కెఱింగించుటకు నీవే సాహసింపఁజాలవు సుమా!"

"ఏమీ! ఇట్టి క్రూర నిర్బంధములకు బాల్పడిన పిమ్మట ఈ దురాచారములను మహారాణి కెఱింగింపకుండ మిన్నకుందుననియా నీయభిప్రాయము?"

"సంశయమేమి? ఈ రహస్యవృత్తాంతమునీ వేరికి నెఱింగింపఁజాలవు"

ఫకీరట్లు నిబ్బరముగ బలికినంతనే, జులేఖా విస్మయాక్రాంతయై, అతని వదనమును వీక్షించుచు నల్లన నిట్లనెను—"నీవు సర్వజ్ఞునివలెఁ దోఁచుచున్నావే!"

"సుదతీ! దయయుంచి కూర్చుండుము. అత్యంత ముఖ్యవిషయమై నీతోఁ బ్రసంగింపవలసియున్నది. సావధానచిత్తవై యుందువేని, సర్వము నీకే తెలియఁగలదు."

ఆప్రదేశమున నింకొక్కక్షణమైన నుండుట జులేఖాకు మిక్కిలి కష్టముగ నుండెను. విషయము నరయవలయుననెడు కుతూహలము మాత్ర మత్యధికముగ నుండెను. ఆమె చేయునది లేక, ఫకీరు చెంత నేలపై నామె కూర్చుండెను. కొంతతడవాగి ఫకీరిట్లనెను.—"నారీ! ఒక్కప్రధానాంశము గురించి నీతో రహస్యముగా ముచ్చటింపవలసి యున్నది. కాని, ఈ మన రహస్యసమావేశ మొరులకుఁ దెలియునేని, గొప్పయుపద్రవము సంభవింపవచ్చును సుమా"

"అట్లుకానేల? తొలుత నీ వెవ్వరవో యెఱింగింతువా?"

"క్రమముగా నీకంతయు విశదమగును. తీవ్రపడనేల?"

"నేనిచటికి వచ్చితినని షాజాడా పార్వేషునకు దెలిసియే యుండును గాబోలు?"

"అవును. ఈయుదంత మెవ్వరికి దెలియకుండవలయుననియే నాయభిప్రాయము. కాని నీవు బంధింపఁబడిన ప్రదేశమునుండి యీమందిరము బ్రవేశింపవలయునన్న, పార్వేషుయొక్క సౌధమునుండియే బోవలయును. మార్గాంతరము లేదు. కావుననే, నీవిషయమై సర్వమాతని కెఱింగింపవలసివచ్చెను. కాని, తనమేన ప్రాణముండునంత కాలమా రాజకుమారుఁడీసమాచార మొరులకెఱింగించుటకు సాహసింపజాలడని మాత్రము విశ్వసింపుము.

"అయ్యో ! తప్పద్రావి విగతవస్త్రులగుచుండిన యాతులట బుగూడ మదీ యాగమనము నెఱింగియుందు రే ! వారినో రెట్లు కట్టువయను ?"

గంభీరముగనుండు ఫకీరు వదన మొక్కింత చలించెను. ఆలోచన పూర్వకముగ నాతడిట్లు బదులిడెను—" ఆమందభాగ్యులు నీ విగూఢా గమనమును వెలిబుచ్చకుండు నట్టి గట్టి యేర్పాటు దప్పక జేయింతును."

" అయ్యో ! ఇట్టివిపరీతమార్గమున నీ నిగూఢసమావేశము నీవ పేక్షిం చుటకు గతంబెయ్యది ?"

" క్రమముగా నీకంతయు దెలియగలదు. మనమిక ప్రసంగమునకు గడంగుదము."

తోడనే, జులేఖా క్రోధైక ధురీణయై యిట్లనెను — " నీయిచ్చకు వచ్చినటులే గానిమ్ము. నీకారణమున నిట్టిదురాచారముల ననుభవించిన పిమ్మట, నీయాజ్ఞలెల్ల శిరసావహింప వలసినదే కాని, నీవు చెప్పిన దెద్దియో శీఘ్రముగమాత్రము ముగించి నాకు సెలవునయుచేయుము."

చిఱునవ్వు నవ్వుచు ఫకీరిట్లు పలికెను. నీవు సాక్షాత్కరించిన సింగమువలె నున్నావే ! కాని, మీయిరువురిలో నెవ్వరు మిక్కిలిప్రతా పవంతులు, నీవా ? నూర్జహానా ?"

తోడనే, జులేఖా యాగ్రహావేశ పూరితయైగంభీరముగా నిట్లనెను,— " ఈయసంబద్ధ ప్రసంగమేల ? నేనిచటకు నే తేరవలసిన కతంబెద్దియో యెఱింగింపుము."

" సుదతీ ! నిక్కము వచించితివి. మనమిక కార్యమునకు గడంగు దము కాని, నీవు నామమాత్రముననే జులేఖావి గాని, నీవు నిశ్చయ ముగ నాటి సర్వసుందరివే "

జులేఖాయొక్క దున్సహాగ్రహము తోడనే ద్విగుణీకృతమాయెను. " నీవు నాకొనరించిన పరిభవ మింతింతనరాదు. ఆనామాక్షరములే మఱల నుచ్చరించుచు మగుడపరాభవింపనేల ? నీవెవ్వరో నాకుఁదెలియ

కున్నది. నేను నీకెన్నఁడు నెట్టి యపరాధమైన నొనరించి యెఱుంగనే! అట్టి నన్ను నీవిట్టి తెఱంగున పరుషవాక్యములచే బాధింపనేల?" దృఢమనస్కుఁడై ఫకీరిట్లు బదులిడెను.—

"నిన్ను బరిభవింపవలయునని నాయభిప్రాయము కాదు. కాని, పాతప్రసంగములను ద్రవ్వియెత్తుటకుఁ దగు కారణముండకపోదని నీవు గ్రహింపవలదా? నేను చెప్పునదేమనగా, నిశ్చయముగా నేటికిసహితము నీవు సర్వసుందరివేగాని, జులేఖావి కావుసుమా!"

పట్టఁజాలక, జులేఖా యెద్దియో ప్రత్యుత్తర మొసంగబోయెను. కాని, ఆమెనువారించి, తాఁజెప్పునది సావధానముగ వినవలయునని ఫకీరుపలుక ఆగ్రహాపరాభవము లామెను దహించివైచుచుండినను, చేయునదిలేక ఆమె మిన్నకుండెను. ధీరస్వాంతుడగు ఫకీరు గంభీరభాషణంబులనిట్లు పలికెను.—"సుదతీ! నాఁడు నీప్రాణనాథుఁడు క్రూరముగ వధ్యుడైన కారణమున దండహ్యామగ్నమానసివై ఆహంతకులపై గసిదీర్చుకొనవలయునని పదిసంవత్సరముల నుండియు నీవు మహాప్రయత్నము లొనరించుచుంటివి. మఱియు, నీ సాహాయ్యము లేకుండ షేరుఆఫ్గను ఆవిధమున వధ్యుఁడై యుండడుసుమా?"

తోడనే, యుద్రేకపూరితయై జులేఖా యిట్లనెను—"అయ్యా! ఈదురదృష్టవంతురాలి విషాదచారిత్రమంతయు నీ వెఱుంగుదువని వ్యక్తమగుచున్నది. మహాపాపియగు నయ్యాఫ్ఘనుని చేతనేగదా, పూజ్యుఁడగు నాప్రాణనాథుఁడు విగతజీవుఁడాయెను! మానవవేషధారియగు రక్కసి కారణముననేగదా, స్థానభ్రష్టత్వమును దేశాంతరప్రవాసమును బ్రాప్తించినవి! ఆక్రూరాత్ముని కారణముననేగదా, ప్రాణపదమగు నస్మదీయ పవిత్ర మతమునకు గూడ వెలియైతిని! ఆ నరాధముని కారణముననే గదా! ప్రాణనాథుని చరణారవిందములకు వెలియై ఘ్లేచ్ఛునింట నూడిగముఁ జేయవలసి వచ్చెను! దయారహితుఁ

డగు నా దుష్టాత్ముని కారణముననే గదా! మురిపెముల దొంతియగు నాయనుంగు పట్టి కూడ నాకు దూఱమాయెను! ఆహా! నిజాంతఃపురమును సువర్ణ మయడోలికలో నుయ్యాల లూగుచు నాడెందమునకు హాయి కలిగించు ముద్దులపట్టి యిప్పుడెచ్చట నున్నదో గదా! కన్నతండ్రి కంటె నెక్కుడుగ ప్రేమించు మామగారికి వృద్ధాప్యమున కట్టియిక్కట్టు ఘటించినది! వారిం దలంచునంత మాత్రమున నాడెందము శిలాకృతి దాల్చినదయ్యు, వక్కలగునే! హా! దుర్భరము! దుస్సహము! ఆర్యా! పరమనీచుడగు నాద్రోహియొక్క వధకు నెట్టులైననేను గారకురాలనైన నగుదుగాక, అందు హైన్యము లేకని మాత్రము చెప్పఁగలను."

అను ప్రవర్తనము సమంజసముగనే యుండెనని డెందమునఁదలపోయుచు, ఫకీ రిట్టు లనెను:— నేనావిషయమై వ్యతిరేకముగా మాట్లాడు వాఁడను గాను. ఆదార్యాభ్యునకుఁ దగిన శాస్తియే యైనది. కాని నిరూపింపఁ గడంగున దెద్దియున, నీడెందమున ప్రజ్వరిల్లిన క్రోధానలజ్వాల లింకయుఁ జల్లారలేదు."

ఫకీరట్లు పలికినంతనే, గంభీరముగా జులేఖా యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "ఆర్యా! మీ రేలకో పొరపడినవారలై, ఆమార్గము ననుసరించియే యోచించుచు, ప్రసంగించుచున్నారు. తొంటి వృత్తాంతము నెన్నఁడు స్మరించువానను గాను. నేఁడు మహారాణికరుణాతిశయముచే నేను బీగము మహాలునందత్యున్న తస్థానము నలంకరించియుంట వాస్తవము. ప్రత్యక్షదేవతవలెనుండు నూర్జహాను నన్ను సోదరివలెఁ ప్రేమించుచున్నను, ఆ ప్రాపు నూతఁజేసికొని, బీగము మహాలునందు వసించువారి కెవ్వరికైన నెట్టి యపకారమైనను జేసియుంటినని ప్రేల్మడిచి చూపింపఁగలరా?"

ఫకీరు—"సుదతీ! నే నన్యథా తలంచువాఁడను గాను. బీగము మహాలునందలి వారలందఱు నిన్ను గౌరవింతురనియు, నీయెడల నను

రాగపాశబద్ధులై యున్నారనియు నే నెఱుంగుదు. సర్వాధికారియగు నూర్జహాను సహితము నీ యధీనమైయున్న విషయము నేనెఱుంగనిది గాదు. నీవు స్త్రీజాతిలో నసాధారణమైనదానవని నిర్ణయించుటకు సందియము లేదు. కాని, ఉత్తమవంశసంజాతవగు నీకీర్ష్యక్రోధము దారుణతరముగఁ బరిణమింపనున్నది సుమా!"

"అయ్యా! మీ రేమేమో చెప్పుచున్నారు. కాని, మీయభిప్రాయము మాత్రము గ్రాహ్యము కాకున్నది."

"జులేఖా! నీకుఁగ్రాహ్యము కాకేమి! నేనింత ధారాళముగా ప్రసంగించునపుడు, నీ విట్లు యన్యథాప్రవర్తించుట పాడిగాదు సుమా!"

"అయ్యా! నీతో తర్కించుట నిరర్థకము. కావున, నీయుపన్యాసము ముగియువఱకు నేను వినవలసినదే! ఇంకను నేమి చెప్పవలయునో చెప్పుము."

అంత, గంభీరముగ ఫకీరిట్లు పలికెను.

"చెప్పెద వినుము. మహమ్మదీయ సామ్రాజ్యవిచ్ఛిత్తిని నీవు తల పెట్టియున్నావు. తత్కార్యాచరణమునకై నీవు వేఱువేషము ధరించియున్నావు. మొగలు సామ్రాజ్యవిచ్ఛిన్నకార్య దీక్షాపరతంత్రవై ఈ పది సంవత్సరములనుండియు నీశక్తిసామర్థ్యములను బూర్తిగ కేంద్రీకరించుచుంటివి. నూర్జహాను మహారాణి యెడల నీకుఁ గలప్రేమయు నంతయు గేవలము బాహ్యాడంబరమే! కాని, నీహృదయము మాత్రము యమ్మహారాణియొక్క వినాశమునే సంకల్పించియున్నది. మొగలాయిసామ్రాజ్య విచ్ఛిత్తియే నీపరమలక్ష్యము. హైందవసామ్రాజ్య పునరుద్ధరణమే నీజీవితచారిత్రరహస్యము. సర్వసుందరీ! నాపలుకులు యదార్థములా, కావా?"

భావగర్భితంబులై యుండిన ఫకీరుయొక్క గంభీరభాషణంబులు వీనులబడినంతనే, జులేఖాయొక్క నిర్మలవదనము వివర్ణమాయెను కాని

ఒక్కక్షణములో నావదనము తొంటి నైర్మల్యమును ధరింప, నామె తోడనే మందస్మితవదనారవిందయై, ఫక్కున నవ్వి, యిట్లు బదులిడెను.— "తాపసోత్తమా! నీవు నిక్కముగా కలగాంచుచున్నావు. సన్నిపాత జ్వరపీడితుని వలె నీవు వచించు మహావిషయము లెవ్వియు నల్పజ్ఞనగు నాకు గ్రాహ్యము కాకున్నవి. నేను నూర్జహాను మహారాణి యొక్క ప్రేమకు బాత్రురాలనై యున్నను, ఒకసాధారణ పరిచారికనే యని యెఱుంగుము. నాతొల్లిటిచారిత్రమంతయు నామనఃఫలకము నుండి పూర్తిగ దుడిచివైచితినని యింతకుముందే వచించియుంటినిగదా! అయ్యా! నీవచనములాలింప నున్మత్తునివలె దోచుచున్నావు."

అట్లు గంభీరముగ సంభాషించుచుండిన జులేఖాయొక్క హృదయ రహస్యవిచ్ఛేదనాయత్తచిత్తుండై, ఫకీరొక్క తీక్షణవీక్షణము నామెపై సారించి, మందహాసమొనరించుచు నిట్లు పలికెను—"భరతఖండము నందెల్లడల బంగాళాదేశస్థు లసాధారణమేధావంతులని సుప్రసిద్ధమై యున్నది. వంగీయవంశసంజాతవగు నీయప్రతిహతశక్తి సామర్థ్యముల ముందు నూర్జహానుయొక్క తెలివి తేటలేపాటివి!"

## ౨౧

### క్రొత్త ప్రసంగము

అంతవరకు నాసీనయై, ఫకీరుయొక్క పలుకుల నాలించుచుండిన జులేఖా దిగ్గున లేచి కోపఘూర్ణితవదనయై యిట్లు పలికెను.— "అయ్యా! నీతోడి వాదము నిరర్థకము. ఒక్కమాటజెప్పెద, నాలింపుము. —నాజాడలరయుటకై మహారాణి తత్క్షణము విశ్వప్రయత్నము లొనరించును. నేను కానరాకుందునేని, సార్వభౌమురాలు కుపితస్వాంతయై భూమ్యాకాశములను జిందరవందర జేయింప గలదు సుమా!"

జులేఖాయొక్క తీవ్రాలాపములకిట్లు ఫకీరు ప్రత్యుత్తర మొసంగెను.

—" జులేఖా ! నీవట్లు తీవ్రపడనేల ? నేటిరేయి నీకై తాపత్రయపడుటకు మహారాణికి తీరిక యుండదులే. "

" అదియెట్లు ? "

" సార్వభౌముఁడు నేటిరాత్రి మహారాణీ మందిరమున శయనించును గనుక "

తోడనే జులేఖా యాశ్చర్యస్వాంతయై యిట్లు పలికెను.—"ఓహో రాజాంతఃపురరహస్య విషయములన్నియు నీకుఁజక్కగా తెలియునట్లున్నదే ! నాకంతె నీవే విశేషముగ నెఱింగియుండుట కర మాశ్చర్యకరముగా నున్నది ! "

మందహాస మొనరించుచు ఫకీరిట్లు బదులిడెను.—" జులేఖా ! నేనొక్కమాట చెప్పవలసి యున్నది. నీవిట్లు నిగూఢముగఁ బ్రవర్తించుట మాని, హృదయము విచ్చి మనసార ముచ్చటింతువేని, ఇరువురకును క్షేమకరముగా నుండును. సావధానచిత్తవై యోచించుము.

జులేఖా సహజముగ గంభీరస్వాంతయయ్యు నొక్కింత చలించెను. మిగుల దృఢముగాఁ బ్రసంగింపగడంగియు నాయువతీలలామ ప్రకంపితకంఠయై యిట్లుపలికెను.—" నేను విశేషించి చెప్పవలసిన దేమున్నది ? భాగ్యవశమున మహారాణియొక్క ప్రాపుఁబడసిన దాసనై యున్నను, బీగముమహలు నంజలి వేన వేల దాసీలలో నేనొక్కరితనుగదా, నాకు రాజకీయ వ్యవహారములతో నంబంధమేల ?

" లేకేమి ? సంబంధ ముండు కారణముననే, వింత తెరంగున నిన్నీ ప్రదేశమునకు రప్పింపవలసివచ్చెను. సరె, ప్రస్తుతమది యట్లుండ, నేనెంత చెప్పినను సరకుఁజేయక మౌర్ఖ్యము వహించి, నీవు నిష్కాపట్యము వహింపకుండుటచే, నిన్ను గుఱించి యొక్క ప్రశ్న యడుగ వలసియున్నది."

" అదేద్దియో శీఘ్రముగ ముగించి నాకనుజ్ఞ నొసంగుము. "

" నీ కుమార్తె యెచట నున్నది? ఆ బాలిక జాడ నీకేమైనఁ దెలియునా?"

" ఆమె జాడ నాకు లేశమైనను దెలియదు. నాపట్టి యొకవేళ సజీవియై యున్నను, నాకు మాత్రము విగతజీవియే."

" ఏమీ! నీబిడ్డ యీ నగరమున లేదనియే యందువా?"

" అయ్యా! నాకేమియుఁదెలియదని చెప్పియేయుంటిమి! నాముద్దులబిడ్డజాడ నీవే యెఱుంగునటు లున్నది."

" అట్లయినచో, నీబిడ్డ యెచటనున్నదో వెదకింపుమందువాయేమి?"

" అయ్యా! వలదు! వలదు. అయ్యో! నేనుజాతిభ్రష్టనైతినే. నిజముగా నాపట్టిని గాంచునంతటి భాగ్యము కలుగనున్నను, మహాత్మురాలి యందిరమున దానిసనై యున్న నావదనమును నాబిడ్డకెట్లుచూపగలను?"

" నీ మామగారి జాడయైన నీకుఁ దెలియునా?"

" నాకుఁదెలియదు. ప్రజాభిప్రాయము ననుసరించి నేనుగూడ నా మహనీయుఁడు మనుమరాలితోఁ గలసి పవిత్ర భగీరథీ తోయములం బడి మరణించి యుండుననియే విశ్వసింతును"

అట్లు పలికిన జులేఖాయొక్క హృదయ రహస్య కవచమును భేదింపఁగల తీక్ష్ణ వీక్షణము నామెపై నిగుడించి ఫకీరిట్లు ప్రశ్నించెను—" నీమనోవిశ్వాసము నిజముగా నట్లేయున్నదా?"

" అయ్యా! నిజముగా నట్టులే. గాని అనవసరముగ నిట్లు ప్రశ్నించుచు నన్ను బాధింపనేల?"

ఆపలుకులను వినకయే ఫకీరిట్లు చెప్పఁ దొడంగెను— " విపరీతముగా జరుగుచున్న ఆహత్యలగుఱించి నీకేమైనఁ దెలియునా?"

తోడనే కోపవివశయై, చుఱచుఱఁ జూచుచు జులేఖాయిట్లు ప్రత్యుత్తర మొసంగెను.—

"ఎంతటిసాహసము ! హత్యలకు నేను కారకురాలనని నిరూపింపఁ జూతువా యేమి ?,,

ఫకీరణుమాత్రమైనను జలింపక నిశ్చలముగా నిట్లు పలికెను—"ఫత్తే పూరు సిక్రీ వ్యవహారము గుఱించి కొంచమైనను నెఱిఁగింపజాలవా ?"

"అయ్యా నాకేమియుఁ దెలియదు. నాకెట్లు తెలియఁగలదు ?"

"జులేఖా ! నిక్కమెఱింగింపుము."

"అయ్యా ! క్షమింపుడు. మీయసంబద్ధ ప్రలాపములకు బదులాడను."

"ఆ కాయగూరలు విక్రయించు బాలిక, ఆ వెఱ్ఱిముదుసలి, ఆ సన్యాసి అమాలవి—మొదలగు మిథ్యా వేషధారుల గుఱించి యైనదెలియునా ?"

"అయ్యా ! నాకేమియుఁ దెలియదని యెన్నిసారులు చెప్పవలయును? హా ! దైవమా ! ఈవిషమ పరీక్షనుండి తప్పింపుము''

"జులేఖా ! నేజెప్పి నదంతయు మిథ్యయే యందువా యేమి ?"

"అయ్యా! నాకా విషయమే తెలియనపుడు మిథ్యయో యదార్థమో యెట్లు నిరూపింపఁగలను? "

"సర్వసుందరీ ! నీ గాంభీర్యము మిక్కిలి కొనియాడదగియున్నది. కాని, నీహృదయ మెరింగింతువేని, నీకుక్షేమకరముగా నుండునుసుమా. నీ వింక నిగూఢప్రవర్తనము జాలించిననే, నీవుతలపెట్టినకార్యము సులభతరముగ సాధింప నగునేమో. ఆ పాటి నీ వాలోచింపఁ జాలవైతివే, కావున ఈవిషయమై హృదయము విచ్చి మాటాడ రాదను నీ మనోనిశ్చయము మాత్రము శ్లాఘనీయముగా లేదు. "

నిశ్చలస్వాంతయగు జులేఖాయించుకేని చలింపక గంభీరముగా నిట్లు పలికెను. —"అయ్యా ! నీవంటి మహానీయు డిట్లు దురభిప్రాయపాశబద్ధుఁడగుట మిగుల సంతాప కరము. ఎట్టిరహస్యమైనను నాహృ

దయము నావరించియున్నచో, నీవంటి సర్వజ్ఞుని గాంచుభాగ్య మబ్బు నంతనే, పరమానందభరితనై యెఱింగించి ధన్యతగాంచియుండనా ?"

ఆమె యట్లు పలికినంతనే ఫకీరు వదన మొక్కింత వివర్ణమాయెను. ఆతని గంభీర స్వరముకూడ నొక్కింత చిన్నవోయెను — "జులేఖా! మఱల నెఱింగింతు నాలింపుము — నీహృదయరహస్య మెఱింగింతు వేని, నీకే మిక్కిలి లాభకరముగ నుండును."

తోడనే, క్రోధఘూర్ణమాన మానసినియై ఆమె యిట్లనెను— "నేను లాభము నపేక్షించుటలేదు. దయయుంచి నన్నుబోనిమ్ము."

"సరే! అట్లేయగుగాక. నీవిఁక వెడలవచ్చును."

"అయ్యా! ఈమందిరమునుండి వెడలుమార్గము చూపింపుము."

"నీవే తెంచిన ద్వారము తెరచియే యుండును. కాని, నేటిసమాచారమేరికి నెఱింగింపరాదని వేఱుగ జెప్పనక్కరలేదుగదా"

"నేనెఱింగింపను. పర్యవసానము నీకే దెలియగలదు."

తోడనే ఫకీరు పకపక నవ్వుచు నిట్లుబదులాడెను—"నీవెట్టి గట్టి ప్రయత్నములొనరించినను ఎచ్చటనైననుసరే, నన్నునీవు గుర్తించుట కల్ల. మఱియొక్క విషయము చెప్పెద వినుము —

"పార్వేషుగుఱించి లేశమైనను బయల్పఱచెదేని, నీకు లాభము కలుఁగకుండుటయేగాక, నష్టము వాటిల్లగలదని యెఱుంగుము. నీవిఁక పోవచ్చును." అని పలికి, యెదుటనుండిన ద్వారమును ఫకీరు చూపింప జులేఖా యిట్లు ప్రశ్నించెను.—

"అయ్యా! దయయుంచి ఈమార్గ మెచ్చటికిఁ గొంపోవునో చెప్పెదవా ?"

ఫకీరు :— "ఈమార్గము ననుసరించి యేగెదేని, నీకే తెలియ గలదు. కాని, మఱల నొక్కసారి చెప్పెదనాలకింపుము—నీ హృదయ రహస్య వృత్తాంతమును బూర్తిగ నెఱింగింతువేని, నీకెంతయో

లాభకరముగ నుండును. కష్టసమయములందు నీకెంతయు సహకారినై యుందునుసుమా? తీవ్రపడక లెస్సగ విచారించుకొనుము."

జులేఖా ద్వారమును సమీపించినదయ్యు, ఫకీరట్లు పలికినంతనే మోముద్రిప్పి నిశ్చలహృదయముతోడనే యిట్లుపలికెను— "అయ్యా మీరతిదారుణముగ దురభిప్రాయమునకుఁజిక్కియున్నారు. ఏదియెట్లున్నను, ఒక్కవిషయము నరయవలయును. మిమ్ము నేనెట్లు పరిగణింపవలయును.—మిత్రులనియా, శాత్రవులనియా?"

ఒక్కక్షణమూరకుండి, ఫకీరిట్లు బదులిడెను :—"మిత్రత్వమో శత్రుత్వమో, కేవలము నీప్రవర్తనము ననుసరించియే యుండును."

"అయ్యా! మీగురించి సవిస్తరముగాఁ దెలిసికొనుట శ్రేయస్కరము కావున, దయయుంచి వివరింతురా?"

"నేను సామాన్యపు ఫకీరునే, అంతకంటె విశేషములేదు."

"నేనుమహారాణికి నూడిగముజేయు చెలికత్తెనగు నట్టులేగదా"

"ఒకవిధముగా నట్టులే యనవచ్చును. ఒక్కవిషయము మాత్రము స్పష్టముగఁ జెప్పెద. గమనింపుము. నేను మొగలాయి వంశజుల క్షేమము గోరువాఁడ ననియు, హైందవులకుఁ జెఱుపు గోరువాఁడను గాననియు, నెఱుంగుము. నీ విఁక బోవచ్చును."

"అయ్యా! ఈ మార్గము బీగము మహలునకు గొంపోవునని భావింతును."

"ఆ మార్గము ననుసరించి యేగుదేని, నీకే దెలియును."

"మిమ్ము మఱల దర్శింపగలనా?"

"అవసరము కలుగునేని, మనము మఱల గలియు నేర్పాటు జరుగవచ్చును. నీ వింక నిలువవలసిన యవసరము లేదు. పొమ్ము."

ఎదుట నుండిన యా ద్వారమున జులేఖా ప్రవేశించినంతనే, ఆమె వెనుక గుభాలున నొక శబ్దమాయెను. తోడనే యదరిపడి ఆమె వెను

కకు మఱలి చూడ, తా నేతెంచిన మార్గము పూర్తిగ మూయఁబడి యుండెను. ఆ తలుపెచట నుండెనో తెలియకుండెను. ఈ స్థలమున దలుపు ఉండును అని నిర్ణయించుటకైనను నవకాశము లేకుండెను. శిలానిర్మితమగు కుడ్యము తప్ప వేఱొండు కానరాకుండెను. ఆ ద్వార మేమాయెనో, ఆ తలుపు యేమాయెనో—అంతయు నింద్రజాలమువలె నుండుటచే నామె భయాశ్చర్య వివశ యాయెను.

ఆమె యొక చిన్న గదిలో నుండెను. చెంతనే, సోపాన పరంపర లుండెను. మేడపై నొక దీపము వెలుగుచుండెను. ఆ కారణమున క్రింది గది యొకింత కాంతియుతముగ నుండెను. కాని, ఎంత వెదకినను దా నేతెంచిన ద్వారము గోచరింపకుండుటచే నామె విసిగి వేసారి, చెంతనుండిన సోపానముల నారోహించుచు బోవ, దివ్యభవనమువలె నుండిన మసీదునం దామె ప్రవేశించెను. అందు సహస్ర బాహువులుగల దీపరాజ మొందు దేదీప్యమానముగ విరాజిల్లుచుండెను. చంద్రకాంత శిలానిర్మితమైన యామందిరకుడ్యముల ధగధగద్ధాయమానమై భవము గాంచినంతనే జులేఖా యాశ్చర్యమగ్నమానసి యాయెను. వర్ణనాతీతముగ నుండిన యాదివ్యమందిరమే సుప్రసిద్ధమగు మోతీమసీదు. అద్వితీయమై భవ విరాజమానమై యొప్పు నమ్మహామందిరము ఆగ్రానగర దుర్గావరణమునందే యుండెను. సార్వభౌము కుటుంబమునకై గలిగిన విస్మయము వర్ణనాతీతముగ నుండెను.

మోతీమసీదు దుర్గావరణయందే నుండినను, రాజమందిరమునకు వెలుపలనే యుండెను. ఆ రెండుమందిరములకును భూమిలోపలి భాగమున మార్గ మేర్పడియుండెనని యేరికిఁ దెలియదు. అట్టి రహస్యము తనకు గూడ దెలియకుండుట జులేఖాకు మిగుల నాశ్చర్యకరముగ నుండెను. ఆ పరమరహస్యము సార్వభౌమ పుత్రుఁడగు పార్వేషుకు సహితము తెలియదు. ఆ కారణముచేతనే, జులేఖా యత్యద్భుతము గా

వృధ్వీలోనికి దిగిపోవుట గాంచినంతనే, పార్వేషు భయభ్రాంతుఁడును విస్మయపరవశుఁడును నాయెను. ఆతని కాగుప్తమార్గము తెలియదని యామె సులువుగా గుర్తింపఁగలిగెను. ఆమె నాతెఱంగున ఫకీరేల రప్పించియుండెనో, ఆమె యక్కల వచ్చియుండెనో కూడ పార్వేషున కగమ్యముగ నుండెను. వారిరువురుఁ గలసి తన్ను రాజ్యాభిషిక్తు నొనరించు తలంపుతో మంతన మొనరించుచుండిరని రాజకుమారుడు విశ్వసించియుండెను. అతడు నిజముగ నట్టివేలయే యనియు, రాజ్య సంపాదనమునకు వలయు చాకచక్యము లాతనియందు సూన్యము లనియు జులేఖా గుర్తించియుండెను. వనితాపానములకు దాసుడై, నిరంతరము మైమఱచియుండు మూర్ఖులా కష్టసాధ్యమగు మొగలాయి సామ్రాజ్యమును జేపట్టువారలు!

రాత్రి మీఱియుండుటచే నందెవ్వరు నుండరని జులేఖా యెఱింగియే యుండును. దైవాంశసంభూతు లనఁబడు రాజసంతతివారలు మాత్రమే ప్రార్థనకై కూడు నా మందిరమున జులేఖా యేకాకియై యుండెను. ఆప్రదేశము నిర్జనముగ నుండుట చేతను, నిశ్శబ్దముగనుండుట చేతను, బాహ్యప్రపంచమంతయు మైమఱచి నిద్రించుచుండుట చేతను, జులేఖా యాలోచనా యత్తచిత్తయాయెను. కాని, అట్టి ప్రదేశమున నాలోచించుచుగాల యాపన మొనరించుట వివేకము కాదని యెంచి ఆ మసీదునంతయు నొక్కసారి పరిశీలనగా దిలకించి, పైకిఁ బోవలయునని గమకింప నామందిరము నుండి యొక మానిసి నిష్క్రమించుట గోచరమాయెను. ఆతఁడు తాను గాంచిన ఫకీరువలెనే యుండెను. తన్నెవరైనఁగాంతురేమో యని కాబోలు ఆతఁడతి రయమున నిష్క్రమించియుండుట నాతని వదనము గాన్పింపకుండినను, ఆతఁడు తప్పకతనతో సంభాషించి యుండిన యావింత ఫకీరేయని యామె నిశ్చయముగ గ్రహించెను. ఆఫకీరు యాకృతి దృశ్యమైనంతనే, ఆమందిరము

పీడనుండిన జులేఖా విస్మయపరవశయై చేష్టలుడిగి, శిలావిగ్రహాకృతి దాల్చెను.

ఫకీరుతోడ నామె సంభాషించిన మందిరమునకును, ఈమందిరము నకును ఆమె యరుదెంచిన మార్గము తప్ప వేఱొండు మార్గము లేదని జులేఖా స్పష్టముగఁ దెలిసియుండెను. వేఱొకమార్గముండు నేని, ఆమెకుఁ గోచరము కాకుండునా? ఆమె వెంబడియే దొంగవలె తక్కుచు తారుచు నాతఁడరుదెంచి యుండునా? అట్లయినచో, వివేక వతియు సూక్ష్మజ్ఞానియునగు జులేఖా ఆపాటిగుర్తించియుండదా? కాని మార్గంతరములేని యీమసీదునందు జులేఖా యెఱుంగకయే యెట్లుప్రవే శించి యుండును? ఫకీరుయొక్క ప్రవర్తన నంతయు కేవలము మాయ వలెను ఇంద్రజాలము వలెను నుండెను. ఆవింతఫకీరు యొక్కవిపరీత ప్రవర్తనము గుఱించి దలంచుకొలది యామె మఱిపోవుచుండెను.

పట్టియాలోచనలతో గాలయాపన మొనరింపరాదనియెంచి, మనసు జేరదీసి వింతమానిసియగు నా ఫకీరుని వెన్నంటి అతనిజాడ నరయవల యునని నిశ్చయించి, ఆత డెచటికిఁబోవునో గనిపెట్టుట ప్రధాన కర్తవ్య మని యెంచి, జులేఖా ప్రయాణ మొనరింపసాగెను.

ఆఫకీరుయొక్క వైఖరి గాంచుగొలఁది ఆమె విస్మయమధికాధిక ముకాఁజొచ్చెను. ఆతఁడెవ్వడోగాని, యతిరయమున రాజాంతఃపురము వైపుననే బోవుచుండెను. నిస్సంగుడనన్యాసియేమి రాజాంతఃపురము ప్రవేశింపఁగడంగుటయేమి? ఆనిశీథసమయమున మిణుకు మిణుకులాడు నక్షత్రములకాంతి మాత్రమే సాహాయ్యముగ నుండుటచే, నావింత పూరుషునివదనము కానరాకుండెను కానిఆదీర్ఘకాయముమూర్తి సౌమ్య తయు, బాహువుల దీర్ఘతయును, చీకటియందు వెండితీగవలె తళతళ లాడుచుండిన యాతని బవిరిగెడ్డమును, పాదములవఱకు వ్రేలాడుచు నాతనిశరీరమును గప్పియుండిన అల్ఫాలాయును గోచరించినంతనే

యాతడు తప్పక ఆఫకీరేయైయుండునని స్పష్టమాయెను. కాని, ఆతడు నిక్కముగా సార్వభౌముమందిరము జొచ్చునో, లేక, మార్గమధ్యమున నెట్లైన నంతర్ధానమగునోయని శంకించి, జులేఖాకూడ నతిరయమున బోయెను.

ఫకీరుయొక్క గమనమును బరిశీలించుచు శీఘ్రముగా ప్రయాణ మొనరించుచుండిన జులేఖా హఠాత్తుగ విస్మయపరవశయై, చైతన్య విహీనయై ఆకసమువంక నట్టె నివ్వెరపాటుతో వీక్షింపఁగడంగెను.

## ౨౨

### దులారీ

రాత్రిమిాఱియుండుటచే, ప్రదేశమంతయుకడు నిశ్శబ్దముగ నుండెను. వివిధకార్యతత్పరులై యుండు మానవు లెల్లరు దమతమ నివాసముల యందు విశ్రమించు చుండుటచే మనుష్యసంచార ముడిగి యుండెను, వేళ యతిక్రమించుటచే రాజమందిరమునందలి దీపరాజములు నహి తము కానరాకుండెను. సముద్రతరంగములవలె మహాఘోర్భాటముతో ముందువెనుకలకు నిరంతరము నూగులాడు జనసమూహము లంతరిం చుటచే రాజాంతఃపుర మంతయు నిద్రించు చుండినటులు కడు నిశ్శబ్ద ముగ నుండెను. సాయుధులై, యప్రమత్తులై, సింహములవలె గావలి యుండు ఘారావాంద్ర గర్జనలు మాత్రము కఠోరముగ వినవచ్చు చుండెను. ఆసమయముననే, ఢంకానగారా మొదలగు వాయిద్య ములు కర్ణపర్వ మొనరింప నారంభించుటచే నపుడు పండ్రెండు గంట లాయె నని జులేఖా గ్రహింపఁ గలిగెను.

రెండుమూఁడు గంటల కాలములో నాఁడా మెగాంచిన యద్భుతము లన్నియు మఱల స్మరణకు వచ్చెను. ముఖ్యముగా, ఆ ఫకీ రెవ్వరై యుండునో యను ప్రశ్న యామెను మిగుల బాధింపఁ దొడంగెను.

కేవలము మోక్షసాధనానుష్ఠానపరతంత్రుఁడై యుండు సంయమీశ్వరునివలె నుండిన ఫకీరు నన్నీ తెఱంగున బట్టించి బంధించి యతివిపరీతగతి నిర్జనప్రదేశమునకు రప్పింపనేల ? ఈతని హృదయరహస్యాభిప్రాయమేమై యుండును ? సర్వజ్ఞునివలెఁ దోచునీతఁ డెవ్వఁడో ?

అని పరిపరి విధములఁ జింతించుచుండ, నా ఫకీరు సింహద్వారము సమీపించెను. ఆతని గాంచి నంతనే గస్తుతిరుగుచుండిన సైనికులు దిగ్గునలేచి భయభక్తియుతులై, తాముధరియించిన యాయుధములను బ్రదర్శించి, యతివినయముగ, దాఁటినొసంగిరి. మొగలాయిసార్వభౌముఁడు మాత్రమే యట్టి మహాగౌరవమున కర్హుఁడై యుండెను. సార్వభౌము పుత్రులు సహితమట్టి విశేష గౌరవము నెఱుంగరు. ఈ విషయమును జులేఖా యెఱింగియుండెను. ఆ కారణముననే ఆమెప్రమాణ్పబడి యట్లువీక్షింప దొడంగెను. సువర్ణమయ విగ్రహమువలె నామె చేష్టలుడిగి యుండుట కయ్యదేకారణము. "ఈఫకీరెవ్వరు ? రాజమందిరద్వారమున గావలియున్న రక్షకభటులవలన నట్టి మహాగౌరవము నందఁగల యీమహాపురుషుఁ డెవ్వఁడు ! అని యెంత యోచించినను సమాధానము కుదురదాయెను. ఈపాదుషావారే యిట్టి రూపము ధరించి యుందురా ? యని ఆమె వితర్కింప నారంభించెను. అదియెట్లగును ? ఆమె పాదుషాను నెరుంగనిదికాదు. వివిధసమయములందు సార్వభౌముఁడు వివిధవస్త్రధారుడై యుండుట జులేఖా స్పష్టముగ నెఱింగియే యుండెను. అట్టి స్థితియందు, పాదుషాయే ఫకీరురూపు దాల్చియుండినచో, నాతనితో నంతకాలము సంభాషించి యుండిన తాను గుర్తింపఁజాలనా యనితర్కించి, ఆ ఫకీరు పాదుషా కాఁజాలఁడని యామె స్థిరపరచికొనెను. కాని సర్వజనభయంకరుండగు సార్వభౌముఁడొక్కఁడే వడయఁగల మహాగౌరవమునకుఁ బాత్రుఁడైన యీఫకీరెవరు ?

అట్లామె వితర్కించుచు ధ్యానైకతత్పరయైయుండ, నాఫకీరు రాజమందిరము బ్రవేశించి యంతర్హితుండాయెను. తోడనే యాలోచనలతో బ్రొద్దుపుచ్చుట కయ్యది యదను గాదని యెంచి యతిరయమున నామె గూడ సింహద్వారమును సమీపించెను. ఫకీరునకట్టి మహాగౌరవముతో స్వాగతమొసంగిన ద్వారపాలకు లెప్పటి యట్లు సరససల్లాపము లొనరించుచుండిరి. ధ్యానైకతత్పరయై యుండి నజులేఖా వారిని సరకుఁ జేయకయే రాజమందిరము బ్రవేశింపఁగడంగెను. కాని, ఆమె ముసుగుధరించి యుండుటచే గుర్తింపజాలని ద్వారపాలకు లామెను వారింప, దనచేతనుండిన నూర్జహాను దివ్యనామాంకితమగు వజ్రపుటుంగరమును బ్రదర్శించినంతనే, పెనుబాముగాంచి యదరిపడు పాంథులవలె, వార లులికిపడి, తహాతహాలాడుచు దిగ్గునలేచి, ముకుళితకరకమలులై దారి నొసంగిరి. అంత, వారి నతిక్రమించి కొంత దవ్వరిగి మగుడ వెనుకకు మఱలి, కావలివారి నాయకునిగాంచి జులేఖా యిట్లు ప్రశ్నించెను:—"అయ్యా! ఇప్పుడిపుడే యిందు బ్రవేశించి యుండిన వార లెవ్వరో యెఱింగింతువా?"

నాయ— "జులేఖాబీబీ! ఇంకెవ్వరు! ముల్లోకములను శాసించు పాదుషావారే. ఒక్కక్షణముక్రిందనేగదా దేవర యేతెంచి యుండిరి!"

తోడనే, యామె సుందరవదనము సిందూరవర్ణము వహించెను.

"ఏమీ! పాదుషావారా! నాయకోత్తమా! నీవులెస్సగ దిలకించి యుంటివా? ఇందొక నిముసముక్రిందఁ జొచ్చినవాడు మునలిఫకీరు కాఁడా? వృద్ధుడగు ఫకీరేయిందుబ్రవేసించియుండుట నేఁగాంచియుంటినే!"

"జులేఖాబీబీ! పాదుషావారినే నీవుగుర్తింపఁజాలకుండుట చాల వింతగానున్నది. పాదుషావారుకున్న మేమట్టి మహాగౌరవమును జూపింతుమా?"

"ఫకీరుకాఁడనుమాట నిశ్చయమేనా?"

"బీబీ ! ముహూర్తానికి నిశ్చయము "

"సరే పాదుషావారెచటకేగి యీనిశీథసమయమున నేతెందిరో చెప్పగలవా ?"

"జులేఖాబీబీ ! షూకట్టి విషయము లెట్లు తెలియును ?"

"పాదుషావారేయుగు గాక కాని వారు ఫకీరువేషము ధరించి యుండలేదా !"

"లేదు లేదు. మేము కనులార గాంచియుంటిమి బీబీ."

తోడనే, పిడుగుపడినట్లుజులేఖా విస్మయభరముచే క్రుంగిపోయెను. కావలివారితోనిక ప్రసంగించుట నిరర్థకము నెంచి శీఘ్రముగలోనికి బోయి, బీగమువుహాలు సమీపించి, అచట రక్కసివలె గావలి గాచు చుండిన 'మస్రూ' యను కొజ్జాకు దన వజ్రపుటుంగరమును బ్రదర్శించి నంతనే వాడదరిపడి దిగ్గునలేచి వంగివంగి సలాములాచరింప, వాని నిట్లు జులేఖా ప్రశ్నించెను—"ఈరాత్రి పాదుషావారు యేబీగము మందిరమున నుందురో చెప్పుము"

"ఏరాత్రి ఏరాణితో సార్వభౌముడు క్రీడించునోమస్రూకు దప్పక దెలియుచుండును. కావున, వాడిట్లు సగర్వముగ బ్రత్యుత్తరమొసంగెను. —"జగద్రక్షకురాలగు నూర్జహాను బీగముసాహేబు దివ్యమందిరమున పాదుషావారున్నారు. కాని, జులేఖాబీబీ ! నీకీవిషయము తెలియకుండుట చాల వింతగా నున్నది !"

వానితో బ్రసంగించుటకు తీరిక లేకుండుటచే, మానిమాటలను వినకయే జులేఖా నిష్క్రమించెను. రాజాంతఃపురవాసు లనేకులు మైమరచి నిద్రించి యుండుటచే గడు నిశ్శబ్దముగ నుండెను. సందడితో పాటు దీపరాజముల కాంతిసహితము విశేషముగ తగ్గియుండెను. మృదుమధురగానస్వరము మాత్ర మచ్చటచట వినవచ్చుచుండెను.

చప్పుడుచేయక, మిక్కిలి జాగరూకతతో నూర్జహాను దివ్యభవన

మును జులేఖా సమీపించెను. సార్వభౌముని స్వాధీన పఱచికొనిన యా సాధ్వీమణి శయ్యామందిరము మూయఁబడియుండెను. చల్లని కాంతులీనుచుండిన దీపరాజమొండుయందు వెలుఁగొందుచుండెను. ఆమందిరము కడు నిశ్శబ్దముగ నుండుటచే, తన్నివాసులు మైమఱచి నిద్రించుచుందురని జులేఖా గ్రహించెను. ఐనను ఆమందిర ద్వారము సమీపించి, కడునిశ్శబ్దముగ దనకర్ణమునొండు తలుపునజేర్చి, సర్వేంద్రియసమర్థ్యములను కర్ణేంద్రియమునందే కేంద్రీకరించి, ఏమైనను విననగునేమోయని జులేఖా ప్రయత్నించెను. కాని, ఆమె ప్రయత్న మంతయు నిరర్థకమగుటచే, ఖిన్నయై, అందు నిద్రించు వారలెవ్వరో తెలిసికొనుటకు నవకాశము లేకపోయెగదా యని వగచుచు నామె నిజ నివాసము జేరెను.

నూర్జహానుయొక్క దివ్యభవనము క్రిందనే, జులేఖాకొఱకు మూడు గదులు ప్రత్యేకింపఁబడియుండెను. బీగము మహాలునందలి వేనవేల బందీలలో నొక్కజులేఖా మాత్రమే యట్టి ప్రత్యేక గౌరవమునకు బాత్రురాలై యుండెను. ఒకగదిలో నామె శయనించును. ఆమెకొఱకు నేతెంచువారలతో బ్రసంగించుటకు రెండవగది ప్రత్యేకింపఁబడెను. మూడవగది యామె పరిచారికకై ప్రత్యేకింపబడియుండెను. జులేఖా యంతటి గౌరవము నేల వడయఁగలిగియుండెనో పాఠకులు గ్రహించియే యుందురు. మహాసామ్రాజ్యమును శాసించు నూర్జహాను మహారాణియొక్క యమితానురాగమున కామె పాత్రురాలై యుండెను. ఎట్టి క్లిష్ట వ్యవహారమునందైనను, ఎట్టి రాజకీయ సమస్యాపరిష్కార సందర్భముననైనను నామె సలహాను నూర్జహాను యపేక్షించుచుండెను. మేధావియు సూక్ష్మజ్ఞానియు. ఉపాయధురీణయు నగు జులేఖా సమయోచితంబుగ బ్రవర్తించుచు, మహారాణి హృదయమును రంజింపఁజేయుచు, బీగముమహాలునందేగాక మొగలాయిసామ్రాజ్యమునం

దంతటను గూడ ప్రసిద్ధమానిస్థియై యుండెను. సద్గుణ వితానయగునా నారీమణి యసాధారణ సౌందర్యవతియు గూడనై యుండుటచే నామె వాంఛించియుండెనేని, జహాంగీరు పాదుషాను దన దాసునిగా నొనరింప జాలియుండెడిది. కాని, బుద్బుదప్రాయములును, నతిహేయములు నగు నైహిక సౌఖ్యములువర్జనీయములని యెఱింగిన దగుటచేనాసాధ్వీ మణియట్టి దుర్వ్యాపారమునకుఁ గడంగలేదు. నీతి, శీలము, మానము యను సద్గుణములు కేవలము గగనకుసుమములై యుండినయా బీగము మహాలునందు నిరంతరము నివసించుచుండయ్యు, దన మానమును నిలిపి కొనఁజాలిన జులేఖా ప్రసంశనీయురా లనుటకు సందియ ముండదు.

జులేఖాయొక్క వృద్ధపరిచారిక యొక వస్త్రమును గుట్టుచుండెను. ఆ పరిచారిక వృద్ధురాలయ్యు నవయువపటుత్వము గలిగియుండిన దగుటచే దన కార్యము జక్కగ నొనరించికొను చుండెను. అలుకుడిదైనంతనే జులేఖా యేతెంచియుండెనని గ్రహించి యొక నిట్టూర్పు విడిచి, ఆమెను గాంచి యిట్టు లనెను—"ఆహా! వచ్చితివా! నిన్ను గాంచుటచే నిపుడు నాహృదయభారము తీరిపోయినది. ఇంతవఱకును, నీకెట్టి కష్టము, ఎట్టి యనర్థము వాటిల్లి యుండెనో యని చింతించుచునే యుంటిని. నీవు రాకుండుటచే మిక్కిలి వెఱగంది, బీగము మహలంతయు వెదకి వెదకి నిన్ను గాంచఁజాలక దిగులొందిన డెందముతో నీకై నిరీక్షించుచుంటిని. అమ్మాయీ! నీవిట్లు తడయుట తగునా! రెండు ఝాములైనదే! నీవెచటి కేగియుంటివి? నీకై తయారుచేసిన యాహారము సిద్ధముగ నున్నది—"

విశేషముగా మాట్లాడుట యావృద్ధాంగనకు సహజమై యుండుటచే నామె యింకను నెద్దియో చెప్పుచు ప్రశ్నించుచునే యుండునని యెంచి జులేఖా యిట్లు ప్రశ్నించెను.—

"దయామణీ! పాదుషాబీగము నాగురించి యేమైన బ్రశంసించి యుండునా?"

దయా — "నీగురించి ప్రశంసించుటకు నేఁడు మహారాణికి వేళ యెక్కడ? చీకటి యగువఱకు పాదుషావారు నూర్జహాను తోడనే యుండిరి గదా"

"నిశ్చయమేనా?"

"ఏమీ! నిశ్చయమా యని ప్రశ్నింతువా? నేనింత వృద్ధురాలనైనను దేవుని కృపచే నా యింద్రియము లన్నియు నాస్వాధీనములోనే యున్నవి. వయసుమీఱినదాన నగుటచే నేను కొఱమాలిన దానవని భావింతువా యేమి? నాకండ్లు చెవులు పట్టుదప్పి యున్నవని యెంతువా యేమి? హా! ఏమి కాల వైపరీత్యము! మహారాజుగారి యాగమనము కన్నులార గాంచియుంటినే. మహారాజావారు టన్జను నుండి నాగదిచెంతనే దిగి ఇరువురు స్త్రీలపై నానుకొని, ఎట్టులెట్టులో మహారాణి మందిరము జేరియుండుట నేను స్పష్టముగా గాంచియుంటిని. పానీయ మధికమగుటచే మహారాజు తూలిపోవుచుండెను సుమా"

"దయామణీ! మతిపోయినదా యేమి! గోడకు చెవులుండునని నీ కెఱుంగవా! నీ పలుకు లెవ్వరైన నాలింతురేని వెంటనే ప్రాణహాని సంభవించునని యెఱుంగవా?"

"ఎఱుంగ కేమి? అతిభయంకరమగు నీమాయామందిరము నెన్నఁడు ప్రవేశించితినో, నాటినుండియు గ్రహించుచునే యున్నాను"

"పాదుషావారు మగుడ నెపుడు పైకి వెడలిరి?"

"సరిపోయినది! పాదుషావారు వెడలిరనియే భావింతువా యేమి? మహామాయాస్వరూపిణి యగు నూర్జహాను భుజపంజరమున జిక్కిన ఱేఁడు యెట్లు వెడల గలఁడు! వలయునేని నీవు చూడవచ్చును. జగ

న్మోహనాకారముగల నూర్జహానుయొక్క పాదములను మహారాజు తన శిరమున ధరించియే యున్నాఁడు."

అట్లు నోటికి వచ్చినట్లు వదరుచుండిన ముదుసలి దాదిని గాంచి భయవిహ్వలయై జులేఖా దిగ్గునలేచి ఆమెనోరు నొక్కి యిట్లు పలికెను.

"నోరు మూసికొని యుండఁజాలవా! నీకు పిచ్చిపట్టినదా యేమి? ఎవరైన విన్నచో నెంతప్రమాదము!"

ఆ వృద్ధాంగనకు బట్టరాని యాగ్రహము జనించుటచే నిట్లు తీవ్రముగ బలికెను.

"నాకీ చెఱయేల? నా దేశమునకు బోయెదను సెలవిమ్ము."

అట్టి జరఠాంగనతో, వాదించుట వ్యర్థమని భావించి, ఒక్కక్షణ మాగి భుజింతునని పలికి, జులేఖా తన శయ్యాగృహమునకు, బోయెను. ఇచట వృద్ధురాలగు దహూమణి మాత్రము కోపముచే మండిపడుచు ఊడగా మిగిలియుండిన పండ్లను పటపట గొఱుకుచు నిట్లు గొణగఁ దొడంగెను.

"నీ కర్మము, నీ యిష్టము వచ్చినట్లు చేయుము. నీ కొఱకు మిఠాయిలను పండ్లను ఆ వెండిపళ్ళెరమున ఆమూలను దాచియుంచితిని. పలావు మొదలగు పదార్థములను యథావిధిగా పేదసాదలకు పంచివైచితిని. నీ యిష్టము—" అని యేమేమో యనుకొనుచుండెను.

మాంసభక్షకులగు మహమ్మదీయులమధ్య సదా వసించు జులేఖా యట్టి పదార్థములను వర్జించి కేవలము శాకపాకములనే గుడుచుచుంట మిగుల నాశ్చర్యకరమైన విషయమని పాఠకులు గుర్తించియేయుందురు కాని, ఈవిషయము నందఱు యెఱుంగరు. ఎఱింగినను, నిజముగ నందంత యాశ్చర్యములేదు. సుప్రసిద్ధుఁడగు నక్బరుపాదుషా రసపుత్ర రాజపుత్రికలను వివాహమాడి వారలను నిజాంతఃపురమునకు జేర్చినపుడు వారివారి సాంప్రదాయముల ననుసరించియే వారు మెలంగవచ్చు

వనియు, వారి మతాచారముల కెట్టివిరోధమైనను నొనరింపరాదనియు వా సాధుశీలుండు కఠినముగ శాసించియుండెను. జహాంగీరుకూడ తండ్రి తెలుంగుననే సంచరించుటచే బీగము మహలునందలి హైందవాంగన లెల్లరు దమ తమ యాచారములచొప్పుననే మెలంగ గలుగుచుండిరి. కర్మవశమున మహమ్మదీయమతము నవలంబింపవలసిన దయ్యు నా జాతి దుస్తులను మాత్రమే ధరించుచు నాచారవిషయములందు బూర్తిగ హైందవ శుద్ధాంగనవలెనే జులేఖా మెలంగుచుండెను. ఆమె సాధారణముగా బాలు ద్రాగుచు, పండ్లనారగించుచు, నప్పుడప్పుడు మిఠాయిలనుకూడ దినుచు, మహమ్మదీయాహారమును మాత్ర మామె పేద సాదల కిడుచుండెను.

తుపాను సమయమునందలి సముద్రమువలె జులేఖాయొక్క డెందము మిక్కిలి యుల్లకల్లోలముగ నుండెను. పాదుషా నూర్జహాను యొక్క మందిరముననే యున్నాడా? అట్లయిన, ఫారావాండ్ర వాక్కులు యసంబద్ధము లగునే! ప్రవేశించినవారు పాదుషావారే యని ఆ ఫారాచౌకీలు చెప్పియుండిరే! నూర్జహాను మందిరమున నుండువాడు పాదుషా యగునా కాడా యని యెంత ప్రశ్నించుకొన్నను శంకానివృత్తి కాకుండెను. ఆలోచన తీవ్రమగుచుండుటచే, నామె మెదడు కరిగిపోవునటు లాయెను. ఆహారముపై వాంఛ లేకుండెను. కాళ్ళేతులు లాగుకొని పోవుచుండెను. సముద్రతరంగములవలె పొంగిపొంగి కలంచుచుండిన వ్యర్థపు టాలోచనల నడంచునది నిద్రాదేవియే యని యెంచి యామె తనశయ్యపై వ్రాల, నాసమీపము నుండి 'ఆహా! హా' యను దీనారవము హఠాత్తుగ వినవచ్చుటచే నామె త్రుళ్ళిపడి లేచెను.

జులేఖాకొఱకు ప్రత్యేకింపఁబడియుండిన పడకగది యతి విశాలముగనుండెను. మనోహరములగుసోఫాలు 'కుర్చీలు' మేజాలు మొదలగు

సామానులతో నామందిర మలంకరింపఁబడి యుండెను. వెండితోఁ జేయఁబడిన చిన్నిచిన్ని మేజాలు అచ్చు టచ్చుట గోడల కమరియుం డెను. ఆ మందిర వైభవమును గాంచి, ఉమ్రావు మొదలగు నున్న తాధి కారుల శయ్యామందిరములకు దీసిపోదని తోపకమానదు. కాని, వైభవ ముతో నలరారు సామగ్రిని నామెయుపయోగించుట యరుదు. ఆగోడల కమరియుండిన వెండిమేజాలపై ఫలహారాదు లుండినను, మనసు మిక్కిలి చీకాకుపడియుండుటచే, నామె వానిని ముట్టకయే, తాను గదిలో బ్రవేశించినంతనే తలుపువైచికొని తన శయ్యపై నామెవ్రాలెను. బీగము మహాలు నందు పది సంవత్సరముల నుండియు సంచరించు చుండిన కారణమున నచ్చటి సాంప్రదాయములను జులేఖా చక్కగా నెఱింగి యుండెను. ఎన్నియో వైపరీత్యముల కామహాలు రంగస్థలమై యుండెను. ఎందరో యువకులు స్త్రీవేషములు ధరించి మొగలాయి జనానా యందు బ్రవేశించు చుండిరి. పురుషసంపర్కములేక స్రుక్కు నారీమణులు తాముప్రేమించు వన్నెకాండ్రను నిగూఢముగ రప్పిం చుట సాధారణ ధర్మమై యుండెను. నానా దేశములనుండి యరు దెంచి మొగలాయి జనానా యందు నివసించు యసాధారణ సౌంద ర్యవతులగు బీగములు, మహావైభవా క్రాంతులయ్యు, పేరునకు మా త్రము భార్యలే యయ్యు, తమకాంతులు తమ్ముమరచి పరాంగనలతో విహరించు వారలగుటచే, మన్మథా వేశమున బరపురుషులను గుప్త ముగ రప్పించుట యాచారమై యుండెను. పురుషుడు బహుభార్యా సక్తుండగు నపుడిట్టి యధర్మములు ప్రభవించుట యాశ్చర్యముకాదు. అవివాహితలగు బందీలకొలకు నరుదెంచు వారలసంఖ్యకొక హద్దు లేదు. ఇట్లు బందీలు మొదలు బీగములవఱకును నందు వివిధతరగ తుల వారెల్లరు తమ తమ విటులను రప్పించుచునే యుండిరి. సాధా రణ పురుషులేగాక, ఉమ్రావు మొదలగు మహాపురుషుల కుమారులు

సహితము ప్రచ్ఛన్నముగా నంతఃపురముఁ జొరఁబడి తిరుగాడుచునే యుండిరి.
కాని, ఒక్క విషయమును మన్నింపవలసి యున్నది. పోతుటీగయైనను
పాదుషావారి బేగముమహాలు జొరరాదు కావున, నందు ప్రవేశించు
వారెన్నియో మాయోపాయములను బన్నుచుండిరి. స్త్రీవేషముధరిం
చినంత మాత్రమున నందు నిర్భయముగా ప్రవేశించుటకు వలను
పడదు. కాబట్టి ఒక్కొకపుడు కావలివారి కన్నుఁబ్రామి మఱియొక
ప్పుడు వారికిలంచములు గుడుపుచు నందు ప్రవేశించుచుండిరి. పద్మ
వ్యూహము వలెనుండిన యమ్మహామందిరమున నెట్టి యద్భుతములు
జరుగుచుండెనో యేరికి దెలియదు. అందలియేబందీలు, ఏబేగములు
యంతర్ధాన మగుచుండిరో యివ్వరికి దెలియదు. ప్రచ్ఛన్నముగా
నందుఁ బ్రవేశించు పురుషులును సద్వంశజులును నెందరు విగతజీవు
లగుచుండిరో యేరికిఁ దెలియదు.

నాటి యద్భుతవైపరీత్యముల కారణమున క్రుంగిక్రుంగి శయ్యపై
వ్రాలిన జులేఖా, తానట్లువ్రాలినంతనే "ఆహా! హా!" యను దీనా
రవము హఠాత్తుగ వినవచ్చినంతనే యదరిపడెను. కామాయత్త
చిత్తుఁడైన మదాంధుఁడెవ్వఁడో తనమందిరము జొచ్చి తనమంచము
నారోహించెనేమోయని యామె యనుమానించెను. ఆమె ప్రవేశించు
నపుడు సన్ననిదీపమొక్కటియే వెలుఁగుచుండుటచేతను, మిక్కిలి యలసి
ధ్యానైక తత్పరయైయుండుటచేతను నామె పరిశీలింపకయే శయనింపఁ
బోయెను. తోడనే, యమ్మానవతి దండతాడితభుజంగమువలె క్రోధై
కధురీణయైగంభీరముగా నిట్లు సంబోధించెను: "ఓరీ! నరాధమా!
నాశయ్యపై బరుండ సాహసించిన రక్కసి యెవ్వఁడురా వీఁడు?"

కాని, ఆమె యట్లు గద్దించినను, సదుత్తరము రాకుండెను. తీవ్ర
మగు బాధను దెలుపు ఆహా!, యనునొక నిట్టూర్పుమాత్రము బయ
ల్వెడలెను. ఆతల్పముపై శయనించిన వారెవ్వరో దెలియదు కాని, అధిక

మగు బాధకుపశులై యొడలెఱుంగకుండినట్లు తెలియవచ్చెను. తోడనే లేచి, చెంతనుండిన దీపము దెచ్చిచూచి, యాశ్చర్యాంతయై జులేఖా ఫక్కున నవ్వెను.

ఆశయ్యపై బరుండియుండినది యొక బాలిక. ఆమె ప్రాయము పండ్రెండేండ్లవలెనుండెను. గాని, ఆమె యంతకంటె నెక్కుడు వయో వంతురాలని బీగము మహలునందలి వారందఱు నెఱుంగుదురు. పది యేండ్లనుండియు నామెయట్లులే పండ్రెండేండ్లబాలిక వలెనే గోచరించుచుండెను. అతికోమలమగు నామె సుందరవదనమునందు నెట్టి మార్పునైనను గానరాకుండెను. ఆసుందరవదనారవిందము సంతతము పరిశుద్ధమై విరాజిల్లుచుండెను. ఆకారణమున దమ సంతోషాతిశయమున నాగ్రా పురవాసులెల్లరు నామెను "హ్వా" యని పిలుచుచుండిరి.

ఆబాలిక సౌందర్యవతియేగాని, విశేష సౌందర్యవతియని చెప్పుటకు వలనుపడదు. ఆమె భుజములపై వ్రేలాడు కుంతలములు ఎదుగుతరుగులులేక యట్టులే యుండెను. ఆమె సర్వదా సామాన్యవస్త్రములనే ధరించుచుండెనుగాని విలువగలవస్తువులనైనను డాబుగానుండు వస్త్రాభరణాదులనైనను నెన్నఁడుధరించుటలేదు. ఆమె జన్మరహస్యముగాని జీవితచరిత్రము గాని యెవ్వరెఱుంగరు. ఆమె యెచట జనించెనో, ఏజాతియో ఏదేశమో తల్లిదండ్రు లెవ్వరోకూడ నెవ్వరెఱుంగరు. ఆ రహస్యముల నరయు గుతూహలమున నెవ్వరైన నామెను బ్రశ్నించినచో నామె యెట్టి సమాధానము నొసంగక వారి హృదయమును రజింపంజేయు నొక్కచిరునవ్వును మాత్రము వ్యక్తీకరించుచుండెను. అనునిత్యము బాలికవలె దోచు నాయంగన యందొక గొప్పవిశేషముండెను. ఆగ్రహము జనించునపుడామె నయనములు చింతనిప్పులవలెను, విషానలజ్వాలలు వెడలఁగక్కు నాగేంద్రుని

నయనములవలెను ప్రకాశించుచు, నెదుటనుండువారికి భయభ్రాం తులుకల్గించుచు చేతులు జోడింపఁజేయుచుండెను.

చిరకాలము క్రింద నెవ్వరో యీమెను బీగమహాలునందు ప్రవేశపెట్టిరి. నాటగోలె, ఒకరియడ్డంకిలేక ఆమహాలునందామె నిరంకుశముగ దిరుగాడుచుండెను. నూర్జహానుయొక్క మిత్రరత్నమగు జులేఖాకు నామె ప్రియతమమైన పదార్థమై యుండెను. కాలచక్రము గిర్రునదిరుగుచుండినను ఏండ్లు గడచుచుండినను, బాలికవలెనే యుండినయీమె పరిశుద్ధప్రవర్తనము జులేఖాకు మిక్కిలి యానందదాయకముగ నుండెను. అప్పుడపుడర్థరహితములగు మాటల నుచ్చరించుచు వినువారల కామె నవ్వుగలిగించుచుండెను. ఒక్కొకపుడామె మూఢురాలువలెను వెర్రిదానివలెను ప్రవర్తించుచుండెను. మఱియొకప్పుడామెయందునింగితజ్ఞానము ప్రపంచజ్ఞానమును గానరాకుండెను. అట్టి యీమె యవ్యక్తప్రవర్తనము మహారాణియగు నూర్జహాను యపారప్రేమను గూడ నాకర్షించెను. నిరంతరము రాజకీయ వ్యవహారములయందు నిమగ్నమై యుండు సార్వభౌమురాలు విశ్రాంతి కలుగునపుడా బాలిక యభావచేష్టలఁ గాంచి వినోదార్థము యెకసకము లాడుచు యానందించుచుండును. ఆ తెఱంగున నామె యందఱికి నానందముగలిగించునదగుటచేనామెను "దులాలీ!" యని యందఱు బిలుచుచుండిరి. తుదకు "జ్వా" యను తొల్లిటిపేరు మాసి 'దులాలీ' యను నామమే స్థిరమైపోయెను.

బీగము మహాలునందుండు దులాలీ యొక్కొకపు డాకస్మికముగా మాయమగుచుండెను. ఆమె యెచటికేగునో యెవ్వరికిదెలియదు. ఆమె సంరక్షకురాలగు జులేఖాయైన నెఱుంగదు. అప్పుడపుడామె యాగ్రానగరము దాటి పోయియెచటనో తిరుగాడుచుండును. ఛాయవలె నంతరించి, ఛాయవలెనే గోచరించు నా బాలికను గాంచునంతనే ద్వారపాల

కుఱు దాఁటిపోయెసంగుచుండిరి. ఆమె మౌనము, మాంద్యము, అవ్యక్తాలాపములు, నిరపాయకరమగు నసంబద్ధ ప్రవర్తనమునుగాంచి ఆమెపై జాలివహించి, యామెకెట్టి నిరోధము గలిగింపకుండుటచే, నాబాలిక బీగము మహాలునందంతటను స్వేచ్ఛగా నిరాఘాటముగా సంచరించుచుండెను.

ఒక వారమునుండియు బీగము మహాలునందుగాని యాగ్రానగరమందుగాని దులాలీగోచరించుటలేదు. ఆమె యెన్నఁడు వెడలెనో యెచటికేగెనో జులేఖా యెరుంగదు. ఆబాలిక యట్లు లంతరించుటసాధారణలక్షణమగుటచే నామె కొఱకు జులేఖా వెదకింపలేదు. ఆమె గుఱించి తలంపనైనను లేదు. వృద్ధురాలగు దయామణి సహితమెఱుంగదని యే యందఱు భావించుచుండిరి. ఆ బాలికయొక్క గమన మతిత్వరితము గను నత్యద్భుతముగను నుండెను. ఎవ్వరైన వెంబడించుటకువీలులేనట్లు ఉమతవలెను మర్కటమువలెను వృక్షములపై గాని గృహములపై గాని యతి లాఘవముగా నెగబ్రాకి లంఘించును. అట్టి దులాలీ యెప్పుడు బీగము మహాలు ప్రవేశించెనో జులేఖాయొక్క శయ్యాగృహము నెన్నఁడుప్రవేశించెనో యెవ్వరెఱుంగరు. దయామణియే యెఱుంగనపుడోరులెట్లెఱుంగగలరు?

దుర్మదాంధుఁ డెవ్వఁడో తనశయ్యపై దాగియుండెనని భ్రమించి, యాగ్రహోద్వృత్తచిత్తయైన జులేఖా దులాలీని గాంచినంతనే విస్మయపరవశయై యాశ్చర్యస్వాంతయై పక్కున నవ్వెను. కాని, ఆక్షణముననే యానవ్వు మాఱిపోయెను. ఆదివ్యసుందర వదనారవిందము ప్రభాతసమయమునందలి సూర్యబింబమువలె నెఱ్ఱబాఱెను.

దులాలీ నిద్రించుచుండెను. తోడనే యామెను లేపబోయి, యేలకో జులేఖా సంశయించెను. ఒక్కక్షణ మూరకుండి ధ్యానైకతత్పరయై కృతనిశ్చయయై, "దులాలీ, దులాలీ" యని పిలిచుచు

తట్టితట్టి యామె లేపివై చెను. తోడనే తన విశాలనయనములను విప్పి, యసమయమున జులేఖా యట్లు గోచరించినందున నొక్కింత యాశ్చర్యపడి, కండ్లు నులిపికొనుచు సాధ్యమగునంత త్వరగా లేచికూర్చుండి దులాలీ యిట్లనెను. "నేనుగాఢముగా నిద్రించుచుంటిని కాబోలు!" జులేఖా తలయూపి యామెప్రక్కనే యాసీనయై "నీ వెటు పోయి యుంటివి?" యని ప్రశ్నించెను.

"చాల దవ్వేగి యుంటిని."

"సరె ఎచటి కేగియుంటివో వివరింపుము."

ప్రత్యుత్తరపూర్వకముగా దన నయనములతో నత్యద్భుతముగా దులాలీ యొక సంజ్ఞ గావించెను. అందలి రహస్యము జులేఖాకు గ్రాహ్యమగుటచే తోడనేయిట్లు ప్రశ్నించెను.

"అక్కడి సమాచార మేమి?"

"అంతయు బాగుగనే యున్నది."

"అజితసింహుం డింకను పలాయన మొనరింపక యచటనే యున్నాం డని భావింతును!"

"రనపుత్ర రాజపుంగవు లంతసుఖులుగా లోబడుదురా?"

"మఱి యేమి విశేషములు?"

"మహాబతుఖాను భీమసింగు లిర్వురు విశేష సైన్య సమన్వితులై యిటు యరుదెంచుచున్నారు!"

"ఇపుడు షాజాడా యెచట నున్నాడు?"

"ఆతం డెక్కడ దాగియున్నాడో యెవ్వరు నెఱుంగరు!"

"వాస్తవమేగాని, నీవెఱుంగుదువనిమాత్రము నే నెఱుంగుదును!" తోడనే, దులాలీ పకపక నవ్వి యిట్లనెను —

"నీ కొక వింత సమాచార మెఱింగింపవలసియున్నది!"

"అదేద్దియో శీఘ్రముగా నెఱింగింపుము."

"రేపు సూర్యోదయము కాకపూర్వమే, షాజాదా పార్వేజు సైన్యసమేతుఁడై సమరకార్యైకోత్సుకుఁడై బయల్వెడలనున్నాఁడు!"

"రాజకుమారుఁ డెవరితో బోఁగాఁడు?"

"రసపుత్ర వీరులతో."

"అట్టులా? — నీ కీ సమాచార మెట్లు తెలిసినది?"

"నీ వెఱుంగవా! సర్వసన్నాహములు సిద్ధములైనవి. పాదుషా వారే హుకుం యిచ్చియున్నారు?"

"పాదుషావారీ విషయమై నూర్జహానుతో నాలోచింపలేదు కాబోలు?"

"అది యెట్లు ఆమె సర్వ మెఱుంగును. ఆమె సలహా ననుసరించియే పాదుషావా రిట్టి కార్యమునకుఁ గడంగిరని నా విశ్వాసము."

తోడనే జులేఖా వదన మెఱ్ఱబాఱ, ఒకింత ధ్యానించుకొని యిట్లనెను — "మహారాణి యిప్పుడిప్పుడేలకో గాని తొంటి తెఱంగుదప్పి నాయెడ వేఱుగా బ్రవర్తించుచున్నది. నాపై గల విశ్వాసము దినదినము తగ్గుచున్నట్టు గోచరించుచున్నది. తొల్లి, ఎట్టిరహస్యమైనను నాకెఱింగించుచు నాతో ముచ్చటించుచుండెను. ఇప్పు డట్లాచరించుటలేదు."

"స్వవిషయముల నెల్ల మహారాణి నీకేల యెఱింగింపవలయును?"

"అవును, బాగుగా జెప్పితివి. అన్ని విషయములను నాకేల నెఱింగింపవలయు! కాని, పార్వేజు యుద్ధసన్నద్ధుఁడాయెనని వారెఱుంగుదురా?"

"ఈ సమాచారము నాకే దెలియును? ఒరు లెవ్వ రెఱుంగరు."

"నీ కెట్లు తెలిసినది?"

"విషయము నీకు సవిస్తరముగాఁ జెప్పెదను. కాని, ఒకింత వరుండనిమ్ము."

దులాలీ చాలదూరము పాదచారియై ప్రయాణ మొనరించియుండు ననియు ఆకారణమున మిక్కిలి యలసియున్నదనియు గ్రహించి

ప్రశ్నలు వైచి యామెకు బాధ గలిగింపరాదని యెంచి మంచముపై నాసీనయై యుండిన జులేఖా లేచిపోయెను. తోడనే, దులారీ గాఢ నిద్రాపరవశ యాయెను.

ఆ సమీపముననే జులేఖా తనకై యొకతల్పము సిద్ధపఱచికొనెను. కాని, ఆమె మనసు పరిపరివిధములు పోవుచుండెను. ఆమె డెందమున ననేక యాలోచనలు పరుగులెత్తుచుండుటచే నిద్రించుట కవకాశము లేకపోయెను. పాన్పుపై గూర్చుండి, కొంతతడవెద్దియో గాఢముగాఁ దలపోసి, యామె దిగ్గున లేచి యామూలనుండిన యినుపపెట్టెను దెఱచి యందలి కాగితముల నతిభద్రముగా జదువగడంగెను. ఆ పత్రము లన్నిటిని సమగ్రముగా నామె పరీక్షించెను. అట్లామె రెండుమూడు సారులు పరిశీలించి, సమీపమున మండుచుండిన దీపముతో వాని నన్నింటిని బూర్తిగా దహించివైచెను. అనంతర మామె దీర్ఘముగు నిట్టూర్పు విడిచి యిట్లనుకొనెను.

"జగదీశుని చర్యలతి విపరీతములుగదా! నా జీవితచారిత మెట్లు ముగియునో దైవమేయెఱుఁగు. నామోముపై నెద్ది లిఖింపఁబడియున్న దో యెట్లెఱుగనగును? ఏకార్యసాధనమునకై నాజీవితము వినియోగిం చితినో యమ్మహాకార్యము సిద్ధించు మహాసమయ మేతెంచినది. దైవ ము నాకెట్టు విధించెనో దైవమే యెఱుగు!"

జులేఖా యట్లు ధ్యానైకతత్పరయైయుండ, దుర్గమునందలి నౌబతు వాయిద్యము విననాయెను. "ఆహా! ఈరాత్రిమెల్లగా నెట్లుగడచిపోయి నది! నేనిట్లు యోచించుచుండగనే యరుణోదయకాలము దెల్పు మృదుమధురమంగళ వాయిద్యములు కర్ణపర్వ మొనరించుచున్నవే! పాదుషావారు యిందుండివెడలి యుండురాయేమి! అది యెట్లగును! వారింకను నూర్జహాను మందిరముననే, యుండవలయు!"

అట్లు చింతించుచు సమీపముననుండిన గవాక్షమునామె తెరువ

ప్రత్యూష పవనాంకురములు ప్రవేశించి, వివిధవిచారములచే క్రాగియుండిన జులేఖా డెందమునకు హాయి గలిగించెను. తూర్పుదిక్కున నరుణోదయకాంతి యొక్కింత గోచర మగుచుండినను, ఆగ్రానగర దుర్గమింకను తమోసాగరమున మునగియేయుండెను. జనసంకీర్ణమగు నాగ్రానగరమంతయు నింకను నిద్రావస్థయందే యుండుటచే సర్వము కడు నిశ్శబ్దముగ నుండెను. రాత్రియందు జాలకాలము మేల్కాంచి యుండు బీగముమహాలు నివాసులందరు నిద్రాసౌఖ్యము ననుభవించుచునే యుండిరి. రాత్రియంతయు వివిధాలోచనా పీడితయైయున్న జులేఖా చల్లని మందమారుతములచే సేదదేఱి, సూర్యోదయావసర మహావైభవ దృశ్యము గాంచి సంతుష్టాంత రంగ యాయెను. ఆదివ్య సుందర వదనారవిందముపై నాణి ముత్యములవలె దోచిన ఘర్మకణములు నానావిధపుష్పముల పరిమళములతో గలసి సోకుచుండి మంద మారుతముల కారణమున మాయమాయెను. "షాజాడా పార్వేషు సంగ్రామాభిముఖుఁడై యున్నాఁడని దులాలీ తెలిపియున్నది. అట్టి యెడ యిప్పుడైనను దుర్గమంతయు గందరగోళముగా నుండవలదా? దుర్గమిట్లు సద్దుగనుండుట గమనింప ఈబాలిక పొరబడియుండునని తోచుచున్నది. ఏమైనను మెలకువగా నుండుటవలన బ్రమాద ముండదు గదా!"

అని తర్కించుకొని, యింకను మైమఱచి నిద్రించుచుండిన దులాలీని ఆమెతట్టి మేల్కొల్పెను. తోడనే యాబాలిక యతిరయమున గాలోచిత కృత్యములను నిర్వర్తించుకొని, మగుడ జులేఖా చెంతకేతెంచి సమీపించి యామెచెవిలో నేద్దియో చెప్పెను. నిశ్చలస్వాంతముతో నంతయు నాలించి జులేఖా యిట్లనెను —

"అవును, నాకంతయు బోధపడినది: — ఫతేపూరు సిక్రీ — కాని నీవుకొంతధనమును ఒకయొకాను గూడ గొంపొమ్ము —"

మలాలీ—నాన్గాని పోనీయుము నాకై నిరీక్షించుచున్నది. నీవు నాకై తత్తర పడవలదు."

## ౨౩

### రాజకీయములు

దులారీ యొక్క కృతిలో సదృశ్యురాలాయెను. తోడనే జులేఖా లేచి తనవృద్ధదాదిని బిలచి యిట్లులాజ్ఞాపించెను—

"నీవిచట గావింపవలసిన పనులను జక్కబెట్టుము. నేను మహారాణి విషయమై యరయవలయును."

రాత్రియంతయు జులేఖా జాగరమొనరించి యుండెనని పాఠకు లెఱిగియేయున్నారు. రాత్రియంతయు నామె వివిధాలోచనాయత్తచిత్తయై కూర్చుండియేయుండెను. తెప్పవాల్పక యామె యప్రమత్తయై యుండుటచే, పాదుషా యెంత నిగూఢప్రవర్తకుఁడైనను, ఆమెను మఱపించి సంచరించుట కెట్టియవకాశమైన నుండదు. ఆమహాలునందు సౌందర్యవతులగు బీగము లెందరో గలరు. ఆసమయమున నేకాంతపై మోహ ముదయించునో యామె మందిరమున నారాత్రి మనసార గ్రీడించి, కొంతరాత్రియుండగనే నిజాంతఃపురంబున కరిగి, మఱునాటి యుదయమున నొకటిరెండు ఝాములవఱకు మైమఱచి నిద్రించుట జహాంగీరున కాచారమై యుండెను. కాని, భువనైక సుందరియగు నూర్జహాను విషయమున మాత్రమట్లుగాదు. అసాధారణ సౌందర్యవతియగు సమ్మోహనాంగి మందిరము ప్రవేశించు పాదుషా వేఱు విచారమెఱుంగక, రాజకీయములనైన సరకుఁజేయక మోహపారవశ్యమున బాహ్యప్రపంచమును బూర్తిగా మఱచిపోయి దినముల గొలందియుండే యుండుట గూడ సాధారణ ధర్మమై యుండెను.

ఆకారణమున, పాదుషా యింకను నూర్జహాను చెంతనేయుండెనని జులేఖా భావించెను.

పాదుషా విషయానురక్తుఁడై మోహపాశబద్ధుఁడై యచటనే యుండుట జులేఖాకు లాభకరమే. ఆమెయొనరించుచుండిన మహాకార్యమున కయ్యది సహాయకరముగనే యుండెను. ఏలనన, పాదుషా నూర్జహానుతోఁ గలసియుండునంతకాలము జులేఖా స్వేచ్ఛగా సంచరింపఁగలదు. ఆమెను మహారాణి యెన్నఁడు బిలిపింపదు. జులేఖా గుఱించివినుటయే గాని పాదుషా యామెనెన్నఁడు గాంచి యుండడనియే చెప్పవచ్చును. తన చెంత పాదుషా యుండునపుడు నూర్జహాను యితర పరిచారికలను రావించును గాని, జులేఖాను మాత్రము రావించుటలేదు. మహారాణి యట్లేల ప్రవర్తింపవలయు ? తనపై బద్ధానురాగుఁడై యుండు నిజ ప్రాణనాథుఁడామెను గాంచినంతనే ప్రకంపిత హృదయుఁడై యాసుందరాంగిని గవయ నపేక్షించునని మహారాణి భావించియుండునా ? లేక, ఇంకొక భద్రకారణ మెద్దియైనయుండునా ? ఏమైనను జులేఖా యెడలగల యవిరళప్రేమాతిశయముచేతనో లేక చెప్పరాని రహస్య కారణముచేతనో గాని, పాదుషా తన యండనుండని సమయములందెల్లెడల జులేఖానువిడువకుండిన నూర్జహాను యీసమయమున పాదుషాతోఁగూడి యుండుట జులేఖాకు మిక్కిలి యనుకూలముగనే యుండెను. ఎన్నియో నిగూఢ విషయముల నరయవలసిన యామె పాదుషా నూర్జహాను మందిరమున మోహపరవశుఁడై యుండెనని భావించి సంతుష్టాంతరంగ యాయెను.

జులేఖాయొక్క గృహము నూర్జహానుయొక్క క్రీడామంటపము క్రిందనుండెనని పాఠకులెఱుంగుదురు గదా ! జులేఖా శీఘ్రముగా లేచి యెదుటనుండిన సోపానపరంపరల నారోహించి మెల్లఁగా దిలకించెను. అచట గావలియుండిన బందీలు నిద్రించుచుండిరి. రాత్రియంతయు

గావలిగాచుటచే వారలు కడుడసి మైమఱచి నిద్రాసౌఖ్యము ననుభవించుచున్నారని యెంచి, కడు నిశ్శబ్దముగ వారి నతిక్రమించి యేగి, ఆదివ్య సౌందర్యశయ్యామందిర ద్వారము డాసి, సర్వేంద్రియములను కర్ణమునందే కేంద్రీకరించి, యమ్మందిరమునుండి యెట్టి శబ్దమైనను విననగునేమోయని జులేఖా ప్రయత్నించెను. కాని, మానవోచ్ఛ్వాస నిశ్వాస శబ్దములు తప్ప వేఱేమియు వినరాకుండుటచే నామె భగ్న మనోరథయై విచారగ్రస్థయాయెను. ఆముహూర్తమున నామె యవస్థ కడుంగడు దుర్భరముగ నుండెను. అగ్నిపర్వతమువలె నామె డెందము వివిధాలోచనలతో గ్రాగుచుండెను. ఎన్నియో యాలోచన లామె హృదయము నావరించి బాధించుచుండెను.

ముఖ్యముగా, పాదుషాయింకను మహారాణి కోమలకరకాంతా రాంతర ప్రదేశమున డాగియుండెనా లేదాయను సంశయము తీఱిన గాని, దహించుకొని పోవుచుండిన జులేఖాయొక్క చిత్తమునకు శాంతి చేకూరదు. కావున వట్టివిచారములతో గాలయాపన మొనరింపరాదని యెంచి, అతిసాహస మొనరించి, మార్జాలంబుకంటె కడు నిశ్శబ్దముగా క్రీడామందిర ద్వారంబును దెఱచి, ఉచ్ఛ్వాస నిశ్వాసములను బూర్తిగ బంధించి నాగకన్యకవలె నక్కాంతామణి లోన బ్రవేశించెను.

సుగంధబంధురమగు నమ్మందిరమున భువనైకసుందరియగు నూర్జహాను రేయియంతయు నిజప్రాణనాథుతో మదన కదన మొనరించి యుండుటచే గాబోలు హాయిగ నిద్రించుచుండెను. ఆమెను ననుదినము గాంచునదేయైనను, ఆసమయమున నమ్మహారాణి సహస్రాధిక వైభవ సముజ్వలయై యొప్పుచుండుటచే, తాను వివిధాలోచనాత ప్తహృదయ యయ్యు, జులేఖా యాశ్చర్యమగ్నమానసయై యట్టె వీక్షింపదొడంగెను. కృష్ణసర్పంబులవలె నల్లనై యిటు నటు జీరాడియుండిన యక్కోమలి కోమలకుంతలంబుల మధ్యంబున వఱ్ఱనమాన స్నిగ్ధధా

పశ్యంబున విరాజిల్లుచుండిన యవ్వానితామణి నీలమేఘావృతంబగు చంద్రబింబమువలె దోచుచుండెను.

ఆ కోమలాంగి ధరించిన కనకాంబర మొక్కింత సడలుటచే, హారి దంతసమాన సౌందర్యముతో విరాజిల్లుచుండిన యామె భుజములు నేత్రపర్వ మొనరించుచుండెను.

సర్వావయవములును సముచితముగ నమర్చి సౌందర్యము నంతయు బ్రోవుచేసి బ్రహ్మ సృజించిన యా సుందరాంగి సౌందర్యము గాంచి యానందించుటకు జులేఖాకు సమయము గాదు.

తా నేతెంచినట్టులే కడు నిశ్శబ్దముగను కడు జాగ్రత్తగను దలుపు వైచి వెనుకకు మరలి యొడలెరుంగక నిద్రించుచుండిన బందీని జులేఖా తట్టి మేల్కొలిపెను. ఆమెను గాంచినంతనే యాబానిసయొక్క ప్రాణము లెగిరిపోయెను. తనను మేల్కొల్పినది మహారాణియే యని యెంచి, అప్రమత్తయై కావలి గాచుటకు మాఱుగా దాను మైమఱచి నిద్రించుచుండినందులకు శిక్షగా నాటితో దన యాయువు చెల్లిపోయె ననియే నిశ్చయించుకొని ఆ ఘారామనిషి భయకంపిత యాయెను. కాని, మహారాణీకి మాఱుగా దనయెదుట జులేఖా గోచరించుటచే నా బందీ వెఱపు వీడి మెల్లగ నవ్వుచు నిట్లనెను — " జులేఖా ! నీవా ! మహారాణియే యని భ్రమించి యెంత వెఱగందితిని ! దైవకృపచే గొప్ప గండము గడచినది. "

" సరే, కాని, ఈ మందిరమునుండి పాదుషావారెప్పుడు వెడలిరి? "

" నేను చెప్పజాలను. రాత్రి యంతయు గావలి గాచుటచే మేము నిద్రించితిమి. పాదుషావా రెపుడు వెడలిరో యెఱుంగము. "

జులేఖా యిట్లు చింతింపదొడంగెను — " జహాంగీరు చర్య లిపుడు మిగుల నాశ్చర్యకరములుగ నున్నవి. రాజకార్యములను దలపెట్టక నిరంతరము విషయానురక్తుడై మెలంగు నీ జేసు యేలకో కడు

చురుకుదనము వహించియున్నాఁడు. కారణ మేమైయుండును?" అట్లు లామె కొంతకాలము ఆలోచనాపరయై మఱఁడ నిట్లనెను — "పాదుషా బీగము నీతో నేమైన జెప్పియుండెనా?"

"జులేఖా! నిద్రాదేవతను జేరనీక మేము కృపాణధారులమై కావలి గాయుచుండ, మహారాణి మాచెంత కేతెంచెను. ఆమెను గాంచి నంతనే మా ప్రాణము లెగిరిపోయెను. మమ్ము గాంచి, ఆమె యిట్టు లాజ్ఞాపించెను — "పాదుషావారు వెడలిరి: మే మిక విశ్రమింపవలయు: మా నిద్రకు భంగము కలుగరాదు: జాగరూకతతో గావలి గాయుడు —" అని బేగముగారు ఆజ్ఞాపించినట్టులే కొంతకాలము కావలి యుంటిమి. కాని, అంతలో పెద్దనిద్ర దాపరించుటచే నిద్రించితిమి."

"ఇకనైన మీరు జాగ్రత్తగా నుండుడు. మీరు మఱల నిద్రింతు రేని, ప్రాణములు దక్కవు. మహారాణి మేల్కాంచునంతనే నాకు వర్తమాన మంపుడు."

అని యజ్ఞాపించి, మెల్లగ వెడలి, జులేఖా యిట్లు చింతింపఁ దొడం గెను— "నామనోరథము సిద్ధించుట కిప్పటిదే తరుణము, ఇట్టి మహా సమయము మఱల లభించుట కల్ల కాని, నిన్నటిరేయి నే నెట్టి యద్భుతములు గాంచితిని! బీగముమహాలునందు నాకు దెలియని రహస్యములు లేవని యింతవఱకు గర్వించియుంటిని. కాని, నే నెఱుంగని రహస్యమందిరములు, గుప్తమార్గములు యెన్ని యున్నవి! ఆవల నున్న మోతీమసీదునకు నేను పోవునటు లాచరించినవాఁడు పాదు షాయే యైయుండునా! అతఁడే ఫకీరువేషము ధరించి నాతో బ్రసం గించి యుండెనా. కాదు కాదు; అట్లు కాజాలదు. రారాజు యెట్టి వేషము ధరించినను, నేను గుర్తింపజాలనా? కాని, ఆ ఫకీరు దుర్గద్వా రము సమీపించినంతనే, అచ్చటి ద్వారపాలకులు చూపిన యపూర్వ గౌరవమునకు సార్వభౌముఁడు తప్ప మఱి యెవరు పాత్రులు? హా!

దైవమా! యోచించుకొలది మతి పోవుచున్నదే! ఇన్ని సంవత్సరముల నుండియు నెంతయో శ్రమపడి, చీమవలె విసుగు విరామముల కెడ మీక నిర్మించిన మహాసౌధరాజము నేను దారుణముగా నేల గూలును గాబోలు నూర్జహానుయొక్క మాటయునిన జాలు నట్టి మహోపద్రవము సంభవింపగలదు. అట్లయైన, నాగతి యేమగును? నాకు దెరువెయ్యది? అట్టి వైపరీత్యమే సంభవించు నేని, నాకీ కృపాణమే, శరణ్యము; ఈ విషమే నా మిత్రము!

ఆమె చిత్తము వివిధాలోచనతో గ్రాగుచుండుటచే నొక్క నిమేషమాత్ర మామె నయనములు రోషానలజ్వాలలు గ్రక్కెను. చంద్రోదయ సమయమునందలి సముద్రతరంగములవలె పొంగిపొంగి పొరలుచుండిన యాలోచన నెట్టకేలకు నడంచుకొని, "ఆహా! నూర్జహాను నిద్రించుచున్నది: ఇదే సమయము" అని లోలోన గొణుగుకొని, జులేఖా క్రిందికి పోయెను.

బీగముమహాలునకు గుడివైపున నొక చిన్నమందిర ముండెను. బీగము మహాలును శాసించు 'మస్రూ!' యందునివసించుచును. అబిసీనియా దేశమునుండి యేగుదెంచిన యీతడు మొదట సాధారణపుబానిసయే యైనను, క్రమముగా వృద్ధిలోకివచ్చెను, శక్తిస్వరూపిణి యగు నూర్జహాను తప్ప బీగముమహాలు నందాతఁడెవ్వనిని సరకుజేయఁడు. బీగము మహాలునందలివారలందఱు నాతని గాంచునంతనే గడగడ లాడుచుందురు. నగరమునందలి ఉగ్రమూర్తిగాక, సార్వభౌము కుటుంబమునందలి రాజకుమారులు సహితము ఆతని నెయ్య మపేక్షించుచుండిరి. చూపునకు రాక్షసునివలె వికారముగను భయంకరముగను నుండినను, ఆతఁడు రాజభోగముల ననుభవించుచుండెను. బీగము మహాలునందు అనుదినము వెచ్చింపబడు కోటానుకోట్లు ద్రవ్యమంతయు నాతని చేతి మీదుగనే నడచుచుండెను. బీగము మహాలునందలి బందీయైనను, బీగ

మైనను, పరిచారికలైనను, రాజకుమారియైనను సరే, తనకు వలయు సామగ్రినెల్ల వానిద్వారానే పొందవలయు, వానికి దెలియకుండ పూచిక పుల్లయైనను సందుజొరరాదు. వాఁడు సహజముగ తెలివితేటలు గలవాఁడును, మనుష్యస్వభావమును జక్కఁగ నెఱింగిన వాఁడును నగుటచే దాను మొదట బానిసయేయైనను, ఇట్టి విపరీతాధికారమును చెలాయింపఁగలిగెను: కిరీటమొక్కటి కొరతగాని, బీగముమహాలు వాఁడు రాజువలె శాసించుచుండెను.

నిరంతరము బీగము మహాలునందు బంధింపబడి, పురుషసంపర్కమునకై మోము వాచియుండు బీగములైనను, తమ మనోకాంతులతో మనసార విహరింపగోరు పరిచారికలైనను వాని సాహాయ్యము లేకుండను వానికి దెలియకుండను దమతమ మనోరథములను నెరవేర్చుకొనుటసున్న, ఒక్కొకపుడు, రాజకుమారులును ఇతర యువకులును గూడ నామహాలునందలి మోహనాంగుల పొందుగోరి, స్త్రీవేషము ధరించియుండు ప్రవేశింతురు. వారు సహితము మష్రూయొక్క కన్ను గప్పి ప్రవేశింపజాలని వారలగుటచే, నాతని నెద్దియో తెఱంగున సంతోషపఱచియే యేగెదరు. ఇట్టి విపరీతాధికారము గలిగియుండిన మష్రూ సుఖముగా కోటీశ్వరుఁడాయెను.

రాజమందిరము వలె వైభవముతో నలరారుచుండిన యాతని మందిరమునకు జులేఖా యేతెంచెను. ఆసమయమున నాతఁడు మొగములు సోఫాపై సుఖాసీనుడై బంగారు హుక్కానొకటి చేత బూనియుండెను. ఆమందిరమంతయు పొగతోడను సువాసనతోడను నిండియుండెను. ఆసమయమున నేతెంచిన జులేఖాను గాంచినంతనే యాతడిట్లు ప్రశ్నించెను. — “ జులేఖాబీబీ! ఏమి నాయదృష్టము! అల్పుడగు నీదాసుని కుటీరమున కిట్టి యసమయమున రాఁగతంబెద్దియో తెల్పెదవా? ”

జులేఖాకు మస్రూరా యాసన మొసంగలేదు. ఐనను ఆసోఫా మీదనే వానికి దూరముగా నొకమూల నామెకూర్చుండి యిట్లనెను.

"ఓయీ! నేను రాజకార్యమునిమిత్త మే తెంచితి: అవసరమునకు ఒకసమయముండదుగదా."

ఆమెపై నూర్జహాను కమితానురాగము కలదనియు, ఆమె సలహా ననుసరించియే నూర్జహాను మెలంగుననియు మస్రూరా యెఱింగి యుండెను. ఆకారణమున, జులేఖాపై నాతడు ద్వేషము వహించియుండినను ఆమె సగౌరవపఱచుటకు సాహసింపఁజాలని వాఁడగుటచే నాతఁడా వాక్కుకాయినట్లుద్రోసి, లేనివినయగౌరవములనభినయించుచునిట్లనెను.

"బీబీ! ఈ సేవకుఁడు నీయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగ నున్నాఁడు."

"ఓయీ! యాత్రార్థియైన షాజాదా యెప్పుడు బయలుదేరెనో యెఱుంగుదువా?"

"జులేఖా! ఏ షాజాదా?"

"మస్రూరా! తెలియనట్లు నటింపనేల? ఒకషాజాదా పాఱియుండె గదా! నేను పార్వేషు గుఱించియే ప్రశ్నించుచున్నాను."

"జులేఖా! పాదుషాబీగము గుఱించి యెఱుంగగోరెదవాయేమి?"

"ఇట్టి యసందర్భ ప్రసంగముతో నాకు పనియేమి?"

"అట్లయిన, సైన్యసమేతుఁడై యాతఁడు నిన్నటిరేయి ప్రయాణ మాయెను."

"సరే. ఒక్కవిషయ మడిగెద; దయయుంచి తెల్పుము. రాత్రి షాజాదా పార్వేషు క్రీడాసక్తుఁడై యుండిన వనిత లెవ్వరో నీవెఱుంగుదువా?"

"ఈసమాచార మెవ్వరికి గావలయును?"

"నీకెన్నిసారులు సమాధాన మొసంగవలయును?"

"అవునుఁ, ఆ ఆంకుటాంద్ర నీనగరమునుండియే షాజాదా రప్పించెను."

"వారిపు డెచ్చట నున్నారు"

"వారెక్కడనుండి యేతెంచిరో యచ్చటికే వారిని షాజాదా పంపివైచెను.

కొంతసేపేమియు బలుకక, హుక్కా-కాయ నట్టె పరీక్షించుచు మందహాస మొనరించి జులేఖా యిట్లనెను— "సాహెబ్! ఇక నా గురించియే కొంచెము తెలిసికొనవలసి యున్నది"

జులేఖా బీబీ! విషయమెద్దియో సెలవిమ్ము. సేవకుడు వేచి యున్నాడు."

"నిన్నరాత్రి బీగముసాహేబా కార్యార్థము నేనువెడలియుంటినని నీవెఱుంగుదు గదా"

చిఱునవ్వునవ్వుచు మస్రూ యిట్లుబదులిడెను.— "బీబీ! నీవెపుడు వెడలియుంటివో నేనెఱుంగను" ఆతని నిజాభిప్రాయము నరయుటకై జులేఖాయాతని దేనతీక్షణముగా జూచెను. కాని, చీకటి రాసివలె నుండిన వాని మోము నిశ్చలముగా నుండెను. వానిమనసెట్లుండెనో తెలియకుండెను. తోడనే, గొప్పయనుమానమామెను బాధింప గడంగెను. రాత్రియామెకు సంభవించిన వైపరీత్యము మస్రూకు దెలియునా? అందు వాడు గూడ పాల్గొనియుండునా జులేఖాకు నేదియు దోపకుండెను. కాని, ఆమె తన యాందోళనమును బైకి తెలియనీయరాని వివేకవంతురాలగుటచే నిశ్చలహృదయముతో నిట్లనెను.

"మస్రూ! ఆ సమయమున నీవచట లేవు. అచటనుండిన వారు నన్ను గుర్తింపజాలక పోయిరి!"

"అట్లే కావచ్చును."

"మస్రూ! రాత్రి కార్యార్థినై వెడలిన నేనుతిరిగి వచ్చునరికిజాల

కాలమాయెనని నీ వెఱుంగుదుగదా. కావున, పాదుషావారు మహారాణీమందిరము నెప్పుడు వీడియుంటిరో యేనెఱుంగను. ఆసంగతి గుఱించియే—"

"బీబీ! బీగము మహాలునుండి పాదుషావారు యెప్పుడు వెడలియుండిరో నీవెఱుంగగోరెదు కాబోలు. కాని, ఒక్కరహస్య మెఱింగించెదవినుము. షాజాడాను యుద్ధమునకు సిద్ధపరచుచుండిన కారణమున రాత్రి మహారాజు బీగముమహాలునకు రానేలేదుసుమా!"

వాడట్టిసమాధాన మొసంగునని జులేఖా యెన్నఁడు భావింపలేదు. సార్వభౌముఁడు ఇప్పుడే నిష్క్రమించెననియు, తానింక విశ్రమింప వలయుననియు, తననిద్దురకు భంగము రాకుండునట్లు కడుభద్రముగ గావలి కాయవలయుననియు నూర్జహాను శాసించెనని యచ్చటి బంధీ చెప్పియుండెగదా. కావున, ఇపుడు మస్రూరా యిట్లు వచింపగనే, జులేఖా నిర్ఘాంతపడెను. తుఫాను సమయమున నంబు సముద్రమువలె నామె డెందము ఘూర్ణిల్లుచుండెను. కాని ఆమె దిట్టరియగుటచే, కలంగిన డెందమును పదిలపఱచికొని, ధైర్యము వహించి యిట్లనెను—

"సరే! అంతయు దివ్యముగా నున్నది. నేనికబోవలయును."

అనిపలికి, ఆమె నిష్క్రమించెను. తన జీవితకాలమున నట్టి వైపరీత్యముల నామె కాంచి యెఱుఁగదు. రాత్రినుండియు నామె యెట్టి యద్భుతములకు బాల్పడుచుండెను? అడుగడుగునకు వైపరీత్యమే, అద్భుతమే! అంతయు నొక యింద్రజాలమువలె నుండుటచే నామె యాశ్చర్యమగ్నమానస యాయెను. నూర్జహాను మందిరము గాచుచుండిన బానిస లట్లేల చెప్పవలయు? వారట్లు యనృతమాడి, దారుణముగ నేల మోసపుచ్చవలయు?

అంతలో, మెఱపువలె నొక్కసందేహ మామె మానసమున మెఱసెను. తోడనే, ఆమ ధైర్యమంతయు జెదరిపోయెను.

అంతవఱకు గంభీరముగ నుండిన జులేఖా హఠాత్తుగా భయ విహ్వాలయాయెను. దేహమున వేవేల మార్గముల బ్రవహించు రక్త ప్రవాహము హఠాత్తుగా నాగిపోయినట్లులగుటచే నామె దేహము కొయ్యబాఱిపోయెను. ఎట్టికష్టమైనను వెనుదీయని, ఎంతటి యుపద్రవమైనను జలింపని దిట్టరియగు జులేఖాయిట్లుకానేల? అసాధారణధైర్యవతియగు జులేఖా యింతటి దైన్యమునకు బాల్పడనేల?

## ౨౪

### మరణశిక్ష

జులేఖా యొక్కయవస్థ కడు దుస్సహముగను కేవలము వర్ణనాతీతముగను నుండెను. మఱియొకరట్టి యవస్థను జిక్కినచో నేమిచేయుదురో చెప్పజాలముకాని, ఆమె మాత్రము క్రమముగా ధైర్యము వహించి, మెల్లగా తన మందిరము జేరెను. రాత్రి యంతయు నామె యొక్కక్షణమైన నిద్దుర పోజాలదు. అనేక కారణములచే నామె డెందము క్రాగుచుండెను. నూర్జహాను మేలొందుచున్నంతనే తనకై వర్తమాన మంపునని ఆమె యెఱింగియుండెను. ఐనను, ఆమె మిక్కిలి డస్సియుండుటచే, శయ్యపై వ్రాలెను. తోడనే, దీర్ఘమగు నిట్టూర్పు విడిచి ఆమె యిట్లు చింతింపదొడంగెను—"కడు నిర్మలముగ నుండిన నా మనోనయనమునకు మొదట నొక చిన్ని మేఘపు తునక దృశ్యాదృశ్యముగ గోచరించినది. గ్రహచార మెట్లున్నదో గాని, క్రమముగా నయ్యది క్షణక్షణప్రవర్ధమానమగుచున్నది. తుదకు, అయ్యది గాఢమై, దట్టమై నన్ను గప్పివేయునట్లు భయంకరాకృతి దాల్చుచున్నది. నా ప్రాణమునకై నేను వగచుదానను గాను. దుర్భరముగ నున్న యీ జీవయాత్ర ఎంతశీఘ్రముగ ముగిసిన నంత మేలే కాని, నేను

తలపెట్టిన మహాకార్య మేమి కావలయును? కావున, నేనిపుడు మరణింప రాదు. హా! దైవమా! నీ వెట్లు నిర్ణయించితివో యట్లే యగుగాక!"

అట్లు లామె చింతించుచుండగనే, నిద్రను జెందెను. కాని, అగ్ని పర్వతమువలె లోలోన దహించుకొనిపోవుచుండిన హృదయమునకు నిద్రయందైనను సౌఖ్య మెక్కడ? రేయియంతయు జాగర మొనరించిన ఆ నయనములు మూతపడినంతనే, ఆమె యతి భయంకరమగు కల గాంచెను. తోడనే, ఆమె భయవిహ్వలయై దద్దరిల్లి మేల్కాంచెను. ఆమె కాంచిన కల యెంతదారుణమైనదో, ఆమె వదనమే చాటుచుండెను. చంద్రబింబమువలె నుండిన యా సుందరి వదనారవిందము పూర్తిగ కళావిహీనమై, ముడుచుకొనిపోయెను. ఆ మానవతి మేనం తయు ఘర్మకణపూరితమై గడగడ్డాడ నారంభించెను, వెఱ పెట్టిదో యెఱుంగని ఆ కేసరి నోటనుండి యొక్క యవ్యక్తదీనాలాపము గూడ వెలువడెను. ఆమె మొట్టకేలకు సేదదేరి చూచునరికి సమీపమున నొక పరిచారిక గోచరించెను.

తాను గాంచిన కలచే బిక్కిలి కలవరపడుచుండిన సమయమున నా పరిచారిక హఠాత్తుగ గోచరించుటచే జులేఖా యొక్క యొడలంతయు నొక్కసారి కంపించెను. ఆమెను వివిధాలోచన లింకను గారించుచునే యుండెను. చెప్పరాని భయముచేతను, వర్ణింపరాని వేదనచేతను నామె హృదయము ప్రక్కలగుచుండెను. ఐనను, ఆమె సహజముగ ధీరస్వాంతయగుటచే ధైర్యము వహించి, పరిచారికను గాంచి యిట్లు ప్రశ్నించెను — "ఓసీ! నీ విచటి కేతెంచి యెంతకాల మైనది? ఇపుడు వేళ యేమగును? రాత్రియంతయు నిద్దురయెఱుంగని దాననగుటచే, వలదనుచుండగనే నిద్రాదేవి నన్నావహించినది."

"అమ్మా! రెండు ఝాములు దాటినది: మహారాణి సీక్రెట్ షిస్ మహాలునుండి నిరీక్షించుచున్నది."

"షీస్‌మహాలునందా?"

"అవును. నేడు యుష్ణ మాధికముగా నుండుటచే దేవి యచట నున్నది."

"మహారాణితో మఱి యెవ్వరైన నున్నారా?"

"మఱి యెవ్వరు లేరు:— నీవు వెంటనే రావలయునని దేవియాజ్ఞ!"

"ఇప్పుడే వచ్చెద." అని పలికి, శీఘ్రముగ లేచి, జులేఖా ముఖ ప్రక్షాళన మొనరించెను. ఎట్టులో తన హృదయతాపము మఱుగుపఱచి, ఎద్దియో నెపమున నా పరిచారికను ముందుగా నామె పంపివైచెను. అనంతర మా సమీపమున నున్న యినుపపెట్టె దెఱచి ఒక పత్రము జేతబూని, అతి రయమున నెద్దియో లిఖించి, తన యనుంగు పరిచారికయగు దయామణిం జేరి, గద్గదస్వరముతో నిట్లు పలికెను.— "దయామణీ! చిరకాలమునుండియు నీవు నిండారు ప్రేమతో నన్ను సాకుచుంటివి. నీయసాధారణ వాత్సల్యాతిశయము చేతనే గదా, నే నీ మహమ్మదీయ మందిరము జొచ్చినను, నీవు వీడకుంటివి! అయ్యో! మనకుగల ఋణానుబంధము నేటితో తీరు గాబోలు. అట్టి ప్రమాదమే సంభవించునేని, దయామణీ! గమనింపుము. ఈ పెట్టియందలి ధనాభరణాదులు దీసుకొని, రాత్రివఱకు నాకై నిరీక్షించి భద్రముగా ఫతేపూరు సిక్రీనగరమునకు బొమ్ము. ఇందలి స్వల్పభాగ్యమును నీవును దులాలీయును సమానముగా గ్రహింపుడు. నీస్వగ్రామమున సుఖముగా గాలము గడపుట కీపైకము చాలును. ఈలేఖమాత్రము దులాలీకి భద్రముగా జేరవలయు సుమా."

చిరకాలమునుండియు జులేఖా కన్నకూతురువలె ప్రేమించుచున దగుటచే దయామణి ఖిన్నురాలాయెను. "బాలా! నిన్ను వీడు టెట్లు? దూరముననున్న ఫతేపూరునగరము నేకాకినై చేరుటయెట్లు? నిశాన మయమున బ్రయాణ మొనరించుట మరియు గష్టముకదా."

"దయామణీ! ఈనగరమున చౌకబజారునందు తమలపాకులు విక్రయించు గంగయను స్త్రీ యున్నదిగదా. నీవు ముందుగా నామె చెంత కేగదేని, వలయు సహాయ్యము లభించును. ఆమెయే నిన్ను సిక్రీనగరమునకు సుళువుగా గొంపోవును.

"సిక్రీనగరమున నెవరింటికి బోవలయు? నాకు దిక్కెవరు!"

"దయామణీ! దులాలీ యచట నేయున్నది. నీకామె యాతిథ్య మొసంగును. ఆమెయే నిన్ను నీగ్రామమునకుఁ జేర్పఁగలదు."

"సరే! కాని, బాలా! నాకన్న తల్లిమాట యేమందువు?"

లేని సంతోషము దెచ్చుకొని, జులేఖా యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.—"దయామణీ! దయామయుఁడగు పరమాత్ముఁడు కరుణించునేని, మరల గలసికొందును."

తన హృదయమున నుదయించిన విషాదమును బట్టజాలక గోడనే దయామణి బారున నేడ్చెను.—"అమ్మాయీ! నిన్ను మఱల గాంచు నంతటి భాగ్య మీమందభాగ్యురాలికి గల్గునే?"

"దయామణీ! దయామణీ! నీవిట్లు విలపించినచో ప్రమాదము సుమా. గోడలకు చెవులుండునని నీవెఱుంగవా? కావున, విచారము దిగమ్రింగుము. నేను చెప్పినచొప్పున ప్రవర్తింపుము. మనము మరల గలసికొందముగాక!"

"కానిమ్ము. విధి యెట్లు నిర్ణయించెనో యట్లే యగుగాక. గాని ఈపెట్టెయందలి సామాగ్రిగైకొని పైకి వెడలుట యెట్లు? ద్వారపాలకు లడ్డవైతురేని, దిక్కేమి?"

అంతవఱకు నాయుపద్రవము జులేఖాకు స్ఫురింపలేదు. కొంత తడవాలోచించి, ఆమె యిట్లు బదులిడెను.—"అవును: నీవు చెప్పినది నిక్కవము. కావున, రాత్రివఱకు వేచియుండుట క్షేమకరము కాదు. నీవిప్పుడే వెడలినచో నెట్టియనుమానమునకైనను నవకాశముండదు."

అని పలికిన పిమ్మట నొక కాగితము బూని, మగ్రఘూపేర నామెయిట్లు లిఖించెను.—"మగ్రఘూఖాను సాహెబ్! మహారాణియాజ్ఞ వడసి, ఈ నా దాది తనగ్రామమునకు బోవనున్నది. కావున, తన సామానుతో బాటు బీగముమహాలునుండి వెడలు నీవృద్ధాంగనను వారింపక దయ చేసి పోనిమ్ము.—జులేఖా"

"దయామణీ! నీవీ జాబును మగ్రఘూకొసంగె దేని, నిన్నెవరు వారింపరు. నీవిక శీఘ్రముగా బొమ్ము. జాగుసేయకుము. ఆజాబుమా త్రము దులాలీకి జేరవలయు సుమా. ఈతాళము గైకొమ్ము, లెమ్ము నూర్జహాను పరిచారిక మఱల నేతెంచుచుటులున్నది. ఆలస్యమగునేని కావలసిన కార్యమంతయు జెడిపోవును.—"

అంతలో నాపరిచారిక ప్రత్యక్షమాయెను. "ఓసీ! ఆలస్యమైనది కాబోలు, ఇదిగో వచ్చుచున్నాను. పొమ్ము"

"జులేఖా! నీకై మహారాణి మఱల పంపియున్నది"

మఱి మాఱుపలుకక, ఒక్కసారి వెనుకకు దిరిగి, తన దాదినిగాంచి తాను చెప్పిన చొప్పున మెలంగవలయునని సంజ్ఞచేసి, జులేఖా షిన్ మహాలునకు బోయెను.

ఆమె జీవితచారిత్రమునందలి మహాముఖ్యదిన మేతెంచియుండెను. మానవుని జీవిత మొక ప్రవాహమువంటిది. మార్గమధ్యమున ప్రమాదము లనెడు నిసుక తిన్నె లెన్నియో యడ్డు తగులుచుండును. చిన్న చిన్న తిప్పలను సరకుఁ జేయక ఈప్రవాహము నడచుచుండును. కాని, నేడు నిరోధించు తిన్నె యసాధారణమైనది. జీవిత ప్రవాహ మంతయు నందే యింకిపోవును గాబోలు, తోడనే, తన పూర్వవృత్తాంతమంతయు జులేఖాయొక్క మనోనయనమునకు గోచరమాయెను. పది సంవత్సరములక్రిందట తనకు బర్ద్వాను నగరమున నంభవించిన మహాభంగము జ్ఞప్తికి వచ్చెను. దుర్మదాంధుఁడగు నాయాఫ్ఘ

నని క్రౌర్యము నిజప్రాణనాథుని మరణము బంధువియోగము, నిజ పుత్రికా వియోగము, మతభంగము, మ్లేచ్ఛునింట దాస్యము—అన్ని యుస్మరణకువచ్చెను. అంతటి కష్టమునకు బాల్పడిన జులేఖా నాఁడే మరణింపవలసినది. నాఁడు తప్పినను, నే,డు తప్పునా!

సహజముగ ధైర్యవంతురాలగు జులేఖా ప్రకంపిత హృదయయై, భయవిహ్వలయై, కళావిహీనయై, నిర్జీవప్రతిమవలె నుండెను. కాని, ఆమె పౌరుషవంతురాలగుటచే నొక్క నిమిషములో మఱల ధైర్యము ధరించి, మిస్మహాలునకు నిశ్చలముగా బోయెను.

భూగర్భమున నుండిన కారణమున కాంతివిహీనమై యుండిన యా మహాలునందు నొక మసనదుపై నూర్జహాను యాసీనురాలై యుం డెను. ఆమె పాత్రమునొండు చేతబూని పఠించుచుండినను, జులేఖాను గాంచినంతనే, ఆ పాత్రము నటువైచి, ఆమెపై తీక్షణ వీక్షణముల జురచురఁజూచెను.

మందిరము చీఁకటిగా నుండుటచే, నూర్జహానుయొక్క ముఖాకృతి జులేఖాకు గోచరింపలేదు. ఆమె మహారాణిని సమీపించి ప్రణమిల్లి, ఎద్దియో పలుకబోయెను; కాని, గొంతుక తడియారుటచే నొక్కపలు కైన నుచ్చరింపఁజాలక పోయెను. సదామందహాస మొనరించుచు, చంద్రబింబమువలె కటాక్షవీక్షణముల ప్రసరించు నామె వదనము కాఠిన్యము వహించియుండెనని జులేఖా గ్రహించెను. తోడనే, నాటితో తన జీవయాత్ర ముగిసెనని యామె గుర్తించెను.

ఒకరిహృదయము నొకరు యరయుచు నొక్క నిముషము మాత్ర మిర్వురు మిన్నకుండిరి. అనంతరము, గంభీరస్వరముతో నూర్జహాను యిట్లుపలికెను.—"జులేఖా! నేను బహుభాషిని కానని యెఱుంగు దుగదా! కడచిన పది సంవత్సరములనుండియు, నాయనుంగు సోదరి వలె నిన్ను ప్రేమించుచుంటిని. బర్ధమాను నగరమున నీవు నాకంట

బడినదాది నేటివఱకును ఎడతెగని నా యసాధారణ వాత్సల్యము ననుభవించుచుంటివి. కాని నిన్ను నిశ్చలముగా ప్రేమించి, పూర్తిగా విశ్వసించు, నీకు సర్వాధికార మొసంగ, నీవెట్లు ప్రవర్తించితివి ? ఇంత ద్రోహమా ? ఇంతవిశ్వాస ఘాతకమా ?''

మహారాణియొక్క పలుకులు, జులేఖాయొక్క హృదయమును ములుకులు వలె నాటుకొనెను. తోడనే, "పాదుషాబీగమా !" యని సంబోధించి, తనకు సాధారణమైయుండిన చనువు వహించి, ముందుకు సాగి, మహారాణియొక్క పాదపద్మముల సమీపమున నామె యాసీను రాలు కాబోయెను, కాని యాకలితోనుండు సింగంబు చందంబున నూర్జహాను నిజనయనగహ్వరములనుండి క్రోధానలజ్వాలవృష్టి గురిపించి, "దూరముగ నుండుము," అని గర్జించెను. తోడనే జులేఖాయొక్క హృదయము వ్రక్కలాయెను. జీవరహితమగు ప్రతిమవలె నామె నిలిచిపోయెను.

పాదుషాభీగము మరల నిట్లు గర్జించెను.—"ఏ నిన్నిదినంబులును, ప్రేమమీఱ పాల్వోసి సాకినది విషసర్పమని నేడుగా దెలిసికొంటిని !—''

మఱల నేదియో జులేఖా చెప్పబోయెను. కాని రౌద్రముదాల్చిన నూర్జహాను యవకాశ మొసంగక, ఇట్లు గర్జింపదొడంగెను. —

"పవిత్రమగు మొగలాయి సామ్రాజ్యమును తుదముట్టింపవలయునని సంకల్పించి, నిగూఢముగా నీవెట్టి దారుణప్రయత్నము లొనరించు చుంటివి ! ఓసీ, పాపీ ! రక్కసీ ! మొగలాయి సామ్రాజ్యమును విచ్ఛిన్న మొనరించి, ఉదయ పురాధీశుఁడగు కర్ణాసింగును తత్సామ్రాజ్యాధిపతి నొనరింపగోరెదవా ? ఎట్టి రాక్షసప్రయత్నము లొనరించితివి ! మహాబతుఖానుయొక్కయు, భీమసింగుయొక్కయు, సహాయ్యమువడసి, ఎంతటి కుట్రపన్నితివి ! కాని నీవొనరించునది రాక్షసకృత్యమే యైననను, శాక చక్యములు మాత్రము అసాధారణమైన వనుటకు సందియము

లేదు. నేయి యింతకాలము నేయింబవళ్ళు తదేకధ్యానముతో నీవొనరించిన భగీరథ ప్రయత్నమును గమనింప, నాకాశ్చర్యము కలుగుచున్నది. హా ! రక్కసీ ! ఎట్టి ఘోరకృత్యము ! ఎట్టి దారుణ ప్రయత్నము లొనరించితివి ! దుష్టురాలా ! — ”

నూర్జహాను నోటనుండి వెలువడు నొక్కొక్క పలుకు ఒక్కొక్క శూలమువలె జులేఖాను బాధింప నారంభించెను. ఒకపాత్రయందు నీరము బోసి, మూతవైచి కాచినచో తయారగు నావిరి, యందు నిలువజాలక, పైకిపోవలయునని యెట్లు ప్రయత్నించునో, అట్టులే, నూర్జహాను పలుకులనెడు అనలముచే క్రాగుచుండిన జులేఖాడెందము పట్టజాలక నెద్దియో సమాధాన మొసంగవలయునని ప్రయత్నించెను. కాని సింహమువలె గర్జించుచుండిన నూర్జహాను అట్టి యవకాశ మొసంగలేదు. — “ ఓసీ ! పాపాత్మురాలా ! నోరుమూయుము ! ఏమి, నీ సాహసము ! సార్వభౌము పుత్రులగు ఖరీము షార్వేషుల నిర్వారను గడతేర్పవలయునని సంకల్పించితివిగా ! ఆహా ! షార్వేషు గతి యేమాయెనో, ఇంకను నా కేసమాచారము చేరలేదు. క్రూరులగు వైరులను సంహరించుటకు వెడలిన షార్వేషు యేమాయెనో — ”

ఎట్టకేలకు, జులేఖా యిట్లు పలుకగలిగెను. — “ పాదుషాబీగమా ! నీకెవరు బోధించిరోగాని, ఇదియంతయు శుద్ధ యబద్ధము, కేవలము —”

“ ఓసీ ! అసత్యమెట్లగు ? అనుమాత్రము సందియము లేదు. చాల కాలము నుండియు నీపాపకృత్యముల గుఱించి కర్ణాకర్ణి యాలించుచుంటిని. కాని, నాకునీపైగల వెఱ్ఱియభిమానముచే నింతవఱకు విశ్వసింపనైతిని. యదార్థమిపుడు తెలిసినది. ఇంకను నిన్ను విశ్వసింతునా ? ”

ఆశ్చర్యము దెలుపుచు జులేఖా యిట్లనెను. — “ పాదుషాబీగమా ! ఎపుడు నీవిశ్వాసమునకు వెలియైతినో, నాప్రాణములప్పుడే పోయిన

వనుకొందును అల్పురాలగునీదాసి ప్రవర్తనము నెట్టులనుమానించినను అమ్మా! నీకు జెల్లును. కాని, నేను విన్నవించునదేమనఁగా, ఒక్క నిదర్శనమైన గలదా?"

"లేదు; ఎట్టి నిదర్శనమైనను నాకుగోచరింపలేదు. కావుననే, నీచర్యలు నాకెంతయు విస్మయము గలిగించుచున్నవి. సహస్రనయనములతో గనిపెట్టు నూర్జహానునే మోసపుచ్చితివిగా?"

"దేవీ! అట్టిమహత్తర రాజకీయ కుట్రలతో నాకుపనియేమి? ఇట్టి పాపపు కార్యములవలన నాకు గలుగు లాభమేమి?"

తోడనే, నూర్జహానుయొక్క గంభీరకంఠధ్వని తీవ్రతరమాయెను. — "ఏమీ! ఈ కుట్ర వలన నీకు గలుగు లాభమేమందువా? చెప్పెద వినుము, నీకూతురు నిజముగా మరణించినదా? నీమామగారు నీబిడ్డను గొంపోయి, కర్ణాసింగున కిచ్చి, వివాహ మొనరింపలేదా? ఓసీ, పాపీ! నీబిడ్డ సార్వభౌమురాలైన పిమ్మట, నీవు సార్వభౌమురాలి మాతవై, సామ్రాజ్యాధికారము జెలాయింపవలయునని నీవు వాంఛించుటలేదా? ఓసీ! ఇంకను వినఁగోరెదవా? నాడు బర్ద్వాను నగరమున జరిగిన పరాభవమునకై లోలోనగుందుచు, క్రోధావేశమున కసితీర్చుకొనవలయునని సంకల్పించి యుంటివిగదా?—"

తనకు సర్వసాధారణమై యొప్పు చిరునగవు వహించి, సదుత్తరమొసంగవలయునని జులేఖా ప్రయత్నించెను. కాని, అట్టి, విషమసమయమున చిఱునగ వెక్కడ? "పాదుషాబీగమా! నాకు ప్రాణముపై తీపు లేదు. ఇంకను మనవలయునని నేను యోచించుట లేదు. దేవీ! నీయపారయవ్యాజ కరుణాకటాక్ష సాంద్రకిరణములలో దేలి యాడుచుండుట చేతనే, ఏనింతదనుక సజీవినై యుంటిని. లేకున్న ఓదేవీ! ఏనాఁడు మదీయ ప్రాణనాథుఁడు విగతజీవుఁడాయెనో, ఏనాఁడు నాము ద్దుబిడ్డను గోల్పోతినో, ఆ నాఁడే పవిత్ర గంగానదీ తోయములబడి

మరణింపనా? కన్న సోదరి కన్న మిన్నగా నన్ను సాకుచుంటివని, ఈ మహాసామ్రాజ్యము నందంతటను మహా ప్రతీతికలదు గదా! నేనట్టి యపారమగు ప్రేమకు బాత్రురాలనగుటచేతనే యింతవరకు సజీవినై యుండగలిగితిని. చతుసముద్రముద్రిత మహీమండలమున నిరంకుశముగ శాసించు చక్రవర్తిని యపారకృపాకటాక్షముల నాకర్షించుకొన నవకాశమొసంగిన పరమాత్ముని నెట్లుకొనియాడగలనో తెలియకున్నది. సూర్యునాశ్రయించి బ్రతుకు చంద్రునివలె నున్న నాపదవి గాంచి ఈసామ్రాజ్యమున మత్సరించువారనేకులున్నారు. వారందఱు వైరమూని, నావినాశము నే సదా యపేక్షించుచున్నారు. వారు—"

బాష్పములు క్రమ్ముటచే, జులేఖా యికపలుకనేరకపోయెను, ఆమె హృదయము తటతట గొట్టుకొనుచుండెను. ఒక్కనిముసమామె వెక్కి వెక్కి యేడ్చుచునట్టె నిలిచి యుండెను. కాని, నూర్జహాను విశ్వసింపలేదు: ఆమె హృదయము కరుగలేదు. అంతలో జులేఖా నేదదేరి, మఱల నిట్లనెను—" పాదుషాబీగమా! నావైరులు వ్యాపింపజేయు నపవాదులను నీవువిశ్వసింతువా—"

" ఏమీ! అపవాదులా? ఈనెపమునదప్పించుకొనజూతువాజులేఖా నీ కాపట్యమును ఋజువుచేయు సాక్ష్యము కావలయునంత గలదు!"

వెలవెల బోవుచు, జులేఖా యిట్లనెను.— " పాదుషాబీగమా? ఇక నీతో చర్చించుట నిష్ప్రయోజనము. ఈ దీనురాలకు నెట్టి శిక్ష విధింతువో యనుగ్రహింపుము. "

తోడనే, క్రోధఘూర్ణితమానసియై ఆణిముత్యముల వలె నుండిన పండ్లు గొఱుకుచు నూర్జహాను యిట్లనెను.—"నీరాక్షస కృత్యములకు దగిన శిక్షయే నీవనుభవింపగలవు. ఈక్షణముననే, నీశిరము తెగిపోవును."

## ౨౫

## ఆ త్మ హ త్య

ఆ క్షణముననే, కాలి యలుకుడి యగుటచే నులికిపడి జులేఖా వెనుకకు దిరిగి చూచెను. ప్రత్యక్ష యమదూతల వలె నుండిన నల్లని భయంకర పూరుషు లిర్వురు గోచరించిరి. వారు నీగ్రోజాతివారు. చీకటి రాసులవలె నుండిన యాకారములును, చింతనిప్పులవలె కణ కణ లాడుచుండిన నయనములును. చేవదీరిన తాల వృక్షములవలె దీర్ఘముగా ముష్కరముగా నుండిన దేహములును గోచరించినంతనే జులేఖా భయభ్రాంతియై కంపించెను. ఆ నీగ్రో లిర్వురు తళతళ లాడుచుండిన వాడి ఖడ్గములను ధరించి యుండిరి. జులేఖాయొక్క కోమల కంఠమును నొక నిముసములో నిరకక్కసులే తెగనరికెదరు కాబోలు.

నరరూపము ధరించిన యా యమదూతలను గాంచునంతనే ప్రాణములు వెంటనే యెగిరిపోవును. కాని, జులేఖా సాధారణపు మానిని కాదని పాఠకులు గ్రహించియే యున్నారు, కావున, ధైర్యము వహించి, నూర్జహానువంక దిలకించి, విస్పష్టముగా నామె యిట్లు వక్కాణించెను.

“ పాదుషాబీగమా ! ఈ మొఱకలు నాకంఠము దెగనఱికినచో నీకు గలుగు లాభమేమి ? అపారమగు నీ ప్రేమికే నేను వెలియైనపుడు, నా కీజీవనమేల ? కావున, ఒక్కింత విషము దయచేయుదువేని, ఏలిన వారి సమక్షముననే దుర్భరమగు నాజీవయాత్రను తుదముట్టించెదను.”

నూర్జహాను యేమియు బలుకక మిన్నకుండెను. కావున, జులేఖా మఱలనిట్లనెను — “ దేవీ ? ఓర్వజాలని నా విరోధులు చాటు యప వాదుల నూతగొని నీ విట్టి కాఠిన్యము వహించుట — ”

తోడనే, తన పాదములు జాడించి, నూర్జహాను యిట్లు సంబోధించెను — “ ఓరీ ! హంతకులారా ! ”

తోడనే, ఆ హంతకు లిర్వురు జులేఖాను సమీపించిరి. కాని, ఆమె యసాధారణధైర్యము వహించి, వారినిగాంచి గంభీరముగ నాజ్ఞాపింప, వారు వెనుకకు మఱలిరి. తోడనే, ఆమె నూర్జహాను యొక్క పాదపద్మముల సమీపమున బ్రణమిల్లి యిట్లనెను — " దేవీ! కరుణింపుము. చిరకాలము నిన్ను భక్తివిశ్వాసములతో సేవించిన యీ సేవకురాలిపై కృపాంబువులు కురియింపుము ! "

తోడనే నూర్జహాను రోషకషాయితాక్షియై యిట్లులనియె — " ఓసీ ! ఈపదినంవత్సరములనుండియు నిన్ను సంపూర్ణముగ విశ్వసించి, సోదరికంటె నెక్కుడు ప్రేమతో సాకినందులకు నీ వెట్టి ప్రత్యుపకార మొనరించితివి ? నేడు నీవిశ్వాసఘాతకనైజము ఋజువైనది. ఓసీ! రక్కసీ! ఇంకను నిన్ను విశ్వసింపవలయునే ! "

అని యట్లు నూర్జహాను క్రోధానలజ్వాలల నుమియుచుండగనే యొక యద్భుతము సంభవించెను. ముకుళిత కరకమలయై యతి దైన్యముగనుండిన జులేఖా హస్తమున వజ్రాయుధమువలె మెఱయుచుండిన కృపాణ మొక్కటి మెఱుపువలె గోచరమాయెను. ఆవీరవనిత కఱకు గరవాలమును దూసి, నూర్జహానును డాసి, విస్పష్టముగ నిట్లు పలికెను.

" పాదుషాబీగమా ? చూచితివిగదా యీ ఖడ్గము ! ఈఖడ్గము బూని, నీహృదయము భేదింపగోరుదునేని, నన్ను వారించువారెవ్వరు ? నిన్ను రక్షించువారెవ్వరు ? కాని, నేనట్టి యకార్యము నొనరింప జాలను. నీవు చూచుచుండగ నాప్రాణమునేహరించుకొందును. "

అని పలికి ఆఖడ్గము నటుపాఱవైచి, విషపుగుటికనొండు దీసి జులేఖా నోటవైచుకొని, ఇట్లనెను — " పాదుషాబీగమా ! నా కడ సారి ప్రార్థన నాలింపుము. ఇంతకాలము నిన్ను భయభక్తులతోడను నిష్కలంక హృదయముతోడను సేవించిన నాశరీరము హిందూమత సాంప్రదాయము చొప్పున దహనమగుటకు మాత్రమనుగ్రహింపుము.

ఇదియే నాకడసారి ప్రార్థన. మన్నింపుము!"

అట్లు పలికిన జులేఖాయొక్క భావమును నూర్జహాను గ్రహించు లోపలనే, యమ్మానవతియొక్క ముఖవికాసము మాఱిపోయెను. నూర్జహాను నివ్వెరపడి పరికించుచుండగనే, జులేఖాయొక్క నయనములు గిరగిర దిరిగెను. తోడనే, ఆమె నిలువఁజాలక కూర్చుండి, ఆ ముహూర్తముననే నేలపై వ్రాలెను. ముద్దులొలుకు ఆసుందరి వదనారవిందము కళావిహీనమై వెలవెల బోయెను.

మరణదండన విధింపఁబడిన జులేఖా కత్తి దూయుటయు, నూర్జహాను నట్లు హెచ్చరించి ఆ ఖడ్గము నటు పాఱవైచి విషము మ్రింగుటయు, తన యంత్యాభిప్రాయము నెఱింగించి నేలగూలుటయు గూడ నొక్క నిమిషము లోపలనే సంభవించుటచే, నూర్జహాను భయభ్రాంతయై రయమునలేచి జులేఖాను సమీపించెను. మోము తెల్లబాఱియుండుటయు, అతివిశాలములగు నయనములట్టె తెఱచియుండుటయు అవయవములన్నియు కొయ్యబారి యుండుటయు గాంచినంతనే జులేఖా మరణించెనని నూర్జహాను నిశ్చయించెను.

జులేఖాను వధింపవలయునని కఠినముగ శాసించిన మహారాణి యొక్క కాఠిన్యమంతయు త్రుటిలో మాయమాయెను. కాలాను గుణంబుగ నెంత కాఠిన్యముపహించినను, కోమలాంగుల హృదయము లిట్టి సమయములందు నెట్లు కరుగకుండును? నాఁటివఱకును దాను బ్రాణపదముగ జూచుకొనుచుండిన వనితారత్నము తాను జూచుచుండగనే యట్లు దారుణముగ మరణించుట మహారాణికి కడు దుర్భరముగ నుండెను. తోడనే నూర్జహాను తన నెచ్చెలి చెంతనే యాసీనయై తనకోమల కరపల్లవంబుల నామె శిరంబునెత్తి తనయొడిలో నిడికొనెను. ఆహా! ఆదృశ్యము నెవ్వరు చిత్రింపగలరు? ఎవ్వరు వర్ణింపగలరు?

నూర్జహాను బాహ్యప్రపంచమును పూర్తిగా మఱచిపోయెను.

జులేఖాయొక్క మోమును, హృదయమును నాడిని గూడ నామె పరీక్షించెను. ఎంత పరీక్షించినను ప్రాణములు నిలిచియుండు సూచన యొకటియైనను గానరాకుండుటచే మహారాణి ఖిన్నురాలాయెను. ఆభువనైక సుందరి విశాలనయనములు బాష్పజలపూరితములై గిఱ్ఱున దిరుగ నారంభించెను. తెగిపోయిన ఆణిముత్యముసరులవలె బాష్ప జలములు జలజల రాలగడంగెను. ఎట్టకేలకు ధైర్యమూని యమ్మహా రాణి ద్వారముచెంతనుండిన హంతకులనుజీరి, మస్రూరు దోడ్కొని రండని యాజ్ఞాపించెను. అనంతరము తన యొడిలోనుండిన జులేఖా శిరమును నేలపై నిడి, మహారాణిలేచి యుచితాసనంబు నారోహించెను. సకలజనభయంకరముగ రాజ్యతంత్రమును త్రిప్పు నూర్జహాను ఆసమ యమున విగణ్ణవదనయై, దగ్ధార్ద్రహృదయయై, తన యెదుటనున్న కళేబరమును గొంత తడవు పరికించి, ఇంకను బరికించుటయే కష్ట మగుటచే వేఱొక దెస మోముద్రిప్పి, తన్ను దాను మఱచి నిర్జీవ సువర్ణవిగ్రహామువలె నుండెను.

అంతలో మస్రూ ప్రవేశించెను. నూర్జహాను వదనము వన్నె దొఱంగియుండుటయు, నామెయాలోచనాపరయైయుండుటయు నాతడు కనిపెట్టెను. కాని ఒక్కనిముషము వేచి, తానావిషయము గుర్తింప నట్టులే వాడు సవినయముగ నిట్టులనెను. "దేవీ! అల్పుడగు నీసేవకున కేమియాజ్ఞ?"

వాని వాలి యలుకుడి యాలించినంతనే తెలివితెచ్చుకొనిన మహా రాణి యిట్లు ప్రత్యుత్తరమొసంగెను— "నా పరిచారిక జులేఖా హఠాత్తుగా మరణించినది."

మస్రూ యిట్టు లనుకొనెను—"ఇందేద్దియో మోసమున్నది. ఈ జులేఖాయొక్క వృద్ధదాది తన సామగ్రి వెంటనిడుకొని ఇప్పుడే వెడలియుండెను. ఈవిషయము ఆమెయు నెఱింగియేయుండును."

అని యట్లు తనలో దాను తర్కించుకొనిన మస్రూా యిట్లు వినయముగాఁ బల్కెను—"దేవి! ఖున్‌ఖానాయందు మృతకళేబరములను బూడ్చివేయుట యాచారము. సెలవొసంగుదు రేని కళేబరమును గూడ నచటికి గొంపోదును."

బీగము మహాలున రహస్యముగా మరణించువారికి లెక్కలేదు. ఆమాయామందిరమున నెవరు యేవేళ యెట్లు మరణింతురో చెప్ప నలవిగాదు. విషప్రయోగముచే మరణించువారు కొందఱు: కరవాలమున కెరయై మరణించువారు కొందఱు: హఠాత్తుగ నెను కనుండి బాకులచే పొడువఁబడి మరణించువారు కొందఱు: ఏపాప మెఱుంగక నిర్భయముగా నిర్గమించుచుండ, పొంచియుండిన రక్కసులు పైబడ మరణించువారు కొందఱు — ఇట్లనేక తెఱంగుల వికతజీవులగు దురదృష్టవంతులను బూడ్చివేయు ప్రదేశమునే ఖున్‌ఖానా యందురు. కళేబరము నాప్రదేశమున బడవైచిన తోడనే ముగ్గునున్నము విశేషముగా పైని చల్లివైతురు. ఆ తెఱంగున, నా మృతకళేబరమునుండి దుర్గంధము బయల్వెడలకనే యయ్యది క్రమముగా మృగ్గుతో గలసి పోవును. ఈ తెఱంగున నెందరు మరణించుచుండిరో బాహ్యప్రపంచ మెఱుంగదు.

ఒక్కనిమేషమాత్రము మిన్నకుండి, నూర్జహాను యిట్లు వాక్రుచ్చెను. — "ఇంతకాలము నన్ను విశ్వాసముగ సేవించిన యీ పరిచారికయొక్క కళేబరము నాకూపమున ద్రోయరాదు. హైందవులకు సాధారణమగు దహనసంస్కార మీమెకు జరగవలయు. ఈమె జాతివారలే వలయు కృత్యములను నిర్వర్తింపవలయు"

వంగివంగి సలాము లాచరించుచు మస్రూా యిట్టులనెను—"సర్కార్! మహా ప్రసాదము. బ్రాహ్మణోత్తములను రావించి హైందవసాంప్రదాయముల ననుసరించి దహన సంస్కారము జేయింతును."

నూర్జహాను కొంతతడవు ఆలోచనా యత్తచిత్తయై సాగుడనిట్లనెను— "జులేఖా నిశ్చయముగ మరణించినది. ఓరీ! మఱియొకమాట. ఈమె మరణించిన విషయ మెవ్వరు నెఱుంగరాదు."

మస్రూ — "సర్కార్! ఈబీగముమహలువందేగాక ఆగ్రానగర మునందు గూడ జులేఖా బీబీని నెఱుంగనివారు లేరు కాబట్టి, ఎల్లరు నీమె యేమాయెనో యని ప్రశంసింతురు —"

నూర్జహాను — "ఓరీ! ఈ విషయము మాకును నీకును ఆయిరువురు కొజ్జాలకును దప్ప మఱియొకరికి దెలియదు. ఈరహస్యము నోరు లెఱుంగరాదు. జాగ్రత! నాదీయాజ్ఞానుసారముగ జులేఖా ఢిల్లీకి బోయెనని మేము ప్రకటింతుము."

మస్రూ — "పాదుషా బీగము సాహేబా! ఈ శవమును హైందవ సాంప్రదాయముల ననుసరించి దహనపఱుప వలయునేని —"

వాఁడట్లు పలుకుచుండఁగనే పట్టరాని యాగ్రహము జనింప, నూర్జహాను యిట్లు గర్జించెను — "ఓరీ! మస్రూ! మేము వచించు వాక్యములను శ్రద్ధగా నాలింపుము. హైందవులకు సాధారణములగు సంస్కారములన్నియు నీమెకు జరుగవలయు. ఈమె మరణవార్త యేరికి దెలియరాదు. అట్లుగాక, నీవన్యథా ప్రవర్తింతువేని, ఈ మృతకళే బరమునకు జరగవలసిన సంస్కారమున కెట్టి లోపమైన గావింతువేని, మా విశాల సామ్రాజ్యమునం దెవ్వరికైన నీమె మరణవార్త తెలియునేని, నీ కంఠము నీది కాదని యెఱుంగుము. జాగ్రత!"

అట్లు శాసించిన పిమ్మట నతి రయమున నూర్జహాను ఆమందిర మును వీడెను. అంతవఱకును దనకెట్టి యుపద్రవము సంభవించునో యని భయభ్రాంతుఁడై స్రూన్పడియుండిన మస్రూ యిట్లువిచారింపఁ దొడంగెను — "ఆహా! ఇప్పటికి ప్రాణములు కుదుటబడినవి. ఈమహారా ణిని సేవించుట యెంతకష్టము! ఎంత ప్రమాదకరము! ఈ శవమునకు

హైందవ సాంప్రదాయములననుసరించి సంస్కారమొనర్పవలయునట. కాని, ఈ రహస్యము నెవ్వరు నెఱుంగరాదట. హా! దైవమా! ఏమి, యీప్రారబ్ధము! ఈ శవమునకు హైందవులచేతనే దహనసంస్కారము కావలయునట. అట్టి సమయమున, ఒరులకు దెలియకుండ కార్య మెట్లు చక్కబడును? నేనీ మహలు ప్రవేశించి యిరువది సంవత్సరములు కావచ్చినది. కాని, ఇంతటి యుపాయ మెన్నడెఱుంగను. అల్లా! నా తనువు నేటితో జల్లారుగాబోలు. ఖున్‌ఖానాయందే దీనిం దఱిని రహస్యముగా బూడ్చివేయరాదు! ఈ శవమునుగూడ నట్లులే పాఱవేతునన్న, నూర్జహాను సైరించునా? నూర్జహానుయొక్క కఠినశాసనము నతిక్రమించుటయు, ఇంకను జీవించియుండుట యునా? అణుమాత్రమైనను ఆజ్ఞ నుల్లంగింపరాదు, ఓసీ! జులేఖా! కాఫర్! నీవు చచ్చియు నన్ను ఎంతగా బాధించుచున్నావు!"

"హా! దైవమా! దేహము కంపమెత్తుచున్నది. హిందూశవముమోము మహమ్మదీయుడు కాంచరాదట, కాంచిననో, దయ్యమగునట! జులేఖా దయ్యమే యగునేని, మాగతి యేమి కావలయు? ఈమె యాజ్ఞయెన్నడు జవదాటి యెఱుంగను. ఈమె దయ్యమగానేని, నేనీ దేశమున నిలుచుట దుర్లభము. నన్నీమె బాధింపదని యొక్క నిబ్బరము మాత్రము గలుగుచున్నది. ఈమె కెట్టి యుపకార మొనరించి యెఱుంగను. ఈమె కెల్లప్పుడు ప్రీతిగొల్పుచునే యుంటిగదా. కాన, నేనేల వెఱువవలయు?"

ఈ తెఱంగున మస్రూరా పరిపరివిధముల జింతింపుచు నిటునటు పచారు చేయుచుండెను. నల్లబాఱిన జులేఖాయొక్క వదనము మఱింత నల్లబాఱెను. ఆలోచనాపరుడై యుండిన మస్రూరా యీ విషయము నెఱుంగడు. జులేఖా దయ్యమగునేమో యను భయమొకటి: మహారాణి యాజ్ఞచొప్పున రహస్యమున జులేఖాను నుత్తరక్రియలు సలుపుట

యొక్కటి: ఈ రెంటినష్టమును నాతఁడు కలిగిపోవుచుండెను. ఎంత యోచించినను ఉపాయము స్ఫురింపకుండెను. "హా! దైవమా! ఈ త్సునుని రక్షింపుము రక్షింపుము" అని విలపించుచు వేడినిట్టూర్పులు దీర్ఘముగ విడచుచుండెను.

"జులేఖా మరణించినదని విచారింప నవసరము లేదు. నూర్జహానును సహితము కీలుబొమ్మవలె త్రిప్పుచుండిన ఈస్త్రీ తాను నే గాంచునపు డెల్ల నెట్టి ప్రమాదము సంభవించునో యని వెఱచుచునే యుంటిని. చిత్తము శాంతియొందుంగదుగదా! అట్టి స్త్రీ తాను మరణించుటయే క్షేమకరము కాని, ఈమె యెట్లు మరణించియుండునో, పాముపాటీగమే కడతేర్చి యుండునా? ఆమె యంతటి సాహసికురాలౌను కాని, అట్లు జరిగియుండదు. ఆ హంతకులను గాంచినంతనే, జులేఖా విషముదిని మరణించియుండును. ఈమె యెట్లు మరణించినను నాకేల? నా కిపుడు కర్తవ్యమెద్ది? ఇపుడెంత విచారించినను లాభము లేదు. రెండు ఝాములగు వఱకు నీశవము నిచటనే యుంచెదను. నగరమంతయు మైమఱచి నిద్రించునపుడెద్దియో యుపాయ మాలోచించెదను."

అని నిశ్చయించుకొనుచు భయవిహ్వలుఁడై యుండిన మస్రూూ జులేఖాయొక్క మోము నొక్కసారియైన గాంచకయె, ఆమందిరము నకు భద్రముగా బీగమువైచి పరుగున బోయెను.

## ౨౯

### మృ త క ళే బ ర ము

రాత్రి రెండు ఝాముల నౌబత్తు కర్ణపర్వము జేయుచుండెను. అర్ధరాత్రి యగుటచే పారావాంద్రు తప్ప ఆగ్రానగర వాసులెల్లరు మైమఱచి హాయిగ నిద్రించుచుండిరి. మహాసముద్రమువలె ఘూర్ణిల్లు నగరమంతయు గడు నిశ్శబ్దముగ నుండెను. అట్టి సమయమున, నూర్జ

హాను జులేఖాను వధించుటకై యరుదెంచిన ఆహంతకుల చెంతకు మస్రూపోయెను. జులేఖాయొక్క యుదంతమువారలుతప్ప మఱియెవ్వ రెఱుంగరుగదా, ఆకారణమున, మస్రూ లోకానుభవముగల మానిసి యగుటచే వారి చేతనే కార్యము నెఱవేరవలయునని నిశ్చయించెను.

"పాపాత్ములారా! బీగము సాహేబుగారి యాజ్ఞ నెఱిగించెద వినుడు. ఈశవమునకు హైందవ సాంప్రదాయము ననుసరించి దహన సంస్కారము కావలయు, ఈమె మరణించిన సమాచార మెవ్వరికి దెలియరాదు. తెలిసినదా" అని గంభీరముగను కఠినముగను మస్రూ తెలియఁబఱుప, చేతులు జోడించుచు, "చిత్తము చిత్తము" అని వినయముగ వారు పలికిరి.

"ఓరీ! దుర్మార్గులారా! జాగ్రత్తగా వినుడు. శవము షిస్ మహాలు నందున్నది. అద్దానిని రయమున గొంపోయి నేను చెప్పిన చొప్పున గావింపుడు. ఆజ్ఞ నణుమాత్రమైన నుల్లంఘింపరాదు సుడీ. ప్రమత్తులై మీరెట్టి స్వల్పలోపమైనను గావింతు రేని, మీప్రాణములు మీవిగావు. ఈమహాలునందు మీకెట్టి యాటంకములుగలుగకుండ, వీధివఱకు మిమ్ము నేను వెంబడింతును. చీకటిరాత్రు లగుటచే నటుపైని మిమ్మెవ్వరు గుర్తింపఁజాలరు. యమునానదీ తీరమున బడి తూర్పుముఖముగా బోవ లయు. వినుచున్నారా!"

"హుజూర్! చిత్తము! చిత్తము"

"ఒకే వేళ, మార్గమధ్యమున మిమ్మెవరైన ప్రశ్నింతురేని, మీరు దైన్యమును విచారమును నభినయించి, తల్లిస్వర్గస్థురాలాయెననియు, ఉత్తరక్రియ లొనరింప నరుగుచున్నామనియు నెఱింగింపుడు"

"హుజూర్! మహమ్మదీయులము గదా!"

"దౌర్భాగ్యులారా! నాకా విషయము తెలియదా! మీవస్త్రము లను విసర్జింపుడు. నిఱుపేదలగు హైందవులవలె చీలిక పేలిక గుడ్డలను

ధరింపుము. శవము పూర్తిగా గప్పివేయుము. తెలిసినదా!"

"చిత్తము, చిత్తము"

"సింహద్వారము వఱకు మిమ్ము సాగనంపెదను. తెల్లవారు వరకును ఎక్కడమీరు నిలవరాదు. మార్గమధ్యమున ఈశవము నెవ్వరు చూడరాదు. ఈప్రాంతమున జులేఖాను దెలియనివారుండరు. ఎవ్వరైనను గుర్తింతురేని మోసము సంభవించును. మీకొంపమునుగును. తెలిసినదా!"

"చిత్తము, హుజూర్"

"ఒకవేళ తెల్లవారక పూర్వమే యీశవమును దహనపఱచుట కవకాశము చిక్కకపోవచ్చును. అట్టిసమయమున, యమునానదియందీశవమును బాఱవేయుడు. ప్రవాహమున, బడినపిమ్మట నయ్యది శీఘ్రముగా గంగానది జేరగలదు. మనకష్టము గట్టెక్కును. మూర్ఖులగు హిందువులకు నిట్టి సంస్కారము కూడ పరమ పవిత్రమేగదా. ఆకారణమున చచ్చిన జులేఖాసహితము సంతసింపగలదు"

"చిత్తము, హుజూర్"

"పశుప్రాయులారా! ఇంకను ఆలసించెదరేల? వరుగున పొండు. నేజెప్పిన చొప్పున ప్రవర్తింపుడు. ఎంత చిన్న పొరపాటైనను జరుగునేని ప్రాణము లెగిరిపోవును. జాగ్రత్త"

మస్రూరాయొక్క తెలివితేటలు అద్భుతములైనవి. కావుననే, ఆతఁడెంతయో విచారించి, కార్యాభారము నంతయు నాహంతకుల మీదనే ద్రోసివైచెను. ఆతఁడు బీగమునొసంగ నారాజభటు లతి శీఘ్రముగను అతినిశ్శబ్దముగ పిన్‌మహాలుకు బోయిరి. మస్రూరామాత్ర మామందిరమును సమీపింపఁజాలక భయభ్రాంతుఁడై దవ్వున బహారుచేయుచుండెను. ఈలోన, జులేఖాయొక్క కళేబరమునకు మాసిన బట్టలు చుట్టబెట్టి, వెదురు కర్రలపై భద్రపఱచికొని, ఆహంతకులు

మ(హ్మూనః సమీపించిరి. వారి వికృతాకారములను, మలిన వస్త్రము లను, ముఖ్యముగా జులేఖాకళేబరమును గాంచినంతనే, భయమెఱుంగని మహ్మూ యొక్కసారి గడగడ వడంకెను. కాని, ఆతఁడు ధైర్య వంతుఁడును ఆఱితేరిన దుండగీడును అగుటచే వారిని వెంటబెట్టుకొని ధైర్యముగా నిర్గమించెను. ఎవ్వరుగుర్తింపజాలనట్టులు శవము పూర్తిగ గప్పబడియుండెను. మార్జాలముల వలె వారు కడు నిశ్శబ్దముగ బోవుచుండిరి. మహలునందు నివసించు వారెవ్వరు నానిర్భాహకుల గాంచలేదుగాని, పారావాండ్రు మాత్రమటుగాయించిరి. వారు సహి తము, మ(హ్మూనుగాంచినంతనే దాఱియొసంగిరి. ఈ తెఱంగున నాహంత కులు పారాలన్నియు దాటి సింహద్వారము సహితము నతిక్రమించి, రయమున ప్రయాణమొనరించి తుదకు యమునానదీతీరముజేరి, తెల్ల వారక పూర్వమే, వారాగ్రానగరమునకు సాధ్యమగునంతదూరముగ నుండవలయు, నగర మధ్యమున బరుగులిడినచో నెట్టి ప్రమాదము సంభవించునో యని వెఱచిరి. కాని, నదీతీరము జేరినంతనే యొక్క క్షణకాలమాగి పిక్కబలిమి కొలది వారు పరుగిడ జొచ్చిరి.

చీఁకటి మిక్కిలి దట్టముగా నుండెను. చేరువునుండిన వృక్షాదులు సహితము గాన రాకుండెను. శవమును మోచుకొని పరుగు పరుగున బోవుచుండిన యాహంతకుల కాళ్ళసడి తప్ప వాతావరణమంతయు గడు నిశ్శబ్దముగ నుండెను, వారిని మఱియొక రానమయమున గుర్తిం చుట యసంభవము. వారును అట్టులే భావించి యుండిరి. కాని, విధి విధానమెట్లుండునో యెవ్వఁడెఱుంగ గలఁడు ? ఆ తమోసాగరమున వారల వెంబడియే మఱియిద్దరు కూడ బరుగిడుచుండిరి. శవమునుగొం పోవుచుండిన హంతకులధ్యాన మంతయు తత్కార్యము మీఁదనే లగ్న మైయుండుటచే, వారాపిషయమును గుర్తింపజాలరైరి. వెనుక పరుగిడు చుండిన వారెవ్వరో ? ఎందులకట్లు ప్రయాపడుచుండిరో ?

నాలుగుమైళ్ళు ఆ తెఱంగున పరుగిడిన పిమ్మట, ఆహంతకులపిక్కలు పీకెను. వారి గమనము మందగించెను. ఉస్సురని దీర్ఘనిట్టూర్పులు విడుచుచుండిరి. దేహమంతయు చెమ్మటలు క్రమ్మటచే ప్రయాణము సల్పుట కడుంగడు కష్టమాయెను. వారిని వెన్నాడుచుండిన నూతన పురుషులలో నొక్కడు సమీపమున నుండిన తుప్పచాటున నక్కెను. రెండవాడు మాత్రము వారి వెంబడినే నేర్పుగా బోవుచుండెను. తుప్పచాటున దాగినవాడు యశ్వారూఢుడై రయమున నరుదెంచి రెండవ దెస వాయువేగమున నదృశ్యుడాయెను.

ఆహంతకులట్లు కొంతదూర మేగిన పిమ్మట వారిలో నొక్కడిట్లనెను. "ఓరీ? యీశవము నొకసారి దింపవలయునురా. మనము పరుగెత్తు సమయమున దీనికి గట్టిన కట్లు విడిపోయెనుకాబోలు. కట్టు దప్పి యొక్కచేయి వ్రేలాడుచు, నన్ను ఒక్కలాగున కొట్టుచున్నదిరా. ఇదియేమి ప్రారబ్ధము!"

"అల్లా! అల్లా! దీనికి దయ్యము పట్టినదేమోరా!"

"ముందు దింపరా, పరీక్షింతము"

"అట్లు కాదురా, తెల్లవారువరకు తాళుదము"

"ఛీ! మూర్ఖా! యీసైతాను అదేప్రకారము నన్ను కొట్టుచుండ ఇంక నొక్క క్షణమైనను తాళుటెట్లురా? దేహమంతయు గగుర్పొడుచుచున్నది. భరింపజాలను, ఒక్కసారి దింపి మరల గట్టిగా కట్టివేయుదము?"

"ఓరీ! పశువా! మనము శవమును చాలగట్టిగనే కట్టియుంటిమే ఇంతలో నెట్లు వీడునురా!"

"దౌర్భాగ్యుడా! మనకీ తర్కమేల? నీకండ్లతో నీ వేచూడగలవు. దింపుము."

ఎట్టకేల కాశవమునుక్రిందనిడిరి. చీకటిగా నుండుటచే వారి కేమియు

బాగుగ గోచరింపకుండెను. ఐనను కష్టపడి శవమును దడపుచు పరీక్షింప దక్షిణహస్తము కట్టుపీడెనని దెలియనాయెను. తోడనే ఆహంతకులకు గలిగిన భయమువర్ణనాతీతమైయుండెను. దేహములందు ముచ్చెమటలు క్రమ్మెను. అంతవరకు బీరము లాడుచుండిన రెండవ వాఁడు సహితము భయభ్రాంతుఁడాయెను. అయ్యది కల్లయో నిక్కమో తెలియకుండెను. "ఈచేయి యింకను ఊఁగులాడుచున్నదే! దీనికి తప్పక సైతాను పట్టినది! అల్లా! అల్లా!"

జులేఖాయొక్క కరము నిజముగ నూఁగుచునే యుండెను. క్రోవపోడుగునను లెంపకాయలు తినుచుండినవాడిట్లనెను.—"మనము దింపునపుడు కలుగు త్వరితముచే నిట్లూఁగరాదా!"

చేయి మరల కదలెను. సూర్జహాను నామాంక్షరములుగల వజ్రపుటుంగరము ఆసమయమున మెఱుపువలె దళుక్కున మెఱసెను. తోడనే వారిరువురు భయభ్రాంతులై కెవ్వున నఱచిరి. అంతలో ధైర్యము వహించి, నిలువబడి, ఆకరమును తేరిపార పరికించి యిట్లనుకొనిరి.—"ఈ చేయి యిపుడు కదలుట లేదు. మనము భ్రమపడితిమే కాని దయ్యము లేదు. పిశాచము లేదు." అని భావించి యొకరి నొకరు తిలకింపగడంగిరి. షీస్ మహాలునందు శవమును బంధించుసమయమున వారా యుంగరమును గాంచుట కవకాశము లేకపోయెను. గండము గడచిన జాలునని తహ తహ లాడుచుండిన మ్రుషూ శవమును గాంచుటకే భయపడెగదా. సహస్రాక్షియగు నూర్జహాను సహితము క్రోధ ఘూర్ణితచిత్తయు, వివిధాలోచనాయత్తచిత్తయునై యుండుటచే, తన యుంగరము మాట మఱచిపోయెను. నిందారోపణమూ, దీనాలాపమును, క్రూరమరణ శాసనము, విసము మెసవుటయు, నొక్క త్రుటిలోఁ జరిగియుండుటచే, మఱపెఱుంగనిమహారాణియుంగరము మాట మఱచిపోయెను.

పిశాచభయము తొలంగగనే యా హంతకులిద్దఱు ధైర్యవంతు లైరి. వారిలో నొక్కఁడు వికారముగా నవ్వుచు నిట్లనెను.— "ఓరీ ! ఈ శవము ఒకవేళ పునర్జీవి యగుననుకొనుము. అప్పుడామె తన యుంగ రము మెఱపించునేని మన యవస్థ యెట్లుండునో? బీజాక్షరములవంటి నామాక్షరములు గల ఆ యుంగరమును బ్రదర్శించువానికి మనము దాసానుదాసులము కావలయుఁగదా!"

"ఓరీ నీవు చెప్పునది నిక్కము. కావున, దీనికి ప్రాణములు రాక మున్నే యుంగరము తీసి వేయుదము రా"

కాని, అదృష్టవశమున వారట్లు కావింప లేదు. ఏమన, రెండవవా డిట్లుపలికి వారించెను.—

"ఎట్టి మూర్ఖుఁడవురా! ఆ యుంగరము నంటినచో మన ప్రాణ ములు నిలుచునా? దీనిని హరించి యేమి చేయవలయు? దీనిని దాచ గడంగుట అగ్గిమూటగట్టబోవుట కాదా? రహస్యము బయల్పడినచో తలకాయ లెగిరిపోవటరా!"

వాఁడట్లు పలికినంతనే మొదట వాఁడు భయకంపితుఁడాయెను. వాఁడా యుంగరమును దీయుటకు సాహసింపఁజాలని వాఁడాయెను. ఐనను, ఉంగరము మీఁద మోహము మాత్రము పోకుండుటచే, వాఁడు మిక్కిలి యాగ్రహపరవశుఁడై యిట్లనెను.— "అట్లయిన మనకీ బాధ యేల! ఈ పీనుగను వెంటనే నదీప్రవాహమున బారవేయుదము."

"దౌర్భాగ్యుఁడా! మన యజమానియగు మఖ్రూ చెప్పినదేమి? నీవు చెప్పినదేమి? తెల్లవారకుండగనే యట్టు లొనరింతుమేని, మనలను మఖ్రూ ఖండ ఖండ లొనరింపఁడా?"

"మనమిక్కడేమి చేయుదము, వాని కెట్లు తెలియునురా?"

"మఖ్రూకు ఎన్ని కండ్లు ఎన్ని చెవులు గలవో నీవెఱుంగవా?"

"నిజము నిజము, వానిని మోసగించుట కల్ల కావున, ఈపీనుగను

దిట్టముగా గట్టి, సూర్యోదయ మగువఱకు తాళుదము. సూర్యోదయ మగు నంతనే పారవేయుదము."

అనంతర మా హంతకు లిర్వురు మోములు చిట్లించుకొనుచు, ఊపిరి బిగబట్టి, పెదమోముతో గదిమి, విడిపోయిన జులేఖా యొక్క కర చరణముల గట్టిగ గట్టివైచి, శవమును భుజములపై వైచికొని, తొంటియట్లు నయమున బరుగిడజొచ్చిరి. వారికి వెన్నాడు చుండిన క్రొత్త పురుషుడు వా రాగినంతనే, యొక్క ప్రక్క నక్కె. ఆహంతకులు మరల పరుగిడ నారంభించినంతనే వాడును వారి వెనువెంటనే కడు నిశ్శబ్దముగ బరుగిడజొచ్చెను.

అరుణోదయ మగుసరికి వారు నదీతీరమున నుండిన హైందవ శ్మశానవాటిక జేరిరి. ఆ సమీపమున హైందవ శవమొకటి గోచరించెను. ఆకళేబర మెవ్వరిదోగాని దానిచెంత నెవ్వరులేరు. దహనపఱచుటకు వలయు కట్టెలను దెచ్చుటకై వెడలి యుందురు.

ఒంటిపాటుగా నుండిన యా శవమును గాంచినంతనే ఆ హంతకులకు గలిగిన యానంద మింతింతగాదు. తమ కష్టమంతయు గట్టెక్కినట్లు వారు సంతసించిరి. జబ్బలు విరుగునట్టులు మోయుచుండిన శవమును నిఁక అనాయాసముగా వదల్చుకొన వచ్చునని వారు భావించిరి. వారిద్దరిలో బుద్ధిమంతు డిట్టు లనెను. — "అల్లా! నీవు నిజముగ దయామయుడవు. ఇంతకాలము పిక్కలు పీకునట్లు పరుగెత్తి, భుజములు విరుగునట్లు మోసి మోసి, దీని నేమి చేయవలయురా" యని విచారించు ఈదీనుల కీకళేబరమును గనబఱచిన నీమహిమ నెట్లు కొనియాడగలము? ఓరీ! మిత్రమా! మన మిపుడేమి చేయవలయునో దెలియునా? ఆ కళేబరమును దీసివైచి, ఈపీనుగు నచట పెట్టుదము. మూర్ఖులగు హైందవు లీ రహస్యము నరయజాలరు. ఈకళేబరము తాము తెచ్చినదే యని యెంచి దహనపఱతురు. మన కార్యమా

తెలంగున సూక్ష్మముగా జక్కఁబడునా. జాగుసేయక త్వరపడుము – ”

“ ఓరీ ! నీకీ యుపాయ మెట్లు తట్టినదిరా ? ఇఁక నాలస్యమేల ? ”

వారాప్రకారము జులేఖాయొక్క కళేబరమును దింపి, కట్లు విప్పి వైచి రెండవశవముండు ప్రదేశమున నద్దానినుంచి, ఆ క్రొత్తపీనుగను భుజములపై నిడికొని, ఉత్సాహాధికముగా సంపుటచే నాయునేక ముల బరుగిడి, చాల దూరమేగినపిమ్మట నాశవమును యమునానది యందు బాఱవైచిరి. అనంతర మాదౌర్భాగ్యు లిర్వురు నేటొక మార్గమున నాగ్రానగరము జేరిరి. దుర్మార్గులకట్టి విపరీతబుద్ధి జనించుట కేవలము అదృష్టమే !

సర్వసుందరి యెంతటి దైన్యమునకు బాల్పడినది ! విధివిధాన మిట్టులే దురూహ్యమై విపరీతమై యుండుగదా ! భూవలయమును శాసించు నూర్జహాను యపార కృపారసతరంగ మాలికలో దేలి యాడుచు నిన్నటివఱకు ముల్లోకముల నల్లలలాడించుచుండిన జులేఖా నేడిట్టి నికృష్టావస్థకు బాల్పడుటా ! ఆమె జీవితచారిత్రమంతయు గడు విషాదకరముగనే యుండెగదా. పుట్టినదాది భోగభాగ్య ముల నోలలాడు కోమలాంగికి దుర్భరమగు వైధవ్యము, జాతిమత భ్రష్టత్వము, వైరిగృహంబున దాస్యము, క్రూర మరణ దండనము అపయశోభాజనమగు నాత్మహత్య, మరణించినపిమ్మటనైన నుచిత సంస్కారణము జరుగకపోవుటయు మఱియు నికృష్టమేగదా. హైంద వుల కంతకంటె యగౌరవము దురదృష్టము ఏమున్నది ?

రెండవశవము గుఱించి యొక్కింత దెలియవలసియున్నది. అద్దానిని గొనితెచ్చినవారలుకూడ నిర్వురే. వారు నిజముగా గట్టెలం దెచ్చు టకే పోయియుండిరి. తమ బాంధవుడు మరణించెనని విలపించు దురదృష్టవంతులు తాము తెచ్చిన శవము నోరు లపహరింతురని యెట్లెరుంగగలరు ? అనుమానమున కెడములేకుండునట్టు లా ఘాతకులు

చక్కని ఏర్పాటు లొనరించియుండుటచే వారనుమానించుట కవకాశము లేకపోయెను. వారుపాపము నిరుపేదలు. మలిన వస్త్రములే వారి దారిద్ర్యమును జాటుచుండెను. విచారగ్రస్థులై యుండిన నిరుపేద లిర్వురు చితిపేర్ప నారంభించిరి. ఇంతలో సహస్రకిరణు డుదయించెను. అంతవఱకును తమోసాగరమున మునింగియుండిన ప్రపంచమంతయు ప్రకాశవంతమాయెను. చితియుసిద్ధమాయెను. తోడనే వారాశవమును సమీపించిరి: అద్దాని నెత్తి చితిపై వైచి దహనపఱచుటయే తరువాయి. కాని, ఆకళేబరమును గాంచినంతనే వారిహృదయములు కంపించెను. ఇరువురును జెచ్చపడి "ఇదియేమి ? ఇదియేమి ?" అని హీనస్వరమున ప్రశ్నించుకొనిరి. వారికి గలిగిన భయాశ్చర్యము లింతింతగాదు. భయవిహ్వలులై వారు ప్రాణరహితమగు బొమ్మలవలె ప్రాన్పడియుండిరి. వారిలో నొకడెట్టకేలకు హృదయము నొక్కింత పదిల పఱచుకొని ప్రాణములు బిగయబట్టి యిట్లనెను. — "ఇది కాదురా."

రెండవవానికి కూడ గొంత ధైర్య మలవడెను—

"నిజమే ఇదికాదు. ఇయ్యది ఇంకొకరి మృత కళేబరము కావలయు."

"మనది యేమైనది ?"

"నే నేమి చెప్పగలను ?"

కొంతతడవు వారలిర్వురు. పిడుగుపడినట్లు చేష్ట లుడిగియుండిరి. అనంతర మొక్కడు తెగువజేసి ఇట్లనెను—"ఈ సంశయమేల ? విప్పి పరీక్షింతము."

రెండవ వాడు సంకోచించెను—"మనము కప్పినవస్త్రమిది కాదే. ఇది మిగుల మేలైనది."

"కానిమ్ము విప్పి చూతము."

అని పలుకుచు, వాఁడాకట్లు విప్పి తిలకించెను. వాని కేమి గోచరించెనోగాని, దేహము కొరడు బాఱ, కెవ్వుకెవ్వున నేక లిడుచు నిటునటు జూడక, పిక్కబలిమికొలది పరుగిడ నారంభించెను. వాని చర్యగాంచినంతనే రెండవ వాఁడును, కారణమేమో తెలియకుండుటచే కరము భయ మొంది, గడగడ వడఁకుచు, వాని వెంటనే పరుగిడెను.

## ౨౭

### పాడుదేవాలయము

జులేఖాయొక్క కళేబరమును గొంపోవుచుండిన ఘాతకుల వెనువెంట నొక్క పూరుషుఁడు పోవుచుండెగదా. ఆజానుబాహువులు వెడదయురము, దృఢశరీరము, గంభీరాకారమును జూడ నాతఁ డొకయుత్తమ సైనికోద్యోగియై యుండునని స్ఫురించును. మిగిలియుండిన కట్టు లాతఁడు పూర్తిగ విప్పివైచి, చుట్టిన వస్త్రము బాఱవైచి ఆకళేబరమును దన భుజపంజరమున నుంచికొని, చేరువనున్న చెట్టు క్రిందికి బోయెను. పితృవాత్సల్యముతో నాకళేబరము నాతఁడు పరికించెను. అనంతర మాతఁడు ఎవ్వరికొరకో నిరీక్షించువానివలె తత్తరపాటుతో నిటునటు దిలకింపదొడంగెను. పల్లకినొండు వెంట నిడుకొని చిన్నజనసమూహ మొక్కటి యాదెస నఱుదెంచుచుండెను. వారివెనుక నొక యువకుఁడు వీరపురుషోచిత వస్త్రములు ధరించి ఆయుధపాణియై అశ్వారూఢుఁడై యేతెంచుచుండెను. నిరీక్షించుచుండిన పురుషుఁడు వారిని గాంచినంతనే సంతుష్టాంతరంగుఁడై ఈల వైచినతోడనే యువకుడాశబ్దము నాలించి, గుర్తించి, వాయువేగమున సమీపించెను. పల్లకిమోయుచుండిన పదునార్గురుభటులుకూడనరుదెంచిరి. వారాపల్లకి దింపి విశ్రాంతికై చతికిలబడిరి. వారితో నేతెంచిన పురుషుఁడు వాజి డిగ్గి, తన మిత్రునకు సాహాయ్య మొసంగ, వారలిర్వురు గలసి జులేఖా

యొక్క కళేబరమును భద్రముగా పల్లకియందిడి కవాటముల బిగించిరి. తోడనే భటులు పల్లకి నెత్తుకొని, కడునిశ్శబ్దముగాను కడుజాగరూకత తోడను, పరుగుపరుగున బలాయన మొనరించిరి. గమ్యస్థానము వారె ఱింగియే యుందురు. అశ్వారూఢుఁడై యరుదెంచిన యువకుఁడుకూడ మగుడ నశ్వము నారోహించి సంరక్షకుఁడుగా వారి వెను వెంటనే బోయెను.

రెండవ వీరాగ్రేసరుఁడు పల్లకి గాన్పించువఱకు నట్టె జూచుచు నాలోచనాయత్తచిత్తుండై నిలునబడి యుండెను. పల్లకి యదృశ్యమై నంతన యీపలుకు లాతని నోటినుండి వెలువడెను—

"ఈ సింగంబులు రెండును గావించు ద్వంద్వయుద్ధమున నెవ్వరు జయింతురో చూచెదగాక" అని పలికి యమునానదీతీరము బట్టి యాతఁడు వచ్చిన మార్గమునఁబోయెను.

మధ్యాహ్నము రెండు ఝాములగు సరికి పల్లకి యొక పొలము నడుమ నుండిన పాడుదేవాలయము జేరెను. దేవళము చుట్టును ఉన్నత ప్రాకారము లుండెను. లోనికి బోవుట కొక్క ద్వారము మాత్రమే యుండెను. అయ్యది మూసి యుండుటచే నశ్వారూఢుఁడై యుండిన వీరుఁడు నేలకుఱికి దడదడ తలుపు తట్ట, లేఁబ్రాయంపు వాఁడును మనోహరాకారుఁడును నగు సన్యాసి యొక్కఁడు తలుపు తెరువ, పల్లకి తోబాటు పరివారమంతయు లోన బ్రవేశించెను. తోడనే సన్యాసి తలుపులు మరల బిగియించెను. కొంతకాలమైన పిమ్మట నేతెంచిన పరివారమంతయు నీవలకు వచ్చిరి. సైన్యాధిపతితో బాటు వారందఱు నిష్క్రమించిరి. ఆవీరుడు గోచరించునంతకాలము ఆతని వంకనె వీక్షించుచు, నాతఁడదృశ్యుఁడైనంతనే సన్యాసి లోనికేగి తలుపులు భద్రముగా బిగించెను. సర్వసుందరియొక్క కళేబర మందేయుండెను. ఆమె యెంత దురదృష్టవంతురాలు! ఆమె జీవిత మెంతదుర్భరముగ

నుండెను! మరణించిన శాంతి లేకపోయెగదా!

పల్లకినెత్తిన భటులందరును తమ తమ ప్రదేశములకు బోయిరి. రాతుమాత్రము వాయువేగమున రాజధానిదెస బోయెను. నగరము సమీపించినంతనే గమనము మందగించెను. ఆతనికై యొకఁడు నిరీక్షించుచుండెను. వానిఁ గాంచినంతనే యాశ్వికుఁడు భూమిపై లంఘించి, అశ్వమును వాని కప్పగించి, పాదచారియై నగరమువైపు బోవుచుండెను. నగరద్వారము చెంతకూడ నెవ్వరో యాతనికై నిరీక్షించుచుండెను. ఆతని గాంచినంతనే యాశ్చర్యస్వాంతముతో యువకుడిట్లనెను—"నీకై నిరీక్షించుచున్నాను. నీవింత శీఘ్రముగ నెట్లు లరుదెంచితివో మిగుల నాశ్చర్యకరముగ నున్నది!"

వాఁడు సవినయముగ నిట్లు ప్రత్యుత్తర మొసంగెను.—"దేవా! ఈయుల్పునకు గుఱ్ఱపుస్వారి యొక్కింత తెలియును."

"ఓయీ! నీకు గుఱ్ఱమెట్లు లభించెను.?"

"రాజా! పరాత్పరుఁడు దయామయుఁడై యుండ, అశ్వముల కేమికొదువ? తమ సేవకుఁడగు 'బేహారి చారన్' రసపుత్రసైనికుని పాత్ర ధరింపగలడు. ఇక గుఱ్ఱము లభించుటెంత?"

రసపుత్రవీరుడు నవ్వుచు నిట్లు ప్రశ్నించెను:

"ఎవరి యశ్వము తస్కరించితివి?"

మెల్లగ నవ్వుచు బేహారి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను:—

"రాజా! గుఱ్ఱమెవ్వరిదో నాకేల? రాజకార్యము లొనరించునపుడు అట్టి వితర్కము అనవసరమనియే నాయభిప్రాయము. అవసరమగునపుడు సార్వభౌముని యశ్వమునైనను హరింపవలసిన దే. నాకుజిక్కిన గుఱ్ఱమెవ్వరిదో యెఱుంగను కాని, నాకార్యము తీరినంతనే దానిని వదలివైచితిని. తనస్థానమున కయ్యది తప్పక చేరి యుండును."

"సరే! నీవైచిత్ర్యమటుండ, నీవిచట గోచరించుట యదృష్టము నేనిక నగరము బ్రవేశింప నవసరములేదు. నీవుపోయి దయామణి జాడ లరయుము. ఆమెను గనుగొందువేని, ఆమెను పాడుదేవాల యమునకు దీసికొనిరమ్ము. పిమ్మట—"

"రాజా! సన్యాసి నాకై మిక్కిలి తత్తరపడుచున్నాడు."

"నీవు శీఘ్రముగ బొమ్ము. కాలహరణ మొనరింపరాదు."

అని పలికి రసపుత్ర సైన్యాధిపతి గ్వాలియరు ద్వారమువైపు బోయెను. బెహారిచారను అచటనే యుండి ఆలోచనాపరుఁడై యిట్లు చింతింపదొడంగెను :—"ఆపాడు దేవాలయమునం దెన్నియో రహ స్యాద్భుతములుం దాగియున్నవి. దానితోపాటు నాజీవితమంతయు రహస్యాద్భుతములతో నిండియున్నది. దానిగుఱించి ఇపుడాలోచిం చుట, నిష్ప్రయోజనము. ఆమె యెచటనున్నదో యరయుట ప్రకృ తాంశము. ఇంతకుపూర్వమే ఆమె ప్రయాణమాయెనేని, ప్రమాదమే. కాని, ఆబాలిక యేమాయెనో? ఎచట నుండెనో? ఇరువైపులవాడిగ నుండు కైదువవంటి ఆచిన్నదానిపై నాకెంతయో ప్రేమ. ఎచట నుం డునోగదా."

దయామణి యెచటనుండునో యరయుటకై బెహారి బయల్వెడలెను. బెహారిచారను పడుచువాడుకాడు. అతని ప్రాయము అరువదేండ్లకు తక్కువగ నుండదు. కాని, ఆతని కాయము మిక్కిలి బలిష్ఠమైన దగుటచే, నాతఁడంత ప్రాయంపువాఁడని యెవ్వరు గుర్తింపఁజాలరు. వానిముందు పడుచువాండ్రు గవ్వకైనను పనికిరారు. వాని యసాధా రణయుంగపటుత్వ మట్లుండ, ఆతని తెలివితేటలు కడు విపరీతములై నవి. ఆతఁడెట్టి యాకృతినైన సులభముగా ధరింపఁగలడు. ఆతఁడొక సన్యాసివలెగాని ముసలిదానివలెగాని నటించునపుడాతని గుర్తించు టకు సాధ్యముకాదు. ఏజంతువువలెనైన నరచుటయందుగూడ నాతని

కసాధారణప్రావీణ్యము౦డెను. అదియే జీవనోపాధిగా నాతఁడు చిర కాలము పొట్టపోషించుకొనుచుండెను. బంగాళా దేశమునందలి యొక కుగ్రామ మాతని స్వస్థలము. ఆతఁడు స్వగ్రామమువీడి మొగలాయి రాజధాని కేల ఏతెంచెనో యెవ్వరెఱుంగరు. తనకు గలవిద్యచే నచట విశేషధనమార్జింపవచ్చునని భావించియుండునా? ఐనగావచ్చు. ఆతని స్వగ్రామము గుఱించిగాని, జాతిగుఱించిగాని ఆగ్రామ నగరప్రదేశ మువారెవ్వరెఱుంగరు. బలవంతుఁడగు యౌవన రసపుత్రసైనికుని వలె నాతఁడు వారికి గాన్పించుచుండెను. ఆతఁడు వంగదేశస్థుఁడని కలనైన నెఱుంగరు. సుప్రసిద్ధమగు జయపురమునుండి యేతెంచిన రస పుత్రుఁడనియే అచటి జనులెల్ల భావించుచుండిరి.

ఆతఁడు నివసించు గృహ మెయ్యదో యెవ్వ రెఱుంగరు. ఆతని కొకచోట కాపురమని చెప్పుటకుకూడ నవకాశములేదు. ఇపు డీచటను రెండు నిముషములు గడచిన పిమ్మట మఱియొకచోటను గాన్పించు చుండెను. ఆతఁ డేవిషయమునందును జొచ్చుకొనక, ఎవ్వరితోడను బ్రసంగింపక వినోదాదులయందు గాలహరణ మొనరింపక మూగివాని వలె మెలంగుచుండుటచే నాతఁ డెవ్వడోయని శంకించుటకైన నవకా శము లేకపోయెను. జంతువులవలె నఱచు దన యసాధారణకౌశల్యము గూడ నగరమున నాతఁడు ప్రదర్శింపకుండెను. ఒరుల వినోదార్థ మాతఁడు మారు వేషములు వేయుట సహితము మానివైచెను. అట్టి బెహారి యుదరపోషణ మెట్లొనరించుచుండెనో యెవ్వ రెఱుంగరు. కాని ఆతఁడు లేమి నెఱుంగడు. తాను లేమి నెఱుంగకుండుటయే గాక, పేదల కప్పుడప్పుడు ధనసాహాయ్యముగూడ నొనరించుచుండెను.

మొగలాయి రాజధాని యగు నాగ్రానగరమున కనుదినము పెక్కండ్రు రసపుత్రసైనికు లేతెంచుచుండిరి. నగరమునుండి యనేకులు వెడలుచుండిరి. కొంత రసపుత్రసైన్య మచట శాశ్వతముగా నిలిచి

యుండెను. మేము వ్రాయుచున్న కాలము మిక్కిలి యల్లకల్లోలముగ నుండెనని పాఠకు లెఱుంగుదురుగదా. నగర మంతయు తుఫాను సమయమునందలి సముద్రమువలె ఘూర్ణిల్లుచు నుండెను. యుద్ధము గుఱించియే జను లెల్లప్పుడు చెప్పుకొనుచుండిరి. అనుదినము పెక్కు పటాలము లేతెంచుటయు, అనేక పటాలములు నగరమునుండి వెడలుటయు సర్వసాధారణ మాయెను. నేఁడు పదివేల సైన్యమున కధినాథుఁడగు మన్సబ్దారు యొకఁడు సైన్యసమేతుఁడై యరుదెంచును. వేఱొకఁ డాతఁడు సైన్యముతోబాటు ఢిల్లీనగరమున కేగును. మఱునాఁ డాతఁడు కాశ్మీరదేశమునందలి తిరుగుబాటు నణచివేయుటకై వెడలును. అనంతర మాతఁడు రాజద్రోహులను శిక్షించుటకై బంగాళా దేశమున కేగును. పఠానులును అశ్వికదళమును గలసి పాతిక వేలసంఖ్యగల మహాసైన్యముతో సుప్రసిద్ధ సైన్యాధిపతి యగు మహాబతుఖాను ప్రాయికముగా నాగ్రానగరమున కేతెంచుచుండెను. మహాబతుఖాను మహమ్మదీయుఁడైనను, ఆతని యభిమాన మంతయు హైందవులమీఁదనే యుండెను. కర్మవశమున నాతఁడు మతేతరుఁ డాయెఁగాని నిజముగ నాతఁడు మేవారు వంశోద్భవుఁడగు రాజకుమారుఁడే గదా. కావున, ఆతఁడు హైందవుఁ డనియే చెప్పవలయును. సదా హైందవుల సహాయ మాతఁ డారయుచుండెను. వారి లాభక్షేమములకై యాతఁ డెంతయు బాటుపడుచుండెను. రాజపుత్రు లందఱు నాతని దమ నాయకునిగా బరిగణించుచు ప్రేమించుచుండిరి. రాజపుత్రుల సాహాయ్యము చేతనే, యాతఁడు రణవ్యాపార పారంగతుఁ డగు మహావీరుఁడని యఖండ విఖ్యాతి గాంచెను. వారి సాహాయ్యముచేతనే యాతఁడు మేటి మొగలాయిసైన్యములకు సర్వసైన్యాధిపతి కాఁగలిగెను. వారిసాహాయ్యము చేతనే యాతఁడు ఒకానొక సమయమున సార్వభౌమునిసహితము చెఱబెట్టఁగలిగెను. అట్టి మహావీరుని సైనికు లెల్లరు తండ్రికంటె మిన్నగ

ప్రేమించుచు, ఆతనికై ప్రాణములనైన నర్పింప సంసిద్ధులై యుండిరి.

అట్టి మహాసందడిలో బెహారీ నిగూఢముగా ప్రవర్తింపఁ గలుగుట యాశ్చర్యకరము గాదు. రసపుత్రవేషము ధరించువారలెల్లరు నిర్భయముగ సంచరింపవచ్చును. వారిని వారించువా రెవ్వరు నుండరు. రసపుత్రుల కంతే పలుకుబడియు నంత గౌరవమును నుండెను. కావుననే బెహారీ రసపుత్రసైనికుని వేషమున మెలంగుచుండెను. వారి భాషయు వారి యాసయు గూడ వానికి పట్టువడెను. ఏకారణముచేతనో ఎట్టి కార్య మొనరింపదలంచియోగాని యాతఁడు నగరమున దన దేశస్థులనేకులుండినను, ఆదెస బోవుటయైన మానివైచెను. బెహారీ చారన్ యను వంగీయుఁ డానగరమున నుండెననియే వారెఱుంగరు.

బెహారీ యెల్లప్పుడు రసపుత్రవేషమే ధరించుటలేదు. ఫతేపూరు సిక్రీనగరమున నుండిన సన్యాసివద్ద నీతఁడు వంటపుట్టిగా మెలంగిన విషయమును పాఠకు లెఱింగియే యుందురు. ఆ సన్యాసి యిపు డెచట నున్నాడో? జులేఖాయొక్క కళేబరమునకై బెహారీ యంత తాపత్రయ పడుటకు కారణ మేమో?

దయామణి జాడ లరయుట బెహారీ ప్రస్తుత కర్తవ్యము గదా. అతఁడు సూటిగా ఆగ్రా చౌకునకు బోయెను. అందొక తమలపాకుల దుకాణ మొకటి యుండెను. ఆ దుకాణపు యజమాని యొక స్త్రీ. ఆమె పేరు గంగ. ఆమె ప్రాయము సుమారు నలుబదియేండ్లు. ఐనను మిసమిసలాడుచు, మరులు గొలుపుచు సరససల్లాపముల పిన్న పెద్దల నాకర్షించుచు వ్యాపారము చేయుచుండిన గంగను ఎఱుంగనివారు ఆగ్రానగరమున నుండరు. నగరమునందలి పెద్ద పెద్ద వంశజు లెల్లరు నామెవద్దనే తమలపాకులను గొనుచుండిరి. జమీందారులు, రాజులు, ఖానులు, ఉమ్రావులు మొదలగు గౌరవనీయుల గృహంబుల కామె టంజనుపై నెక్కి పోవుచు వారి వారికి వలయు తాంబూలపు సామానుల

నొసంగుచుండెను. మంచి ముత్యములతో తయారుచేసిన సున్నము, ప్రశస్తమగు కస్తూరి, పరిశుభ్రమగు పచ్చకర్పూరము, దోషము లేని కుంకుమపువ్వు మొదలగు మేలైన సుగంధద్రవ్యములతో తయారుచేయు తాంబూలమున కామె యొక మోహారీ వసూలు చేయుచుండెను. ఆమె విక్రయించు పదార్థములు గొనుట మిగుల గౌరవమనియు, కొనకుండుట యగౌరవమనియు జనులు భావించుచుండిరి. ఆ కారణమున నగరమునందలి భాగ్యవంతులందఱిని యామె యాకర్షించెను. నగరమువలె నుండి బీగము మహాలుకు కూడ గంగయే పాహాలు కారు. అట్టి యగ్రస్థానము నాక్రమించిన గంగకు గౌరవమునకును పలుకుబడకేని ఏమి కొదువ? భాగ్యమున కేమికొదువ? టజ్జును యొక్కట యొక్క లెక్కా?

ఆమె పూర్వచరిత్ర మెవ్వరెఱుంగరు. అక్బరుకాలమున మిక్కిలి ఘనతగాంచిన మాన్సింగుతో నేతెంచిన పరిచారికలలో నామె యొక్కతె యని కొందఱు మాత్ర మెఱుంగుదురు. మాన్సింగు మహారాజు మరణించిన యనంతరమామె తమలపాకుల వ్యాపారము ప్రారంభించి ఖ్యాతిగాంచెను. ఎవ్వరిని దూషింపక నిరసింపక, కొలది వారినైన గౌరవించుచు, పెద్దలముందఱ దన యాత్మగౌరవము నిలుపుకొనుచు, సమయోచితముగ బ్రవర్తింపుచు, తన మాట నేర్పరితనముచే నెల్లరిని రంజింపజేయుచు ఆగ్రానగరమున గంగ హాయిగ కాలము గడుపుచుండెను.

## ౨౦

### తమలపాకులగంగ

అంగడిలో నొక సోఫాపై గంగ ఆసీనురాలై యుండెను. రకరకముల జనులు పెక్కండ్రచ్చటి కరుదెంచు చుండిరి. రాజధానికంతయు

నొక్కటే యంగడియా యనునట్లు జనులు తండోపతండములుగా నేతెంచు చుండిరి. వక్కలు కత్తిరించు వారు కొందఱు, ఆకులను శుభ్ర పరుచువారుకొందరు, సున్నముద్రాయువారుకొందఱు, సుగంధద్రవ్య ములను సద్దుబాటు చేయువారు కొందఱు, తాంబూలములు వేర్వే రుగా సమర్చువారు కొందరు, తమలపాకులకై ప్రత్యేకముగా వచ్చు వారి కందిచ్చువారు కొందఱు—ఇట్టులనేకులు యంత్రములోనుండు మరలవలె నంగడిలో నెవ్వరిపనులు వారు నిర్వర్తించుకొను చుండిరి. వారి నందఱిని గనిపెట్టుటయేగాక, తన యంగడి కరుదేరువారి నందఱి నుచితరీతిని పలుకరించుచు, మర్యాదనొసంగుచు, మర్యాదవడయుచు గంగ యంగడియందుండెను. ఆమెకుగల ఓర్పు నేర్పు మర్యాదయు వర్ణనాతీతములు. ఆమె మాటలతోపాటు వెండిబంగారు నాణెములు మ్రోగుచునే యుండెను.

అట్టి మహాసందడిలో బెహారీచారన్ యేతెంచెను. వానినిగాంచి నంతనే గంగ ప్రసంగ ప్రవాహమొక్కింత క్షణకాలము కట్టువడెను. తోడనే తనసేవకునొకని జీరి యిట్లు లనెను.—"మనసింగుగారికొక యాసనము నమర్చుము."

బెహారీ—"కూర్చుండుటకు వేళలేదు. నేను వేఱొక కార్యము మీద పోవలయు. ఈమర్యాదల కేమిగాని, తమలపాకుల పడవ వచ్చినదా?"

గంగ—"పడవవేళకే వచ్చినది. కాని, అందలి సామానులు మాత్రము పాతవి. కావున కొంత చెడిపోయినవి సుమా"

"సర్కారు ఉద్యోగులు నిషేధింపలేదా!"

"లేదు. కొంతదూరము వారువెంబడించిరి. కానిసామగ్రి గంగది యని తెలియవచ్చుటచే కాబోలు వారువెనుకకు మఱలిరి."

తాము మాటాడు మాటలెవ్వరైన వినుచున్నారేమోయని

బెహారీ నలుదెసల బరికించెను. గంగమాత్రము నలుగురితో మాట్లా డునట్టులే యథాలాపముగనే ప్రసంగించుచుండెను. ఆగ్రానగరము నందలి చౌకుబజారునందు లక్షలకొలదిజనులు నానారాష్ట్రములనుండి యేగాక భూవలయమునందలి సమస్తదేశములనుండియు తండోపతండ ములుగ నరుదెంచి వ్యాపారమొనరించుచుందురు. అట్టి ప్రదేశమున జనసమూహము నదీప్రవాహమువలె యవిచ్ఛిన్నముగ బ్రవహించు చుండును. ఆసమయమున జెలరేగు కోలాహలము పర్వకాలపు సముద్రము ఘోషను మీఱియుండును. అట్టిసమయమున, తమ ప్రసంగము నెవ్వరైన వినుచుండిరేమో యరయగోరిన బెహారీ విఫల మనోరథుడాయెను. తుదకాతడిట్లు భద్రముగ బలికెను— "మన ప్రసంగము నెవ్వరు వినుటలేదుగదా."

మందహాసమొనరించుచు గంగ యిట్టులనెను. — "ఎవరెట్టుపోయిన పోనిమ్ము, నాకేమి?"

"వెంటనే పంపివేయరాదా? వారు మఱల రావచ్చును."

"ఆకార్యమప్పుడే తీరినది." అనిగర్వముగ గంగ బదులిడెను.

బెహారీ ఆశ్చర్యస్వాంతుడాయెను.— "ఏమీకార్యమైపోయినదా!"

"సింగుగారూ! చెడిపోయిన సామగ్రిని నేనుంచుదాననుగాను. కావున, పనియైనది."

"దాని నెక్కడికి పంపితివో చెప్పగలవా?"

"యమునానదియందు పారవైచితిని. చెడిపోయిన వస్తువులకదియే గదా స్థానము?"

బెహారీ నివ్వెరపడి గంగ మోమునే దిలకించుచుండెను. గంగ మాత్ర మెప్పటియట్లు తన యంగడికేతెంచువారలతో మందహాస మొనరించుచు బ్రసంగింపగడంగెను. బెహారీతో మాట్లాడునపుడు సహితము ఆమె యితరులతో గూడ ముచ్చటించుచునే యుండెను.

తమతో మాట్లాడునట్టులే బెహారీతో గూడ మాట్లాడుచుండెననియే వారందరు భావించిరి కాని అన్యథా తలంపలేదు. బెహారీ మాత్రము జరిగిన యుదంతమంతయు నెఱింగింపవలయునని తత్తరపడుచుండెను. ప్రసంగవశమున దయామణి వృత్తాంత మొకింత తెలిసెను. కాని గంగతో రహస్యముగ సంభాషించుట యవసరమైయుండెను. వారు రహస్యముగ ముచ్చటించిన గాని యనంతర కర్తవ్యము స్థిరపడజాలదు. అట్టియవకాశ మెప్పుడు చిక్కునో యని స్వాతివానికై వేచియుండెడి ముత్తెపుచిప్పవలె నాతడు నిరీక్షించుచుండెను. సముద్రతరంగమువలె నొకరివెనుక నొకరు యేతెంచుచుండ సమయమెట్లు చిక్కును? తాళు కొలది జనసమూహ మధిక మగుచుండెను. గంగ వానివైపు జూచుటయే లేదు.

ఒక్కింత తెరిపిగ నుండినపుడు గంగ యిట్లనెను — "సింగుగారూ! జాబులోనున్న ప్రకారము అక్షరాల జరిగినది. మీరు కంగారు పడ నక్కరలేదు —"

అంతలో నెవ్వరో యేతెంచుటచే బెహారీతో నిక ప్రసంగించుటకు గంగ కవకాశము లేకపోయెను. బెహారీ యవస్థ మఱల విషమమాయెను. దయామణి గుఱించి కొంతసమాచారము మాత్రము తెలిసెను. ఆమె గృహమునకు దయామణి వచ్చెననియు, మార్గమధ్యమున నామె నెవ్వరో వెంబడించిరనియు, గంగకుగల పలుకుఁబడి కారణమున కాబోలు వారివలన ప్రమాదమేమియు సంభవింపలేదనియు నాతఁడు గ్రహింపగలిగెను. జులేఖా వ్రాసిన జాబు గంగకు జేరెననియు, ఆప్రకారము ఆమె దయామణిని ఆగ్రానగరమునుండి తప్పించెననియు గూడ బెహారీ యెఱుంగగలిగెను. కాని, ఆతఁడంతటితో సంతసించువాఁడు కాడు. జులేఖాయొక్క సామగ్రి నంతయు దయామణి తరలించుకొని పోయెగదా. ఆవిషయము నూర్జహానునకు దెలియకపోదు.

తెలియునంతనే, గొప్ప మోసము జరిగెనని యెంచి, తద్రహస్యమును భేదింపవలయునని సంకల్పించి దయామణి జాడదీసి ఆమెను బట్టుకొనుటకై నూర్జహాను గూఢచారులను నియోగింపదా? సామ్రాజ్యమును శాసించు నూర్జహాను సంకల్పించునపుడు దయామణికి దిక్కెక్కడ? యమునివలె బాలించు మహారాణి జులేఖాతోడి సంబంధముగలవారి నందఱిని బట్టి బంధింపదా? సోదరివలె సాకుచుండిన జులేఖాకే మరణశిక్ష విధించినపుడు తక్కుంగలవారు ఒక లెక్కా? దయామణి పట్టువడునేని వధింపఁబడుట తథ్యమే గదా! — అని బెహారీ చింతింప దొడంగెను.

పరిస్థితు లింత ప్రమాదకరముగ నున్నవని గంగ యెఱుంగదేమో! జులేఖాయొక్క సామగ్రితో దయామణి గంగవద్దకు నేతెంచెగదా! దయామణి నెవ్వరో వెన్నాడుచుండిరిగదా! అంతలో ప్రమాదము సంభవింపకపోయినను, నూర్జహాను కాసమాచారము తెలియకుండునా? తెలిసినపిమ్మట గంగగతి యేమి కావలయు? బుద్ధిమంతురాలగు గంగ ఆపాటి యెఱుంగదా? జులేఖాయొక్క మరణము గుఱించి ఆమె యెఱుంగునో లేదో! — అని బెహారీ మఱల చింతింప దొడంగెను. వేళ యతిక్రమించుకొలది వాని తొట్రుపాటు యధికమగుచుండెను. అంత, తనయంగడికేతెంచిన పెద్దమనుష్యులతో సంభాషించుచుండిన గంగ బెహారీ నుద్దేశించి యిట్లనెను — "సింగుగారూ! మఱియొక తాంబూలము నందుకొనుఁడు. ఈమధ్య మీరు పంపుచున్న తమలపాకులు మిగుల ప్రశస్తమైనవి. మా కాతాదారు లందఱు మిక్కిలి సంతసించుచున్నారు మీకు వందనములు." అనంతర మామె యంగడిలో నుండినవారి దెస తిరిగి యిట్లనెను — "ఈసింగుగారే నాకు సామాను లంపుదురు. వారి సాహాయ్యముచేతనే నా వ్యాపార మింతగా సాగుచున్నది,"

"అటులనా?" అని కొందఱు పలికిరి. కొందఱాతని రసపుత్ర వస్త్రాదులను పరికింపఁ గడంగిరి. ఆ సమూహములోని ముసల్మానులొకఁడు వెటకారముగా నిట్లు పలికెను — "మేవారు దేశస్థులు నిద్రయందైనను వర్తకము సంగతి మఱువరు గదా! ఈసింగుగారు వేషమున మాత్రము సైనికులుగాని అసలు తమలపాకుల వ్యాపారస్థులే!"

ఆ మహమ్మదీయుఁ డట్లు పలికినంతనే యందఱు ఘొల్లుమని నవ్విరి. గంగకూడ నవ్వుచు నిట్లు ప్రత్యుత్తర మొసంగెను — "మేము వ్యవహారస్థులమే. మేము కాలము వ్యర్థపుచ్చఁజాలము. ఇంటఁగూర్చుండి యనుభవించుటకు నాయార్జన చాలదా? ఐనను, నేను వ్యాపారము మానఁజాలను."

తోడనే యందరు ఘొల్లుఘొల్లున నవ్విరి. అదేసమయమున యొంచి బెహారీ మెల్లఁగ నిట్లు పలికెను — "గంగ బీబీ! నీకొక విచారకరమగు వార్త నెఱింగింపవలయు. తమలపాకుల వ్యాపారములో నారితేఱిన మనవాఁడు నిన్ననే మరణించెను సుమా."

పిడుగులు పడినను చలింపని గంగహృదయము తోడనే కంపించెను. కలకల లాడు సుందరవదనారవిందము కళావిహీనమాయెను. ముఖమందుండు నిరంతరము తూగాడు మందహాసము మాయమాయెను. మిక్కిలి తొట్రుపాటు సూచించు హీనస్వరముతో గంగ యిట్లు ప్రశ్నించెను — "ఏమి మిత్రమా? నీవు చెప్పినదేమి?" ఆమె బెహారీ మీదనే నిలిచియుండెను.

బెహారీ: "చెప్పుట కేమున్నది? మన తమలపాకుల మిత్రుడు మరణించెను."

బెహారీయొక్క భావమును గంగ గుర్తించెను. ఆకారణముచేతనే గంగ వెలవెలబోయి బెహారీవంకనే తిలకింపదొడంగెను. ఆమెకు గలిగిన హృదయతాపమును వర్ణించుటకు వీలులేదు. ఆమెకు గొప్ప

కష్టము ప్రాప్తించియుండునని యంగడియందుండిన వారందరుగు ర్తించి మిన్నకుండిరి. మిక్కిలి యల్లకల్లోలముగా నుండిన యంగడియంతయు గడు నిశ్శబ్దమాయెను. ఆవిషయమును గంగయు గుర్తించెను. యుక్తాయుక్తము లెఱింగిన ప్రౌఢయగుటచే నామె శీఘ్రముగ తెలివి తెచ్చుకొని, సమయోచితముగ నిట్లు విలపించెను— "ఎంతకష్టము ఎంతకష్టము! సామగ్రికై వానికి చాలధనము పంపియుంటిని. ఇక నావ్యాపార మెట్లుసాగును?" తోడనే, అందరును విచారగ్రస్థులైరి. అంతటివెనుకటి మహమ్మదీయుడిట్లు యోదార్చెను.—"బీబీ! నీవిట్లు విలపింపనేల? వ్యాపారముపట్ల కష్టనష్టములు గాకుండునా? మఱియు నీవు విశేషధనమార్జించి యుందువే ఈకష్టమొక్క లెక్కా? నీ వో మిట్లు హఠాత్తుగ వెల్లబొరుట గాంచి నీతండ్రియో కుమారుడో మరణించెనని భావించితిమి. ఇంతవిచారము గలిగించిన ధననష్టమెంత యో యెఱింగింపుము. ధనముపై నింత మోహము తగదుసుమా!"

ఆమహమ్మదీయుడట్లు పలికినంతనే యందఱు పక పకనవ్విరి. లేని నవ్వు దెచ్చుకొని గంగ నెల్లగ నిట్లు పలికెను—

"ఖాన్‌సాహేబ్! ధనార్జన మెంతకష్టమో నీవెఱుంగవు. పువ్వు పువ్వున కెగురుచు తేనెగూర్చు తేనెటీగవలె నష్ట కష్టముల కోర్చి ధనమార్జించు మాభోంట్లకు ధనము ప్రాణముకాదా? మీవంటి యాగర్భ శ్రీమంతులకు మాకష్టము లెట్లు తెలియును! అయ్యలారా! నష్టపోయి పలికినపలుకులకు గినియకుడు. నాకుగలిగినకష్టమెంతయో సవిస్తరముగా నెఱుంగవలయు. ఈ సింగుతో ముచ్చటించిన గాని తెలియదు. క్షమింపుడు. పోయివచ్చెద."

అని పలుకుచు గంగ లోనికి బోయెను. అట్టి యవకాశమునకే తత్తరపాటుతో నిరీక్షించుచుండిన బెహారీ యామె వెంటబోయెను. వ్యాపారముమాత్రము యథాప్రకారము సాగుచుండెను.

బెహారీ గంగలిర్వురు నౌకనదిలో నాసీనులైరి. బెహారీ ప్రవేశించిన౦తనే యామె తలుపు బిగించెను. ఒక గడియకాలము వారెద్దియో రహస్యముగ బ్రసంగించిరి. పిమ్మట, బెహారీ యావలకు వచ్చి, సముద్రమువలె నుండిన జనసమూహములో జొచ్చి యదృశ్యుఁడాయెను. పిమ్మట, గంగకూడ ఈవలకు వచ్చెను. "నా మనసేమియు బాగుగ లేదు. నేనిక గృహమునకు బోయి విశ్రమింపవలయు, నేను వచ్చువఱకు మీరు వ్యాపారమును చక్కఁగ సాగింపుఁడు. సాయంత్రములోపునే బహుశా రాగలరు," అని అంగడియందుండిన తన సేవకులతో బలికి, అప్పటికి వసూలయిన ధనమంతయు జేతపట్టుకొని గుఱ్ఱపుబండి నారోహించి, మహాసముద్రమువలె నుండిన జనసమూహమున
బండి నారోహించి, మహాసముద్రమువలె నుండిన జనసమూహమున
బడి బెహారీవలెనే గంగయు నదృశ్యురాలాయెను.

గంగ ఉత్తరవృత్తాంత మెవ్వరెఱుంగరు. ఆమె తిరిగి యంగడికి రాలేదు. సాయంకాలము రాకుండుటచే నామె సేవకులందఱు నామె గృహమునకు బోయిరి. ఆగృహమునందెవ్వరు లేరు. గంగయు, లేదు. తెల్లవారినపిమ్మట నగరమంతయు నదియే ప్రశంస, "గంగ ఏమాయె ? గంగ ఏమాయె ?" అని ప్రశ్నించువారలేకాని సమాధానమొసంగువాఁడొక్కఁడును లేడు. ఆమెకు బండికట్టిన బండివాఁడు సహితము కానరాకుండెను. జనులు పరిపరి విధముల ననుమానింపదొడంగిరి. కాని, గంగ జాడ లేశమైనను దెలియలేదు.

## ౨౬

### ఆగ్రానగరమునందు కలవరము

ఆగ్రానగరవాసులెల్లరు ఏలకో మిక్కిలి కలవరపడజొచ్చిరి. పెను భూతమును గాంచినట్టులు వారందఱు భయవిహ్వలులైరి. ఎద్దియో

మహోపద్రవము సంభవింపనున్నటులు ఎక్కడజూచిన గుసగుసలే కాని మాటాడుటకునైన సాహసించజాలకుండిరి. నిత్యకృత్యములైన సరిగా నిర్వర్తించుట మానివైచిరి. జనసామాన్యమునకేగాక పెద్దవారలకు గూడ నదియే యవస్థ. ప్రపంచమునందలి జాతుల నన్నింటి నాకర్షించుచు మహాతీర్థమువలె కలకలలాడు బజారుసహితము కళావిహీనమై యుండెను. కోట్లకొలది జరుగు వ్యాపారమంతయు కట్టువడెను. ఒక్క యాగ్రానగరమేగాక అక్కడనుండి ఢిల్లీవరకు గల ప్రదేశమంతయు నట్టి యవస్థకే పాల్పడెను.

ఢిల్లీనగరమునందలి దారుణ ప్రదర్శనముల గుఱించి పాఠకు లెఱింగియే యున్నారుగదా. సద్వంశ సంజాతులగు రాజకుమారులను దారుణముగ వధించి, మృతకళేబరముల వస్త్రములను హరించి ఢిల్లీనగర సింహద్వారమున నత్యద్భుతముగను అతి రహస్యముగను నెవ్వరో ప్రదర్శించుచుండిరిగదా. ఆకారణముననే యాదేశమునందలి జను లందఱు మిక్కిలి కలవరపడుచుండిరి. నిర్జనప్రదేశమగు సిక్రీనగరమునందలి పైశాచకృత్యములు వినుటచే వారి కలవరము ద్విగుణీకృతమాయెను. వీనికి దోడు, గ్వాలియరు దుర్గమున బంధింపఁబడిన రాజకుమారుఁడు — ఖుస్రూ — తప్పించుకొని పారిపోయె ననెడు వార్త యొకటి పిడుగువలె నేతెంచెను. విడబడిన ఖుస్రూ యుద్ధసన్నద్ధుఁడు కావచ్చును. తోడనే, వదంతి వివిధ రూపములు ధరించి గోరంతలు కొండంతలు చేయుచు జనులను భయవిహ్వలుల నొనరించెను.

సిక్రీనగరమునుండి దారుణమగు వార్త యొకటి యరుదెంచెను. అచట నసంఖ్యాకములగు దయ్యము లున్నవనియు, ధైర్యవంతులని పేరుగాంచిన రసపుత్ర సైనికులు వానికి వెఱచి అచట నిలువజాలక పోయిరనియు, ఆకారణమున, జగదైకవీరుఁడని వన్నెజెందిన అజితసింగు తత్ప్రాంతము వీడి దూరమున విడిసియుండెననియు గూడ

జనులకు దెలియవచ్చెను. ఆగ్రానగరమునందుండిన యాలీని సైనికులందఱు రయమున బోయి ఆతని గలిసికొనిరి.

సిక్రీనగరమునందలి రహస్యమును భేదించుటకై నియోగింపబడిన అజితసింహుని ప్రయత్నము లాతెఱంగున వ్యర్థము లగుటచే, తత్కార్య నిర్వాహణమునకై సుప్రసిద్ధ రసపుత్ర సైన్యాధిపతి యగు అనిలసింగు నియోగింపబడెను. ఆతఁడు నిజముగ ధైర్యసాహసములు గల మహావీరుఁడేగాని, సిక్రీనగరమునకు బోవుటకు మాత్రము సాహసము చాలినది కాదు. కావున, ఆతఁడు మార్గమధ్యమున నొక శిబిరము నేర్పఱచికొని, కాలహరణ మొనరింపదొడంగెను.

అనిలసింహుని ప్రవర్తనము నెఱింగినంతనే జహాంగీరు పాదుషా కుపితుఁడాయెను. పాదుషా మాట కేమిగాని నూర్జహానునకు జనించిన యాగ్రహమునకు హద్దులేదు. సామ్రాజ్యము నంతయు నామెయే శాసించుచుండెగదా. మహావీరులని వన్నెగాంచిన రసపుత్ర నృపాలు లీతెరంగున పిఱికిపందలగుదురని ఆమె కలనైన దలంపలేదు! వారిపై గల విశ్వాసము నాటితో దొలంగెను, మహమ్మదీయ సైన్యాధిపతుల వలననే కార్యము చక్కబడవలయునని ఆమె భావించెను. తోడనే సుప్రసిద్ధ మహమ్మదీయ సైన్యాధిపతులను రావించి, విషయము నెఱింగించి, తత్క్షణము సైన్యసమేతులై సిక్రీనగరమునకేగవలయునని ఆజ్ఞాపించెను. మహమ్మదీయ సైన్యాధిపతులు తోడనే చెవులు మూసుకొని, భయభ్రాంతులై, అతిదైన్యముగ నిట్లు విన్నవించుకొనిరి — "బీగము సాహెబా! క్షమింపవలయును. ఎట్టి భయంకర శాత్రవునైన త్రుటిలో పరాభవింపగలము. కాని దయ్యములతో బోరాడుట మాతరమా? మఱి యెట్టికార్యమునకైన నియోగింపుడు. మన్నింపుడు."

నూర్జహానుయొక్క యవస్థ నెట్లు వర్ణింపగలము? సామ్రాజ్యమును శాసించు మహారాణి యాజ్ఞ నెవ్వరు మన్నింపరైరి. హైందవ మహా

మ్మదీయ సైన్యాధిపతు లందరు దయ్యములని వెఱచి వెనుదీసిన-చో కార్యము నెరవేఱుటెట్లు? ఒక కార్యము దలపెట్టునపుడు నడుమ నెన్ని విఘ్నములు వచ్చినను ఆమె సైరింపజాలదు. ఆమె సోదరుఁడగు 'ఆసఫ్ ఖాను' యొకఅమాత్యుఁడై యుండెను. అతని రావించి, నూర్జహాను యిట్లు పలికెను. —"నాయనుంగు సోదరుఁడా! నిన్నొక కార్యార్థము రావించితి. ఈమధ్య జరుగు వైపరీత్యములను నీవుకూడ గమనించు చున్నావుగదా. యశోభరితమగు మొగలాయి సామ్రాజ్యమును విచ్ఛిన్నమొనరించుటకై హైందవులందరు కుట్రలు సలుపుచున్నారని నాకువిశదమైనది. వారిదుష్ప్రయత్నములకు సిక్రీనగరము కేంద్రస్థలము. ఇకనైన మనదుర్మార్గుల నడంపకున్న ప్రమాదము నాటిల్లు. నాకేదియు దోపక నిన్ను రావించితి. సోదరా! నాచిన్నపనిపాలింపుము. వలయు సైన్యము దీసుకొని, అతిరయమున సిక్రీనగరముపై దాడి వెడలి తద్ర హస్యమును భేదింపుము. నీవు కృతకృత్యుఁడవైన నిమ్మట నా దురాత్మ ర్గులను నీ యిచ్చకు వచ్చుతెఱంగున శిక్షించుతువుగాక. వట్టి యాడంబ రమే గాని రసపుత్రులు పౌరుషహీనులు వారి శౌర్యాగ్ని చల్లారినది. సమర్థుఁడగు మహమ్మదీయ సైన్యాధిపతి యొక్కఁడైన లేకుంట కరము విచారకరము. కావుననే, సోదరా! ఈకార్యభారము నీపై వైచితి."

మోమువాల్చి ఆసఫ్ఖాను మెల్లగ నిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "పాదుషాబీగమా! సోదరీ! నన్నిట్టి కార్యములకు నియోగింపదగునా? కృపాయత్తచిత్తవగు నీకటాక్షముచే నేను ధన్యుఁడనైతి. ఇంటనుండి ప్రభుత్వకార్యములను నిర్వర్తించుటయేగాని, రణరంగ మెన్నఁడుఁగని నేనిట్టి మహాత్కార్యభారము నెట్లు వహింపగలను? మఱియు, దయ్య ములతో బోరాడుటకు మానవుడే పాటివాడు? సోదరీ! క్షమింపుము."

అతఁడట్లు పలికినంతనే, నూర్జహానుడెందము చిన్నబోయెను. ఆగ్రహ మధికమాయెను. తత్సమీపముననే జహంగీరు చిత్తుగ సురాపాన

మొనరించి ముఖమలు సోఫాపై సుఖాసీనుఁడై యుండెను. ఆతనిశరీర పటుత్వ మెట్టిదోగాని, ఎంతత్రాగినను మఱుపెఱుంగఁడు. సోదరీ సోదరుల సంభాషణ మాత్ర మాలించుచునే యుండెను. ఆసఫ్‌ఖాను యిట్లు పలికినంతనే యాతఁడు పకపక నవ్వెను. ఆసఫ్‌ఖాను సహితము వెనుదీయుటచే నుపాయాంతర మెద్దియో యని గాఢముగ విచారించుచుండిన నూర్జహాను పాదుషా యిట్లు నవ్వినంతనే దండతాడితభుజంగమువలె నాగ్రహాపరవశయై తేఱిపాఱఁ జూచి యిట్లనియె. — "పాదుషా సాహేబా! మీరిట్లు లవమానించుట తగదు. నా సోదరుని పిరికితనము గాంచి మీరు నవ్వినను నవ్వవచ్చుగాని, నేనట్లు లాచరింపఁజాలను. పరిహాసమున కిది సమయమా? ఒక్కమాట చెప్పెద, గమనింపుడు. నేను లేకున్న హైందవప్రభువులు గలిసి మిమ్మీపాటికే రాజ్యభ్రష్టు నొనరించియుందురు."

కుపితస్వాంతయై మహారాణి యిట్లు పలికినను సార్వభౌముఁ డించుకేనియు బాటింపక ఇట్లు పలికెను — "ప్రేయసీ! నీవు చెప్పినదంతయు సత్యము. ఈ మహాసామ్రాజ్యము నేఁడు కేవలము నీ బాహుచాతుర్యము మీఁదనే యాధారపడి యున్నదని స్పష్టముగఁ దుదకు పసిపాప సహితము గుర్తించుచుండ నేనట్లు కాదనఁగలను? సుందరీ! మనకీ వివాదమేల? ఇట్టి గట్టి యనుమానములు నిన్ను బాధింపనేల? ఇపుడు కర్తవ్యమెద్దియో యెఱింగించెద నాకర్ణింపుము. మన మీపురము గలసి తత్ప్రాంతమున కేగుటయే తగినోపాయము. సుందరీ! భువనైకసుందరివగు నీ ప్రాపు గాంచి ధన్యుఁడనైతి. రంభాసంభోగమును నిరసించు సంభోగార్ణవతరంగములలో నిరంతరము దేలియాడు జహాంగీరు స్వర్గీయసౌఖ్యము నిక్కడనే యనుభవించుచున్నాఁడు. —"

ధ్యానైకచిత్తయై యున్న నూర్జహాను యాగ్రహ మధికమాయెను. "మీరు చెప్పినదేమి? ఔను. నేనే ప్రమాణము కావలయు. ఇట్టి

మహాసంకట సమయమున రాజ్యతంత్రమును త్రిప్పు సామర్థ్యముగల పురుషుఁడొక్కఁడు కానరాకుండెగా! పాదుషా సాహేబా! నేనే పోవలయు. ఈ సామ్రాజ్యమును నేనే రక్షింపజాలుదు. మఱియొకరికి సాధ్యముకాదు."

మందహాస మొనరించుచు జహాంగీరు యిట్లు మాఱుపలికెను. — "దేవీ! నీరాకకతంబున సిక్రీనగరము పవిత్రమగును. నీ వేగునంతనే యచటి పిశాచములన్నియు నీపాదపద్మములపై వ్రాలి జోహారు లొనరించును."

పాదుషాయొక్క సరసల్లాపములకు ప్రత్యుత్తర మొసంగక యే నిజసోదర నుద్దేసించి నూర్జహాను యిట్లు లాజ్ఞాపించెను — "నీవు రయమునబోయిమన సైన్యాధిపతులనెల్లదమతమసైన్యవిభాగములతో తత్క్షణము దాడివెడలుటకు సిద్ధముగా నుండవలయునని యెఱింగింపుము. స్వయముగా మేముకూడ తత్ప్రాంతమున కేతెంచు వారము."

సిక్రీనగరమునందలి దయ్యములను రూపుమాపుటకై రాజదంపతు లిర్వురు ప్రయాణ మొనరింప నున్నారని జనుల కెట్టులో తెలిసి పోయెను. అచటి దయ్యముల గుఱించిన సమాచారములను జనులు వేయివిధంబుల జెప్పుకొన జొచ్చిరి. ఒకరు చెప్పు విధము నింకొకరు చెప్పుటలేదు. ఒక నోటినుండి వెలువడు వదంతి మఱియొక నోటినుండి వెలువడునపుడు వేఱొక రూపము ధరించుచుండెను. ఒకరు చెప్పినటు లింకొకరు చెప్పకుండుటయేగాక, వదంతులంతకంతకు దారుణాకృతులు తాల్చుచుండెను. నెత్తురు మాంసములు లేని మనుష్య పంజరములు సిక్రీనగరమునఁ దిరుగాడుచుండెననియు, ప్రళయకాలమునందలి పిడుగుల వలె నయ్యవి గర్జించుచుండెననియు, మహమ్మదీయులసిన నయ్యవి మండిపడుననియు, మహమ్మదీయుని గాంచునంతనే అయ్యవి యాకస్మికముగ లంఘించి మెడ విరుగదన్నుననియు, రాత్రులందచట నెత్తురు

వర్షించుచుండెననియు మఱియు పనేక తెలుంగుల జనులు చెప్పుకొన దొడంగిరి. ఈ విధంతులునేతనే మిక్కిలి కలవరపడుచుండిన జనులకు పులిమీంద పుట్రవలె మఱియొకటి తెలియవచ్చెను. అచట దర్యాములన్నియు గుమికూడి ఆగ్రానగర మీదకే దండెత్తనుండెనని తెలియవచ్చెను. ఈ సమాచారమెక్కడ బయల్వెడలెనో యెవ్వరెఱుంగరు కాని, ఆసమాచారమువినినంతనే ఉన్మత్తమతికూడ పోయెను. ఆగ్రానగరమునందలి మహాకలవరమున కదియొక కారణము.

ఉదయపూర్ మహారాణా యగు కర్ణాసింగుయొక్క ప్రతికళేబరము ఢిల్లీనగర సింహద్వారమున దారుణముగ ప్రకటింపబడి యుండెనని పాఠకు లెఱింగియే యున్నారు గదా. ఆ ప్రతికళేబరము కర్ణాసింగుది కాదనియు, సార్వభౌముని పుత్రుడగు ఖరీము రహస్యముగ వధింపబడి యట్లు ఘోరముగ ప్రదర్శింపబడెనని యొక వదంతి బయల్వెడలెను. ఖరీము ఆకస్మికముగా నదృశ్యుడగుటచే నావదంతి యదార్థమై యుండునని జను లనుమానింప దొడంగిరి.

మఱియొక్క వదంతి ఢిల్లీనగరమునందలి దారుణకృత్యము లన్నియు కేవలము పైశాచకృత్యము లనియు, పిశాచము లిక ఢిల్లీనగరము వీడి, తమ యమానుషకృత్యములకు నాగ్రానగరమునే రంగస్థలముగ నొనరించుననియు నెవ్వరో యొక వదంతి వదలిరి. ఆగ్రానగరమునందలి మహాకలవరమున కియ్యదే కారణము. తోడనే బాలురు వృద్ధులు, స్త్రీలు పురుషులు, పిన్నలు, పెద్దలు, నగరవాస్తవ్యులందఱును భయవిహ్వలులైరి. కోట్లకొలది జరుగు వ్యాపారముకట్టు వడెను. పిశాచముల బాధపడనుండిన యీ పాపనగరము వీడుటయే క్షేమకర మని యెల్లరు గుర్తించిరి. పిశాచములు పైబడకమున్నె పలాయన మొనరింపవలయునని వారు యోచించిరి. ఎటులపలాయన మొనరింపవలయునో యని వారు తత్తరపాటుతో గుసగుసలాడగడంగిరి.

పిశాచముల మాట యటుండ, మహారణ్య మధ్యమున నుద్భవించెడు దావానలమువలె, మొగలాయి సామ్రాజ్యము నంతఃకలహములు జనించి ఎట్టి యుపద్రవము ఘటిల్లజేయునో యని దేశమునందలి జను లందఱు వెఱచుచుండిరి. ఉదయపూరు మహారాణా యగు భీమసింహుయును, మొగలు సైన్యములకు సర్వసైన్యాధిపతియగు మహాబతుఖానుయును గలసి ఖురీమును సామ్రాజ్యాధిపతి నొనరింప సంకల్పించి యున్నారని యెల్లరెఱుంగుదురు. వారు యిర్వురును శతసంగములఁ బోరాడిన మహావీరులు. వా రెన్నఁడు రాజధానిపై బడుదురో యని యందఱు తహతహలాడుచుండిరి. అంతఃకలహములవలన దేశమునకు గలుగు మహోపద్రవము నెఱింగినవా రగుటచే జను లందఱు భయభ్రాంతులైరి. వారిని వారించుటకై షాజాదా పార్వేషు మహాసైన్యసమేతుఁడై పోయియుండెను. పార్వేషు విజయుఁడైన సరే. అతనికి నపజయము ప్రాప్తించునేని, శత్రుసైన్యములు ఆగ్రానగరముపై ఆవుఁన వ్రాలవా? చెలియలికట్ట నతిక్రమించు నదీప్రవాహమువలె మహాసంరంభముతో నరుదెంచు వైరులను వారింప నెవ్వరి శక్యము. వారిని వారింప గడంగు ఆగ్రానగరవాసు లందఱు దావానలమున బడు శలభగణములవలె ప్రమగ్గరా? అనంతరము నగర మంతయు దోపిడిపాలు గాదా? ఎట్టిక్రౌర్యములు ఎట్టిచిత్రవధలు జరుగునో యెవ్వఁడెఱుంగు? అని తలంచుచు జనులు గడగడ వడంక దొడంగిరి.

చిత్త మొకతెఱంగున తత్తరపడునపుడు ప్రతివిషయము నా తత్తరపాటు నధికపఱచుచుండును గదా. గంగ హఠాత్తుగ మాయమగుటయు, జులేఖా కానరాకుండుటయు గూడ జనుల కలవరమునకు దోహద మొసంగెను. ఎల్లరు జూచుచుండగనే గంగ యంతర్ధాన మాయెను. రెండు వారములనుండియు జులేఖా కానరాకుండుటచే జనులు పలు తెఱంగుల ననుమానింప గడంగిరి. బీగము మహాలునందు నిరంతరము

జరుగు హత్యలగుఱించి జను లెఱింగియే యున్నారు. రెండవ నూర్జహాను వలె సర్వాధికారసమన్వితయై యొప్పు జులేఖా కూడ నట్టి హత్యమునకు బాల్పడునా? విధివిధాన మెట్లులుండునో యెవ్వరెఱుంగు? అట్టి జులేఖాకే దిక్కు లేకపోయినపుడు మన కెప్పుడు ఎట్టి గతిపట్టునో దైవ మెఱుగునని చింతింపుచు జనులెల్లరు భయభ్రాంతులైరి.

ఇట్లు లనేక కారణములచే గలవరపడుచుండిన జనులు సాయంకాలమైన సిమ్మట గృహములనుండి యీవలకు వచ్చుటకైన సాహసింపంజాలక, ఏక్షణమున నెట్టి యుపద్రవము సంభవించునో యని వెఱచుచు క్షణ మొక యుగమువలె గడుపుచు నుండిరి.

## 30

### మహారాణి యవమానము.

బీగము మహాలు క్రిందిభాగమున నెన్నియో గదు లుండెనని పాఠకు లెఱుంగుదురుగదా. ఆ మందిరము లన్నియుం జక్కగ నలంకరింపంబడి వెలలేని సముచిత వస్తుచయంబులతో నమరి యుండెను. ఆ ప్రదేశము శీతలముగను మనోహారముగను నుండుటచే బీగములు విశ్రాంతికై యచటి కేగుచుందురు.

రాజకార్యధురంధరయగు నూర్జహాను అచటి యొక మందిరమున నొక సుఖములుసోఫాపై సుఖాసీనయై ఎద్దియో యాలోచించుచుండెను. అనేక కుట్రలకు రంగస్థలమై యొప్పు మొగలు మహాసామ్రాజ్యమును పరిపాలించు మహారాణికి శాంతి యెక్కడ? వివిధాలోచనలచే క్రాగుచుండిన డెందమునకు విశ్రాంతి యొసంగుటకు కాంబోలు, ఆమె యొక సుప్రసిద్ధ పెరసియా గ్రంధముం జేతం బూనియుండెను.

అట్టిసమయమున మస్రూా మెల్లగం బ్రవేశించి, ప్రాణము బిగియ బట్టి యతివినయముగ వంగి వంగి సలాము లాచరించెను. వాని యుల్లు

కుడి యైనంతనే, నూర్జహాను మెల్లగ నటుతిరిగి యిట్లు ప్రశ్నించెను —

" మన్సూరా! నా యాజ్ఞానుసారము గావించి యుంటివా?"

నేల తాకునట్లు వంగి, అతి వినయముగ వాఁ డిట్లు విన్నవించెను— "చిత్తము, చిత్తము. ఏలినవారి యాజ్ఞ చొప్పునను సర్వము జరిగినది"

నూర్జ: " ఓరీ! జులేఖా మరణింపలేదని యనుమానింతును. ఏమందువు?"

మహారాణి యట్లు పలికినంతనే వాఁడు భయ విహ్వలుఁ డాయెను. మహారాణి యాజ్ఞను వాఁ డెట్లు నెఱవేర్చెనో పాఠకు లెఱింగియే యున్నారు — " పాదుషా బీగముసాహేబా! జులేఖా యింకను జీవించి యుండుట కల్ల."

నూర్జ: " నీ వట్టులన నేల?"

మన్సూ: చిత్తగింపుడు: జులేఖాయొక్క మృతకళేబరము పది పండ్రెండు గంటలకాలము పిస్ మహాలునందే యుండెను. నడిరేయి కడుభద్రముగ గొంపోబడెను. నేనా సమయమునఁ బరీక్షింప, దేహ మంతయు మంచువలె జల్లగను, కఱ్ఱవలె కొరడుబాఱియు నుండెను. శవమును గొంపోయినవారు ధైర్యవంతులును, స్వామిభక్తి పరాయణు లును నగుటచే ననుమానము కొంచెము లేదు. మరణించిన జులేఖా జీవించి యున్నదని యనుమానించుటకు నెట్టి యవకాశమైనను లేదు. క్షమింపుడు."

నూర్జ: " ఓరీ! మదీయాజ్ఞానుసారము శవమునకు దహనసంస్కా రము జరిగెనా?"

మన్సూ: " ఏలినవారి యాజ్ఞప్రకారమే జరిగియున్నది. ఆహం తకు లిర్వురు రాత్రియంతయు మృతకళేబరము మోసి మోసి హైందవ శ్మశానవాటికఁ జేరిరి. సూర్యోదయా వసరమున వారొక శవమును

గాంచిరి. ఆశవము నెవరు తెచ్చిరోగాని అచ్చట నెవ్వరులేరు. తోడనే, ఆశవము నట్లుద్రోసి, ఆస్థలమున జులేఖా యొక్క కళేబరమును భద్రముగ బెట్టి ఆరెండవశవమును గొంపోయి ఆ హంతకు లిద్దఱు యమునా నదియందు బాఱవైచిరి.

నూర్జ: ఆకారణమున, జులేఖాయొక్క కళేబరము దహనపరుపఁ బడెనని యూహింతు నాయేమి ?"

మస్రూ — "పాదుషాబీగముసాహేబా ! అట్లుకాదు. ఆహంతకు లెఱింగించిన యనంతర వృత్తాంతము. విన్నవించెద. చిత్తగింపుము. క్రొత్తశవము నట్లు పాఱవైచిన పిమ్మట నా హంతకులు మఱల వెనుకటి శ్మశానమున కేతెంచి తుప్పచాటున నక్కి చూచుచుండ క్రొత్తశవముఁ దెచ్చిన వారలెవ్వరో యేతెంచి చితి పేర్చి, జరిగిన మోసము నరయఁజాలక జులేఖాయొక్క కళేబరమును పూర్తిగ దహించివైచిరి."

మస్రూయెట్టి బూటకముఁ గల్పించెనో పాఠకులు గమనించియే యున్నారు. క్రొత్తశవమును బాఱవైచిన హంతకులట్టులేపాఱియుండిరి. వారు శ్మశానమునకు దిరిగి రాలేదు. జులేఖా యేమాయెనో వారె ఱుంగరు.

కాని, వాని సమాధానము నూర్జహానుకు నచ్చలేదు. మిక్కిలి యాగ్రహించి ఆమె యిట్టులనెను —

"ఓరీ దౌర్భాగ్యుఁడా ! నీవంటి పశుప్రాయుఁడు ఇంకొకఁడుండడు. నీవు చెప్పిన విషయ మెంత యసందర్భముగ నున్నదో యిప్పుడైన గ్రహింపఁ జాలవా? నీవునిజముగ పుంజబుద్ధివేకాని, ఆశవమును దహన పఱచుటకై యచటి కేతెంచినవారుగూడ నీవంటిమందభాగ్యులై యుందురా? జులేఖాయొక్క కళేబరము తాము తెచ్చినదే యని వారెట్లు భ్రమింతురు ? ఎట్లు దహనపఱతురు ? అంతబుద్ధిహీనులా ? అందులా ?

అమృతకళేబరము పురుషునిది కారాదా? స్త్రీకళేబరము పురుషకళేబర మేయని భ్రమించి దహనపఱతురా?”

మస్రూా యేమియుఁబలుకనేరక పోయెను. దేహమంతయు కంపించుచుండెను. నాటితో దన యాయువు చెల్లునని వాఁడు గ్రహించెను. యుక్తాయుక్తముల నెఱింగిన వాఁడగుటచే నూర్జహాను యొక్క విమర్శ కడు సమంజసముగ నుండెనని వాఁడు గుర్తింపఁగలిగెను. ఆహంతకుల వచనములను విశ్వసించుట యందలి యవివేకము వానికప్పుడు తెల్ల మాయెను. మహాసామ్రాజ్యమును గడగడలాడించు నూర్జహాను ముందర అనా యిట్టి యసంబద్ధప్రలాపములు? ఆమె మఱల నిట్లు పలికెను.— “ఓరీ! జులేఖాయొక్క కళేబరమును ఆ హంతకులు మార్గమధ్యమున నెక్కడో పాఱవైచియుందురు. అనంతరమీకథ గల్పించిరి. నీవాపాటి గుర్తింపజాలవైతివి!”

మస్రూా: “పాదుషా బీగమా”

నూర్జ: ఓరీ? నోరు కట్టుము. ఆహంతకులను సత్వరమీనగరమునుండి గెంటివేయుము. మఱియొక విషయము. జులేఖాయొక్క వృద్ధదాది సర్వస్వముఁ జేతఁబట్టుకొని బీగము మహాలునుండి పలాయన మొనరించినది. నీవేల పోనిచ్చితివి?”

మస్రూా: “పాదుషాబీగమా! నేనేమి చేయుదును? జులేఖా బీబీయే ఆవృద్ధాంగనను సాగనంపినది. అసాధారణాధికారముఁ జెలాయించుచుండిన జులేఖాను వారించుట కెట్లుసాహసింపఁగలను?”

నూర్జ: “జులేఖాకుఁగల ధనకనకాది వస్తువుల నా దాది కొంపో యెనని నీ వెఱుంగుదువా?”

మస్రూా: “నాకా సమాచార మిప్పుడే—”

నూర్జ: ఓరీ వదరకు, వారిరువురుఁగలసి యెట్టి కుట్రపన్నిరో కిప్పుడైనఁ దెలిసినదా? అట్లు కాదేని, వృద్ధాంగన ముందుగ

నట్లు పలాయన మొనరించునా?

మస్రూ : "పాదుషాబీగమా!—"

నూర్జ : "జులేఖా మరణించునని దాదికిముందుగ నెట్లు తెలియునో వచింపుము."

మస్రూ యేమియు సమాధాన మొసంగజాలడాయెను. ఎద్దియో సమాధాన మొసంగుటకునైన నవకాశము లేకుండుటచే, వాడు శిరము వాల్చి మిన్నకుండెను.

నూర్జ : "ఓరీ! దాని జాడలైన నెరయుదువటివా?"

మస్రూ : "చిత్తము, పాదుషాబీగమా! చౌకుబజారునందలి తేమల పాకుల గంగ గృహమున కావృద్ధాంగన పోయియుండెను.

నూర్జ : "తరువాత ?"

మస్రూ : "తరువాత, పాదుషాబీగమా! వారిరువురు మాయమైరి."

నూర్జ : "జులేఖా, దాది, గంగయు వంగ దేశస్థులని యెఱుంగుదువా ?"

మస్రూ : "పాదుషా బీగమా!—"

నూర్జ : "ఓరి, పనరు! ఏమ్రపేలెదవు? నీవు పట్టి దాని భాగ్యురాండ్ర వని యిప్పుడైన గ్రహించితివా? నీవంటి బుద్ధిహీనునకా యీ సుప్రసిద్ధ మగు బీగము మహలుపై నధికార మొసంగుట ?"

మస్రూ యవస్థ యెట్లు లుండునో పాఠకులే గ్రహింపఁగలరు. ఏముహూర్తమున దనకు మరణశిక్ష విధింపఁబడునో యని వాఁడు గడగడ వడంకుచుండెను. సింహమువలె గర్జించుచుండిన మహారాణి కెట్టి సమాధాన మొసంగుట కావంతయైనను నవకాశము లేకుండెను. తాను చిక్కిలి తెలివితేటలు గలవాఁడ ననియు విశేషాధికారము గల వాఁడననియు విఱ్ఱవీగు మస్రూ యవస్థ నేఁడు క్రిమికీటకాదుల కంటె నికృష్టమాయెను. నూర్జహాను పలుకు లనెడు శరములకు దేహ మొగ్గి,

ఏశరముచే దన ప్రాణము లెగిరిపోవునో యని వాఁడు భయమువిహ్వలుఁడై యుండెను. అంత, నూర్జహాను మరల నిట్లు పలికెను.

"అణుమాత్రమైన నీకు ప్రపంచజ్ఞాన మున్న యెడల ఆ మువ్వురకు పరస్పర సంబంధముండెననియు, కుట్ర నడుపుచుండి రనియు గ్రహించి యుండవా ? జులేఖా యదార్థముగ మరణించినచో, నా నిమువురు నేల పలాయన మొనరింపవలయు ? వారి పలాయనము నా యనుమానము నకుఁ గారణభూతమైయున్నది. ఓరీ ! నీవు ప్రమత్తుఁడ వగుటచే నెట్టి మోసము వాటిల్లెను ? నేను కావింపవలసిన మహాత్కార్యము లనేకము లున్నవి. కాని, జులేఖా యుదంతము మొదట తేటపడవలయు. ఆమె మరణించెనని యెట్లు విశ్వసింపగలను ? "

హృదయము దడదడ కొట్టుకొనుచుండినను, దేహ మంతయు గడగడ వడఁకుచుండినను, నోటనుండి మాట వచ్చుట కష్టముగ నుండినను, ధైర్యము వహించి, ప్రాణము బిగియఁబట్టి మస్రూా యిట్లు చెప్పఁబోయెను —

" పాదుషా బీగము సాహేబా ! జులేఖా కళేబరము కబ్రువలె కానఁబడు పారి యుండె — "

నూర్జ : "ఓరీ ! ఆకారణమున నా యనుమానము స్థిరపడుచున్నది."

మస్రూా తెల్లబోయెను. మహారాణి యభిప్రాయము వానికి గ్రాహ్యము కాలేదు.

నూర్జ : " ఓరీ ! ఇందలి రహస్యము నే నరయఁగోరెదను. "

మహారాణి యిట్లు పలికినంతనే, మస్రూాయొక్క పోయిన ప్రాణములు లేచి వచ్చెను. ఇంతవఱకును తన కెప్పుడు మరణశిక్ష విధింపఁబడునో యని వాఁడు వెఱచుచునే యుండెను. వాని కపుడు ధైర్యమలవడ, సంతుష్టాంతరంగుఁడై యిట్టు లనెను — " పాదుషా బీగము సాహేబా ! సెలవగునేని యీా దాసుఁడు — "

తోడనే నూర్జహాను ఆగ్రహావేశయై యిట్లనియెను —

"ఓరీ! నీ తెలివితేటలు లేదు తెల్లవారిపోగదా! అదృష్టవంతుండవగుటచే నీవు బ్రతికిపోయితివి! అతి నిపుణుఁడగు గూఢచారి యొకఁడు కావలయును. అటువంటివాఁ డెవ్వఁడు?"

మహ్రూ: "సాదుసాబీగమూ! గవ్హార్జాన్ యనునది ఎట్టి కార్యమునకైన దగును."

నూర్జ: "దానిని విశ్వసింపనగునా?"

మహ్రూ: "తప్పక, చిత్తము. దాని నెట్టి కార్యమునకైన నియోగింపవచ్చును. అట్టిని ఆసేతుహిమాచలయు సర్వోత్తమము కానదని నొక్కి చెప్పవచ్చును."

నూర్జ: "ఔను. వివిధాలోచనాయత్తచిత్తనై యున్న నేను దాని విషయము మఱచితిని. నీవు రయమున బోయి దాని దోడ్కొనిరమ్ము."

తోడనే మహ్రూ నిష్క్రమించెను. "ఆహా! నేఁడు నా యదృష్టము బాగుగనే యున్నది. మృత్యుదేవత నోటఁ జొచ్చియు నదృష్టవశమున జీవములతో నీవలఁ బడితిని. మహారాణి కేవలము కరుణించి నన్ను మన్నించినదని తలంపరాదు. నా యవసర ముండుటచే మరణము తప్పిపోయెను. లేకున్న, ఈ మహ్రూ యింకను సజీవుఁడై యుండునా?" అని చింతించుచు వాఁడు వెడలెను.

నూర్జహాను యవస్థ కడుంగడు దుర్భరముగ నుండెను. మహావైభవాధికారములతో మహాసామ్రాజ్యమును శాసించుచు మహాభోగభాగ్యములతో నోలలాడవలసిన మహారాణి కావిచారము? తన వినాశము గలపెట్టి యెవ్వరో గొప్పకుట్ర పన్నుచుండిరని యెఱింగిన దాది ఆమె యవస్థ మాఱిపోయెను. ఆ కుట్ర జరుగుచుండెననితో కాని దాని స్వభావ మెట్టిదో అందలి ప్రధానపాత్ర లెవ్వరో స్పష్టముగఁ దెలియకుండుటచే నామె యవస్థ బాధకరముగ నుండెను. యోచించు

గొలఁది వరిని విశ్వసించుటకును, వీలులేకుండెను: ఎల్లరిని అనుమానింప వలసిదయే యుండెను. తుదకు, పాదుషాయే తన వినాశము గలపెట్టినా యను యనుమానముగూడ నూర్జహానను బాధింప దొడంగెను.

ఎవని విశ్వసింపక, ఎల్లరిని ననుమానించుటయే ఆమె స్వభావమై యుండెను. ఆమె తండ్రి ప్రధానామాత్యుఁడై యుండెను. సోదరుఁడొక యమాత్యుఁడై యుండెను. ఆమె వారిని సహితం విశ్వసింపక, దేశమంతటను గూఢచారులను నియోగించి రహస్య వృత్తాంతముల నరయుచుండెను. అట్టి విశ్వప్రయత్నము నొనరించుచుండినను యెవ్వ, రగులుచుండిన కుట్రగుఱించి యింతవఱకు నామె యెఱుంగజాలదాయెను. సిక్రీనగరమునందలి దయ్యాలు, షాజాడాఖరీము ఆకస్మికముగ నదృశ్యుఁడగుటయు, పాదుషా స్వభావము నందలి మార్పు, జులేఖా సమస్య, గంగ పలాయనము వీనినన్నిటిని గాంచినంతనే నూర్జహాను ప్రకంపిత హృదయయాయెను. దర్బారునందలి ప్రధాన మున్సబుదారు లందఱు దనపై కత్తి కట్టిరా? షాజాడాఖరీమును సామ్రాజ్యాధిపతి నొనరించుటకై యీ కుట్ర నిగూఢముగ రగులుచుండెనా? అట్లయిన నూర్జహానున కాశాభంగము కలుగును. పాదుషా యనంతర మొక బలహీనుని సింహాసనముపై నిడి సామ్రాజ్యమును సర్వాధికారముతో శాసింపవలయునని యాసించిన నూర్జహాను భగ్నమనోరథయాయెను. మఱియొక యుపద్రవ మామెను బాధింప గడంగెను. మొగలాయి ప్రభుత్వము నెడ విముఖులై యుండు రసపుత్ర వీరులందఱు గలసి మొగలాయి సామ్రాజ్యమును విచ్ఛిన్న మొనరించి హైందవ సామ్రాజ్యము సృష్టించుటకై నిగూఢముగ మహాప్రయత్నము లొనరించుచుండవచ్చును. ఇన్ని మహాసంకటములచే గారింపఁబడుచుండిన నూర్జహాను యవస్థ కడుంగడు దుర్భరముగ నుండెను కాని, మేధావంతురాలును, వివేకవంతురాలును కార్యైకతత్పరయునగు వనితారత్నము

అంతమాత్రమున నిగులొంది తడబడి క్రుంగిపోవునది కాదు. మహా వ్యక్తుల సామర్థ్యము ను అట్టి విషమసమయముల నే బయల్పడను యు. కావున మహారాణి ధైర్య స్థైర్యములను కార్యదీక్షా పారతంత్రత యు ద్విగుణీకృతమాయెను.

## ౩౧

### గహర్బాను

మహ్రూ పంపిన గూఢచారి ప్రవేశించెను. తోడనే, మహారాణి వివిధాలోచనలన్నియు సంతరించెను. అరుదెంచిన బందీని నఖశిఖ పర్యంతము తీక్షణ వీక్షణంబులఁ బరిశీలించి మహారాణి యిట్టు లనెను – "ఓసీ! నీవెవ్వతెవు? ఏల వచ్చితివి?"

"పాదుషాబీగముసాహెబా! మహారాణి యాజ్ఞయైనదని మహ్రూ యెఱింగింప, పరుగున నరుదెంచితి. ఆజ్ఞ దయచేయుఁడు."

ఈదాసీవృత్తాంత మెవ్వరు చక్కఁగ నెఱుంగరు. ఢిల్లీనగరమున నను దినము దేశదేశములనుండి యరుదెంచు దాసిసలను విక్రయింతురు. ఒకానొకదినమున మహ్రూ యీమెనుగొని, పద్మవ్యూహమువలె నుండు బీగము మహాలునందుఁ బ్రవేశపెట్టెను. నాటగోలె అనలి వేన వేలు దాసీలలో నొక్కతియై మెలగుచుండెను.

ఆమె స్వభావాకారముల గుఱించి యొక్కింత గ్రహింపవలసి యున్నది. ఆమె యప్సరస యని చెప్పరాదు గాని, కురూపి యెంత మాత్రము గాదు. నలుబదియేండ్లు నతిక్రమించినను, పదునెనిమిదేండ్లు ప్రాయంపు జవ్వనివలె మిసమిసలాడుచు మనోహరముగ నుండెను. ఆమె మొగలు కులస్థురాలో పెరషియా కులస్థురాలో మఱియే మహా మ్మదీయకులమునకు జెందియుండెనో గ్రహించుట కవకాశము లేకుం డెను. ఆమె మోము గాంచునంతనే, మంచి దొడ్డ లెఱుంగని బేల

యనియు గోలకొండయు నెల్లరు స్మరించును. కాని, అంతకంటె పొరపాటు మఱియొకటుండదు. ఆమె బేలవలెనే మెలగుచు, కండ్లు పూర్తిగ నెప్పుడు తెఱవకయే సర్వము సమగ్రముగ బరిశీలించు చుండును.

ఆమె యద్భుతముగ తెలివితేటల కచ్చెరువడి, మహ్రూ ఖానుమును బీగముముహాలునందు గూఢచారిగ నియోగించెను. నాటకోలె, నెవ్వరికిఁ దెలియకయే అందఱి ప్రవర్తనములను నామె కనిపెట్టుచుండెను. సహ ప్రాక్షివలె సంచరించు గహర్జాను కిన్ను ఖానుమి నెవ్వరెట్టి కార్యము నాచ రించుటకును వీలులేకుండెను. సాధారణపు బందీలేగాక, బీగముల యొక్కయు, తుదకు నూర్జహాను యొక్కయు సగూఢ ప్రయత్నము లను రహస్యవృత్తాంతములను నామె చక్కగఁ బరిశీలించుచుండెను.

నూర్జ: "నిన్నేల చీరితినో యెఱుంగవా!"

గహ: "దేవీ! ఎద్దియో రాజకార్య మొనరింప వలసియున్నదని యాత్రి మెఱుంగుదును."

నూర్జ: "అవును. కాని, నిన్ను విశ్వసించు టెట్లు?"

గహ: "పాదుషా బీగము సాహేబా! విశ్వాసమునకుఁగూడ వెల గలదు. ఇతర పదార్థముల వలెనే విశ్వాసమునకు హెచ్చు వెలయిచ్చిన సులువుగా పడయనగును."

నూర్జహాను సముఖమున నెవ్వరు అంత ధైర్యముగను అంత విస్పష్ట ముగను మాటాడి యెఱుంగరు. కావున, మహారాణికి పట్టరాని యాగ్రహాశ్చర్యములు గలిగెను. కాని లోలోన నడంచికొని, యిట్లు ప్రత్యుత్తర మొసంగెను—"ఓసీ! నీవు చెప్పినది సత్యము. నీస్వాచ్ఛంద ప్రవర్తనము నాకాశ్చర్యము గలిగించుచున్నది. ఇంత ధైర్యముగ, ఇంత ధారాళముగ బ్రసంగించు నీవలననే కార్యము చక్కబడవలయును. కాని, నీవిశ్వాసమునకు వలయు వెల యెంతయో విశదపఱచుము."

గహా: "దేవీ! చిత్తగింపుము. పదివేల్సైన్యమునకు నేను "మన్సబుదారు" గావలయు, కాశ్మీరదేశమునకు నేను సుబేదారు గావలయు, పదిలక్షలపైకము కూడ ముట్టవలయు. పాదుషా బీగముసాహేబా! ఇవియే నాపరతులు, ఈ సేవకురాలి విన్నపము మన్నింపుము."

బీగముమహాలునందు నూడిగ మొనరించి జీవించు బానిస యిట్టి విపరీతాలాపముల నసంబద్ధముగ నుచ్ఛరింప సాహసించునని నూర్జహాను కలనైన నెఱుంగదు. నివ్వెరపడి మహారాణి యిట్లు ప్రశ్నించెను — "ఓసీ! కాశ్మీరదేశమును బరిపాలింప వలయునని యాశింపనేల?"

గహా: "పాదుషా బీగముసాహేబా! నా జీవితరహస్యము నెఱింగించెద. చిత్తగింపుము. కాశ్మీరదేశమే నా నివాసస్థలము. నాజీవిత చారిత్రము సంపూర్ణముగఁ దెలుప నవసరములేదు. కాని; బాల్యమునుండియు, నా మాతృభూమి బరిపాలింపవలయుననెడి వాంఛకు లోనైయుంటి. దినములు నడచుకొలఁది, నావాంఛ మఱియు తీక్ష్ణము కాజొచ్చెను. తుదకు, నేనెన్నటికినైన కృతకృత్యఁ గావలయునని సంకల్పించి, బీగముమహాలు బ్రవేశించినచో నా మనోరథము సిద్ధింప వచ్చునని యెంచి, బానిసనై యిందుఁ జొచ్చితి. దైవకృపచే నామనోభీష్ట మీరు దేరు మహాసమయము మే తెంచెనని విశ్వసింతును."

నూర్జ: "నీ హృదయాభిప్రాయము నెవ్వరైన నెఱుంగుదురా?"

గహా: "దేవీ! నేఁటివఱకు నా మనోరథము నెఱింగింపవలసిన యవసరము రాకుండుటచే నెవ్వరికి నెఱింగింపలేదు."

నూర్జ: "నిన్నీమహాలునందు బ్రవేశ పెట్టిన మహ్రూఖాయైన నెఱుంగదా?"

గహా: "దాని కణుమాత్రము తెలియదు."

నూర్జ: "ఓసీ! నీకోరిక లతివిపరీతముగ నున్నవని యెఱుంగవా?"

గహా: "పాదుషా బీగముసాహేబా! విన్నవించెద. చిత్తగిం

వుము. మీరు నియోగింపఁబోవు కార్యము కడు దారుణమైనది కడు ప్రమాదకరమైనది. అందలి ప్రమాదము గుర్తింప, నేను కోరిన దేపాటి?"

నూర్జ: "నిన్నెట్టి కార్యమునకు నియోగింతునో నీకేమి తెలియును?"

గహా: "దేవీ! క్షమింపుము. ప్రస్తుతము నిగూఢముగ జరుగుచున్న కిర్రట—అంజలి రహస్యోద్భవవిషయమును నరయుట యొకటి."

నూర్జ: "రహస్యోద్భూత విషయము మెద్ది?"

గహా: "దేవీ! నేనా విషయమంతయు నెఱుంగుదు. సిక్రీనగరము నందలి పిశాచకృత్యములు, ఢిల్లీనగరమునందలి శవములు, నిపరీతముగు జులేఖా యాత్మహత్య, గట్టి పలాయనము—"

నూర్జ: "ఔనౌను. కాని నీ కింత దురాశయేల?"

గహా: "పాదుషా బీగముసాహేబా! నా ప్రవర్తన మన్యథా తలంపవలదని ప్రార్థించుచున్నాను. నా యాశ దురాశ కానేరదు. ఇపుడు నిగూఢముగ జరుగుచున్న దారుణ ప్రయత్నములు ఫలించు నేని యెట్టి ఘోరమగు ప్రమాదము వాటిల్లునో గుర్తింపవలయు. ఆసేతుహిమాచలపర్యంతము వ్యాపించు యీ విశాల మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిన్నము కావచ్చును! పాదుషావారు రాజ్యభ్రష్టులు కావచ్చును. దేవీ! మీ కెట్టి దోసగు వాటిల్లునో గుర్తింపుము. షాజాదా ఖుర్రము సామ్రాజ్యాధిపతి కానగును. దేవీ! తుదకు సర్వాధికారము వహించి సామ్రాజ్యమును గడగడలాడించు మీ స్థానము నొక హైందవాంగన యలంకరింపనగును."

నూర్జ: "ఓసీ! ఈవిషయమై నీ వెఱుంగు సమాచారము సవిస్తరముగ నెఱింగింపుము."

గహా: "దేవీ! ఈ దీనురాలిని క్షమింపుము. నా షరతుల నంగీకరించిన పిమ్మట, మీరు చెప్పిన చొప్పున మెలంగెద, సెలవిమ్ము."

అంత ధైర్యముగ ప్రసంగించుచుండిన గహ్జానుయొక్క ప్రవర్తనము నిష్ఠురముగ నుండుటచే, మహారాణి యాగ్రహపరవశ యాయెను. కాని, ఆమె యుక్తాయుక్తముల నెఱింగినదగుటచే నిగ్రహించుకొని యిట్లు ప్రశ్నించెను —

"ఓసీ! నీ విషమునకు తులలను నే నొడంబడనిచో...?"

గహ: "దేవి! నా మరణమునకు సిద్ధమగువారు వేలాదిగ కలరు."

తోడనే, గాయపడిన బెబ్బులివలె క్రోధఘూర్ణితమానసయై ఎదుట నున్న గహ్జానుపై లంఘించుదానివలె హుంకరించి దిగ్గున లేచి యిట్లు గర్జించెను — "ఓసీ! పిశాచమా! ఏమి నీ విశ్వాసఘాతక నైజము! తుచ్ఛులగు నా శాత్రవుల నాశ్రయింతువా!"

గహ: "దేవి! శాంతింపుము. నే నెన్నడును మీ దాసినే. కాని, మదీయ జీవితరహస్యము వెల్లడించి యుంటిని. ఆ కారణమున నే గహ్జా మాతృభూమిని విసర్జించి, సింహాసనము ముందు గాలిడితి! మహాసామ్రాజ్యమునకును ఇమ్మహాసామ్రాజ్యమును శాసించు మహావ్యక్తికిని ఇంతకంటె మహాసంకటసమయము మఱొకటి ప్రాప్తించదు. ఇట్టి విషమసమయమున నన్ను విడనాడరనియే దృఢముగ విశ్వసింతును. దురదృష్టవశమున మీ రన్యథా తలంతురేని, నా కదియే కర్తవ్యము గదా!"

తోడనే నూర్జహాను నవనవ మెత్తఁబారెను. తుపాను సమయమున సంకలిత సముద్రమువలె నామె డెందము ఘూర్ణిల్లజొచ్చెను. అగ్ని పర్వతమువలె నామె డెందము మిక్కిలి క్రాగుచుండుటచే దేహమంతయు కంపించెను. కాని కార్యావసరమున తీవ్రపడుట పాడిగాదని యెంచి, సముద్రతరంగమువలె పొంగి పొరలుచుండిన కోపోద్రేకము నొక్కింత యడంచికొని కఠినముగ నిట్లు పలికెను — "ఓసీ! నీకిపుడు మరణశిక్ష విధించినచో, దిక్కేమి?

క్రోధైకధురీణయై యుండిన నూర్జహాను యట్లు పలికినను గహ

ర్జాను యించుకేని చలింపక, సవినయముగ నిట్లు బదులిడెను — “లోకమును శాసించు మహారాణియే మరణశిక్ష విధించునప్పుడు నాకు దిక్కెక్కడిది. మరణమే శరణ్యము. కాని నేను మరణించినచో ప్రతి కక్షకు వాటిల్లు నష్టమేమి? వారికి లాభమే యగును. నేను మరణించినచో, మీకుఁ గలుగు లాభమేమి? మీమనోరథము సిద్ధించు నవకాశమే యంతరించు. నేనీబీగము మహాలు చొచ్చినదాది మరణమునకు సిద్ధముగనే యుంటిని. కాని ఈ సమయమున నీ చరణదాసిని వధింప వనియే విశ్వసింతు.”

నూర్జ: “అట్టి విశ్వాసమున కాధారమెద్ది?”

గహ: “దేవీ! ఇట్టి మహాసంకటసమయమున, నేను తప్ప నిన్నొరులు రక్షింపనేరరు.”

నూర్జహానుకు పట్టరాని ఆగ్రహము జనించెను. కాని, యుక్తాయుక్తముల నెఱింగిన వివేకవంతురాలగుటచే నామె సత్యాసత్యములను బరిశీలింపగలిగెను. యోచించుకొలది గహర్జాను పలుకులను ద్రోసి వేయరాదనియే తెల్లమగుచుండెను. గహర్జాను మఱల నిట్లనెను. — ‘నేను చేయబోవు కార్యము మహత్తరమైనది. అందలి యుపద్రవము నిర్ణయింప నలవికాదు. తత్కార్య సాధనమునకు నెంతటి ధైర్యస్థయిర్యములు కావలయునో ఎట్టి తెలివితేటలు కావలయునో దేవర యెఱుంగుదురు. ప్రాణములపై నాసకలవారు ఇట్టి యసాధారణ సాహస కార్యమునకు గడంగరని వేరుగ జెప్పనక్కరలేదు.”

నూర్జ: “ఓసీ! నీధైర్యము నాకాశ్చర్యము కలిగించుచున్నది. నీవు విధించు కఠిన షరతుల కొడఁబడి, నాకార్యము నెఱవేరినపిమ్మట నిన్ను విసర్జించినచో నేమి చేయఁగలవు?”

గహ: “దేవీ! మీరట్లు లాచరింపరని దృఢముగ విశ్వసింతును.

నూర్జ: “నీ విశ్వాసమున కాధారమేమి?”

గహా : "నన్ను విసర్జించుట క్షేమకరము కాదని మీకే గ్రాహ్యమగును. మఱియు, మహాసామ్రాజ్యమును బరిపాలించు మహారాణి విశ్వాసఘాతక నైజమెఱుఁగదగినదియు, ...డి తప్పదనినఁ జేనేగాదు, లోకమంతయు నెఱుంగు. వేరేల సందేహింపవలెను?"

గహార్జాను యిట్లు నిర్భయముగ సంభాషించుచుండఁగా, నూర్జహాను ఆగ్రహము, క్రోధము మొదలగు వివిధోద్రేకములకు లోనగుచుండెను. ఒక్కింత యోచించి, యిట్లు ప్రశ్నించెను.

నూర్జ : "నా వైరులు నీకేమైన నొసంగనున్నారా?"

గహా : "దేవీ! చిత్తము."

నూర్జ : "వారు నీ షరతులెల్ల నొడంబడిరా?"

గహా : "చిత్తము. నేను కోరునదెల్ల నెఱవేర్చుటకు వారు సంసిద్ధులై యున్నారు."

నూర్జ : "అట్లైన, తోడనే వారి గుంపుజేరక, నిచ్చట తడయనేల?"

గహా : "పాదుషా బేగముసాహేబా! మీ కెఱుంగని రహస్యము లుండునా? దేవీ! బుద్ధిమంతు డెవ్వఁడు భావి మహాభాగ్యమున కాసించి, ప్రకృతభాగ్యమును గోల్పోదురా? నీ వైరుల ప్రయత్నము లెట్లు పరిణమించునో యెవ్వ రెఱుంగుదురు? దేవీ! నీ వనుగ్రహింతు వేని, నా మనోభీష్ట మొక్క త్రుటిలో సిద్ధించును. వైరుల పంచఁ జేర వలసిన యవసర ముండదనియే విశ్వసింతును."

ఈ సమయమున మహారాణి సుందరవదనారవిందమున జిఱునగ వుదయించెను — "నీ తెలివితేటలు నా కాశ్చర్యము గొల్పుచున్నవి. మనకు విజయము నిశ్చయము. ఉచితానుచితములను లెక్కింపక విపరీతముగ దురాశకుఁ జిక్కి దురాలోచన లొనరించు దుర్మార్గులు భగ్నమనోరథు లగుటయు నిశ్చయము."

ఆ పగిది మహారాణి బీరము లాడుచుండెను. గాని, ఆమె హృద

యాభిప్రాయము మాత్రము వేఱుగ నుండెను. జయాపజయముల ను నిర్ణయించుట అంత సులువు గాదు. తన సమక్షమున నే వైరి శక్తి దారుణ ప్రయత్నముల లోనరించినపుడు, విజయము వచ్చినను ఆమె యెట్లు భావించును? సూక్ష్మజ్ఞానముగల గహార్జాను మహారాణి రహస్యము గుర్తించి, తేటపడునట్లు చెప్పగాని యిట్లు బలికెను —

"దేవీ! శక్తిస్వరూపిణియగు నూర్జహాను మహారాణిపై శత్రుశక్తి విజయము వడయుట సంభవమా?"

గహార్జాను యిట్లు పలికినంతనే సంతుష్టాంతరంగయై మహారాణి యిట్లనెను — "సరె. కాని, వలయు సాహాయ్య మొనరింతువని యే విశ్వసింతును?"

గహా: "దేవీ! చిత్తము. నా యభిప్రాయము వేఱుగ నుండె నేని, వైరిపక్ష మీసరికే చేరియుందును."

నూర్జ: గహార్జాన్! స ప్రవర్తనము కడు సమంజసముగ నున్నది చెప్పవలయు. ఒక్క విషయము నడుగవలయు: వైరిపక్షమును నిన్నెవ్వరు ప్రోత్సహించిరి?"

గహా: "దేవీ! సంశయింపనేల? తమ నీడవలె మెలంగుచుండిన జులేఖాయే!"

జులేఖా యనినంతనే మహారాణి మతిపోయెను. గమ్యస్థానముం జేరుటకై రయమున ప్రయాణ మొనరించు పాంధుడు అడుగిడు సమయమున విషోరగమును గాంచి ఎట్లుకలవరపడునో, మహారాణియు నట్లు కలవరపడి భయవిహ్వలయై, హృదయ మొక్కసారి కంపింప దిగ్గున లేవబోయెను. తా నెంతయు ప్రేమించి, సోదరివలె సాకుచుండిన జులేఖాయే యీ ఘోరమగు కుట్రకు నాయకత్వము వహించి యుండె నని యెఱింగినంతనే బాలసూర్యప్రభాకలితంబై కలకలలాడు నమ్మహారాణి ముద్దుమోము కళావిహీనమై వెలవెలబోయెను. జులేఖా యింతబున

దనకు బ్రాపింపనుండిన మహాసంకట మపుడు పూర్తిగ వ్యక్తమగుటచే, దేహమున విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లు మహారాణి కోమలాంగ మంతయుఁ గంపించెను. ఎట్టకేలకు వివిధ తీవ్రాలోచనలచే బ్రాగుచుండిన చిత్తమును నిగ్రహించి, గద్గదకంఠియై యిట్లు ప్రశ్నించెను —

"గహర్జాన్! నా పరిచారిక యగు జులేఖా వైరుల దుర్మార్గ ప్రయత్నములకు దోహద మొసంగుచుండెనని నీ వెఱింగినంతనే నాకా సమాచారము తెలుపవలదా?"

గహ: "దేవీ? సర్వజ్ఞులగు మీరా రిట్లు సెలవిచ్చుట పాడియా? దుర్లభమగు నీ యపార కృపాకటాక్షమునకు పాత్రురాలై రెండవ నూర్జహానువలె మెలంగుచుండిన జులేఖా యెట్టి దారుణ ప్రయత్నము లాచరించుచుండినను, ఎవ్వ రెఱింగింప సాహసింతురు? ఉచితానుచితములను గుర్తింపక, అట్టి సాహసకార్యమునకు గడంగు నంత బుద్ధి సజీవుఁడై యుండునా?"

గహర్జాను యొసంగిన సమాధానము సమంజసముగ నుండెనని నూర్జహాను గుర్తించెను:—"గహర్జాన్! నీదూరదృష్టి కొనియాడఁదగి యున్నది. కాని, ఇంత నిగూఢముగ ఇంత దారుణముగ జరుగుచున్న కుట్ర గుఱించిన వివరము లెఱుంగుటకై చిత్తము తత్తరపడుచున్నది"

గహర్జాను యొక్కింత యోచించి, మిక్కిలి సంశయించుచు మెల్లగ నిట్లనెను:—"దేవీ! నీ యాజ్ఞకై నిరీక్షించుచున్నాను. సెలవగునంతనే సమస్తము సవిస్తరముగ నెఱింగించెద."

నూర్జ: "ఓసీ! నీమనవులకెల్ల సమ్మతింతునని బాసచేసిన మాత్రమున నీవు సంతసింతువా?"

గహ: "దేవీ? నీవు బాసచేసినఁజాలును. అంతకంటె నాకేమి కావలయు?"

నూర్జ: "అట్లయిన, నీప్రార్థన నంగీకరించితినని తెలుపుము.

నీవిపుడు తలపెట్టు మహాకార్యము జయప్రదముగ నెఱవేరునేని, నీ యభీష్టము సిద్ధించును. పదివేల సైన్యమునకు మన్సబుదారావౌదువు. కాశ్మీర దేశమునకు నిన్ను సుబేదారుగ నియమింతును."

మహారాణి యట్లు పలికినంతనే గహ్హారామునకు వర్ణింపనలవికాని సంతోషము జనించెను. సంతోషము పట్టజాలక, మహారాణికి వంగి వంగి ప్రణామంబు లాచరించుచు, సవినయముగను, ససంభ్రమముగను నిట్లు పలికెను—"నాజన్మము నేఁడు పావనమ్మయ్యెఁ. ధన్యుఁడనైతి నేని బీగముమహాలు ప్రవేశించుటకు గతంబెద్దియో నాఁటికిఁ గాచియుంటిని. తత్కార్యసాధనమునకే స్వాభావికమగు పౌరుషము మఱుగువెట్టి స్త్రీవేషము ధరించితిని. కాశ్మీర దేశము బరిపాలించుటకే యిట్టి ప్రయత్నము లొనరించితి!"

నూర్జ: "కాశ్మీర దేశము నీవెప్పుడువీడితివి? బీగము మహాలు ప్రవేశించి యెంతకాలమైనది?"

గహ: "దేవీ! దురదృష్టవంతుఁడనగు నాపూర్వచరిత్రము నిపుడు త్రవ్వనేల? ప్రకృతాంశమున కట్టి ప్రయోజనము లేదు."

నూర్జ: "నీపూర్వచారిత్రముతో నాకుఁ బనిలేదు. కాని, బీగము మహాలుగుఱించి నీకుఁ దెలియు విషయము లెవ్వియో వివరింపుము."

గహ: "దేవీ! కథ పెంపుఁజేయుట కిది యవసరము కాదు. కాన విషయమును సంగ్రహముగా నివేదింతును. నామనోభీష్టము నెరవేర్చుకొనుటకే గదా! స్వస్థలమువీడి యిందుఁ జొచ్చితి! నాఁడు మొదలు నేఁటివరకు రేయింబవళ్ళు తదేక ధ్యానముతో సంచరించుచుంటి. నామనోరథము సిద్ధించుటకు రెండేమార్గములుగదా. నష్టకష్టముల కోర్చి ఎట్టిప్రమాదమైనఁజలింపక స్వామిభక్తిపరాయణుఁడనై నీక్షేమ మారయుచు నిన్ను సేవించినచో సఫల మనోరథుఁడ నగావచ్చును.

రెండవమార్గ మెద్దియన భావికాలమున నీ సింహాసనము నలంకరించు యదృష్టవంతుని హృదయ మాకర్షించుట."

నూర్జ: "తరువాత?"

గహ: నాటగోలె, కార్యదీక్షాపరతంత్రనై, ఈమహాలు నందు మెలంగు వారల ప్రవర్తనములను సహస్ర నయనములతోఁ బరీక్షించుచుంటి. జులేఖాను గూడ నట్టులే పరీక్షించుచునుంటి!

గహ: "ఓసీ! జులేఖాగుఱించి నీవుకనిపెట్టిన రహస్యము లెవ్వియో శీఘ్రముగ వెలింగింపుము!"

గహ: "దేవీ! నీవు క్షమియింతువేని, ఒక్కపరమ రహస్యమును వెల్లడించెద. జులేఖాయొక్క ప్రవర్తనము కడుంగడు యద్భుత మైనది. ఆమె ధైర్యస్థైర్యములు నిరుపమానములు. ఆమెకుఁ గల మేధాశక్తియు, సూక్ష్మజ్ఞానమును కేవలము వర్ణనాతీతములు. ఆమెకు గల నేర్పు ఓర్పు ఆదర్శప్రాయములు. వివిధోపాయ ధురీణ యగు సమ్మోనవతి ఉపాయముల కెల్ల ననికిపట్టని చెప్పనగు. దేవీ! మహా గుణములచే విరాజిల్లు మహారాణి సహితి మామెకు సరిరాదని చెప్ప వలయు."

ఆమె యట్లు నిర్భయముగఁ బలికినంతనే, మహారాణి ముఖమండ మున నాగ్రహమేఘ ముదయించెను. జనించిన యాగ్రహము నడంచు కొని యామె మిన్నకుండ, గహర్జాను మగుడ నిట్లు లనెను. — "దేవీ! నేను పైనుదహరించిన కారణమున జులేఖాయొక్క రహస్యము నంతగా నెఱుంగుట కామె యవకాశ మొసంగినదికాదు. కాని, ఈవిషయము మాత్రము తథ్యము. — మొగలాయి సామ్రాజ్యమును తారుమారు చేయుట కామె నిగూఢముగ ప్రబల ప్రయత్నము లొనరించుచున్నది. తద్రహస్యము నెవ్వరు గుర్తింపఁ జాలరైరి."

నూర్జ: "దులాలీగురించి యేమందువు? అది నట్టి వెఱ్ఱిపిల్లయే గదా!"

గహ: "దేవీ! దానికి వెఱ్ఱి యంతమాత్రము లేదు. అతిభయంకర మగు నీ రహస్యప్రవాహమున కయ్యదే మార్గము. దులాలీయొక్క సహాయము లేని యెడల, ఈ కుట్ర యింతకుముందే చచ్చియుండెడిది."

నూర్జ: "ఆ విషయమై యింక భయపడవలసిన యవసరము తీఱిపోయినది. జులేఖా యనెడు విషోరగము మరణించెగదా!"

గహ: "దేవీ! నేను మాత్ర మెట్లు నంతసింపజాలను. ఆమె యట్లు పలికి నంతనే నూర్జహాను పిడుగుపడినట్లు ప్రమాన్పడెను. హిమాలయమువలె నిశ్చలముగ నుండు నాధీనురాలు భరింపరాని భయాశ్చర్యములకులోనై కంపించి, బెండువలె, దూలిపోయెను — "ఓసీ! నీ వేమంటివి! నీ యభిప్రాయమేమి! జులేఖా యింకను జీవించియే యున్నదని భావింతువా? మరణింపలేదా!" అని యత్యాతురముతో నామె ప్రశ్నించెను.

గహ: "దేవీ! నేనేమియు నిర్ణయింపజాలను. ఆమె సజీవియై యున్నదని గాఢముగ ననుమానింతును."

నూర్జ: "నీ యనుమానమున కాధారమేద్ది."

గహ: "దేవీ! నీ దివ్యనామాక్షరములుగల వజ్రపుటుంగరమును జులేఖా ధరించియుండెగదా! ఆ యంగుళీయకమును దీయుట మఱచిపోయితి మరచిపోయె."

తద్వృత్తాంతమును వినినంతనే జనించిన యుద్రేకముచే మహారాణి డెందము దహించుకొనిపోవ, దిగ్గున లేచి, గహార్జానువంక నట్టె తిలకించి తీవ్రస్వరముతో నిట్లు పలికెను. —

"నా యంగుళీయము గురించి నేనుగూడ పూర్తిగ మరచిపోతిని. ఇప్పు డయ్యది యెచట నుండును?"

గహా : “ దేవీ ! చిత్తగింపుము. నిన్న నడిరేయి నగరమంతయు నిశ్శబ్దముగ నుండిన సమయమున, ఎవ్వరో స్త్రీయైయుండనోపు — ఆ యుంగరము ప్రదర్శించి దుర్గము జొచ్చిరి. ”

నూర్జ : “ నీకీ సమాచార మెట్లు తెలిసినది ? ”

గహా : “ ఇందలి నివాసు లందరు మైమరచి నిద్రించుచుండిరి. నే నట్టిసమయమున పద్మవ్యూహమువలెనున్న యిమ్మహామందిరము నందలి గుప్తమార్గములఁ బరిశీలించుచు మప్రషూ కావలికాచు సింహ ద్వారము సమీపించితి. మప్రషూ నిద్రాసౌఖ్యము ననుభవించుచుండెను. వానివద్దనుండు చారులిద్దరు మాత్ర మప్రమత్తులై గస్తు తిరుగు చుండిరి. ఆసమయమున వా రెవ్వరికో దారి యొసంగి, తలుపులం మఱల బిగియించుచుండ, నే నటుబోయి “ ఓయీ ! ఈ నిశీధసమయమున నెవ్వరిని ప్రవేశపెట్టిరి ? ”యని ప్రశ్నింప, “ గహర్జాన్ ! ఇందు జొచ్చిన దెవ్వరో మాకు దెలియదు. ఆమె ముసుగు ధరించియున్నది. ఎవ్వ తియో మాకేల ? ”అని వారు బదులిడిరి. తోడనే, వారి నిట్లు ప్రశ్నిం చితి— “ ఎవ్వతెయో తెలియకుండ మీ రెట్లు ప్రవేశపెట్టిరి ? మప్రషూ ఖాను యీవిషయము నెఱింగినంతనే మీకు మరణశిక్ష విధింపఁడా ?” వారించుకేనియు వెఱువక, పకపక నవ్వుచు, నిబ్బరముగా నిట్లు ప్రత్యుత్తర మొసంగిరి. — “ గహర్జాన్ ! మావిషయమై నీవు బెంగ పెట్టుకొననేల? మాకుగూడ నొక్కింత జ్ఞానమున్నది. మేము కేవలము శుంఠలము కాము, యుక్తాయుక్తముల నెఱుంగక, ఎల్లరిని రానిత్తుమా? నూర్జహాను మహారాణి దివ్యనామాక్షరములుగల యుంగరము ధరించు నదృష్టవంతుని నెట్లు వారింపగలము ? ” అంత, నే నిట్లు ప్రశ్నించితి. “ఆమె యెవ్వరో మీరు గుర్తించిరా ?” వా రిట్లు బదులాడిరి. “గహ ర్జాన్ ! ఎవ్వరోయని ప్రశ్నింపవలయునా ? మహారాణియొక్క హృద యము నాకర్షించి, సర్వకాలసర్వావస్థలయందును స్వైరవిహార మొన

రించు భాగ్యశాలి— జులేఖాయే— యని వేఱుగ జెప్పవలయునా ? ”

గహర్జాను యట్లు పలికినంతనే యులికిపడి నూర్జహాను తీవ్రస్వరముతో నిట్లనెను—“ ఓసీ ! గహర్జాన్ ! ఏమంటివి ! జులేఖా—సైతాన్ - జులేఖా మరణింపలేదా ? హా దైవమా ! ఆ పాపాత్మురాలు యింకను జీవించియేయున్నదా ? ఆ సైతాను మఱల బీగము మహాలు ప్రవేశించినదిగా ! తోడనే దానిని నీ వేల వెన్నాడవైతివి ? ”

నూర్జహాను యవస్థ కడుంగడు దుర్భరముగ నుండెను. భయమెఱుంగని యమ్మహారాణి జులేఖా జీవించి యుండునని విన్నంతనే, భయవిహ్వల యాయెను. ఆమె ధైర్యమంతయు నంతరించెను. స్థైర్యమంతయు శూన్యమాయెను. గాంభీర్యమంతయు మాయమాయెను. భయమనెడు మత్తేభము మహారాణి డెంద మనెడు సరోవరము జొచ్చి స్వైర విహార మొనరించుచు పూర్తిగ గలంచివైచుచుండెను. దండతాడిత భుజంగమువలె నమ్మహారాణి దీర్ఘముగు నిట్టూర్పులు విడుచుచుండ, గహర్జాను ఇట్లు ప్రత్యుత్తర మొసంగెను - “ దేవీ ! నేనే మరి యుండలేదు అట్లు నిగూఢముగ ప్రవేశించిన వ్యక్తి జాడలరయ వలయుననియే ప్రయత్నించుచుంటిని. కాని, ఈసరికి సణుమాత్రమైనను గ్రహింపజాలనైతి. ”

నూర్జ : “ ఆ రక్కసి యెచట దాగియున్నది ?”

గహ : “ దేవీ ! నేనేమి జెప్పఁగలను ? ప్రవేశించిన వ్యక్తిని బాగుగ పరిశీలించుట కవకాశము లేకపోయెను. కావున, ఆమె జులేఖాయని నిర్ణయించుటకునైనను వీలులేదు. మహామందిరమున నైదువేలు పరిచారికలు సదా సంచరింతురు. అనుదినము కొందఱు వెడలుటయు వారి స్థానమున క్రొత్తవార లరుదెంచుటయు సాధారణ ధర్మమైయున్నది. ఆకారణమున నందఱిని గుర్తించుట సులువుగాదు. దేవీ ! కావున ఉంగరప్రభావముచే జొరఁబడిన వ్యక్తి యెవ్వరో గుర్తింపజాలనైతి. ”

నూర్జ: "గహార్జాన్! నీవు జులేఖాను జక్కఁగ నెఱుంగుదుగదా! గమనవైఖరినిబట్టి గుర్తింపఁజాలవా?"

గహా: "దేవి! చిత్తము. ఎంతదూరమునుండియైనను, జులేఖాను తప్పక గుర్తించియే యుందును. కావుననే ఆమె జులేఖావై యుండదని భావింతును. ఎవ్వరో ఆ యుంగరము గ్రహించి, యద్దాని ప్రభావముచే నిందు జొరబడిరి. ఆవ్యక్తి యెవ్వరో యెఱుఁగవలయు."

నూర్జహాను విషణ్ణవదనయై వినుచుండెను. గహార్జాన్ మఱల నిట్టులనెను.— "జులేఖా మరణించినదో, జీవించియే యున్నదో నిర్ణయింపఁజాలను. అసాధారణ ప్రభావముగల వజ్రపుటుంగరము మాత్ర మొరుల వశమైయున్నది. ఆవ్యక్తికి జులేఖావలెనే యద్భుతమగు తెలివి తేటలు గలిగియున్నది."

నూర్జహాను యేమియుఁ బలుకలేదు. ఆమె డెందమును వివిధతీవ్రాలోచనలు కలంచివైచుచుండెను. గహార్జాను యొక్క పలుకుల నామె యాలించుచుండెనో లేదో చెప్పజాలము. అంత గహార్జాను మఱల నిట్లు చెప్పదొడంగెను: "దేవి! నే నెఱుంగు విషయ మొక్కింత గలదు. చిత్తగింపుము. చౌకబజారునందు తమలపాకులు విక్రయించు గంగతో జులేఖాకు నత్యంతపరిచయము కలదు. జులేఖాయొక్క వృద్ధ దాది బీగముమహాలు వీడి గంగవద్దకే పోయియుండెను. అనంతరము వారలిర్వురు మాయమైరి. జులేఖా యొక్క మరణము కూడ నపుడే తటస్థించెను."

నూర్జ: "గహార్జాన్! నాకీ సమాచారమంతయుఁ దెలియును ఈ రహస్యముల నరయుటకే నిన్ను రావించితి. నీవు కార్యముసాధింతువా, నీ మనోరథము పూర్తిగ సిద్ధించునని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు గదా."

గహార్జాను ప్రణమిల్లి వెడలనుండ, నూర్జహాను మఱల నిట్లనెను.—

"ఓసీ! సిక్రీనగరమునందలి విపరీతముల గుఱించిగాని, ఢిల్లీనగరమునందలి దారుణకృత్యముల గుఱించిగాని నీ కేమైన దెలియునా ? మహబతు ఖాను భీమసింగులు కావించుకుట్రగుఱించియు నెఱుంగుదువా ?"

గహా: "దేవీ! నేనీబీగము మహాలును దాటి వెడలుటకవకాశములేకపోవుటచే, నీవిషయముల గుఱించి యరయుట కవకాశమింతవఱకు జిక్కకుండెను. ఇక తగు ప్రయత్నములొనరించి తద్రహస్యములనెల్లశీఘ్రముగ నరయగలను. దేవీ! ఒక్క విషయము గమనింపవలయునని ప్రార్థించుచున్నాను. మాయోపాయ ధురీణులగు వైరులు అసాధారణ ప్రజ్ఞాధురంధరులు. అట్టి వారిపై గత్తిగట్టి కార్యము సాధించుట దుష్కరంబైనను, కృతకృత్యనై నీప్రాపుగాంచి ధన్యను కాగలను."

ఆలోచనాయత్తచిత్తయై క్రోధకలుషితాంతరంగయై యుండినమహారాణి యిట్లు గర్జించెను– "ఓసీ! ఈదురాత్ముల కెంతకండకావరము! నేనే స్వయముగబోయి యీద్రిమ్మచ్చులపనిపట్టెద. సిక్రీనగరమునందలి దయ్యములకును, ఢిల్లీ నగరమునందలి హత్యలకును, అతి దారుణమగు నీకుట్రకును సన్నిహిత బాంధవ్యమున్నదని యేవిశ్వసింతును. విచారించుకొలది నావిశ్వాసము దృఢమగుచున్నది. దయామయుఁడగుపరమాత్ముని కృపాకటాక్షముచే రహస్య విచ్ఛేదన మొనరింతునేని, ఇట్టి రాక్షసప్రయత్నము లొనరించు క్రూరాత్ములను పట్టిబంధించి – హా! అప్పుడుగదా–అప్పుడు–"

రౌద్రోద్రేకపూరితయైయుండిన నూర్జహాను యిఁక పలుకనేరకూరకుండినను, ఆమె యభిప్రాయమును గహ్జాను గుర్తింపగలిగెను. తోడనే జహాంగీరు యొక్క ప్రథమ పుత్రుడగు ఖుస్రూయొక్కయు నాతని యనుచరులయొక్కయు విషాదచారిత్ర మామెకు జ్ఞప్తికి వచ్చెను. తన తండ్రియగు నక్బరు సార్వభౌమునిపై జహాంగీరుతిరుగఁబడి, రాజచిహ్న

ములను ధరించి, అంతటితోనైననవిరమింపక, వయోవృద్ధుడును, నీతికోవి దుడును, తత్వవేత్తయు, మతసహనము గలవాడునుగ మించి సార్వ భౌమునకునను గు మిత్రుడునునగు అబ్దుల్ ఫజలును వధించి తండ్రిహృద యము నెంతయు గారించెను. ఆయా కారణములచే జహాంగీరును విసర్జించి ఆతని ప్రథమ పుత్రుడగు ఖుస్రూను భావిసామ్రాజ్యాధిపతి నొనరింపవలయునని, అక్బరు యోచించెను. ఆసమయమున సార్వ భౌముని రెండవ పుత్రుడు మరణించెను. సార్వభౌముని పుత్రులలో నెల్ల జహాంగీరు యొక్కడే సజీవుడై యుండెను.

ఖుస్రూ సాధుశీలుడును ప్రజాభిమానియు నై యుండి ప్రజాహృద యము నాకర్షించుచుండెను. అక్బరు సార్వభౌము డలంకరించిన సింహా సనము నారోహించుట కాతడే తగియుండెను. కాని విధివిధాన మెవ్వరు తప్పింపగలరు? కావున దక్కియుండిన కుమారు నొకనిని విసర్జింప నొల్లక, వృద్ధ సార్వభౌముడు నిజకుమారుని రావించి, ఆతనితో సఖ్య పడ, ననంతర మాతడే సింహాసనారూఢుడాయెను. తనకు జేజిక్క నుండిన మహాసామ్రాజ్యాధిపత్యము చేదప్పిగదాయని వగచి, మిత్రుల దుర్మంత్రంబులకు జెవియొగ్గియో, లేక వీడెగదా నాహక్కును హరింప నుండెను అని యాగ్రహించి జనకుడు తనపై గసిదీర్చుకొనునని వెఱ చియో జహాంగీరు ఖుస్రూపై తిరుగబడెను. కాని, జహాంగీరు ప్రబల ప్రయత్నము లొనరించి, రయంబున బయల్వెడలి విరోధి సైన్యమును జెండాడి, కుమారుని బట్టి, కన్నకుమారుడని సైరింపక సంకెలలు వైచి నగరమున హైన్యముగ ద్రిప్పించి, కండ్లు పొడిపించి కారాగృహమున, బడద్రోసెను. ఆ దురదృష్టవంతుని కష్టములంతటితోనైన దీరినవికావు. షాజహాను కారణముననో, లేక నూర్జహాను ప్రోత్సాహముచేతనోగాని, హంతకులు ప్రవేశించి, తలుపు తట్టి నీ కిక కారాగృహవాసము తీరెనని భ్రమగొల్పి హఠాత్తుగ పైబడి, కంఠము నులిపి విగతజీవు నొనరించిరి.

సామ్రాజ్యాధిపతి కావలసిన ఖుస్రూ ఆ తెఱంగున 1606 లో పట్టుపడి, 1622 లో మరణించెను. అతని యనుచరులు మాత్రము తోడనే పలువిధములగు బాధలకు బాల్పడి మరణించిరి. చిక్కుల త్రేలాడి మలమల మాడి కొందఱు, ఇనుప సుుండ్లపై బంధితులై కొందఱు, దారుణమగు చిత్రవధల పాలై కొందఱు, జీవించి యుండగనే చర్మము లొలువఁబడి కొందఱును మరణించిరి.

ఇపుడు కుట్రలు చేయుచుండిన వారిని గూడ నట్లులే చిత్రవధల బాధించి కసితీర్చుకొనుటకై నూర్జహాను తత్తరపడుచుండెనని గహాగ్దాను గ్రహింపఁగలిగెను. అనుదినము జరుగునట్టి దారుణమగు వధల నెఱింగినదయ్యు నామె వానిని దలంచినంతనే కంపించెను. కాని, రాజ్యము సామ్రాజ్యము సనాయాసముగ నలవడునా? కొండలవలె నేర్పడు మృతకళేబరముల దాటి, రుధిరప్రవాహముల నీదులాడినగాని సింహాసనము గోచరించునా? కాశ్మీర సింహాసనము నలంకరింప నాసించిన గహాగ్దాను మాత్ర మా రహస్య మెఱుంగదా? తద్రాజ్యాధిపత్య మామె మనోనయనమున కప్పుడే గోచరించుచుండెను. తన తెలివి తేటలచే కాశ్మీరరాజ్యము సంపాదించిన పిమ్మట ఢిల్లీసామ్రాజ్యము గూడ నేల జిక్కరాదు? బానిసలై ఉత్తర హిందూదేశమును సుమారు రొక శతాబ్దము బానిసరాజులు పరిపాలించిన విషయము చరిత్రప్రసిద్ధము. అట్టులే తానుగూడ నిజ శక్తి సామర్థ్యముల జూపి చక్రవర్తిని కానగునని, ఆ ముహూర్తముననే గహాగ్దాను భావించెను. మెఱుపువలె దోచిన ఆ యూహాల నటుంచి, సవినయముగ నామె యిట్లు పలికెను.—

"దేవీ! నేనొక్క విషయ మెఱుంగవలసి యున్నది." ఆమె యభిప్రాయ మెద్దియో ముందుగ నరయవలయునని యెంచి, యామెను తీక్షణముగ దిలకించి, భగ్నమనోరథయై, మహారాణి యిట్లు పలికెను—

"దాసీ! నీ వరయఁగోరు విషయ మెద్దియో శీఘ్రముగ బల్కుము,"

మిక్కిలి సంశయించుచు, సవినయముగ నామె యిట్లు బదులాడెను.— "దేవీ! సార్వభౌముని యనంతరము సింహాసనము నారోహించువా రెవ్వరు? — షాజాడా షార్యేషా, లేక, షాజాడా షరియారా?"

ఆమె యిట్లు ప్రశ్నించినంతనే, మహారాణి యదరిపడి, నిరుత్తరయై కొంతతడవు ధ్యానైకతత్పరయై, ఆ ప్రశ్నచే డెందము మిక్కిలి కలంగ, కడు తొట్రిలుచు, మెల్లన నిట్లులనెను.—"ఓసీ! నీవిట్లు ప్రశ్నింప నేల? షాజాడా షార్యేషే భావి సామ్రాజ్యాధిపతి యని జహాంగీరు సార్వభౌముండు నిశ్చయించిన విషయ మెవ్వరెఱుంగరు? పాదుషా వారి యభిప్రాయ మట్లుండ, నాయభిప్రాయము మాత్రమే వేఱుగ నుండునా? కావున, పాదుషా యభిప్రాయమే సిద్ధింపవలయు."

## ౩౨

### షాజాడా షరియార్

సార్వభౌముని నాల్గవ పుత్రుండగు షరియార్ యొక్క క్రీడామందిరము మహోన్నత భవసమన్వితమై కడు మనోహరముగ నుండెను. నిరుపమానములగు వివిధ వస్తుచయంబులతో నామందిర మలంకరింపఁబడి యుండెను. సహస్రబాహువులుగల దీపరాజమొకటి దేదీప్యమానముగ విరాజిల్లుచుండెను. వివిధపరిమళ పుష్పములతో దయార్ద్రైన యందలి తైలము పరిమళము వెదజల్లుచు హాయిగొల్పుచుండెను. మఱియు న మ్మందిరము కనకమయుతరు లతాలంకృతంబై, మణిమయాభర విరాజితంబై, సర్వసుఖప్రదంబై స్వర్గమును మీఱినమహావైభవముతో నలరారుచుండెను. అడుగు వేసినంతనే దిగిపోవునట్టి మెత్తని రత్న కంబళితో నాగదియంతయు గప్పఁబడియుండెను. అందొక హంసతూలి కాతల్పము సముచితముగ నలంకరింపఁబడి, సముచితముగ నమరి యుండెను.

మహావైభవముతో నలరారు మందిరమున నసాధారణ సౌందర్యవంతులగు జవరాండ్రు కిన్నరకంఠములతో గడు మనోహరముగ గానామృత మొలికించుచుండిరి. ఆజవ్వనుల మనోహరాకారములు వారి మృదుమధుర కంఠధ్వనియు మునీంద్రుల హృదయములనైన నాకర్షింపఁజాలియుండెను.

అపూర్వభూషణాంబరములు ధరించిన వెలయాండ్రు ఆ క్రీడా మందిరమున కడు మనోహరముగ నృత్యము చేయుచుండిరి. వీణాది వాయిద్యముల మేళవించి కర్ణపర్వమును నేత్రపర్వమును నొనరించు నాజవరాండ్రను జూచి తీఱవలయుగాని వర్ణింప నలవికాదు. చంద్రకాంత శిలానిర్మితంబైన జలస్తంభ మొండు తత్సమీపముననే కడు మనోహరముగ బన్నీరు వెదజల్లుచుండెను.

అట్లు సకలభోగభాగ్యములకు నాలవాలమై విలసిల్లుచుండిన యా దివ్యమందిరమున సార్వభౌముని పుత్రుఁడగు పరియారు మత్తుచే సగము తూలుచు హుక్కాగొట్టు మొకచేతబూని మొగమలు దిండు పై సగము వ్రాలియుండెను. అసాధారణ సౌందర్యవతియగు నొక జవరాలి కంఠముపై నాతని రెండవహస్త ముండెను. తొలకరిమెఱుపులవలె మెఱయుచుండిన మోహనాంగు లొయ్యారంబుగ నారసి కాగ్రగణ్యుని చుట్టును నిలువఁబడి నర్మోక్తు లాడుచు నాతని యుల్లము రంజింపఁజేయుచుండిరి. ఆజవ్వనుల స్మితేందు వదనములు, వలుద కుచంబులు, సరససల్లాపములు నాతనికి బ్రహ్మానందము గలిగించుచుండెను. మదోన్మత్తుఁడై యుండిన యారాజకుమారుఁడు బాహ్య ప్రపంచమును బూర్తిగ మఱచి, మోహప్రవాహమున కేవలము కొట్టుకొనిపోవుచుండెను. బంగారుపళ్లెరంబున సారాయితో నిండి యుండిన హేమకలశములనేకములు వాని సమీపముననే యుండెను. ఆ సుందరాంగు లాగిన్నెలను రాజపుత్రుని నోటి కందిచ్చుచునే

యుండిరి. ఒక జవ్వని యప్పు డప్పుడాతని నోటికి పాలుకాఁగొట్టము నందిచ్చుచుండెను. మఱియొకప్పు డాతఁడు అమూల్యమగు పరిమళ పదార్థములతో గడు నిపుణముగ తయారుచేయుబడిన తాంబూలము నుగూడ సేవించుచుండెను. ఆతఁ డుమియు సమయము గనిపెట్టి 'పీకుదాను' పట్టుట కొరకు పరిచారిక సిద్ధముగ నుండెను.

మత్తుచే దూలుచు, కామాతురుఁడై యుండిన రాజకుమారుని నయనములు మూసికొనిపోవుచుండెను. ఈతఁడు జహంగీరుయొక్క నాల్గవ కుమారుఁడని పాఠకు లెఱింగియే యున్నారు. కుమారులలో నెల్ల నీతఁడు తండ్రియొక్క యపారకృపకు బాత్రుఁడై యుండెను. ఆకారణమున వానికి భోగమున కేమి కొదువ? కోరిక జనించుటయే తడవు, అయ్యది తోడనే కొనసాగుచుండెను. మన కథాసందర్భ కాలమున నాతని ప్రాయ మిరువదినాలుగు సంవత్సరములు మాత్రమే యైనను, తండ్రికంటె నెక్కుడు భోగము ననుభవించుచుండెను. ఆతఁడు వేఱు వ్యాపారము నెఱుంగక, సర్వకాలసర్వావస్థలయందును, భోగాను రక్తుఁడై యుండెను. వెలది పొంబులనెడు మహాసముద్రముల నాతఁడు నిరంతరము నీదులాడుచుండెను.

ఈరాజకుమారుఁడు నూర్జహాను కారణమున బూర్తిగ చెడిపోయెను. నూర్జహానుయొక్క పూర్వవృత్తాంతము పాఠకులకుఁ దెలియునుగదా. ఆమె మెహారున్నిసయై, బర్దవాను సుబేదారుఁడగు షేర్ఆఫ్గనునకు భార్యయై యుండిన సమయమున నామె యొక కుమార్తెను గాంచి యుండెను. నాటి మెహారున్నిసా కాలప్రభావముచే జగత్ప్రసిద్ధిగాంచిన నూర్జహానుగఁ బరిణమించి నేడు మహాసామ్రాజ్యమును శాసించుచుండి నట్టులే, యామె పట్టికిఁ గూడ విశేషగౌరవ మలవడెను. ఆమె నందఱు 'షహాజాదీ' (పాదుషా పుత్రిక) యని పిలువనారంభించిరి. రాజ కుమారుఁడగు షరియారునకు నూర్జహాను తన పుత్రిక నొసంగెను.

మహారాణికి పాదుషావలన సంతానము కలుగకుండుటచే నామె ప్రేమాభిమానములకు బూర్తిగ నా కుమారీరత్నమే గురియై యుండెను. పాదుషాను సహితము సరకుఁ జేయక మహాసామ్రాజ్యమును గడగడలాడించు మహారాణి పుత్రికయై జనించుటకంటె సదృష్ట మేమి కావలయు? అట్టి బాలికామణిని జెట్టిపట్టిన షరియారుకంటె నదృష్టవంతుడెవఁడు? కావున నాతఁడు బాహ్యప్రపంచము మఱచి కేవలము భోగసాగరమున నీదులాడుచుండెను.

సామ్రాజ్యమును బరిపాలించు జహాంగీరే వేఱువిచార మెఱుంగక నిరంతరము భోగసాగరమున నోలలాడుచుండెగదా. కావున నాతని పుత్రులును, ఉమ్రావులు మొదలగు ప్రభువులునుగూడ సార్వభౌముని నే యనుకరించుచుండిరి. సార్వభౌముని ద్వితీయ పుత్రుఁడగు పార్వేషు యెట్లు కాలము గడపుచుండెనో వెనుకటి ప్రకరణమునఁ గాంచి యుంటిమి. షరియారుయొక్క చర్య నీప్రకరణమున గాంచుచుంటిమి. సార్వభౌముని మూడవపుత్రుఁడగు ఖుర్రము దర్బారునందు లేడు. ఆతఁడెచటనుండెనో యెవ్వరెఱుంగరు. దర్బారునకు దూరమైయుండుట యొక తెఱంగున బాధకరమేయైనను మొత్తముమీఁద, ప్రవాసమే యాతనికి క్షేమకరముగ నుండెను. విషపూరితమగు మొగలాయి వాతావరణమునకు దూరముగ నుండుటచే నాతఁడు పార్వేషు షరియారులవలె హైన్యస్థితికిఁ బాల్పడక, సార్వభౌముఁడై జగద్వంద్యుఁడాయెను.

రాజపుత్రుఁడగు ఖుర్రము సామ్రాజ్యాధిపత్యము నెన్నఁడు నాసింపలేదు. ఆతని తండ్రియగు జహంగీరు యెట్టివ్యసనములకు లోనైయుండినను ధర్మపథంబును మాత్రము తప్పలేదు. ఒకానొక సమయమున జహాంగీరుపై గినిసి తండ్రియగు నక్బరుపాదుషా కుమారుని వర్జించి ఆతని తనయుఁడగు ఖుస్రూఖానునకు సామ్రాజ్యము నప్పగించదలచిన వాఁడయ్యె, నట్లు లాచరించుట యధర్మమని యెంచి కుమారుని రావించి, ఆతనినే తన వారసునిగ నంగీకరించిన విషయము సుప్రసిద్ధము

గదా. జహాంగీరు సహితము ట్టులే ప్రవర్తించెను. దురదృష్టవంతుఁడగు ఖుస్రూ రంగమునుండి తొలంగిన కారణమున రెండవ కుమారుఁడగు పార్వేషే భావి సామ్రాజ్యాధిపతియై యుండెను. గుణదోషములను విమర్శించి రాజ్యాధిపతిని నిర్ణయింపగునేని, ఎంతమాత్రమును పార్వేషు రాజ్యార్హుఁడు కాడని పౌరులెల్లరు నంగీకరింతురు. కాని ఆతఁడు గుణరహితుఁడైనను ఆతని హక్కు నింకొక తనయున కొసంగుట పాడికాదని యెంచి, పార్వేషే భావి సామ్రాజ్యాధిపతి యని జహాంగీరు నిర్ణయించెను. కాని, ఖరీము సార్వభౌముని వేఱొకభార్య యగు రసపుత్రవనితారత్నమున కుదయించి యుండిన కారణమున, అధికారము వహించియుండిన రసపుత్రవీరు లాతనినే సింహాసనాసీను నొనరింపవలయునని కృతనిశ్చయులై యుండిరి. వారు నికృష్టముగఁ గాలము వ్యర్థపుచ్చుచుండిన పార్వేషునెడ వారు విముఖులై యుండిరి. దర్బారునందలి వేర్వేరు పక్షులను వెనుకటి ప్రకరణమున వివరించి యుంటిమి. మార్వాడు అంబరువంశజులగు రాజకుమారులు పాదుషాపై లోలోన వైరమూనియు, సరసముగ బ్రవర్తించుచుండిరి. ఉదయపూరు మహారాణాయగు భీమసింగుమాత్రము తన శత్రుత్వమును వ్యక్తీకరించుచునే యుండెను. ప్రతాపశాలియగు నాపిరాగ్రేసరుఁడు ఖరీము పక్షపాతియై యుండి, జహాంగీరుమరణించిన పిమ్మట హైందవ సామ్రాజ్య లక్ష్మినాతని యధీనముచేయుటకై బహిరంగముగ విశ్వప్రయత్నము లొనరించు చుండెను. పరియారు, సార్వభౌముఁడగు నూచనలు కూడ లేకపోలేదు. ఆతనికిగూడ నొక పక్షయుండెను. కాని, ఆప్రయత్నము లన్నియుఁ గడు నిగూఢముగ జరుగుచుండుటచే బాహ్యప్రపంచము గుర్తింపఁజాల కుండెను. సార్వభౌముఁడు మరణించునంతనే పరియారును సింహాసనాసీను నొనరించుటకై యాతని పక్షపాతులు సముచిత ప్రయత్నము లొనరించుచుండిరి. వారి యాశ

యము ఫలించు నవకాశము లనేకము లుండెను.

కాని, పార్వేషు ఖరీముల యవస్థ కడు దుర్భరముగ నుండెను. రాజాభిప్రాయమున ననుసరించి పార్వేషుయును, రసపుత్ర జనాభిప్రాయము ననుసరించి ఖరీమును భావి సామ్రాజ్యాధిపతులై యుండిరి. కాని, ఇరువురకును, సామ్రాజ్యాధిపత్యము లభింపదు గదా. ఈలోపున, ఒకరి పక్షపాతులవలన నొకరి కెట్టియుపద్రవము సంభవించునో చెప్పజాలము విషముచేగాని హంతకుల కరవాలములచే గాని యే ముహూర్తమున ప్రాణము లంతరించునో గదా. గూఢచారులు వారివెనువెంట నీడల వలె నిరంతరము దిరుగాడుచునే యుండిరి. మరికొందరు పక్షపాతు లాతనికై యెట్టిప్రయత్నము లొనరించుచుండినను, ఆతనికి మాత్ర మట్టి యభిప్రాయములేదు. సామ్రాజ్యాధిపత్యము నాతఁడెన్నఁడు నాసింపలేదు. పానమే యాతని రాజ్యము. మోహనాంగుల గాఢా లింగనములే యాతని సామ్రాజ్యము.

నేఁడు షహజాదా షరియారు యవస్థ యెట్లుండెనో కాంచియుంటిమి గదా. ఆతఁడు మద్యము సేవించుచు, విలాసినీ జనంబుల శృంగార చేష్టల వినోదించుచు, వేఱువిచార మెఱుంగక కేవలము పరవశుఁడై యుండెను. కాని, ఏలకో ఆ కోలాహలమంతయు హఠాత్తుగ నాగి పోయెను. పాషాణములనైన గరగింపగల యక్కులకంఠుల గానము నిలిచిపోయెను. మెఱుపువలె నృత్యము సలుపుచుండిన మించుబోండ్ల కరచరణములుకూడ కట్టువడెను. వీణాదివాయిద్యంబులు సహితమట్టులే నిలిచిపోయెనని వేఱుగఁజెప్పనక్కరలేదుగదా. రసికుఁడగు రాజకుమా రుని విలాసార్థమే తెంచిన విలాసినీజనంబులెల్లరు చైతన్యముడిగి నిర్జీవ ప్రతిమవలె నుండిరి. వారందఱు భయవిహ్వలులై ద్వారమువంక దిల కింపదొడంగిరి. తోడనే, భువనైకసుందరియగు నూర్జహాను, మేఘము నతిక్రమించి మెఱయు చంద్రబింబమువలె, నక్షత్రముల బోలిన పరిచా

రికలచే పరివృతమై గోచరించెను.

మహాసామ్రాజ్యమును శాసించు మహారాణి హఠాత్తుగ నటుదెంచుటచే నా వెలయాండ్రు భయభ్రాంతులైరి. నూర్జహాను యనినంతనే సామ్రాజ్యమంతయు గడగడలాడుచుండ నీవెలయాండ్రు భయభ్రాంతులగుట యబ్బురమా ? ఎద్దియో గొప్ప యవసరముండినగాని అట్టి యసమయమున హేయమగు నా క్రీడామందిరమునకు మహారాణి యేల వచ్చును ? క్రోధముచే ఘూర్ణిల్లు కొదమసింగమువలె నామె ప్రవేశించెను. తోడనే, అచటి జవరాండ్రు శిరముల నేల మోపి మహారాణికి ప్రణమిల్లిరి. వారి ప్రణామంబుల సముచితంబుగ బరిగ్రహించి, రెండడుగులు సాగి, రాజపుత్రు నుద్దేశించి, మృదుమధుర గంభీర స్వరంబున ' షరియార్ ' యని సంబోధించెను.

నూర్జహానును గాంచినంతనే షరియార్ సహితము భయభ్రాంతుండాయెను. రక్షకభటుని గాంచిన చోరునివలె నాతని యుల్లము ఝల్లుమనెను. పిడుగుపడినటు లాతఁడు ప్రమాన్పడెను. ఎట్టకేలకు దెలివి యొంది, ధైర్యము వహించి, ఏతెంచిన మహారాణికి స్వాగత మొసంగుటకై లేవఁబోయెను. కాని, ఇంతవఱకును తప్పద్రావుచుండిన కారణమున నవయవము లాతని యధీనమున లేకుండుటచే భగ్నమనోరథుఁడాయెను. లేవజాలని యా రాజకుమారుడు తూలి తూలి ప్రాకి ప్రాకి యెట్టులో మహారాణి పాదపద్మములను సమీపించి, నోరు తెరచినచో నెట్టి యసంబద్ధ ప్రలాపములు వెలువడునో యని వెఱచి మౌనము వహించి యుండెను.

కడు హేయముగ నుండిన వాని యవస్థగాంచి యాగ్రహపరవశయై చుఱచుఱఁ జూచుచు, తీవ్రస్వరమున మహారాణి యిట్లు పలికెను—

" ఓయి రాజాధమా ! ఒకానొక ముఖ్యవిషయమై నీతో ముచ్చటింప నేతెంచితి, "

"తోడనే, పరిచారికు లిర్వురు కై దండయిడ నాతఁడు లేవఁ బోయెను. కాని, సారాయి ప్రభావమింకను వదలకుండుటచే వాఁడు కుప్పవలె నేల గూలెను. అతి హేయమగు నా దృశ్యము కడుంగడు దుస్సహముగ నుండుటచే వానిని లేవనెత్తవలయునని యా పరిచారికలకు మహారాణి కనుసన్న చేయ వారట్టు లొనరించిరి. అనంతర మామె యిట్లు గర్జించెను. "ఈజవ్వనుల భుజములపై నాని యీ ప్రక్క గదిలోనికి రమ్ము." ఆ పరిచారికల సాహాయ్యముచే నా రాజకుమారుఁ డెట్టు లెటులో నా గది జొచ్చి, వారి సాహాయ్యముచేతనే నొక 'ముసనదుపై' నాసీనుఁడాయెను. మహారాణికూడ నందు ప్రవేశించి తలుపు వైచెను.

షరియూరు యవస్థ కడుంగడు దుర్భరముగ నుండెను. తప్పద్రావి పూర్తిగ కైపెక్కియుండిన యమ్మానవాధముఁడు నూర్జహానుఁ గాంచి నంతనే భయభ్రాంతుఁ డాయెగదా. క్రమముగా వాని మైకమెక్కింత తగ్గెను కాని, భయ మధికమాయెను. మైకము తగ్గ కొలది వెఱపు యధికము కాఁజొచ్చెను. అట్టి యసమయమున నామె వచ్చుటకు గతం బెద్దియో, తన హైన్యావస్థను గాంచిన యమ్మహారాణి వలన దన కెట్టి ప్రమాదము కలుగునో యని వాఁడు తహతహలాడెను. నూర్జహాను యొక్క నిమేషమాత్ర మూరకుండి, రాజకుమారుని యవస్థ బరికించి దందహ్యమాన మానసయై కోపాటోపంబున నిట్లు కఠినముగ గర్జించెను — "షరియూర్! నీకై యెట్టి ప్రయత్నము లొనరించుచుంటినో నీ వెఱుంగుదువా?"

గడగడ వడంకుచు నస్పష్టముగ నాతఁ డిట్లు బదులిడెను. — "దేవీ! దయాస్వరూపిణివగు — నీవు నాక్షేమమే — యరయుచుందువు — నీకే తెలియును."

నూర్జ: "నీవు పాత్రుఁడవేనా"?

షరి : “ నీవు - సదా నాక్షేమ మరయుచుందువుగదా. నేను - ఇట్టులే కాలక్షేపము - కావింతును. ”

సూర్జ : “ షరిఖాగార్ ! నీయసంబద్ధ ప్రలాపంబులుడిగి నేను చెప్పబోవు విషయములను శ్రద్ధగాగమనింపుము. నీప్రవర్తనము గురించి యప్పుడప్పుడేను వినుచుంటి. నేను వినినదంతయు సత్యమే యని నేడు ఋజువాయెను. ఆశోభరితమగు సుప్రసిద్ధ మొగలాయి వంశమున నుదయించి యిట్టి నికృష్టపు కార్యముల నిరంతరము మునిగియుండు మందభాగ్యుల కెట్టి శిక్షవిధింపవలయు ? ఓయి ! రాజపుత్రా ! ఇకనైన మేల్కొనుము. ఇకనైన నీదుర్వ్యాపారములనువిసర్జింపుము. గతించిన దానికి వగచిన లాభములేదు. కాబట్టి, ఇకనైన రాజకీయ వ్యాపారములందు సముచితముగ పాల్గొని సరసముగ ప్రవర్తింతునని బాస చేయుము. నీహితముగోరు నాయెడ మాతృభావము వహించి నేను చెప్పిన చొప్పున మెలంగి ఐహికాముష్మిక సౌఖ్యముల బడయుము. ఒరులకు దుస్సాధ్యమగు మహాకార్య ధురంధరత్వమున కనుగుణముగ ప్రవర్తింపుము. అట్లుగాక, రోగికి వైద్యుని హితవాక్యములు రుచింపనట్లు, మదీయవాక్యములను సరకుచేయక - కూపస్థమండూకము వలె జీవితమునిట్టులే హేయముగ వ్యర్థబుచ్చ దలంచెదేని, మొగలాయి సామ్రాజ్యలక్ష్మిని నీయధీనము కావింపజాలను. ఉచితానుచితముల నెఱుంగని త్రాగుబోతుని సామ్రాజ్యాధిపతి నొనరించి కోటానుకోట్లు జనులను దురవస్థకు పాల్పడచేయనేల ? నేనట్టి పాపకార్య మొనరింపజాలను. ”

సారాయిమైకమింకను బూర్తిగ వదలకుండుటచే మిక్కిలి తడబడుచు రాజకుమారుడిట్లు బదులాడెను — “ పాదుసా — బీగమా — నా — సోదరులు — ఉన్నారుగదా — ఆవిషయం — వారే — కష్టపడుదురు — నేను — నాకు — రాజ్యం — అవసరములేదు. — ”

తోడనే, మహారాణికి బట్టరాని యాగ్రహము జనించినను, అల్ల నల్లనడంచి ప్రకంపితస్వరమున నిట్లుపలికెను. "ఓయి రాజపుత్రా! నేనింక పోవలయు కాని, నీవు రణరంగమున కేతేరవలయు, సన్నిద్ధుడవై యుండుము. ఏమైనను సరె, సూర్యోదయమగునంతనే బయల్వెడలుటకు సిద్ధముగ నుండుము."

వెలయాండ్రతో గూడి నిరంతరము మదనసంగ్రామ మొనరించుట తప్ప వేఱు యుద్ధమెఱుంగని యా దౌర్భాగ్యుఁడు రణరంగమనినంతనే గడగడ వడంకెను.—"యుద్ధమా? ఏల? నాకేమి?—"

"ఓయి దౌర్భాగ్యుడా! సూర్యోదయమగునంతనే సర్వము విశదమగును. నీవుమాత్రము సన్నద్ధుడవైయుండుము." అని పలికి యమ్మహారాణి మెఱుపువలె మాయమాయెను.

## 33

### షహాజాడీ బీగము.

షరియారు క్రీడామందిరమునుండి యాతని యర్ధాంగి మందిరమునకు మఱలుదము. ఆమె సూర్జహానుయొక్క పుత్రికయని పాఠకులెరుంగుదురు గదా. పుత్రుండైనను పుత్రికయైనను నామె యొక్కతయే యైయుండిన కారణమున నెల్లరు నామె యెడ మిక్కిలిభయ భక్తులతో మెలంగుచుండిరి. ఆమెను షహాజాడీ బీగమ్మయని పిలుచుచుండిరి. చిన్ననాటినుండియు దేవేంద్ర భవనమునుబోలిన మొగలాయి బీగముమహాలందుసకలజనవంద్యయైవర్ధిల్లిన యబ్బాలికామణి వేఱువిచారమెఱుంగక నిరంతరముభోగభాగ్యార్ణవతరంగములతో నోలలాడుచుండెను. మహాసామ్రాజ్యమును శాసించుచుండిన శక్తిస్వరూపిణి ముద్దులపట్టిబాల్యావస్థమీఱినపిమ్మట యుక్తాయుక్తముల నరయుచుతో ననుభవము గడించుచు జననియత్రివలె రాజకార్యముల బాల్గొనుటకు మాఱుగ యుక్త

కాలము ప్రాపించుచుండినను ముగ్ధవలెనే మెలంగుచు వినోదముల ప్రొద్దుపుచ్చుచు సంతతానందమగ్నమానసియై యుండెను. ఆహా! మోహప్రభావ మెంతటివారికైనను నంధుల నొనరించుగదా! విశేష మేధావంతురాలును ఘటనాఘటన సమర్థురాలునునగు నూర్జహాను సహితము మోహప్రభావముచే దనపుత్రికను సముచితముగ మందలింపకుండుటచే నాబాలిక నిరంతరము వినోదాది సౌఖ్యములయందేనిమగ్నయై యుండెను.

సౌందర్యమున మాత్రమాబాలిక తల్లినే పోలియుండెను. మనకథా సందర్భసమయమున నామె పదుమూరేండ్ల ప్రాయముగలిగి సర్వాంగ సౌందర్యముతో నిరుపమానముగ విరాజిల్లుచుండెను. ఆసుందరాంగి వదనము బాలచంద్రునివలెనుండెను. చెక్కిళ్ళు. మించుటద్దములవలె నుండెను. కండ్లు జేడిసలకంటె బెడంగుగ నుండెను. నాసికము చంపకము వలె నుండెను. అధరములు బింబఫలస్ఫూర్తి మీఱియుండెను. వీనులు శ్రీకారసదృశ్యముగనుండెను. కురులు హరినీలములవలెను కృష్ణసర్ప ములవలెను నుండెను. కంఠము శంఖమువలెను, బాహువులు పసిడి బిస కాండములవలెను నుండెను. హస్తములు కిసలయములు పెంపు వహించి యుండెను. పాలిండ్లు కరికుంభములవలెను, నడుము హరిణికిగను నుండెను. పిఱుదులు సైకతస్థలములవలెను, ఊరుయుగ్మము రంభా స్తంభములవలెను, పాదయుగ్మము తామరలవలెను నుండెను.

ఆసుందరీమణి బంగారు నగిషీలతో నిండియుండిన మొగముల సోఫాపై సుఖాసీనురాలై యుండెను. మరియారు క్రీడామందిరమువలెనే యీమందిరముకూడ నానాసూన వితాన వాసనలచే హాయిగనుండెను. తత్సమీపముననే చంద్రకాంత శిలానిర్మిత జలస్తంభములు పన్నీరు నెగజిమ్ముచుండెను. చక్కనిబంగారు కలశలయందు పలువిధములగు పరిమళ పుష్పములు సముచిత స్థలంబుల నమరియుండెను. మహాభోగు

లకు వలయు పదార్థములన్నియు గలిగి సముచితముగ నలంకరింపఁబడి యుండిన యామందిరము స్వర్గమువలె నుండెనని చెప్పుట యతిశయోక్తి కాదు. ఉమ్రావులు మొదలగు మహాజనులకు భాగ్యులై యుండఁగల మహావైభవముతో నుండిన నవయౌవన సుందరాంగుల ఆషాజాదీ బీగమునకు బరిచర్య యొనరించు చుండిరి. తను యేలిక సాని యుల్లము రంజిల్లు తెఱంగున నిటు నటు దిరుగాడు చుండిన సుందరాంగుల మధ్యమున నామె తారకాగణ పరివృతయై యుండు చంద్రబింబము పగిది విరాజిల్లుచుండెను.

అట్టిసమయమున నూర్జహాను ప్రవేశించెను. మరియూరు మందిరమున నాగ్రహ పరవశయై వెడలిన యమ్మహారాణి యిటకే తెంచెను. ఒడలెఱుంగక వినోదసౌఖ్యముల నోలలాడు చుండిన పరిచారికలా దివ్య సుందర విగ్రహమును గాంచినంతనే భయాశ్చర్యపరవశులై మిన్నకుండిరి. వారి యుల్లాసమంతయు వెంటనే యంతరించెను. అట్టి సమయమున మహారాణియేల యేతెంచెనో యని వారందఱు భయవిహ్వలులైరి. మహారాణి పుత్రికయు భ్రమాన్వితయట్టులే మిన్నకుండెను.

మహారాణి పరిచారికలం బరికించి యిట్టులనెను — "పరిచారికలారా! మదీయపుత్రికతో నొక్కింత ప్రసంగింప నేతెంచితి. మీరావలకు బొండు." తోడనే వారలందఱు సవినయముగ బ్రణమిల్లి రయంబున నిర్గమించిరి. తత్సమీపముననుండిన ముసనదుపై నాసీనురాలై నిజ పుత్రిక నుద్దేశించి మహారాణియిట్టులనెను. — "పట్టీ! లూలియా! నీతో రహస్యముగ సంభాషింపవలసినయవసరముండుటచే నేనేతెంచితి. సావధాన చిత్తవై యుండువా?

మహారాణి యట్లు పలికినంతనే నిరంతరము మందహాస మొనరించు షహజాడి వివర్ణవదన యాయెను. గభీరాకృతి దాల్చియుండిన జననిం గాంచి భయకంపితయై యట్టె తిలకించుచుండ, మహారాణి విస్పష్టముగ

నిట్లు వ్రాయుచున్నది. — 'నీ ప్రాణనాథుఁడగు పరిణయారు యెట్లు కాలము గడుపుచున్నాఁడో యెఱుంగుదువా ?"

మోము వాల్చి నృపసుమధురకంఠస్వరమున నబ్బాలిక యిట్లు పలికెను.—"తల్లీ! నాకా ప్రశంసయేల ?" తోడనే నూర్జహానుయొక్క దివ్యసుందరవదనారవిందము సంధ్యాసమయమునందలి భానుబింబంబు పగిది నెఱ్ఱబాఱెను. ఆగ్రహాయత్తచిత్తయైన మహారాణి చుఱచుఱం జూచుచు నిజపుత్రిక నుద్దేశించి తీవ్రముగా నిట్లు పలికెను. — "ఓసీ! ఆ ప్రశంస నీ కేలనా? ఆ ప్రశంస నీకు గాకున్న మఱియెవరికి? అస్మదీయగర్భమున జనించిన నీ వాసంగు ప్రత్యుత్తరమా యిది? మగని చర్యాగరయుతవలన భాగ్యకాంక్షలుగు లాభ మేమి? ఛట్టీ? నీమతి భ్రమించెనా యేమి! ఈనాటి యెఱుంగని నీవు మహాసామ్రాజ్య భారము నెట్లు వహింతువు? లాలిహారా! నీపలుకులు నాకెంత సంతాపకరముగ నున్నవి?"

సహజమృదుమధుర స్వరంబున నక్కలికి మెల్లగ నిట్లు ప్రత్యుత్తర మొసంగెను. — "అట్టి దురాశ నాకెన్నఁడు లేదు. ఢిల్లీపాదుషా బేగము కావలయునని యేనాఁడైన దలంపను!"

తోడనే మహారాణి క్రోధైకధురీణయాయెను. ఆగ్రహ మధికమై దుర్భరముగ నుండుటచే నాసుందరీమణి ప్రకంపితశరీరయై యిట్లు పలికెను. — "ఆహా! దైవ మెట్లు సమకూర్చెను! మందభాగ్యురాలా, సామాన్యపు సేనానియగు షేర్ ఆఫ్గనునియొక్క సంతానమునకున్న తాశయ మెట్లుండును? నీవు నాపుత్రికవని చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది." మహారాణిపుత్రిక భయ విస్మయములచే దిప్పువడుచుండియు, తల్లి యట్లు నిరసించినంతనే క్రోధకలుషితాంతరంగయై యిట్లు బదులాడెను. — "నీవు చెప్పిన సూత్రముచొప్పుననే ప్రకృతి ప్రవర్తించునేని, నీవు సార్వభౌమురాలవై యిట్టి యసాధారణాధికార వైభవములతో

దులతూగుచుందువేమో నీవే యాలోచించుకొనుము.”

కటుయుక్తియుక్తముగ నుండిన యీపలుకులు ములుకులవలె మహారాణి హృదయమున నాటెను. షేరుఆఫ్గనుకంటె దన తండ్రిజాతము బట్టి గౌరవనీయుఁడు కాఁడని నూర్జహాను యెఱింగినదగుటచే నాగ్రహపరవశయయ్యు, బ్రతివచనము లాడనేరక ఖిన్నురాలై యల్లన నిట్లనెను—

“కుమారీ! నీతో వాగ్వాద మొనరించుటకు నేను రాలేదు. పట్టీ! అసంబద్ధ ప్రసంగమున కిది యదనుగాదు. మొగలాయిసామ్రాజ్యలక్ష్మి నీయధీనము కానున్నది. అయ్యాదె నాసంకల్పము అచిరకాలమున నీవసాధారణాధికారవైభవ సమన్వితవై విరాజిల్లఁగలవు!”

“తల్లీ! క్షమింపుము. అంతటి దురాశ నాకెన్నఁడు లేదు. నా ప్రాణనాథుఁడు సహితమట్టి మహాపదవి నెన్నఁడు నపేక్షింపఁడనియే విశ్వసింతును.”

తోడనే మహారాణికిఁ బట్టరాని యాగ్రహ ముదయించుటచే బుత్రికపై రూక్షవీక్షణంబుల బ్రసరించి తీవ్రముగ నిట్లు పలికెను—

“నాకు సర్వము నగమ్యముగఁ గాన్పించుచున్నది. చెఱుకుతుంద దోచు వెన్నువలె, యశోభరితమగు మొగలాయివంశమును జెఱుపఁ బుట్టిన యాత్రాగుబోతు — అన్నరాధముఁడు — ఆమరియారుకును శేలవగు నీకును దైవము చక్కగా సమకూర్చెను? ఆశయే యెఱుంగని మీవంటి మూర్ఖులుందురా?”

ముగ్ధయగు మహాజాడీబేగము సహజమగు మధురస్వరంబున నిట్లు పలికెను—“తల్లీ! నీవిట్టు లాగ్రహింపనేల? రాజకుమారులలో నెల్ల పార్వేజు జ్యేష్ఠుఁడు. కావుననాతఁడే రాజ్యార్హుఁడు. రాజాభిప్రాయము సహితమట్టులే యున్నది గదా! ప్రజాభిప్రాయముకూడ నిట్టులే యుండును. శాసనముచొప్పునను ధర్మము ననుసరించియును పార్వేజే భావిరాజ్యాధిపతియైయుండ, నాతని పదభ్రష్టు నొనరింపఁబూనుట

పాపహేతువుకాదా తల్లీ! నీ వట్టి కార్యమునకుఁ గడంగకుము."

"కుమారీ నీవు యుక్తాయుక్తముల నెఱుంగని వట్టిబేలవుసుమా. మొగలాయి దర్బారునందలి పరిస్థితులను నీవణుమాత్రమైన గుర్తింప జాలకున్నావు. మన పరోక్షమునసెట్టి దారుణమగు కుట్ర జరుగు చున్నదో నీవెరుంగవు. స్వార్థైక తత్పరులగు రసపుత్ర వీరులు సార్వ భౌము పుత్రుఁడగు ఖరీమును మూర్ధాభిషిక్తునొనరించుటకై నిగూఢ ముగ ప్రబల ప్రయత్నము నొనరించుచున్నారు. నేనువారి దుష్ప్రయ త్నములను వారింపక యున్నకుందునేని, వారు నిశ్చయముగ సంకల్ప సిద్ధులగుదురు. పార్వేషునకు సామ్రాజ్యము దక్కనేరదు; ఖరీమే సామ్రాజ్యాధిపతి కాఁగలడు. ఇఁక నీవేమందువు?"

"తల్లీ! నేనొక్కమాటాడెద, క్షమింపుము. మనసార నీవు సాహాయ్య మొసంగుదేని రూఢిగ పార్వేషు సింహాసనాసీనుఁడగును. ధర్మాత్ముఁడగుసార్వభౌముని యభిప్రాయము గూడ నట్టులేయుండుగదా"

"కుమారీ! నీవు రాజ్యతంత్రమెరుంగవు. పార్వేషు సింహాసనము నారోహింపఁ జాలఁడు. ఆ మహోన్నతపదవి ఖరీమునకే యులవడును" అని ఖచితముగ మహారాణి పలికెను.

"తల్లీ! నీవచనములు నాకుగ్రాహ్యము కాకున్నవి. నీవుసాహాయ్య మొనరింతువేని, సామ్రాజ్యాధిపత్యము పార్వేషునకేల లభింపదు? ఏది యెటులున్నను, సార్వభౌమురాలను గావలయునని యే నపేక్షింపను. ఈ ప్రస్తుతావస్థయే నాకు గడుంగడు సంతృప్తికరముగనున్నది."

తోడనే, దుర్భరాగ్రహానలజ్వాలల నయున ద్వ్యయుమునుండి, వెడల గ్రక్కుచు మహారాణి యిట్లు పలికెను.— "మందభాగ్యురాలా! ఖరీము సింహాసనారూఢుఁడైన పిమ్మట మనకెట్టిగతి పట్టునో యెఱుంగుదువా? మనమెట్టిదురవస్థకు పాల్పడుదుమో నీకుఁ దెలి యునా? తలంచినంత మాత్రమున దేహము గగుర్పడుచున్నదే!"

మాయమర్మము తెలియంగని యబ్బాలామణి యిట్టు లనెను — "తల్లీ ఇపుడాప్రశ్న యేల? మన యవస్థకు భంగమేల కలుగును? అపుడుకూడ నిట్టులే యుండును." నిశ్చలహృదయ యగు నబ్బాలిక యిట్టులాడినంతనే కోపఘూర్ణిత నదయ్యె మహారాణి దిగ్గునలేచి యిట్లు పలికెను. — "ఖరీము మనప్రాణముల హరించును."

"తల్లీ! నీవట్లు లననేల? ఖరీము ఉదార హృదయుడు, సాధుశీలుడు. అతడు మనప్రాణముల నేల గోరును? అసంభవము తల్లీ! దాచనేల? యథార్థము వచించెద నాలింపుము. నావివాహసంబంధమున నాహృదయాభిప్రాయము చెల్లియుండెనేని, మాననీయుడగు ఖరీమే మత్ప్రాణ నాథుడై యుండెడిని. సార్వభౌము పుత్రులలో నెల్ల నిక్కముగ నాతడేగదా యుత్తముడు!"

నూర్జహానుయొక్క తెలివితేట లీసమయమున నక్కరకు రాకపోయెను. ఎంత వితర్కించినను తన పుత్రికయొక్క మనసు త్రిప్పజాలకపోయెను. వేర్వేఱు కారణములచే దన డెందమును గలంచుచుండిన యాగ్రహము నెట్టులో దిగమ్రింగి ఆమె యిట్టులనెను.— "కుమారీ నీకు నచ్చచెప్పుటకు సాధ్యము కాకున్నది. మన యవస్థ ఎంత ప్రమాదకరముగ నున్నదో నీవు తెలియంగకున్నావు. తెలియంగని దానవు నా వచనముల బాటింపవలదా? నేను నీకంటె లోకానుభవముగల దానగదా! రానుండిన మహోపద్రవమును గుర్తించిన పిమ్మట బుద్ధిమంతులేమి కావింపవలయు? అట్టి యుపద్రవమును బ్రతిఘటించు మార్గము నన్వేషింపవలయుగదా. బిడ్డా! పలుమాటలేల? గమనింపుము. ఖరీము సింహాసనారూఢుడగునేని, మనల నందఱను దారుణముగ వధించును."

"తల్లీ! అసంభవము! అటు లెంతమాత్రము జరుగనేరదు. నేను విశ్వసింపజాలను."

"ఓసీ, బేలా! ఖరీము స్వయముగా మనలను వధింపఁడు. నాకు బద్ధవైరులును, నాపైఁ గసితీర్చుకొనుటకై యెంతయు దత్తరపడు చున్నవారును నగు భీమసింగు మహబతుఖానులే యట్టి దారుణకృత్యమునకు గడంగుదురు."

"తల్లీ! నీవు పూర్వవృత్తాంతము మఱచితివి కాఁబోలు. వారి వినాశము నీవు తలపెట్టియుంటివిగదా. వారి నిపుడేల దూషింప వలయు?"

"మందబుద్ధీ! నీతో నాకు వాగ్వాదమేల? ఉదయమగునంత నే మేము సమర సన్నాహములతో వెడల నున్నారము. పరియారు కూడ మమ్ము వెంబడించును."

సమర మనినంత నే షాజాడీ ముద్దుమోము వెలవెలబోయెను. భయాశ్చర్య విస్మయంబులకు లోనై ఆమె యిట్లు ప్రశ్నించెను — "తల్లీ? సమరమా! ఏల? ఎవరితోడ?"

"ఖరీము, భీమసింగు, మహబతుఖానులపై దాడివెడల వలయు. పాదుషావారు సహితము రణభూమి కేతెంతురు. యుద్ధరంగము బ్రవేశించి నేనును స్వయముగాఁ బోరాడెదను."

నవ్వులొలుకు షాజాడీ వదనము వన్నెదొలఁగెను. విచారగ్రస్తయై భయవిహ్వలయై మాట తడబడ నామె యిట్లులనెను — "తల్లీ! సమరము సర్వవిధముల ననర్థదాయకముకదా! రక్తపాతమువలన గలుగు లాభ మేమి?"

దండతాడిత భుజంగమువలె గడుగనలి మహారాణి యిట్లు గర్జించెను — "దుర్మదాంధులగు భీమసింగాదులు రహస్యముగ సమరసన్నాహము లొనరించుకొని మనపై నాకస్మికముగఁ బడవలయునని నిరీక్షించుచున్నారు. ఖరీమును సామ్రాజ్యాధిపతి నొనర్చుటయే వారి నిశ్చితాభిప్రాయము. ఆదుర్మార్గు లెట్టి ద్రోహము దలపెట్టిరో

చూచితివా? ఈనూర్జహాను ప్రతాపము నెఱుంగని యీ మూఢా త్ములకుఁ దగు తెలుంగున బుద్ధి చెప్పవలయు."

కొంత తడవు షాజాడీ మాటాడనేరక పోయెను. ఆమె బాల్యము నుండియు నిర్విచారముగ భోగభాగ్యముల నోలలాడుటయే గాని, రాజకీయవ్యవహారముల నెఱుంగదు. ఆమె నిరంతరము భోగభాగ్య సమన్వితయై, యుండినను, ఆమెహృదయము మాత్రము నిర్మలమై నిష్కళంకమై, ప్రేమ రసపూరితమై యుండెను. విషపూరిత మగు రాజకీయము లట్టి వినిర్మల హృదయముఁ జొరనేరవు. కావుననే, దర్బారున జరుగుచుండిన కుట్రలనామె యెఱుంగకుండెను. ఈలోక మున స్వార్థమే దైవమనియు, స్వార్థపరు లెట్టి పాపకార్యమునకైన వెనుదీయరనియు నామె యెఱుంగదు. ఆ కారణముచేతనే నూర్జహాను యొక్క వచనము లామెకు భయాశ్చర్య విస్మయములు కలిగించు చుండెను. రాజ్యతంత్రముద్రిప్పుచుండిన నూర్జహానునకు సంగ్రామమొక సాధారణ ధర్మమువలెనుండెను. కాని, షాజాడా మాత్రము యుద్ధ మనినంతనే భయవిహ్వలయాయెను. ఆమె ఢిల్లీ సామ్రాజ్యాధిపత్యము నొల్లకుండుటకదియే కారణము.

నూర్జ: "లాలీ! ఉదయమగునంతనే మేముబయలుదేరవలయు."

షాజాడీ: "తల్లీ! ఎచటకేగెదరు?"

నూర్జ: "రాజపుతానా వైపు పోయెదము. మార్గమధ్యమున సిక్రీనగరమున నవసరముండునేని నిలువచ్చును. ఏమార్గము ననుస రించి వెడలుదుమో మొదలగు వివరముల నింకను నిర్ణయిం పలేదు. షరియారు కూడ మాతోనే తెంచును."

షాజాడీ: తల్లీ! ఆతఁడు సమ్మతించెనా?"

నూర్జ: "ఏమీ? సమ్మతమా? నాయాజ్ఞ నెవ్వరైన నుల్లం ఘింప సాహసింతురా?"

షాజాడీ: "తల్లీ ! నీకింతయాగ్రహమేల ? మరియాతను నేనును యొకవిమున రాజ్యాధిపత్యమే వహించినను అపుడు కూడ నీవే యీ విశాల సామ్రాజ్యమును శాసించెదవు ! తల్లీ ! ఈయుద్ధము, ఈరక్త పాతము, ప్రజాసంక్షోభము వ్యర్థము గదా !"

ఆగ్రహాధికముచే గుంగుచుండిన నూర్జహాను వెంటనే మాటాడ నేరకపోయెను. ఆమెకు పాదుషా యంతవాడు సహితము నూర్జహా నున కెక్కడ కోపము వచ్చునో యని యడలుచు గడు సరసముగ సంచరించును. శక్తి స్వరూపిణియగు నూర్జహాను యెదుట నెవ్వరు ధైర్యముగ మాట్లాడజాలరు. అట్టి మహారాణికి నేడు సంపూర్ణ పరాభవము సంభవించెను. పరాభవాగ్నిచే నామె డెందము దహించుకొని పోవుచుండెను. ఆమె హృదయతాపమును షాజాడీ గుర్తింప నేరక యథాలాపముగ విషాదకరమగు నొక గీతమును హీనస్వరమున బాడదొడంగెను. ఎట్టకేలకు మహారాణి యిట్టులనెను—

"నేను కొంతకాల మాగ్రానగరము వీడియుందును. అంతకాలము నాకు మారుగ నీవు పరిపాలింతువని యెల్లరకు దెలియబఱచి యుంటిని. నాకుగల సర్వాధికారములు నీయధీనమై యుండునని యెఱుంగుము.

విస్మయ పరవశయై షాజాడీ యిట్టులనెను—"నాయధీనమగునా ?"

నూర్జ: "ఔను సర్వాధికారము నీయధీనమై యుండు. నేను దూరముగనుండు సమయమున జోదుభాయి మొదలగు వారలు పరిపాలనాభారము వహింపరాదు."

షాజాడీ "తల్లీ ! నీవట్లు లాడరాదు. జోద్బాయికూడ పాదుషావారి బీగమేకదా ! ఆమెయు సర్వము నెఱుంగు. కాని, నీవు లేని సమయమున నిమ్మహా కార్యధురంధరత్వమును కామెయేతగును."

నూర్జ: "రాజకీయ విషయములను నాకు నేర్పెదవాయేమి ?

చాలుచాలు. నీచందముచూడ, పిల్లను గ్రుడ్డుత్రిప్పింపఁ జేయునటు లున్నది! నేను చెప్పిన చొప్పున మెలంగుము."

మాఱు పలుక నేరక షాజాడీ సమ్మతించెను.

నూర్జ: "లూలీ! రాజ్యపరిపాలన మన్న నీకింత నీరసముగా నున్నది కాని, అన్యు లీయధికారమున కెంత తత్తరపడుచుందురు? మహాభాగ్యముగఁ బరిగణింతురే!"

షాజాడీ: "ఒరులెట్లు తలంచిన నాకేమి? వారి యిష్టాయిష్టములను నేను సరకుఁజేయను. తల్లీ! ఇయ్యది నాకెంత మాత్రము రుచింపదు."

నూర్జ: "నేను చెప్పినదంతయు గమనించితివిగదా. నా యాజ్ఞానుసారముగ సర్వము జరుగవలయు." అని పలికి మహారాణినిర్గమించెను. జీవరహితమగు సువర్ణ విగ్రహమువలె షాజాడీ యట్టె యుండెను. విచారమెఱుంగని కోమల హృదయమును సంతాపమావరించెను. విధివిధానమట్టులే యుండునుగదా! వేయి సంవత్సరములు తపమాచరించినను పలయువారికి లభింపనేరని యధికారము షాజాడీకి మిక్కిలి యసహ్యకరముగను దుఃఖభాజనముగను నుండెనే! కిరీటము ధరించి విషపూరితమగు రాజకీయములలో నిరంతరము మునిగియుండుటకంటె, ఉన్నదానితో సంతసించి, ఇచ్ఛకువచ్చు సౌఖ్యముల నిరంతరము నిరాఘాటముగ నోలలాడుటయే మేలని యామె భావించెను. కావున ఆమె కీయసాధారణాధికారము భరింపరాని మహాభారమువలె నుండెను. కావున నామె యుత్సాహమంతయు నంతరించెను. ఉత్సాహ మంతరించుటయేగాక, వర్ణనాతీతమగు కలవరము కూడ జనించెను.

ఆమె తొట్రుపాటున కొక ముఖ్యకారణ ముండెను. షరియారు యుద్ధసన్నద్ధుఁడై వెడల నుండెను. వేఱొక ప్రపంచమువలె నుండిన

బీగముమహాలునందు సమాచారములు సరిగా జొరనేరవు. అందు కేవలము వినోదాదుల కాలముగుచున్న షహజాడీ అసలే యెఱుంగ నేరదు. కాని, తన ప్రాణనాథుడగు షరియారే రణరంగమున కేగ నుండెనని తెలిసినంతనే, ఎద్దియో మహోపద్రవము రానుండెనని యెంచి యబ్బాలిక భయకంపిత యాయెను. జహాంగీరు మరణానంతరము సామ్రాజ్యమును స్వాధీన పఱచుకొనుటకై పాపపుణ్యముల నరయక స్వార్థపరులు రహస్యముగా నొనరించుచుండిన వివిధ ప్రయత్నముల నామె యెఱుంగదు. మిగిలియుండిన రాజకుమారులలో నెల్ల షార్యారే పెద్దవాడగుటచే నేమియు నెఱుంగని యా ముద్దరాలు అతడే కిరీటము ధరించునని భావించును. తనచుట్టు జరుగుచుండిన కుట్రలగుఱించి యణుమాత్రమైన నామె యెఱుంగదాయెను. నాటి సాంప్రదాయము ననుసరించి రాజ్యసంపాదనకై తత్తరపడవలసిన షరియారుకూడ రాజ్యాభిలాషలేక స్త్రీలోలుడై కేవలము భోగానురక్తుడై ప్రొద్దుపుచ్చుచుండ, కుట్రలగుఱించి యామెకు యర్థాంగి కెట్లు తెలియును? కాని, యుద్ధపువార్త నేడు పిడుగువలె దెలియవచ్చెను. తండ్రికుమారులకు యుద్ధము సంఘటించెను. స్వార్థ మెఱుంగని నిర్మల హృదయయగు నక్కోమలాంగి యీ మహాసంక్షోభమునకు దన తల్లియే కారకురాలని గుర్తించెను. విశాలమగు మహాసామ్రాజ్యమును సార్వభౌముని యడ్డంకి లేక సంపూర్ణాధికారముతో నిరంకుశముగ బరిపాలించుచున్నను నూర్జహాను యేల సంతసింపదు? ఈ యధర్మయుద్ధమున కామెయేగదా కారకురాలు! ఇట్టి యకార్యమున కామె యేల పూనుకొనవలయు?

చింతాక్రాంతయై యుండిన యాచిగురుబోడి యిట్లు పరిపరివిధములు పరితపించుచుండ "షరియారు" యరుదెంచుచున్నాడని పరిచారిక లెఱింగించిరి. తోడనే, సారాయి మైకముచే దూలిపోవుచుం

డిన యారాజకుమారుఁ డల్లన ప్రవేశించి, నిజభార్య నుద్దేశించి, యిట్లు పలికెను.

"లూలీ! నీవేమి యాలోచించుచుంటివి? ప్రేయసీ! మాతల్లిప్రవర్తనమెంత యసంబద్ధముగ నున్నదో కాంచితివా? పేరాస యెఱుంగక నిరంతరము సౌఖ్యముగఁ గాలముగడపఁజూచు నన్ను యమాలయమున కంపఁజూచుచున్నది. తండ్రి ధరించుకిరీటము నేనెన్నఁడాసింపనే! నాకీ యుద్ధమేల! అకారణముగ వేనవేలు జనులు రణరంగమున మడయనేల? సుందరీనాకు సవిస్తరముగ నెఱింగింపుము"

అంత నాసుందరాంగి ప్రాణనాథుని డాసి వానికరంబును దన కోమలకర పల్లవంబునఁ బట్టి ప్రేమానురాగంబులుట్టిపడు స్వరంబున నిట్లు పలికెను—

"ప్రాణేశ్వరా! స్వర్గీయ సామ్రాజ్యభారమునైన వహింపఁదగు మీరీ కిరీటము నేల ధరింపరాదు?"

అయ్యింతి ముద్దుమోము గాంచి రాగరసమగ్నుండై పరితాపరు యిట్లు బదులాడెను— "సుందరీ! రణరంగమునకుఁ బోవలయునని నీవాజ్ఞాపింతువేని మా రాడక యీక్షణమె పోయెద. నీయాజ్ఞ మహాప్రసాదమని యెంచి సామ్రాజ్యాధిపత్యము వహించెద. కాని, కోమలాంగీ! నీవు నీతల్లివలె సామ్రాజ్యపరిపాలనా భారమంతయు వహింతువుగాక. నాతండ్రివలె నేను కిరీటము మాత్రము ధరించి నిరంతరము భోగార్ణవతరంగములలో దేలియాడుచు నుందు."

అంతలో, తత్సమీపమున నుండిన వెలయాండ్రు ఆతని దృష్టినాకర్షించిరి. మెఱుంగు దీగెలవలె నుండిన తనూలతను, నగము జాఱిన పయ్యెదలను, పూర్ణకుచకుంభములను గాంచినంతనే విచారము మఱచి కామాయత్తచిత్తుఁడై నిజకాంతనుద్దేశించి యిట్టులనెను—"లూలీ నీప్రాపు విడిచి యెంతకాలము ప్రవాసమున నుండవలయునో యెఱుం

గరాదుగదా! కావున నొక్కసారి యీ జవ్వనుల నృత్యము గాంచి యానందించి మఱియు బోయెదగాక, ఆనతిమ్ము." అనగని సౌఖ్యమే తనసౌఖ్యమని యెంచు నమ్మానవతి తోడనే కనుసన్న చేయ, ఇనుపకచ్చడముల గట్టుమునుముచ్చుల మనంబులనైన నాకర్షింప జాలినయామత్తకాశినులు తమ నృత్యకళా కౌశల్యమును బ్రదర్శింప నారంభించిరి. వారి నృత్యము కేవలము వర్ణనాతీతమై యుండెను. మెఱపులవలె నృత్యమొనరించుచుండిన యచ్చపలాక్షుల సర్వాంగములు నానమయమున సహస్రాధిక వైభవ సౌందర్యములతో విరాజిల్ల స్త్రీలోలుడగు నారాజకుమారుఁడు కామోద్రేకమున నోడలెఱుంగక దిగ్గున లేచి చేరికందిన మచ్చెకంటిని గాఢాలింగన మొనరింప గమకించెను. తోడనే పాజాడీ కనుసన్నగాంచి యవ్విలాసినీ జనము మెఱుపువలె నదృశ్యమైరి.

## ౩౪

### ప్రేమాంకురము.

మొగలాయి దర్బారు నందలి భోగ భాగ్యాది వైభవములను గాంచియుంటిమి. ఇక, జగదైక సార్వభౌముఁడగు నక్బరు పాదుషాకు రాజధానియై విరాజిల్లి ఈ కథాసందర్భ సమయమున నిర్జనముగ నుండిన సిక్రీనగరమునకు మఱల మఱలుదము. సకలాఘములకుఁ దావలమై యుండిన బీగను మహాలునకు దూరముగనుండిన సిక్రీనగరము పరిశుద్ధమగు ప్రేమకు నాలవాలమైయుండెను. అందు నన్యోన్యప్రేమానుబంధంబున ధన్యాత్ములై ప్రవర్తిల్లుచుండిన పుణ్యాత్ము లిర్వురుండిరి.

అసాధారణ సౌందర్యవతియు సుగుణరాసియునగు లూలియాయను బాలికామణి నిర్జనప్రదేశమగు సిక్రీనగరమున వృద్ధుఁడగు సలబతుఖాను నింట నుండెనని పాఠకు లెఱింగియే యుందురు. ఆసుందరాంగి యొక

నాఁడు సూర్యాస్తమయావసరమున నీరమునకై బావికేఁగుటయు నచ్చట స్త్రీవేషము ధరించియుండిన భువనైక మోహనాకారుఁడగు యౌవన పూరుషుని గాంచుటయు, క్రమముగా నాతనిపై నబ్బాలికకు ననురాగ ముదయించుటయు రాగరసమగ్నమై తన్నుదా మఱచుటయు గూడ పాఠకు లెఱింగి యుండవలయు.

నిర్మలాకాశంబున శీతమయూఖుఁ డుదయించి నిజ ధవళధావళ్యంబున లోకము నాక్రమించెను. మనుష్య సంచార మెఱుంగని యచ్చటి సౌధరాజము లసాధారణ వైభవముతో విరాజిల్లుచుండెను. ప్రకృతిపరమ శాత్రవుఁడగు నరుని సంపర్క మెఱుంగని యచటి పుష్పచయంబులు నానావిధ పరిమళంబులను వెదజల్లుచుండెను. అట్టి సమయమున లూలియా యొకయేకాంతప్రదేశమున నిట్లు చింతింపఁదొడంగెను: "తననామధేయము విమలసింగు యనియు, అంబరు తన నివాసస్థలమనియు, తనను బట్టువానికి విశేషధన మొసంగెద నని సార్వభౌముఁడు ప్రకటించియుండెననియు, దానికారణమున వనితారూపంబు ధరించి యచ్చటచ్చట గ్రుమ్మరుచుంటిననియు, నిర్మానుష్యమైన సిక్రీనగరము మాఱుమూలనుండిన కారణమున దానచటదాగి యుండుటకనుకూలముగ నుండెననియు జెప్పియుండెగదా. ఆనవమోహనాకారుఁడు మృదుమధుర స్వరంబున బలికిన పలుకులింకను నావీనులమాఱు మ్రోగుచునే యున్నవి. "నాకెట్టి యుపాయము రానీక, కుక్కలవలె నన్ను బట్టుటకై నిరీక్షించుచుండు నరాధములకు నన్ను అప్పగింపక నన్ను రక్షింతువని పూర్తిగ విశ్వసించియున్నాఁడ. దయార్ద్రహృదయవగు నీవు పట్టెడోగిర మొసంగిన జాలు నీనిర్జన ప్రదేశమున సురక్షితముగ నుండజాలుదు." అను నాతని పలుకు లామానవతి వీనుల మాఱు మ్రోగుచునే యుండెను. ఆ పురుషవరేణ్యుని దివ్యాకృతి యప్పల్లవాధరి నెమ్మనంబున గాఢముగ నాటి యుండెను. ఆసుందరా

కారుని దెబ్బలను దలంచునపుడెల్ల సుకోమలాంగి హృదయము కంపించుచుండెను. మఱువఁగోరినను నాసుందరాంగి మఱువజాలకుండెను.

పరిశుద్ధాత్మయగు నా బాలిక పరదేశాగతుఁడగు రాకొమరుని యపాయముఁ గాంచి కరుణాయత్తచిత్తయై యాతని రక్షించుమార్గముల నన్వేషింపఁ గడంగెను. తనకారణమున నాతని కెట్టి ప్రమాదము సంభవించునో యని వెఱచి నాఁటి యుదంతము దనదాదియగు హమీదాకు నైన నెఱింగింపదాయెను. కన్నతల్లివలె గడుగారాబముగ సాకుచుండిన తనదాదివద్ద నెట్టిసమాచారమైన నెన్నఁడైన గప్పియెఱుంగదు. నాఁటఁగోలె నాయువకుని ననుదినము నాబావిచెంతనే యామె యేకాంతముగఁ గాంచుచు దాను భుజించు నాహారము నందొక భాగము నాతనికందిచ్చుచుండెను. ఆరాజకుమారుఁ డనుదినము లూలియా చూపుచు సంకేతస్థలంబున కరుదెంచుచు సుకోమలికోమల కరపల్లవంబుల నాహారంబు గుడుచుచు నాసుందరిసుందర వదనారవిందముగాంచి యానందించి పరవశుఁడగుచు రయమున మాయమగుచుండెను. అంతవఱకు నాతనియుదంతము నెఱింగింప వలయునని లూలియా కోరలేదు. ఆతఁడు తెలుపలేదు.

రాజకుమారునిఁ గాంచిన కొన్నిదినములు లూలియా యీరీతింగున జింతింపదొడంగెను:—“ ఈయువకుని పూర్వవృత్తాంతమే నెఱుంగను. ఇట్టి పరపురుషునితో నేకాంత ప్రదేశమున రహస్య సంభాషణము లొనరింపనగునా? నాతల్లి తండ్రుల కెఱింగింపకుండ నిట్టులాచరించుట పాడియగునా? కాదు కాదు. నేనిట్టికార్యము నిక నాచరింపరాదు. నామనస్సాక్షియు నట్టులే బోధించుచున్నది.” ఆమె ఆయుత్తరక్షణముననే యిట్లు వితర్కించును—“ కాని పరమశత్రువుఁడైనను కృపణుఁడగు వానిని రక్షించుట సాధారణ ధర్మమే గదా. రక్షింపకుండుట పాపావహము గాదే. కావున నాతనికి నోగిరముమాత్ర

మొసంగెద. నిమ్నమైన నట నడయక గృహమున కేతెంచెను. కాని, రెండవ మన్మథుని వలె విరాజిల్లు నారాజకుమారుని గాంచి ముచ్చటింపక మఱలుట యెట్లు? ఆమె నిశ్చితాభిప్రాయము వెన్న వలె కరగిపోవును. ఆ సుందరాంగుని మనోహరా కారమును గాంచి భ్రమించి ఆతని సరస ప్రసంగమున కలరి లూలియా వేఱు విచార మెఱుంగక నాగస్వరముచే గట్టువడు నాగకన్యకవలె నట్టె నిలిచిపోవును. ఆమెపూర్తిగ మోహపరవశ నాయెను.

విమలసింగు కూడ మోహపరవశుఁడై యుండెనని వేఱుగ చెప్ప నక్కఱలేదు. ముగ్ధయగు లూలియా నాత్రేమము గ్రహింపనేరకుండెను. ఆతఁడు వచించు పలుకు లొక్కొకటి యమృత బిందువులవలె నామెకు పరమానందము కలిగించుచుండెను. కాని, దాని స్వభావ మిట్టిదని యాబాలిక నిర్ణయింప నేరకుండెను. మోహమునెడు నిర్ఝర ప్రవాహమున నామె యెఱుంగకుండ గొట్టుకొని పోవుచుండెను.

నాటి రాత్రి చంద్రుఁడు సంపూర్ణవైభవముతో విరాజిల్లుచుండె నని చెప్పియుంటిమిగదా. అమృతకరుని సాంద్ర కిరణములలో మునింగి ప్రకృతి యంతయు నిద్రించుచుండెను. ప్రదేశమంతయు గడు నిశ్శబ్దముగ నుండెను. హామీదా ఖాను మొదలగు వారుసహితము నిత్యము తలంచు విషయములను మఱచి నిద్రాసౌఖ్యమును జూఱ గొనుచుండిరి. అట్టి సమయమున లూలియా మెల్లగ లేచి నిజనివాసంబువీడి ఆ బావిచెంతకేగెను. తన రాకకై నిరీక్షించుచుండిన విమలసింగును గాంచి యానంద పరవశయై స్మితేందు వదనముతో నిట్టులనెను: "ఈ తెఱంగున నిన్నిక గలయరాదని భావింతును."

తోడనే యాతఁడయ్యింతి కోమల కర పల్లవంబుల దన పాణిం బట్టి యల్లనల్లన దన చెంత గూర్చుండబెట్టి మందహాస మొనరించుచు నశ్వాలికను దిలకించి భావగర్భితంబుగ నిట్టులనెను — "భరుల

యాక్షేపణలను నరకుఁజేయుని యధికారము నీవాసంగెదేని, యిట్టి మనకష్టము లెల్ల దీరునుగదా!”

బేల యగు లూలితయా యుండలి హృదయార్థము గ్రహింపనేరక డిల్లవడి యాసుందరాంగుని వదనారవిందము నట్టె చూడ దొడంగెను. మోహపరవశుఁడై యుండిన రాజకుమారుఁడు తోడనే యా భీతహరిణనేత్రను జేరదీసి నిజ భుజాయుగాంక పాళీ యలయంబున బిగ్గబట్టి చెక్కుటద్దముల నవిచ్ఛిన్నముగ ముద్దిడుచు, నధరామృతమును నిరాఘాటముగ జవిచూచుచు, మరల మరల గాఢాలింగన మొనరించుచు, పూర్తిగ బరవశుఁడై కేవలము బ్రహ్మానందము నందుచుండెను.

కలారవాస్యములు నెఱుంగని యుమ్ముద్దరాలు నిమీలిత నేత్రయై యచేతనయై యుండెను ఆ రాజకుమారుని గాఢాలింగనములు చుంబన పరంపరలును నామె దేహమున విద్యుచ్ఛక్తివలె ప్రవేశించి ప్రవహింప, వాయుపీడిత పత్రమువలె వడంక దొడంగెను. ఘర్షణములు నృత్యముల వలె నామె దేహము నలంకరించెను. ఆ రాజకుమారుని చర్యములామె కెంతయు నానందదాయకములుగనుండెను. అట్టి సౌఖ్యము నెన్నఁడు నాబాల యెఱుంగని కారణమున కేవలము పరవశయై యుండెను.

లూలితయామెట్టకేలకు దెలివినొంది విమలసింగు యొక్క భుజపంజరమునతిక్రమించి దిగ్గునలేచి, చెదరిన నెఱికురులు, నవరించి సడలిన పయ్యెద సరిజేసి, భయభ్రాంతయై యిటు నటు పరికింప దొడంగెను. తోడనే విమలసింగు కారణము గుర్తించి యల్లన నిట్టులనెను.

“లూలితయా! నీ కాగ్రహము జనించెనా యేమి?”

అస్పష్టముగ లూలితయా యిట్లుప్రత్యుత్తర మొసంగెను — “లేదు లేదు నాకాగ్రహమేల?”

“సుందరీ యిటు కూర్చుండుము” అనిపలికి ఆమె కోమలకరంబుబట్టి

రాజకుమారుడు కూర్చుండబెట్టెను. లూలియా యేమియు బలుకక బొమ్మవలె గూర్చుండెను. ఆ రాజకుమారుని గాంచినపిమ్మట నాతనితో నెన్నియోసారు లామె ముచ్చటించియుండెను. కాని, ఆమెయెన్నడు మోహమాట పడియెఱుంగదు. నేడు ఆమె యెన్నడెఱుంగని మోహమాటము నాందోళనమును నామె హృదయము నావరించెను. ఆమెకొక విధమైన నూతనానంద మంకురింప మోహమువాల్చి రాజకుమారుని చెంత నాసీన యాయెను. అంత నాతడిట్లు పలికెను.

"లూలియా! నాహృదయ రహస్యము నీకెఱింగింప వలయునని యనుదినము యోచించుచునే యుంటిని. నాహృదయము నావరించి దహించుచున్న విషయము మఱుగువెట్ట జాలను. సుందరీ! నాపూర్వవృత్తాంతము నెఱింగించియే యుంటిగదా. అంబరునందు నాకొక చిన్న భూమికలదు. అయ్యది స్వల్పము. మొగలాయి దర్బారున నేనొకయున్నతపదవి యందుండి కర్మవశమున నధికారభ్రష్టుడనైతిని. ఉద్యోగ మూడుటయే గాక, నన్ను బట్టువానికి విశేషపారితోషికమిచ్చెదనని పాదుషా ప్రకటించినకారణమున నాకీయజ్ఞాతవాసముకడుంగడు దుస్సహముగ నున్నది. ఈ ప్రదేశమున నిక నిలువరాదు. తరుణీ! పరిస్థితు లిటు లున్నవి. నాప్రకృతావస్థ గాంచి, యేవగింపక నన్నాదరింతువేని, వివాహమున కంగీకరింతువేని, నాకంటె ధన్యాత్ముడెవడని యానందింతును. కోమలీ! అట్లుగాక, నీవన్యథాతలంతువేని యాత్మహత్యగావించుకొని దుస్సహమగు జీవయాత్ర నంతటితో ముగింతును." ఆ తెఱంగున నాతడు నిజహృదయ వేదనను నిట్టూర్పులు విడుచుచు వెలిబుచ్చుచుండినను లూలియా యేమియు బలుకక యాతని మోమునకై తిలకించుచుండెను. మోహపరవశుడై యుండినను విమలసింగు కడు వివేకముగ నిట్టులనెను.

"లూలియా! నీవు సమాధానము తక్షణమొసంగ నవసరము లేదు.

ఆలోచింపకయే బదులాడవలసిన విషయము కాదు. మఱియు రేయి చాల గడచినది. కావున, నీవిక నీనివాసమునకరిగి లెస్సగ విచారించి నీ యభిప్రాయమును దప్పక రేపు మెఱింగింపుము. ”

అని పలికి విమలసింగు తిరుగ బాఱిబోయెను. తన డెందమును బీడించుచుండిన యభిప్రాయమును లూలియాకు నెఱింగించిన కారణమున నాతఁడానంద పరవశుడై యుండెను. లూలియా మాత్రము మట్లుగాక, అణుమాత్రమైనఁ గదలక నిర్జీవ ప్రతిమవలె నచటనే జైతన్యముడిగియుట్టియుండెను. గాలిదెస జూచి పతాకమువలె నామె చూపు తనను వీడి వెడలుచుండిన రాజకుమారుని వైపుననె నిలిచియుండెను. ఆమె యట నిలిచియున్నను నామె నయనములును డెందమును నామనోహరాకారుని యందె లగ్నమై యుండెను. విమలసింగు లూలియాయొక్క దృష్టిపథమునుండి తొలంగినను నామె మనోనయనములకు గోచరించుచునే యుండెను. ఆ భావిచేంత నామె యట్లెంతకాలముండెనో యెఱుంగము. కాని నిజధవళకిరణజాలముల బర్వజేసి భ్రాంతిగల్పించిన చంద్రుడు డస్తమించెను. తోడనే కాఱుచీకటులు వ్రక్కమ్ముకొని వచ్చెను. లూలియామాత్ర మేమియు నెఱుంగక యట్టె యుండెను.

విమలసింగుయొక్క యభిప్రాయము లూలియాకు నానంద దాయకముగ నుండుటయేగాక పారవశ్యముగూడ గలుగఁ జేసెను. ఆమె హృదయాభిప్రాయముగూడ నట్టులే యుండెను. కావుననే, రాజకుమారుని వచనములామెకు నమృతప్రాయముగ నుండెను. రాజకుమారుని వచనామృతము వీనుల సోకినంతనే యామె హృదయారవిందము వికసించెను. లూలియా మహమ్మదీయాంగన. విమలసింగు పవిత్రమగు రసపుత్ర వంశోద్భవుడు. తాను మ్లేచ్ఛురాలని నిరసింపక తన్నర్ధాంగిగ వడయ సంసిద్ధుడై యుండిన రాజకుమారుని యౌదార్యమామెకు నాశ్చర్యానంద సంభ్రమములు కలిగించెను. కాని, ఒక్కయుపద్రవము

పెనుభూతమువలె నామెకు గోచరించెను. తోడనే, అచిరకాలమున సౌఖ్యముగ నిలుఁ జేరవలసిన నావ హాఠాత్తుగ శిలాభగ్నమై సముద్ర తరంగముల మధ్యమున, నంతరించు తెఱంగున లూలియాయొక్క సంతసము కూడ నంతరించెను. విమలసింగుయొక్క పూర్వచరిత్ర మామెకు సమగ్రముగఁ దెలియదు. ఆవంశముయొక్క సాంప్రదాయ మెఱుంగదు. వానిమాట యటుండ, సార్వభౌముని క్రూరశాసనము కాలసర్పమువలె భయంకరముగ నాతని నావరించియుండెను. కుక్కల వలె వెనువెంట తిరుగాడు రాజభటుల క్రూర కరవాలములచే నాతఁ డేక్షణమున మరణించునో యెఱుంగరాదు. పరిస్థితు లింతవిషమముగ నుండ, వృద్ధుఁడగు నలబతుఖాను యిట్టి వివాహము నామోదించునా? అసంభవము. యోచించుకొలది యీ నవమోహనాకారుని వివాహ మాడు నవకాశము సూర్యుని గాంచు చీకటివలె నంతరించుచుండెను. "ఆసుందరాంగుని పొందుకై నా డెంద మెంతయు దత్తరపడుచున్నది. ఐనను, నన్ను బ్రాణపదముగ జూచు తాత సహింపరాని కార్యమును దలపెట్టరాదు. అతని యనుమతి నడయకుండ నేమియు నొనరింపరాదు. భగ్నమనోరథనై, దుర్భర పరితాపానలజ్వాలల కింధనమునై క్రుగ్గిన క్రుగ్గెదగాని, వృద్ధుని మాట యతిక్రమించి, అయ్యానఘుని హృదయ మును గారింపజాల." అని లూలియా చింతించుచుండెను.

చంద్రుఁడస్తమించెననియు, ప్రదేశమంతయు గాఢాంధకారబంధురమై యుండెననియు జెప్పియే యుంటిమిగదా. తన తలంపులనెడు ప్రవాహమున గొట్టుకొని పోవుచుండిన లూలియాకు దగ్గ్రాంతమంత యు గడు నిశ్శబ్దముగ నుండెను. ఆమె హృదయమున నాకర్షించిన విమల సింగు వెడలిన కారణమున నాబాల యేకాకియై యుండెను. ఆమె హృదయమును గలంచుచుండిన తలంపులను, ఆమెనుముంచిన తమో సాగరంబును మాత్రమే యామెకు సాహాయ్యులై యుండిరి.

అంతలో హఠాత్తుగ ఘోరమగు నొకవిపత్తుసంభవించెను. భయ విహ్వలయై లూలియా కెవ్వున నరవఁబోయెను. కాని, అరచుటకైన నవకాశము లేకపోయెను. పైనుదహరించిన తెలంగున నామె వివిధా లోచనాయత్తచిత్తయై మైమఱచి యుండ, దురాత్ములగు హంతకు లెవ్వరో యరుదెంచి, యామెను, బట్టి, నిర్దయులై యామె నోరు బం ధించిరి. ఏకాకి: అబల: ముగ్ధ! ఒక్కత్రుటిలో నెంతటి యుపద్రవము సంభవించెను! ఆ హంతకు లెవ్వరు? అట్టి దారుణకృత్యము నొన రింపనేల?

## ౩౫

### నడిరేయి

సిక్రీనగరమునందు మనుష్య సంచార మెఱుంగని గృహములు వేనవేలుండెగదా. అందు విమలసింగు యేగృహమున దాగి యుం డెనో యెవ్వరెఱుంగరు. ఆప్రదేశమున సదా నివసించు సలబతు ఖాను, మహమ్మదుజాను, హమీదా సహిత మెఱుంగక పోవచ్చును. ఆరహస్య వృత్తాంతము నెఱింగినను, ఏమియు నెఱుంగనట్టులే వార లందఱు మెలంగుచుండిరి. మిక్కిలివింత పూరుషుఁడగు విమలసింగు గుఱించి వారెన్నఁడు తలంచు నట్టులైన దోపకుండిరి. కాని, ఏయు దంతము గుఱించి వృద్ధుల కెఱింగింప రాదనియు నెఱింగింప కుండ రాదనియు లూలియా తొట్రిలుచుండెనో ఆయుదంతము సూక్ష్మజ్ఞాని యగు హమీదా యెఱింగియే యుండెను. తా ననుదినము స్వాతనా గతుండగు యువకుని నిగూఢముగ గలియుచుండిన విషయ మితరు లకుఁ దెలియదని లూలియా భ్రమించెనేగాని హమీదాకు సర్వము దెలిసియే యుండెను. హమీదాకు దెలిసిన సమాచారము ఖానున కును, మహమ్మదు జానునకును వెంటనే తెలియునని వేఱుగఁజెప్ప

నక్కరలేదు. కాని, వారు మువ్వురుగూడ విమలసింగు జాడ నెఱుంగనట్టులే మెలంగుచుండిరి.

సిక్రీనగరమునందలి రహస్యమును భేదింపుటకై సైన్యసమేతుఁడై యరుదేరిన యజితసింగు యపటినుండి యంతకాలము విమలసింగు యప్రమత్తుఁడై కడు జాగరూకతతో మెలంగుచుండెను. కాని, అజితసింగు భగ్నమనోరథుఁడై తత్ప్రదేశమును వీడినపిమ్మట విమలసింగునకుఁ గొంత స్వేచ్ఛయలవడెను. రాజభటులు తనను బంధింతు రనెడు భీతి తొలంగెను. నిశాసమయమున నిర్భయముగ దురుగాడుట కాతనికి ధైర్యము కలిగెను.

లూలియా నాపగది వీడి తన నిగూఢ నివాసమున కాతఁడరిగి యాలోచనాయత్తచిత్తుఁడై యుండ, నొక చిన్న శబ్ద మస్పష్టముగ వినరాయెను. విమలసింగు ఆశ్చర్యచకితుఁడై సర్వేంద్రియముల సామర్థ్యమును శ్రవణేంద్రియమునందే కేంద్రీకరించెను. కాని, ఆ శబ్దము మఱల వినరాకుండెను. ప్రదేశమంతయు గాఢ నిశ్శబ్దముగ నుండెను. ఎద్దియో గాఢానుమాన మాతని మానసము నావరించుటచే నాతఁడు వెంటనే లేచి నల్దిశల బరిశోధించెను. తన ఛాయ తప్ప మఱి యెవ్వరు గానరాకుండిరి. ఎంత దూరమునుండియైన శబ్దము లక్షించు నసాధారణసామర్థ్య మాతనికి కలిగియుండెను. కావున నయ్యది భ్రమయని తలఁచుటకు వీలులేదు. ఆ ప్రాంతమున మనుష్యసంచారమగుట తథ్యము. వారలెవ్వరో గాని యొక భారము వహించుచుండిరని కూడ నాతఁడు గుర్తింపఁగలిగెను. ఈ నిర్జనప్రదేశమున నిట్టి నిశీథసమయమున నీపగిది సంచరించు వారెవ్వరో యరయవలయునని విమలసింగు కృతనిశ్చయుఁడాయెను.

ఆతఁడెంత ప్రయత్నించినను సవ్వడి మఱల వినరాకుండుటచే నెటు పోవలయునో తెలియక విమలసింగు ప్రమాన్పడెను. ఒక్కొక్కక్షణము

కడచుగొలఁది యాతని యాందోళన మధికమగుచుండెను— "ఇట్టి యసమయమున మనుష్యులిట సంచరింప నేల ? భీమసింగు కాఁడుగదా ! ఆతఁడిపు డే తేరఁ బలసిన యవసరము లేదు. కాని, నే నాలసించుటచే నాతఁడే తెంచిన నే తేరవచ్చును." అని, విమలసింగు ముందుకుఁబో సాగెను. అంతలో, దన నెవ్వరైన వెన్నాడుచుండిరేమో యను ననుమానము హఠాత్తుగ నుదయించుటచే నాగి, వెనుకకు మఱలి పరిశోధించి యెరిని గానక మఱల నాతఁడు ముందుకుఁబోసాగెను. కాని, ఎవ్వరు గానరాకుండుటచేతను, సవ్వడియైన మఱల శ్రవణగోచరము కాకుండుటచేతను నాతఁడు విసిగి వేసారి వెనుకకు మఱలఁ బోయెను. అంతలో నాశబ్దము తొంటి యట్లు మఱల వినవచ్చుటచే నాతఁడు నిజశరీరమున విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లు జర్జరితాంగుఁడాయెను. తోడనే, యాతఁడు తన సామర్థ్యము నంతయు శ్రవణమున కేంద్రీకరించెను. ఇరువురు మనుజులు భారమగు పదార్థము నొండు మిక్కిలి జాగరూకతతో గొంపోవుచుండిరనియు, వారతి రయమునఁ బ్రయాణ మొనరించుచుండిరనియు, ఆ నిశీథసమయమున దమ పదఘాతములు చాల దవ్వు వెడలి యచటి జనుల, మేల్కొల్పునని యెంచి వారు తమ పాదములకు మెత్తని గుడ్డలను జుట్టుకొని యుండిరనియు విమలసింగు గుర్తింపఁ గలిగెను. అట్టి వైపరీత్య మొనరించువారు చోరులై యుందురని యూహించి, వృద్ధుడగు ఖానుయొక్క గృహమున జొరఁబడి యుందలి ధనకనకాదులను దస్కరించి మూటగట్టి వారు కొంపోవుచుండిరని యాతఁడు నిశ్చయించెను. "ఆహా ! దైవవిధి యిట్లు పరిణమించెగా ! వృద్ధున కెట్టి విపత్తు వాటిల్లెను ! నే నిచట యుంటినని యీ నరాధము లెఱుఁగరు కాబోలు ! నేనిదె పోయి, యీ దుష్టాత్ముల కండకావర మడంచెద." అని తలంచి, క్రోధవివశుఁడై యాతఁడు చెఱచెఱఁ బోసాగెను.

ఆతఁడేగు కొలది నాశబ్దములు స్పష్టముగను దగ్గఱగను వినవచ్చు చుండెను. కాని, ఆతని కొక గొప్ప యనుమాన ముదయించి, యాతని గమనమును నిరోధించెను. ఆ హంతకు లెవ్వరైనను గరవాలాది యాయుధములను ధరించియుందురు. వారెట్టి సాహసమునకైన గడంగుట సహజము. అట్టి వారిని దాను నిరాయుధుఁడై యెన్నాడనగునా యని చింతింప దొడంగెను. కాని, నిజనివాసమునకరిగి యాయుధముల దెచ్చుట కవకాశము లేదు. ఆతఁడు మగుడ నేతెంచులోపున నా హంతకు లంతరింపరా ? కావున ధైర్యశాలియగు విమలసింగు వెనుకంజవేయక రయమునఁ బోసాగెను. ఆతఁడు ధ్యానైక తత్పరుఁడై పోవుచుండెను. ఆతని గమనవేగ మినుమడించెను. కాని యాముచ్చులుకూడ దమ్మెవ్వఁడో వెన్నాడుచుండెనని గ్రహించియే కాఁబోలు శీఘ్రతరముగఁ బరుగిడఁజొచ్చిరి. వారు సింహద్వారము సమీపింప నుండిరని విమలసింగు గుర్తించెను. వారు తప్పక సిక్రీనగర బాహ్యప్రదేశమున నివసించు చోరలని యాతఁడు నిశ్చయించెను. ఆతఁడు మఱింత శీఘ్రగతిబోయి వారిని సమీపించెను. ఆ హంతకులు కొంపోవునది వృద్ధుని వెండిబంగారములు కాదు. వారొక యబలారత్నముఁగొంపోవుచుండిరి! కాఱు మేఘముల వలె నుండిన యా క్రూరాత్ముల నడుమ చంద్రబింబముపగిది విరాజిల్లుచుండిన యా కోమలాంగి ముద్దుమోము గాంచినంతనే యామె తనలూలియాయే యని విమలసింగు గుర్తించెను. తోడనే, ఆతఁడు దండవ్యా మానమానసుఁడై క్రోధైక ధురీణుఁడై మెఱుపువలెఁ బరుగిడి, మత్తగజముపై లఘించు హర్యక్షంబు చందంబున నా హంతకులదాకఁ బోయెను. కాని, లయకాల కాలునివలె బరతెంచు చుండిన విమలసింగును గాంచినంతనే యా ముచ్చులు లూలియాను దిగవిడచి వాయువేగమునఁ బలాయన మొనరించిరి.

వారిని బట్టుటకై రాజపుత్రుని యుల్లమెంత యువ్విళ్లూరు చుండినను లూలియాకు హానియెట్టి ప్రమాదము సంభవించునోయని వెఱచెను. అంతలో వారంతరించిరి.

లూలియా కంఠ్ఠకును నోటికిని గట్టియుండిన బంధముల నాతఁడు విప్పివైచెను. అప్పటి యా లతాంగి స్థితి కేవలము వర్ణనాతీతముగ నుండెను. నీటమునిగి మరణింపనుండి అదృష్టవశమున రక్షింపఁబడిన వానియవస్థ యెటులుండునో లూలియా యవస్థయు నట్టులే యుండెను. యమదూతలవంటి హంతకులు తనను బంధించినంతనే భయవిహ్వాలయై మతి గోల్పోయిన కోమలాంగి యింతలో నేమి జరిగెనో గ్రహింపనేరక, ఆశ్చర్యవివశయై యిటునటు బరికించి, తన చెంతనుండిన మనోహరాకారుని సుందరవదనారవిందముగాంచెను. తోడనే, జరిగినయుదంతమంతయు మెఱపు వలె నామె మానసమున మెఱసెను. కాని, అట్టి నిశాసమయమున నాతనితో నొంటిగా నుంటగాంచి లజ్జావనతవదనయై మోము వాల్చి "ఆర్యా! నీవా —?" అని నాశ్చర్యముగఁబలికెను.

రాగరసపూరిత హృదయముతో నాతండిట్టులనెను — "ఔను. కాని, ఇంతలోనింత విపత్తునీకెట్లు చేకూరె? ఈ హంతకు లెవ్వరు? లేమా! సవిస్తరముగ నెఱింగింపుము."

సహజ మృదుమధురస్వరంబున నా సుందరీమణి యిట్లు బదులిడెను: "ఆ దుర్మార్గులెవరో యేనెఱుంగ. నీవు నన్ను వీడిన పిమ్మట నేనును వెడలనుంటి. అంతలో నా దుష్టులరుదెంచి మోముపై నీగుడ్డ వైచి బంధించి నోరు గదల్పుటకునైన నవకాశ మొసంగక నన్ను రయమున గొంపోవ దొడంగిరి. వారి యభిప్రాయ మేమై యుండునో తలంచినంత మాత్రమున దేహము గగుర్పడు చున్నది. అనంతరము వారు నన్ను నేలఁ బారవైచిరి. అంతకాలము నేను భయభ్రాంతనై మతి చెడియుంటి."

విమలసింగు : " ఈ హంతకులు నన్నొకచటికో గొంపోవు చుండిరి. నన్ను గాంచినంతనే నిన్నిట విడనాడి వారు పలాయన మొనరించిరి.

నయనముల బాష్పములు గ్రమ్మ గద్గద కంఠియై లూలియా యిట్లు ప్రశ్నించెను — " వారెవ్వరో యెఱుంగుదువా ? "

విమల : " స్పష్టముగఁ జెప్పఁజాలను. ఆ పాఱుబోతుల వదనముల వీక్షించుట కవకాశము లేకపోయెను. వారు సద్వంశజులు కారను మాత్రము చెప్పగలను. వారియాకృతి బరికింప వారు క్షుద్ర జాతి వారని గ్రహింపగలిగితి. "

లూలియా : " నన్ని తెరంగున వారు కొంపోవ గతంబెద్ది ? "

విమల : " సుందరీ నేనేమని చెప్పఁగలను ? కాని, ఒక్క విషయము మాత్రము ముఖ్యముగా గమనింపుము. ఈప్రదేశము శత్రుజన సంకీర్ణమై యున్నది. ఏవేళ నెట్టి యాపద సంభవించునో యెఱుంగ రాదు. కావున, నీవు దివారాత్రములం దెప్పుడైనను సరె యిట నొంటిగా సంచరింపకుము. నిన్నిఁక నీనివాసంబునకుఁ జేర్చెద, లెమ్ము అన్యథా తలంపకుము. "

లూలియా : రాజకుమారా ! నీ పలుకులు నా కాశ్చర్యము గలిగించు చున్నది. పుట్టినదాది నేనీ ప్రదేశమున స్వేచ్ఛగఁ దిరుగాడు చుంటిని. ఎట్టి యపాయ మెఱుంగనే ! "

విమల : " మీకెపుడు శత్రువులు లేరు కాబోలు "

లూలియా : " శత్రువులా ? మేమెవ్వరికి నెట్టి యపకారము నొనరింపలేదే. ఒరుల కపకారము గలనైన జేసి యెఱుంగము. ఆర్యా ! మాకు వైరు లెవరుందురు ? "

ఆబాలిక బేలతనము రాజకుమారునకుఁబట్టరాని విస్మయా నందములు కలిగించెను. ఆమెతో వితర్కించుట నిరర్థకమని యెంచి యాతఁ డిట్టులనెను. — " సుందరీ ! దుర్మార్గుల కొక కారణమేల ?

వారి కుటిల స్వభావమే వారిని ప్రేరేపించును. మనము మాత్రము కడు జాగరూకతతో మెలంగవలయును."

లూలియా: "నేనీ నిర్జనమగు ప్రదేశముననున్న విషయ మెవ్వ రెరుంగరు. నాతాతయగు ఖానును మహమ్మదు జానును, హామీరాను దప్ప యన్యుల గాంచి యెఱుంగను. నా జాడ యెవ్వరి కెఱింగింపక వారు నన్నుం గడు భద్రముగ గాపాడుదురు."

విమల: "లేమా! నీవు చెప్పినదంతయు సత్యమే. కాని, ఒక్క విషయముగమనింపుము. అదృష్టవశమున నేనీ మహాసంకట సమయమున నచటేర కుండినచో నీ వెట్టి యవస్థకుఁ బాల్పడి యుందువో యించుక యోచింపుము. తలంచినంత మాత్రమున నా డెందము దహించుకొని పోవుచున్నదే! ఈ క్రూరులు నిన్నుచటికిగొంపోవఁ జూచిరో తెలియక పోయెగదా."

లూలియా: "కాని నిన్ను గాంచినంతనే వారు పరుగిడ నేల? నిన్ను వారెఱుంగుదురా?"

వివిధాలోచనలచే నా రాజకుమారుని చిత్తము క్రాగుచుండెను. కావున నా బాలిక బేలతనంపు ప్రశ్నల సరిగ నాలింపకయే యాతఁ డిట్లు బదులాడెను. — "నేనేమియుఁజెప్పఁజాల. నన్ను వారెఱింగిన నెఱుంగవచ్చు. కాని, యీసమయమున నన్ను గుర్తించిరని తలంప జాలను. వారు చోరులుగదా! మనుష్యుని గాంచినంతనే యట్టివారు సహజముగ నదరి పరుగిడుదురు. వీరును నట్లే కావించి యుందురు. నీవేమియు నెఱుంగని ముద్దరాలవు కావున నీకీ చర్యయంతయుఁ గడు విపరీతముగఁ దోచుచున్నది."

లూలియా: — "వీరు దొంగలే యగుదురేని, ధన కనకాద్యమూల్య వస్తుచయంబు గొనిపోవుటకు మాఱుగ నన్ను గొంపోవనేల?"

విమల: — "లూలియా! లోక వ్యవహారముల నించుకేనియు

నెఱుంగవు. లోకమున దౌష్ట్యమే కౌటిల్యమే ప్రబలియుండు. లోకము నీడెందమువలె నిర్మలమై నిష్కళంకమైయుండునని భ్రమింపకుము. ఇట్టి బేలవు ఆ హంతకులు నిన్నెల గొంపోయి యుందురో యెట్లు గ్రహింపఁ గలవు ? సుందరీ ! మీ గృహముఁ జేరితిమి. నీవిఁక తడయక లోని కరుగుము. ఇట్టిప్రమాదమున మఱల జిక్కవలదు సుమా ! ”

లూలియా వెంటనే తనకై ప్రత్యేకింపఁ బడిన గదిలోనికి బోయెను. ఆమె డెందము వివిధాలోచనలతో నిండి యుండెను. జరిగిన విషయములఁ దలపోయుచు ధ్యానైక తత్పరయై యుండ, తత్సమీపమున నెవ్వరో పకపకనవ్వుచు బలికిన పలుకులామె వీనులబడెను. — “ షాజాదా* ఇట్టి నిశీథ సమయమున సహితము నీ ప్రజలను రక్షించు కార్యమున నిమగ్నుఁడవై యుండుట మిక్కిలి శ్లాఘనీయము గదా ! ”

ఆపలుకు లాలించినంతనే లూలియా సంభ్రమాశ్చర్య మగ్న మానస యాయెను. సువర్ణమయవిగ్రహమువలె నామె చేష్ట లుడిగి యుండెను. ఒక్క నిమేషమాత్రమున నా విస్మయాంబుధి నతిక్రమించి ధైర్యమువూని, మెల్లగ లేచి, భద్రముగ దలుపు తెఱచి పరికించెను. కాని, ఆమె కెవ్వరు గోచరింపలేదు. విమలసింగు చాలాకాలము క్రిందటనే వెడలియుండె గదా. అట్లైన నీషాజాదా యెవ్వరు ? “ ఏమీ యీచోద్యము ! స్వప్నమా ? సత్యమా ? ఈకంఠస్వర మెవ్వరిది ? స్పష్టముగ వినియుంటినే ! ఆహా ! అట్లైన, నాతఁడు రసపుత్రుఁడు కాఁడా యేమి ? ”

## ౩౯

### నడిరేయి

లూలియా యవస్థ కడుంగడు దుస్సహముగ నుండెను. నానావిధ తరులతాలంకృత కాంతారమును దహించు దావానలము వలె

* పాదుషా కుమారుడా.

వివిధాలోచన లామె డెందమును దహింపఁ దొడంగెను. ఎట్టికష్ట మెఱుంగక, ఎట్టివిచార మెఱుంగక హాయిగ మనుచుండిన యయ్యింతి సౌఖ్య మొక్క త్రుటిలో నంతరించెను. ఆమె శయ్యపై వ్రాలెను. కాని, వివిధాలోచనలచే క్రాగు చిత్తమునకు శాంతియెక్కడ? ఎట్టి విచారములనైన నెట్టి వెతలనైన మఱపించి మహాసౌఖ్యము నొడగూర్చు నిద్రాదేవి నేఁ డాబాలపై నలుకవహించి ప్రసన్నురాలు కాకుండెను.

అనన్యసామాన్యరూపురేఖావిలాసంబులతో విరాజిల్లునారాకొమరు డాసుందరాంగి చిత్తము హరించెను. ఆ నవమోహనాకారుని దివ్యాకృతి యామె హృదయఫలకమున జక్కగ లిఖితమై యుండెను. ఆసుందరాంగుని మందస్మిత సుందరవదనారవింద మామెకు గోచరించుచునే యుండెను. కాని, ఆరాజకుమారుని యుదంతము దలంచినంతనే, యామెయుల్లము జల్లుమనెను. ఆ రాజు క్రూరశాసనము కాలసర్పమువలె విమలసింగు వెనువెంట నేసదా తిరుగుచుండెగదా. ఏక్షణమున నాతఁడావిషోరగమున కెర యగునో యెఱుంగరాదు. అట్టి పురుషుని పొందుఁగాంచు మహాభాగ్య మెట్టు లబ్బును? భావి సంకటమును దలంపక, ఆరాజకుమారుని వివాహ మాడగోరినను, తాతయగు సఁబతుఖాను సహించునా? ఎట్లు సహించును? నీటిబుగ్గవలె నొక్క క్షణకాలమున నంతరించు వానితోడి వివాహమున కాతఁ డేల సమ్మతించును? చింతావ్యాకులిత చిత్తయై, తానారాజకుమారుని గాంచిన ముహూర్తము నామె దూర గడంగెను.

"ఆహా విధివిధాన మెంతవిపరీతముగ బరిణమించినది? నేనారాజకుమారు నేల గాంచితి? కాంచితిబో వానితో నేల ముచ్చటించితి? నాఁడు ముచ్చటించితిబో, అనుదినము నాతనితో నేకాంతంబుగ బ్రసంగింపనేల? ప్రసంగించినంతమాత్రమున నేమి ప్రమాదము వాటిల్లె?

ఆసుందరాంగుని మందస్మిత వదనారవిందము నెట్లు మఱతు? ఆనవ మోహనాకారుని సరససంభాషణంబు దలంచినంత మాత్రమున చంద్రోదయసమయమున పారావారమువలె నామానస మెంత యుప్పొంగును? అట్టులే యనుదిన మేతెంచుచు సౌఖ్య మొదవూర్చుటకు మాఱుగ నేడీతఁడు వైవాహికప్రసంగము నేల తెచ్చె? ఆవైవాహిక ప్రసంగమేగదా యిట్టి దుర్భరాందోళనమున కంకురమాయె! ఆహా! వృద్ధుని యభిప్రాయమునకు విరుద్ధముగ నీ రాజోత్తముని చరణ దాస్యమువడయఁజాల: ఈసుందరాంగుని పొందు వడయకుండ మనఁజాల. హా! దుర్భరము! దుస్సహము."

అఘాతమగు చింతాసాగరంబున నయ్యింతిమునింగి యుండ నామె మనంబున నొక్క విషయము మెఱపువలెఁదోఁచెను. తానా హంతకుల బారినుండి తొలంగి నిజనివాసంబున కేతెంచి డోలాయమాన మానసయై యుండ నెవ్వరో "షాజాడా!......" అని ప్రశంసించి యుండిరిగదా.—" షాజాడా! షాజాడా! ఏమీ! ఈషాజాడా యెవరు? ఏ షాజాడా? మెఱుఁగుదీగెలఁబోలు విలాసినీజనులచే పరివృతుఁడై నిరంతరము భోగార్ణవతరంగములతో నీదులాడు షాజాడా యీ కుగ్రామమునకు రానేల? నన్ను మోహింపనేల? చతుస్సముద్ర ముద్రిత మహీమండలమును శాసించు సార్వభౌము పుత్త్రుఁడు కామించుటకు కోమలాంగులు లేనట్టు లింతదూర మరుదెంచి నన్నేల వరింపవలయు! అతఁడు షాజాడా కాకున్న, వా రట్టులేల సంబోధింతురు?"

ఆమె యోచించుగొలది మతిపోవుచుండెను. 'షాజాడా' యనునామ మామె డెందమును దయ్యమువలె నావరించెను. కండ్లు మూసిన 'షాజాడా' గోచరించుచుండెను. కండ్లు తెఱచినను 'షాజాడా' యే గోచరించుచుండెను. గాసిఁ జెంది లేచి యిటు నటు దిరుగాడినను, ఆ 'షాజాడా' తోడునీడవలె వెనువెంట దిరుగాడఁజొచ్చెను. లేచినను,

తిరిగినను, అలసి సొలసి మగుడ శయ్యపై వ్రాలి యెటు గాంచినను, 'షాజాడా' సాక్షాత్కరించుచునే యుండెను.

ఆ తెఱంగున లూలియా మిక్కిలి భ్రాంతిజెంది బెగడువడి బెండువలె దూలుచుండ హఠాత్తుగ గడు భయంకరమగు నొక యఱపు కర్ణకఠోరముగ విననాయెను. ఆ కంఠధ్వని విమలసింగునదే యని యామె గుర్తింపఁగలిగెను. తోడనే ఆమె భయవిహ్వలయై, యదరిపడి దిగ్గున లేచి, మెఱపువలె దలుపు దెఱచి ఉన్మాదినివలె రయమునఁ బరుగిడుచుండ, నామె దాదియగు హమీదా గోచరించెను.

హమీదాకూడ నా భూరిధ్వానము నాలించియుండెను. ఆ కారణముచేతనే, ఆమెయు నదరిపడి మేల్కాంచి కారణము నరయుటకై బయల్వెడలెను. కాని, మార్గమధ్యమున లూలియా గోచరించుటచే నట నిలిచి "లూలియా? యిదియేమి?" అని ప్రశ్నించెను.

లూలియా వెంటనే ప్రత్యుత్తర మొసంగఁజాలకపోయెను. ఆమె వదనము కళావిహీనమై వన్నె దొఱంగియుండుట గాంచి, వైపరీత్య మెద్దియో సంభవించియుండునని హమీదా గ్రహించెను. ఆమె మఱల నిట్లు ప్రశ్నించెను — "బిడ్డా ఈ ధ్వని యేమి? ఏవైపు?"

లూలి: "నాకు దెలియదు. అతఁడు—"

వాక్యమును లూలియా పూర్తిచేయలేకపోయెను. ఎట్లు పూర్తిచేయును? తన హృదయ రహస్యము నెఱింగింపజాలక లూలియా మిన్నకుండెను. నివ్వెరపడి యా బాలిక నట్టె తిలకించి దాది యిట్లనెను—

"లూలీ! నీవు పోవలదు. నేను బోయి పరికించెద."

లూలియా యెద్దియో చెప్పఁబోవుచుండెను. అంతలో హఠాత్తుగ మహమ్మదుజాను గోచరించెను. అతని యవస్థ బరికింప, చాలదూరము నుండి యేతెంచినట్లు లుండెను. దీర్ఘమగు నిట్టూర్పులు విడుచుచు,

కాళ్లు వడంక, మాట తడబడ మెల్లగ నిట్టులనెను — "త్వరపడుము, త్వరపడుము—"

బేలయగు లూలియాకు నేమియు గ్రాహ్యము కాకుండెను. ఆమె డిల్లవడి మహమ్మదు మోము పరికింప నాతఁడు మఱల నట్లులేయనెను—

"త్వరపడుడు — త్వరపడుడు"

మహమ్మదుయొక్క యభిప్రాయమును హమీదా వెంటనే గుర్తించెను. తోడనే ఆమె లూలియాను గదిలోని కీడ్చుకొనిపోయి కడు భద్రముగ దలుపు బిగించెను. అంతలో మహమ్మదుజాను కూడ రయమున నిష్క్రమించెను.

ఇంతకు పూర్వమే సూర్యోదయమై యుండుటచే గృహాధికారియగు సలబతుఖాను నిజమందిరమున సుఖాసీనుఁడై యుండెను. రయమున నరుదెంచిన మహమ్మదుజానును గాంచి యాతఁ డిట్లు ప్రశ్నించెను— "అంతయు సవ్యముగా నున్నదా?"

మహ: "సవ్యముగానే యున్నది. నీవావిషయమై యాతురపడ నవసరములేదు."

ఖాను: "వాని గుఱించి యేమందువు?"

మహ: "ఏసమాచార మిఁకను గాలేదు."

ఖాను: "ఆతని విషయమై చక్కగా బ్రయత్నము నొనరించి యాతఁడెచట నున్నాడో నీవు ముఖ్యముగా నరయవలసి యున్నది."

మహ: "ఇప్పుడే యగయువాడ,"

ఖాను: "నీవెంతయుజాగరూకతతో మెలంగవలయునుసూ!"

మహ: "నేనట్టులే మెలంగెద. ఆర్యా! వెఱవకుము. నీవు మఱల మఱల జెప్పవలదు."

ఖాను: "అంబరు మార్వారు లిద్దఱను బోరాడరని భావింతును; లేక, సార్వభౌమునికి, దోడ్పడెదరా?"

మహా: "ఎట్టులైన మనకు నొక్కటే. వారి యాశమనకు లేదు."

ఖాను: "ఆకస్మికముగ నాతఁడీప్రదేశమున కేల వచ్చెనో జాడ దీసితివా ?"

మహా: "అణుమాత్రమైనఁ దెలియలేదు. ఒక్క విషయము మాత్రము తెలిసికొంటి. శాత్రవగూఢచారు లనేకు లిచట కరుదెంచి యున్నారు. మన ప్రయత్నములను వారు కనిపెట్టుచున్నారు."

ఖాను: "వారెవ్వరు ?"

మహా: "నేను స్పష్టముగ నెఱింగింపజాల."

ఇంతలో నావల మాటలు వినవచ్చుటచే మహమ్మదుజాను వెంటనే వెడలి, గౌరవనీయుఁడగు నొక మొగలాయి యువకునితో మఱల బ్రవేశించి ఆనూతనాగతుఁడు ఖానుతోఁ బ్రసంగింప నేతెంచె నని యాతనికిఁ దెలియఁబఱచెను.

తన యెదుటనున్న యువకునిపై ఖాను తీక్ష్ణవీక్షణంబుల బ్రసరించెను ఆత నిరువదియైదేండ్ల ప్రాయంపు వానివలె నుండెను. ఆకృతి బరికింప సద్వంశజునివలెనే యుండెను. ఆతనికి సగౌరవముగ స్వాగత మొసంగ, నాతఁ డొక యుచితాసనము నలంకరించి, మహమ్మదును ననుమానించువానివలె వానిదెస దిలకింపఁ దొడంగెను. తోడనే, యాతని యభిప్రాయము గుర్తించి మహమ్మదుజాను యావలకుఁ బోయెను, కాని, వారిసంభాషణము వినగోరి తత్సమీపముననే నిగూఢముగ నాతఁడు దాగియుండెను. అంత నాక్రొత్తపురుషుఁ డిట్లు ప్రశ్నించెను—"ఉమ్రావు సాహెబా! నీతో రహస్యముగ సంభాషింపవలసి యున్నది. మన ప్రసంగ మొరులకు వినిపించదు గదా ?"

"నీవు సంకోచింపవలదు. ఒక్క సేవకుఁడు మాత్రము నాతోడ నుండెను. ఇప్పుడే వాఁడు తన పనిమీద నెచటికో బోయెను. కావున నీవించుకేనియు ననుమానింపక చెప్పవచ్చును."

ఇంకను సంశయగ్రస్తుఁడై యుండిన యువకుఁడా మందిరము నిటునటు బరికింపఁదొడంగెను. అంతలో సంబాహుఖాను యిట్లు ప్రశ్నించెను.—"ఆర్యా! నీవు నా మందిరమున కేల యరుదెంచితివో, ఎచటనుండి యరుదెంచితివో వినఁగోరెద. సెలవిమ్ము."

కొంతతడ వూరకుండి, యువకుఁడిట్లు ప్రత్యుత్తరమొసంగెను—"ఆగ్రానగరమునుండి నిమ్ము గాంచుటకై వచ్చితిని."

విస్మయముజెంది ఖాను యిట్లు ప్రశ్నించెను.—"నన్ను గాంచుట కేతెంచితివా? నీవు వచ్చిన కార్యమేమి?"

యువకుఁడు: "ఒకానొక ముఖ్యవిషయమును గూర్చి నీతో నొంటరిగా ముచ్చటింపవలసియుండుటచే నేతెంచితిని. నీది యేపక్షము?"

ఖాను ఆశ్చర్యమగ్నమానసుఁడై యువకుని తేఱి చూచుచు నిట్లు గొణుగుకొనెను—"ఏపక్షము! ఏపక్షము!"

ప్రత్యుత్తరము రాకుండుటచే యువకుఁడిట్లు పలికెను—"నా నామధేయము అబ్దుల్ గని!"

ఖాను: "నీ వాకు గ్రహింపఁబడదో విశదీకరింపుము."

యువ: "నీకుఁ జెప్పియుంటిగదా! నీ వేపక్షమునకుఁ జెందియుండువో యరయుటకై యేతెంచితిని,"

ఖాను: "నీవు చెప్పినదేమియు నాకు గ్రాహ్యము కాకున్నది."

యువ: "నీకు సర్వము దెలియునని యెఱుంగుదు. ఐనను నీకు పరిస్థితుల నెఱింగింపవలయు ననియే భావించెద."

తోడనే, ఖాను యాగ్రహము నభినయించి యిట్లనెను— "నీవు సద్వంశజునివలె దోచెదు. నీవంటివాఁడు నన్ను తెలియంగున నకారణంబుగ గారింపదగునా! నీవేమైన జెప్పఁగోరుదేని, శీఘ్రముగ వచింపుము. నాకు వేఱు పని యున్నది."

యువకుఁడు మెల్లగ నిట్లు పలికెను—"నా పేరు గవార్జాను."

లోఁడనే పకపక నవ్వుచు ఖాను యిట్లనెను— "నీ పేరు 'అబ్దుల్ గని' యని నేను నిమిషము క్రిందటనే చెప్పియుంటివిగదా! ఇంతలో నీవు "గఫార్ఖాన్" వైతివా? ఇంకొక్క నిమిషమున 'నూర్జహాను' వగుదువు కాఁబోలు!!!"

యువ: "ఏల కారాదు?"

యువకుఁడట్లు నిబ్బరముగా బదులాడినంతనే సలబతుఖాను విస్మయపరవశుఁడాయెను. నివ్వెరపడి యువకుని వదనము నట్టె పరికించి చిత్తము శాంతపఱచికొని, మందహాస మొనరించుచు ఖాను యిట్లనుకొనెను- "ఈ యువకుని మతి నిశ్చయముగా భ్రమించినది. ఇట్టి ప్రాయమున నిట్టి దురవస్థకుఁ బాల్పడుట మిక్కిలి విచారకరము. ఈతఁడెంత దురదృష్టవంతుఁడు!"

వృద్ధుఁడగు ఖాను యిట్లు తలపోయుచుండగనే, యువకుఁడు చేయి సవరించి, తన జేబునుండి యెద్దియో తీసి ఖానునకు బ్రదర్శించెను. ఖాను దేమి గాంచెనో గాని, మార్గమధ్యమున క్రూరవిషోరగమును గాంచు పాంథునివలె నదరిపడి, దిగ్గునలేచి పిడుగుపడినటులు ప్రాన్పడి చేష్టలుడిగి యుండెను! వృద్ధుని వదనము వివర్ణమాయెను. పెదవుల తడి యారెను. రక్తప్రవాహము కట్టువడి నట్టులే యుండెను. యువకుఁడేమి ప్రదర్శించెను? వృద్ధుఁడేమి గాంచెను?

ప్రథమభాగము — సంపూర్ణము

దీని తరువాతి కథ **ద్వితీయ భాగము** నందున్నది.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము

అని వ్రాసి తెప్పించుకొనవచ్చును.